శ్రీనారసింహసంస్కృతకళాశాలాగ్రంథమాల — నెం. 4.

ఆన్ధ్రీకృత

# లఘుసిద్ధాన్తకౌముది

గ్రన్థకర్తలు:


చిట్టిగూడూరునందలి నారసింహసంస్కృతకళాశాలా పండితులగు

బ్రహ్మశ్రీ చంద్రభట్ల సూర్యనారాయణశాస్త్రిగారు,

ఉభయభాషా - సాహిత్యవిద్యా - ప్రవీణ

శ్రీమాన్ పంచాంగము వేంకటనరసింహాచార్యులుగారు.







చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

శ్రీనారసింహసంస్కృతకళాశాలాగ్రంథమాల.—నెం. 4.

# ఆన్ధ్రీకృత

# లఘుసిద్ధాన్తకౌముది

గ్రన్థకర్తలు:

చిట్టిగూడూరునందలి నారసింహసంస్కృతకళాశాలా పండితులగు

బ్రహ్మశ్రీ చంద్రభట్ల సూర్యనారాయణశాస్త్రిగారు,

ఉభయభాషా - సాహిత్యవిద్యా - ప్రవీణ

శ్రీమాన్ పంచాంగము వేంకటనరసింహాచార్యులుగారు.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1932



ఆన్ధ్రీకృత

# లఘుసిద్ధాన్తకౌముది.



# ఉపోద్ఘాతము.

---

భారతవర్షమున సంస్కృతభాషయందలి వ్యాకరణ శాస్త్రము దేశాంతరములందుఁగాని, భాషాంతరములందుఁ గాని కానుపింపని యభివృద్ధిని గాంచెను. ఇట్టి వ్యాకరణశాస్త్ర ముగల సంస్కృతభాషను దెలిసికొనియే పాశ్చాత్యులు భాషా శాస్త్రమును రచింపఁగలిగిరి.

ఈశాస్త్రప్రారంభము వేదకాలముననే యుండినటు లీ క్రిందిప్రమాణములచే స్పష్టమగుచున్నది. "మన్త్రోహీనః స్వరతో వర్ణతోవా మిథ్యాప్రయుక్తో నతమర్థమాహ. స వాగ్వజ్రో యజమానం హినస్తి యథేన్ద్రశత్రుస్స్వరతోఽపరాధాత్" అనువాక్యమునుబట్టి మనపూర్వులు వేదసంరక్షణమునకై యొన ర్చిన కృషి సువ్యక్తమగుచున్నది. కావున వర్ణోచ్చారణము, స్వరములు, సంధులు మొదలుగాఁగలవిషయములనుగూర్చి చెప్పు లక్షణగ్రంథములు భిన్నభిన్నదేశవలసివచ్చెను. తత్తద్వేద ములకు విభిన్నములుగ నిట్టిగ్రంథములు రచింపఁబడి ప్రాతిశాఖ్య లనుపేరునఁ బ్రసిద్ధములయ్యెను. వైదికశబ్దములకు నిర్వచనము-అనఁగా శబ్దముయొక్క యర్థమునకును నాశబ్దమందలి ధాతువు యొక్కయర్థమునకును గలసంబంధమును జెప్పుట—యాస్కునిచే దననిరుక్తమను గ్రంథమునఁ జేయఁబడినది. ఈగ్రంథ

మునుబట్టి యాస్కునికిఁ బూర్వమున వైయాకరణులును, నిరుక్తకారులును ననేకులు గలరని స్పష్టమగుచున్నది.

యాస్కునికిఁ దరువాత పాణిని అష్టాధ్యాయి యను సర్వాంగసుందరంబగు వ్యాకరణసూత్రగ్రంథమును రచించెను. ఈగ్రంథమునందుఁగూడఁ బూర్వవైయాకరణులు పెక్కురు పేర్కొనఁబడియున్నారు. కాని వారలగ్రంథంబులన్నింటిని గుణాధికతచేత నీయష్టాధ్యాయి నామమాత్రావశిష్టములుగఁ జేసెను. పిమ్మటఁ గొంతకాలంబునకుఁ గాత్యాయనుఁడు పాణిని కాలంబునుండియుఁ దనకాలంబువఱకును సంస్కృతభాష యందుఁ గలిగినమార్పులను దనవార్తికగ్రంథములోఁ బాణినీయసూత్రములకు సవరణలుగఁ బ్రదర్శించెను. పిదప పతంజలి మహాభాష్యమనెడి యష్టాధ్యాయీవ్యాఖ్యానమును రచించెను. ఈగ్రంథమే తరువాతివ్యాఖ్యలకన్నింటికిని మూలాధారము. పతంజలికాలము క్రీ॥ పూ॥ 2-వ శతాబ్దమని చెప్పుచున్నారు. క్రీస్తునకుఁ దరువాత 7-వ శతాబ్దంబున వామన జయాదిత్యులచే "కాశికావృత్తి" యను మఱియొకవ్యాఖ్యాన మష్టాధ్యాయీసూత్రములకు రచింపఁబడెను. ఈకాశికావృత్తికిని నమూల్యములగువ్యాఖ్యలు రచింపఁబడినవి. ఈయష్టాధ్యాయిని సుబోధముగఁజేయఁదలఁచి పూర్వులవలె సూత్రక్రమమున వ్యాఖ్యానుమాని విషయక్రమముగ వ్యాఖ్యానములు వ్రాసినవారిలోఁ బ్రథముఁడు విమలసరస్వతి. ఇతఁడు 14-వ శతాబ్దములోనివాఁడు. ఈతని "రూపమాల" యనుగ్రంథమున

ప్రత్యాహారము, సంజ్ఞ, పరిభాష, సంధి, అజన్తమాల, హలన్త మాల, సర్వనామమాల, సంఖ్యాభాగము, స్త్రీప్రత్యయము, కారకములు, ఆఖ్యాతములు, లకారార్థమాల, తఙ్ఞాదినియమ భాగము, ఆత్మనేపదపరస్మైపదప్రక్రియలు, కృత్తద్ధితలు, సమాసములు——అనుక్రమమున విషయములుగలవు. రూపమాల పద్ధతిననుసరించియే 15-వ శతాబ్దమున రామచంద్రుఁడు ప్రక్రియాకౌముదియనుగ్రంథమును విరచించెను. ఈగ్రంథమే భట్టోజీదీక్షితరచితమగుసిద్ధాన్తకౌముదికి మూలమనిచెప్పుదురు. పూర్వవ్యాకరణములు పాణినియష్టాధ్యాయిచేవలెఁ బూర్వపువ్యాఖ్యలన్నియు సిద్ధాన్తకౌముదిచేఁ దిరస్కృతములయ్యెను. భట్టోజీదీక్షితులు 17-వ శతాబ్దములోనివాఁడు. సిద్ధాన్తకౌముదికి ననేకవ్యాఖ్యానంబులును, వానికిఁ దిరిగి పెక్కువ్యాఖ్యలును రచింపఁబడినవి. క్రమంబుగ బాలురకు సుఖబోధమునకై సిద్ధాన్తకౌముదిని సంగ్రహింప నారంభించిరి. అట్లు సంగ్రహించి రచించినవానిలో వరదరాజకృతమగు "లఘుసిద్ధాన్తకౌముది" ప్రధానమైనది. భాషాస్వరూపమును సులభముగఁ దెలిసికొనఁదలంచినవారి కీగ్రంథ మత్యంతోపకారకము.

చిట్టిగూడూరు,
మచిలీపట్టణము.
10-7-32

శ్రీమత్తిరుమల గుదిమెళ్ల వరదాచార్యులు.



శ్రీ ర స్తు.

# లఘుసిద్ధాన్తకౌముది.



శ్లో. యేనాక్షరసమామ్నాయమధిగమ్య మహేశ్వరాత్,
కృత్స్నం వ్యాకరణం ప్రోక్తం తస్మై పాణినయే నమః.
యేన ధౌతా గిరః పుంసాం విమలైశ్శబ్దవారిభిః,
తమశ్చాజ్ఞానజం భిన్నం తస్మై పాణినయే నమః.
వాక్యకారం వరరుచిం భాష్యకారం పతఞ్జలిమ్,
పాణినిం సూత్రకారఞ్చ ప్రణతోఽస్మి మునిత్రయమ్.

ఓన్నమః పాణినికాత్యాయనపతఞ్జలిభ్యశ్శబ్దవిద్యాసంప్రదాయప్రవర్తకేభ్యో మునిభ్యో మహద్భ్యో గురుభ్యః.

శ్లో. నత్వా సరస్వతీం దేవీం శుద్ధాం గుణ్యాం కరోమ్యహమ్,
పాణినీయప్రవేశాయ లఘుసిద్ధాన్తకౌముదీమ్.

## సంజ్ఞాప్రకరణము.

అఇఉణ్ ౧. ఋఌక్ ౨. ఏఓఙ్ ౩. ఐఔచ్ ౪. హయవరట్ ౫. లణ్ ౬. ఞమఙణనమ్ ౭. ఝభఞ్ ౮. ఘఢధష్ ౯.

జబగడదశ్ ౧౦. ఖఫఛఠథచటతవ్ ౧౧. కపయ్ ౧౨. శషసర్ ౧౩. హల్ ౧౪.

ఈపదునాలుగు సూత్రములు మహేశ్వరునియను గ్రహమువలనఁ బాణినికి లభించినవి. వీనికి అణ్-అక్-అచ్ మున్నగుసంజ్ఞలు సిద్ధించుటయే ప్రయోజనము. ఈసూత్రములను వర్ణసమామ్నాయమని వ్యవహరింతురు. ఈ పదునాలుగు సూత్రములచివరనుండు ణ్-క్- మొదలగువర్ణము లిత్సంజ్ఞకంబులు. "హయవరట్" మొదలుగాఁగల సూత్రములయందు హల్లులమీఁది అచ్చు లుచ్చారణసౌకర్యమునకు నిబద్ధములైనవి. "లణ్" అనుసూత్రమందలి అకారముమాత్ర మిత్సంజ్ఞకముగూడ నగును.

సూ.—హలన్త్యమ్—౧-౩-౩.

ఉపదేశమునఁ జివరనుండు హల్లిత్సంజ్ఞక మగును. ఉపదేశమన మహేశ్వర - పాణిని - కాత్యాయన - పతఞ్జలుల యాద్యమగు నుచ్చారణము. సూత్రమున లేని యావశ్యక పదముల నితరసూత్రములనుండి గ్రహింపవలయును.

సూ.—అదర్శనం లోపః—౧-౧-౬౦.

ప్రసక్తమగునది యుచ్చరింపఁబడకుండుట లోప మనఁబడును.

సూ.—తస్య లోపః—౧-౩-౯.

ఇత్సంజ్ఞకంబునకు లోపంబగును. "అఇఉణ్" మున్నగు

సూత్రముల చివరనున్న "ణ్" మున్నగువానికి అణ్-అక్-మొదలుగాఁగల ప్రత్యాహారములు సిద్ధించుట ప్రయోజనము.

సూ.—ఆదిరన్త్యేన సహేతా—౧-౧-౭౧.

ఇత్సంజ్ఞకమగు చివరవర్ణముతోఁ గూడిన మొదటి అకారాదికము మధ్యనుండువానిని దన్నుఁగూడ బోధించును. ఎట్లనఁగా:—అణ్ణను ప్రత్యాహారమున నిత్సంజ్ఞకమగు ణ్-అనువర్ణముతోఁగూడిన మొదటి అకారము నడుమనున్న ఇ-ఉ-అనువర్ణములను దన్ను అనఁగా అకారమునుగూడ బోధించుననుట. ఇట్లే అక్-అచ్-హల్-మున్నగు ప్రత్యాహారములందును గ్రహించునది. ఈవిధముగాఁ గ్లుప్తపఱుచుటయే ప్రత్యాహార మనఁబడును. ప్రత్యాహారమున నిత్సంజ్ఞకములు గ్రహింపఁబడవు. "ముఖనాసికావచనోఽనునాసిక" యను సూత్రమున సి+క-యనుచోయణాదేశము చేయకయే పాణిని నిర్దేశించుట యిందులకు నిదర్శనము.

సూ.—ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుతః— ౧-౨-౨౭.

ఉ-ఊ-ఊ-(3) అనువర్ణములలో నొక్కొకదాని నుచ్చరించుటలో నగునంతటికాలములు గలయచ్చులు వరుసగా హ్రస్వము, దీర్ఘము, ప్లుతము ననఁబడును. ఈవిధముగా హ్రస్వదీర్ఘప్లుతాత్మకమగు అచ్చు ప్రత్యేకముగా ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము నని ముద్విధములుగా నుండును.

సూ.—ఉచ్చైరుదాత్తః.—౧-౨-౨౯

సావయవములగు తాలువు మున్నగుస్థానములయం దూర్ధ్వభాగమునఁ బలుకఁబడు అచ్చుదాత్తము.

సూ.—నీచైరనుదాత్తః.—౧-౨-౩౦.

సావయవములగు తాలువు మున్నగుస్థానములయందుఁ గ్రిందిభాగమున నుచ్చరింపఁబడు అచ్చు అనుదాత్తము.

సూ.—సమాహారః స్వరితః.—౧-౨-౩౧.

కొంతభాగ ముదాత్తముగను, మఱికొంతభాగ మనుదాత్తముగను నుచ్చరింపఁబడు అచ్చు స్వరిత మనఁబడును. ఈరీతిని దొమ్మిదివిధములగు అచ్చు అనునాసికము, నిరనునాసికమునని రెండుతెఱఁగులుగా నుండును.

సూ.—ముఖనాసికావచనోఽనునాసికః.—౧-౧-౮.

నోరు,నాసిక, అను నీరెంటితోఁ బలుకఁబడువర్ణ మనునాసిక మనఁబడును అ-ఇ-ఉ-ఋ-వర్ణములు ప్రత్యేకము పదునెనిమిదివిధములు. ఌ-వర్ణమునకు దీర్ఘము లేమింజేసి యది పండ్రెండువిధములు. ఏ-ఓ-ఐ-ఔ-వర్ణములకు హ్రస్వము లేనందున నాహ్రస్వమునుబట్టి రాఁదగిన యాఱేసిభేదములు తగ్గఁగాఁ బ్రత్యేకముగ నవియుఁ బండ్రెండువిధములే.

సూ.—తుల్యాస్యప్రయత్నం సవర్ణమ్—౧-౧-౯.

చెప్పఁబోవుతాల్వాదిస్థానములు, ఆభ్యంతరప్రయత్న

ములు నేరెండువర్ణములకు సమానముగా నుండునో యవి పరస్పరము సవర్ణములగును.

ఋౡవర్ణయోర్మిథస్సావర్ణ్యం వాచ్యమ్ —(వా.)

స్థానప్రయత్నసామ్యము లేకున్నను ఋ-ౡ-వర్ణములు సవర్ణములు.

వర్ణోత్పత్తిస్థానములు.

అ, క్-ఖ్-గ్-ఘ్-ఙ్, హ్ - విసర్జనీయము (ః) - వీనికిఁ గంఠము.

ఇ, చ్-ఛ్-జ్-ఝ్-ఞ్, య్, శ్ -వీనికిఁ దాలువు.

ఋ, ట్-ఠ్-డ్-ఢ్-ణ్, ర, ష - వీనికి శిరస్సు. (కఠిన తాలుమధ్యభాగము)

ౡ, త్-థ్-ద్-ధ్-న్, ల్, స్-వీనికి దంతములు.

ఉ, ప్-ఫ్-బ్-భ్-మ్, ఉపధ్మానీయము. (౦ప-౦ఫ) వీనికిఁ బెదవులు.

ఞ్-మ్-ఙ్-ణ్-న్ - వీని కాయావర్గములకుఁ జెప్పినస్థానములుగాక నాసికయును స్థానము.

ఏ-ఐ- లలో నొక్కొకదానికిఁ గంఠమును తాలువును, ఓ-ఔ-లలో నొక్కొకదానికిఁ గంఠమును ఓష్ఠమును, వకారమునకు దంతమును ఓష్ఠమును, జిహ్వామూలీయంబునకు(౦క౦ఖ) జిహ్వామూలము, అనుస్వారమునకు (ం) నాసిక-ఇవి స్థానములు.

ప్రయత్నములు.

ఆభ్యంతర మనియు బాహ్య మనియు యత్నము ద్వివిధంబు. అం దాభ్యంతరయత్నము స్పృష్టము, ఈషత్స్పృ

ష్టము, ఈషద్వివృతము, వివృతము, సంవృతము- అను భేద ములచేఁ బంచవిధంబయ్యె.

స్పర్శములకు స్పృష్టము, అంతస్థముల కీషత్ స్పృష్టము, ఊష్మములకు ఈషద్వివృతము, స్వరములకు వివృతము, హ్రస్వమగు అకారమునకు సిద్ధరూపమున సంవృతము, ప్రక్రియాదశయందు వివృతము.

ఉదా:—దండ+అగ్రమ్- ఇటఁ బ్రక్రియాదశయందు డకారముమీఁది అకారమును, అగ్రమ్ - అనుదానిలోని మొదటి అకారమును వివృతములు. దకారముమీఁది అకారము, రేఫముమీఁది అకారమును సంవృతములు.

బాహ్యయత్నము వివారము - సంవారము- శ్వాసము- నాదము-అఘోషము-ఘోషము- అల్పప్రాణము-మహాప్రాణము- ఉదాత్తము-అనుదాత్తము-స్వరితము నని పదునొకండువిధము లుగ నుండును.

అందుదాత్తానుదాత్తస్వరితములు అచ్చులకు మాత్రమే యుండును.

"ఖర్" లకు వివారము - శ్వాసము - అఘోషము, హశ్శులకు సంవారము - నాదము-ఘోషము, అయిదువర్గము లలోఁ బ్రథమతృతీయపఞ్చమవర్ణములకు యణ్ణులకును అల్ప ప్రాణము, వర్గము లైదింటిలో ద్వితీయ-చతుర్థ-వర్ణములకు శ- ష-స-హ-లకును మహాప్రాణమును యత్నములు.

కచటతపవర్గము లైదింటిని స్పర్శము లనియు, యణ్ణుల నంతస్థములనియు, శషసహల నూష్మములనియు, అచ్చులను స్వరములనియు, ౘకౘఖ యనుచో క-ఖ- లకుఁ బూర్వమందలి యర్ధవిసర్గసదృశవర్ణములను జిహ్వామూలీయమనియు, ౘప-ౘఫ- యనుచో ప-ఫ-లకుఁ బూర్వముననున్న యర్ధవిసర్గతుల్యమగు వర్ణముల నుపధ్మానీయమనియు, అం-అః అనుపట్ల అకారము నకుఁ బరముగా నున్నవర్ణములను వరుసగా అనుస్వారము విసర్గముననియు వ్యవహరింతురు.

సూ.—అణుదిత్సవర్ణస్య చాఽప్రత్యయః—౧-౧-౬౯.

ప్రత్యయమనఁగా విధింపఁబడునది. ఇచ్చటమాత్రమే అణ్ - ప్రత్యాహారము లణ్-సూత్రమందలి ణకారముతోఁ జేయఁబడినది. అణ్ణు ఉద్దేశ్యము, విధేయము, నిమిత్తము నని మూఁడువిధములుగా నుండును. అందు విధేయముఁబక్కఁ దక్కిన రెండువిధములగు అణ్ణును, ఉదిత్తును సవర్ణములను బోధించును.

కు-చు-టు-తు-పు- లైదు నుదిత్తులు నాఁబడును. అది యెట్లనః—అ-ఇ-ఉ-ఇవి తమతమ సవర్ణములను బదునెనిమిదిం టిని బోధించును. ఋకార-ఌకారములు సవర్ణము లగుటచే నివి ప్రత్యేకము ముప్పదివిధములను బోధించును. ఏ-ఓ-ఐ-ఔ-లు ప్రత్యేకము పంద్రెండేసిభేదముల బోధించును. య-వ-ల-లు అనునాసికములు నిరనునాసికములు నని ద్వివిధములు.

వర్ణసమామ్నాయమున నుండువర్ణములు నిరనునాసికములు గాన నట్టివర్ణములు తమ సవర్ణములగు అనునాసిక-నిరనునాసికముల రెంటిని గ్రహించును.

సూ.—పరస్సన్నికర్షస్సంహితా—౧-౪-౧౦౯.

వర్ణములను గాలవ్యవధానములేక పలుకుట సంహిత యనఁబడును.

సూ.—హలోఽనన్తరాస్సంయోగః—౧-౧-౭.

అచ్చులతో వ్యవధానము పొందక యుచ్చరింపఁబడు రెండు మొదలగుహల్లుల సంయోగమునాఁబడును.

సూ.—సుప్తిఙన్తం పదమ్—౧-౪-౧౪.

సుబంతము తిఙంతము పద మనఁబడును. సు-ఔ-మున్నగు ప్రత్యయము లంతమునఁగల - రామః, రామౌ - మున్నగునవి సుబంతములనియు, తిప్-తస్- మొదలుగాఁగల ప్రత్యయము లంతమునఁగల- భవతి-భవతః-మున్నగునవి తిఙంతము లనియు నెఱుంగునది.

సూ.—హ్రస్వం లఘు—౧-౪-౧౦.

హ్రస్వ మగు అచ్చు లఘు వనంబడును.

సూ.—సంయోగే గురు—౧-౪-౧౧.

సంయోగమునకుఁ బూర్వమున నున్న హ్రస్వము గురు వగును.

దీర్ఘం చ—౧-౪-౧౨.

దీర్ఘమగు అచ్చును గురు వగును.

సంజ్ఞాప్రకరణము సమాప్తము.

---

# అచ్సంధిప్రకరణము.

సూ.—షష్ఠీ స్థానేయోగా—౧-౧-౪౯.

సంబంధవిశేషమును బోధింపని షష్ఠీవిభక్తికి స్థానపదాధ్యాహారముచే స్థానపదార్థసంబంధ మర్థము. అనఁగా నెచ్చట సంబంధసామాన్యబోధకమగు షష్ఠీవిభక్తి యుచ్చరింపఁబడునో యట "స్థానే" యనుపద మధ్యాహృత మగును.

సూ.—తస్మిన్నితి నిర్దిష్టే పూర్వస్య—౧-౧-౬౬.

సప్తమీవిభక్త్యంతము నుచ్చరించి విధింపఁబడు కార్యమాసప్తమ్యంతార్థమున కవ్యవహితపూర్వమున నున్నయుద్దేశ్యమున కగును. కార్యముపొందునది యుద్దేశ్య మనఁబడును.

సూ.—సంహితాయామ్—౬-౧-౭౨.

ఇది యధికారసూత్రము. అధికారమన స్వయముగాఁ గార్యమును బోధింపక యుత్తరవిధిసూత్రములతోఁ గలిసి కార్యమును బోధించునది.

సూ.—ఇకో యణచి—౬-౧-౭౭.

సంహితవిషయ మగుచుండ ఇక్కులకు అచ్చులు పర మగుచో యణ్ణు లాదేశము లగును. ఉన్నదానిని తొలఁగించి వచ్చునది యాదేశ మనఁబడును.

సూ.—స్థానేఽన్తరతమః—౧-౧-౫౦.

అనేకాదేశముల ప్రసంగము కలుగుచుండ నెయ్యది మిక్కిలి సమానమగునో యదియే యాదేశమగును. స్థాన-అర్థ-గుణ - ప్రమాణ - కృతాంతర్యంబులలో స్థానకృతాంత ర్యంబు బలీయంబు.

ఉదా:—సుధీ+ఉపాస్యః-ఇట సుధీ యనుదానిలోని ఈ కారమునకు ఉపాస్యః అనుపదమందలి ఉకార మవ్యవహితపర మైనదిగాన ఉద్దేశ్యమగు ఈకారమునకు, తాలుస్థానసామ్య ముచే సదృశతమమగు "య్" అను ఆదేశము వచ్చి సుధ్ య్ +ఉపాస్యః అని సిద్ధింపఁగా,

సూ.—అనచి చ—౮-౪-౪౭.

అచ్చునకుం బరమగు యర్-నకు అచ్చు పరముగా లేనిచో ద్విత్వము వికల్పముగా నగును. (వికల్పమన నొకసారి కార్యము వచ్చుటయు నొకసారి రాకపోవుటయు) ఒకదానినే రెండుమారు లుచ్చరించుట ద్విత్వ మనఁబడును. సుధ్ య్ అనుచో ధ్ అనుదానికి ద్విత్వముచే సుధ్ ధ్ య్+ఉపాస్యః అని కాఁగా,

సూ.—ఝలాం జశ్ ఝశి—౮-౪-౫౩.

ఝల్లులకు ఝశ్శులు పరమగుచుండఁగా జశ్శులగును. మొదటి ధ-కారమునకు ద-కారము. సుద్ ధ్ య్+ఉపాస్యః అని యుండఁగా,

సూ. సంయోగాన్తస్య లోపః—౮-౨-౨౩.

సంయోగ మంతమునఁ గలపదమునకు లోపమగును.

సూ.—అలోఽన్త్యస్య—౧-౧-౫౨.

ఆదేశ ముద్దేశ్యముయొక్క చివరవర్ణమున కగును. సుద్ ధ్ య్ అనునది సుబంతపదము కాన దీనిచివరనుండు య్ అనుదానికి లోపము ప్రాప్తింపఁగా,

యణః ప్రతిషేధో వాచ్యః—(వా.)

సంయోగాంతలోపము యణ్ణులకు రాదు. దీనిచే య కారలోపము నిషేధింపఁబడఁగా సుద్ధ్యుపాస్యః-అనురూపము సిద్ధమగును. మధు+అరిః - ఉకారమునకు వకారము వెనుకటి వలెనే ద్విత్వాదికము. మద్ధ్వరిః.

ధాతృ+అంశః—ఋకారమునకు రేఫము తకార ద్విత్వము-ధాత్త్రంశః, ఌ+ఆకృతిః-ఌకారమునకు లకారము-లాకృతిః అనియు రూపములు నిష్పన్నము లగును.

సూ.—ఏచోఽయవాయావః—౬-౧-౭౮.

ఏ-ఓ - ఐ-ఔ - లకు, అయ్-అవ్-ఆయ్-ఆవ్-అనునవి యాదేశములగును.

సూ. యథాసంఖ్యమనుదేశస్సమానామ్—౧.3-౧౦.

సమసంఖ్యాకము లగువానివిధులు యథాక్రమముగఁ బ్రవర్తించును.

ఉద్దేశ్యములు— ఏ - ఓ - ఐ - ఔ (4);
విధేయములు—అయ్-అవ్-ఆయ్-ఆవ్ (4)
స్థానుల కాదేశములు క్రమముగా నగును.

ఉదా:—హరే+ఏ-హరయ్+ఏ=హరయే, విష్ణో+ఏ-విష్ణవ్+ఏ=విష్ణవే. నై+అకః-నాయ్+అకః = నాయకః. పౌ+అకః-పావ్+అకః=పావకః.

యస్మిన్ విధిస్తదాదావల్ గ్రహణే—(పరి)

అల్‌మాత్ర బోధకమును సప్తమ్యంతము నగువిశేషణము నుచ్చరించి కార్యమును విధించునెడ నావిశేషణము తదాదిని బోధించును.

సూ.—వాన్తో యి ప్రత్యయే—౬-౧-౭౯

యకారాదిప్రత్యయములు పరమగునపుడు ఓ-ఔ-లకుఁ గ్రమముగా వకారాంతములగు అవ్, ఆవ్ అనునవి యాదేశము లగును.

ఉదా:—గో+య-గవ్+య=గవ్యమ్. నౌ+య-నావ్+య=నావ్యమ్.

అధ్వపరిమాణే చ—(వా)

మార్గముయొక్క పరిమితిని బోధించునపుడు గోశబ్దమునకు యూతిశబ్దము పరమగుచో, అవ్ - అనునాదేశ మగును.

ఉదా:—గో+యూతి-గవ్+యూతి-గవ్యూతిః (రెండు క్రోసులదూరము)

సూ.—అదేఙ్గుణః—౧-౧-౨.

అ-ఏ-ఓ-అనునవి గుణము లనఁబడును.

సూ.—తపరస్తత్కాలస్య—౧-౧-౭౦.

తకారమునకుఁ బూర్వమందుఁ గాని పరమందుఁగాని యున్న అచ్చు తత్కాలసవర్ణములను మాత్రమే గ్రహించును.

సూ.—ఏకః పూర్వపరయోః—౬-౧-౮౪.

ఇది యధికారసూత్రము. ఎచ్చట ఏకాదేశమని చెప్పఁబడునో యటఁ బూర్వపరములస్థానమున నొకటి యాదేశ మగునని తెలియునది.

సూ.—ఆద్గుణః—౬-౧-౮౭.

అవర్ణముకంటె అచ్చు పరమగునపుడు పూర్వపరముల స్థానమున నొకగుణమాదేశమగును.

ఉదా:—ఉప+ఇన్ద్రః=ఉపేన్ద్రః. గఙ్గా+ఉదకం=గఙ్గోదకమ్.

సూ.— ఉపదేశేఽజనునాసిక ఇత్—౧-3-౨.

ఉపదేశమం దనునాసికమగు అచ్చు ఇత్సంజ్ఞక మగును. అచ్చులయానునాసిక్యము కార్యమువలననే తెలిసికొనఁదగినది. లణ్ సూత్రమందలి అకారముతోఁ గలిసి యుచ్చరింపఁబడు రేఫము (ర ప్రత్యాహారము) రేఫలకారములను బోధించును.

సూ.—ఉరణ్ రపరః—౧-౧-౫౧.

ఋకారము తనసవర్ణములను ముప్పదిని బోధించునని చెప్పఁబడినది. అట్టి ఋకారముయొక్క స్థానమున వచ్చు అ-ఇ-ఉ-వర్ణములు రేఫపరకములై వచ్చును.

ఉదా:—కృష్ణ+ఋద్ధిః-కృష్ణ్-అర్-ద్ధిః=కృష్ణర్ధిః.
తవ+ఌకారః-తవ్-అల్-కారః=తవల్కారః.

సూ.—లోపశ్శాకల్యస్య—౮-౩-౧౯.

అకారమునకుఁ బరములును బదాంతములు నగు యకార-వకారములకు అశ్శు పరమగుచుండ వికల్పముగా లోపమగును.

ఉదా:—హరే+ఇహ (అయాదేశము) హరయ్+ఇహ-(యకారలోపము) హరఇహ-పక్షమున హర యిహ.

విష్ణో+ఇహ(అవ్)విష్ణవ్+ఇహ (వలోపము) విష్ణఇహ-పక్షమున విష్ణవిహ.

హర+ఇహ-విష్ణ+ఇహ- అనుచో గుణముప్రాప్తింపఁగా,

సూ.—పూర్వత్రాసిద్ధమ్—౮-౨-౧.

పాణినిసూత్రము లెనిమిదియధ్యాయములుగా నుండును. అందేడధ్యాయముల యొకపాదమునకు సపాదసప్తాధ్యాయి యనియుఁ, దక్కినమూఁడుపాదములకుఁ ద్రిపాది యనియు వ్యవహారము. అందు సపాదసప్తాధ్యాయినిగూర్చి త్రిపాది యసిద్ధమగును. త్రిపాదియందును బూర్వమునుగూర్చి

పర మసిద్ధమగును. దీనిచే యకార వకారలోప మసిద్ధమగుటచే గుణమునకుఁ బ్రసక్తి లేదని యెఱుంగునది.

సూ.—వృద్ధిరాదైచ్—౧-౧-౧.

ఆ-ఐ-ఔ- లు వృద్ధి యనఁబడును.

సూ.—వృద్ధిరేచి—౬-౧-౮౮.

అవర్ణమునకు ఏ-ఓ-ఐ-ఔ - లు పరమగునపుడు పూర్వపరవర్ణములస్థానమున వృద్ధియొక్కటి యాదేశమగును. గుణశాస్త్రమున కపవాదము.

ఉదా:—కృష్ణ+ఏకత్వం=కృష్ణైకత్వమ్, గఙ్గా+ఓఘః=గంఙ్గౌఘః, దేవ+ఐశ్వర్యం = దేవైశ్వర్యమ్, కృష్ణ+ఔత్కణ్ఠ్యం = కృష్ణౌత్కణ్ఠ్యమ్.

సూ.—ఏత్యేధత్యూఠ్సు—౬.౧-౮౯.

అవర్ణమునకు ఏ-ఓ-ఐ-ఔ-లు - ఆదియందుఁగల ఇణ్-ధాతువుగాని, ఏధ-ధాతువుగాని, ఊఠ్-గాని పరమగునపుడు వృద్ధి యేకాదేశమగును. పరరూపమునకు, గుణమునకు నపవాదము.

ఉదా:—ఉప+ఏతి = ఉపైతి, ఉప+ఏధతే=ఉపైధతే. ప్రష్ఠ+ఊహస్ = ప్రష్ఠౌహః (ఇట ఊకారము ఊఠ్లు) ఇట ధాతువుల కేజాదులను విశేషణముచే-ఉప+ఇతః. (మాభవాన్) ప్ర+ఇదిధత్- అనుచో ధాతువు కేజాదులు కానందున వృద్ధి లేదు. (గుణము) ఉపేతః—ప్రేదిధత్.

అక్షాదూహిన్యాముపసంఖ్యానమ్—(వా)

అక్షశబ్దముకంటె ఊహినీశబ్దము పరమగుచో వృద్ధి యగును.

ఉదా:—అక్ష+ఊహినీ=అక్షౌహిణీ (సేనయనియర్థము)

ప్రాదూహోఢోఢ్యేషైష్యేషు—(వా.)

ప్ర-అను ఉపసర్గమునకు ఊహ, ఊఢ, ఊఢి, ఏష, ఏష్య-అనుశబ్దములు పరమగునపుడు వృద్ధియగును.

ఉదా:—ప్ర+ఊహః=ప్రౌహః, ప్ర+ఊఢః= ప్రౌఢః, ప్ర+ఊఢిః=ప్రౌఢిః. ప్ర+ఏషః=ప్రైషః, ప్ర+ఏష్యః=ప్రైష్యః.

ఋతే చ తృతీయాసమాసే—(వా.)

తృతీయాతత్పురుషంబున అవర్ణమునకు ఋతశబ్దము పరమగుచో వృద్ధియగును.

సుఖేన ఋతః. సుఖ+ఋత-సుఖ్+ఆర్ త=సుఖార్తః. తృతీయాసమాసమంచనుటచే- పరమశ్చాసౌ ఋతశ్చ, పరమఃఋతః యస్య - అనుకర్మధారయము బహువ్రీహి మున్నగుసమాసముల నీవృద్ధి రాదు. (గుణము) పరమర్తః.

ప్రవత్సతరకమ్బలవసనార్ణదశానామృణే—(వా.)

ప్ర-వత్సతర - కంబల-వసన-ఋణ - దశ - శబ్దములకు ఋణశబ్దము పరమగునపుడు వృద్ధియగును.

ఉదా:—ప్ర+ఋణం-ప్ర్+ఆర్ ణం=ప్రార్ణమ్, వత్సతర+ఋణం-వత్సతర్+ఆర్ ణం=వత్సతరార్ణమ్ మున్నగునవి.

సూ.—ఉపసర్గాః క్రియాయోగే—౧-౪-౫౯.

ప్రాదులు క్రియలతో సంబంధించునపు డుపసర్గలు నాఁబడును. ప్ర, పరా, అప, సమ్, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆఙ్, ని, అధి, అపి, అతి, సు, ఉద్, అభి, ప్రతి, పరి, ఉప-ఈయిరువది రెండును ప్రాదులు నాఁబడును.

సూ.—భూవాదయో ధాతవః—౧-౩-౧.

క్రియలను బోధించు భూ-ఏధ్- మొదలగునవి ధాతువులనఁబడును.

సూ.—ఉపసర్గాదృతిధాతౌ—౬-౧-౯౧.

అవర్ణాంతమగు ఉపసర్గమునకు ఋకారాది యగు ధాతువు పరమగునపుడు వృద్ధి యేకాదేశమగును.

ప్ర+ఋచ్ఛతి-ప్ర్+ఆర్ చ్ఛతి=ప్రార్ఛతి.

సూ.—ఏఙి పరరూపమ్—౬-౧-౯౪.

అకారాంతమగు ఉపసర్గమునకు ఏ-ఓ-లు మొదటఁగలధాతువులు పరమగుచోఁ బరరూప మేకాదేశమగును.

ఉదా:—ప్ర+ఏజతే=ప్రేజతే, ఉప+ఓషతి=ఉపోషతి.

సూ.—అచోఽన్త్యాది టి—౧-౧-౬౪.

అచ్చులలో నేది చివర నుండునో యది యాదియందుఁగలభాగము టిసంజ్ఞక మగును.

శకన్ధ్వాదిషు పరరూపం వాచ్యమ్—(వా)

శకంథ్వాదులు సిద్ధించుటకు టిసంజ్ఞకమునకుఁ బర రూపము చెప్పవలయును.

ఉదా:—శక+అన్ధుః=శకన్ధుః, మనస్+ఈషా=మనీషా.

ఇట శకలోని అకారము మనస్‌లోని "అస్" అను భాగమును టిసంజ్ఞకములు.

శకన్ధుః, కర్కన్ధుః, మనీషా, హలీషా, లాఙ్గలీషా— ఇత్యాదులు శకంథ్వాదులు. ఇది యాకృతిగణంబు కాన మార్త+అణ్డః=మార్తణ్డః అనుచోఁ బరరూపము గలుగు చున్నది.

సూ.—ఓమాఙోశ్చ—౬-౧-౯౫.

అకారమునకు ఓమ్ అనునవ్యయముగాని అఙుకాని పరమగునపుడు పరరూప మేకాదేశమగును.

ఉదా:—శివాయ+ఓమ్-నమః=శివాయోం నమః,

శివ+(ఆ, ఇహి) ఏహి=శివేహి.

సూ.—అకస్సవర్ణే దీర్ఘః—౬-౧-౧౦౧.

అక్కులకు సవర్ణములగు అచ్చులు పరమగునపుడు పూర్వ పరస్థానంబుల దీర్ఘం బొక్కటి యాదేశమగును.

ఉదా:—దైత్య+అరిః=దైత్యారిః, శ్రీ+ఈశః=శ్రీశః, విష్ణు+ఉదయః=విష్ణూదయః, హోతృ+ఋకారః=హోతౄకారః.

సూ.—ఏఙః పదాన్తాదతి—౬-౧-౧౦౯.

పదాంతములగు, ఏ-ఓ- లకు హ్రస్వమగు అకారము పరమగుచోఁ బూర్వరూప మేకాదేశమగును.

ఉదా:—హరే+అవ=హరేఽవ—విష్ణో+అవ=విష్ణోఽవ.

సూ.—సర్వత్రవిభాషా గోః—౬-౧-౧౨౨

లౌకికము వైదికమునను ద్వివిధంబగుభాషయందుఁ బదాంతమగు ఓకార మంతమునఁగల గోశబ్దముయొక్క ఓకారమునకు హ్రస్వమగు అకారము పరమగుచోఁ బ్రకృతి భావంబు వికల్పంబుగా నగును.

ఉదా:—గో+అగ్రం=గో అగ్రమ్. పక్షంబునఁ బూర్వ రూపంబు. గోఽగ్రమ్.

చిత్రగు+అగ్రమ్. అనుచో గోశబ్ద మోకారాంతము కాకపోవుటచేతను, గో+అస్ అనుస్థలమున ఓకారము పదాంతము కాకుండుటచేతను బ్రకృతిభావము లేదు. చిత్రగ్వగ్రమ్.

సూ.—అవఙ్ స్ఫోటాయనస్య—౬-౧-౧౨౩.

పదాంతమగు ఓకార మంతమునఁగల గోశబ్దమునకు అచ్చు పరమగుచుండఁగా స్ఫోటాయనమహర్షి మతమున అవఙ్ అగును. (వికల్పముగాననుట)

సూ.—అనేకాల్ శిత్సర్వస్య—౧-౧-౫౫.

అనేకవర్ణములుకలదియును, శవర్ణమిత్సంజ్ఞగాఁ గలది యునగు ఆదేశము స్థానికంతకు నగును.

ఇట అవఙ్అనునాదేశము అనేకాల్లుగాన, గోశబ్దమున కంతకును బ్రాప్తింపఁగా,

సూ.—ఙిచ్చ—౧-౧-౫౩.

ఙకార మిత్సంజ్ఞగాఁ గలయాదేశ మనేకాల్లయినను అంత్యమునకే యగును.

ఉదా:—గో+అగ్రం(అవఙ్)గవ+అగ్రం(సవర్ణదీర్ఘము) గవాగ్రమ్.

పదాంతము కాకుండుటచే, గో+ఇ-అనుచో అవఙ్లు లేదు. అవాదేశము-గవి.

సూ.—ఇన్ద్రే చ—౬-౧-౧౨౪.

ఇంద్రశబ్దము పరమగుచుండ గోశబ్దమునకు అవఙా దేశము నిత్యముగా నగును.

ఉదా:—గో+ఇన్ద్రః-గవ+ఇన్ద్రః-(గుణము)=గవేన్ద్రః—

సూ.—వాక్యస్య టేః ప్లుత ఉదాత్తః—౮-౨-౮౨.

ఇది యధికారసూత్రము.

సూ.—ప్రత్యభివాదేఽశూద్రే—౮-౨-౮౩.

శూద్రవిషయకముకాని ప్రత్యభివాదవాక్యముయొక్క టిసంజ్ఞకమునకుఁ బ్లుతమగును.

ఉదా:—అభివాదయే దేవదత్తో౾హం—ఆయుష్మానేధి దేవదత్త (3 అ).

స్త్రియాం న (వా).

స్త్రీవిషయకమగు ప్రత్యభివాదవాక్యముయొక్క టి సంజ్ఞకమునకుఁ బ్లుతము రాదు.

ఉదా:—అభివాదయే గార్గ్యహమ్-భో ఆయుష్మతీ భవ గార్గి.

భో॑రాజన్యవిశాం వేతి వాచ్యమ్ (వా).

భోస్—అను శబ్దముయొక్కయు, క్షత్త్రియ వైశ్య వాచక శబ్దములయొక్కయు టిసంజ్ఞకమునకుఁ బ్లుతము వికల్పముగా నగును.

ఉదా:—ఆయుష్మానేధి భో(3)ః—ఆయుష్మానేధీన్ద్ర వర్మ(3)న్. ఆయుష్మానేధీన్ద్రపాలిత (3)

సూ.—దూరాద్ధూతే చ—౮-౨-౮౪.

దూరముననుండి సంబోధించునప్పుడు వాక్యముయొక్క "టి"సంజ్ఞకమునకు ప్లుత మగును.

సూ.—ప్లుతప్రగృహ్యా అచి నిత్యమ్—౬-౧-౧౨౫.

ప్లుతములును, ప్రగృహ్యసంజ్ఞకములును అచ్చు పరమగునపుడు నిత్యముగాఁ బ్రకృతిభావము నొందును.

ఉదా:—ఏహి కృష్ణ(3)+అత్ర గౌశ్చరతి—ఇటఁ గృష్ణ

యను పదము మీఁది అకారము ప్లుతముకాన దీని కచ్చు పరమయినను సవర్ణదీర్ఘసంధి రాక యట్లే యుండెను.

సూ.—ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్—౧-౧-౧౧.

ఈకారాంతము, ఊకారాంతము, ఏకారాంతము నగు ద్వివచనము ప్రగృహ్య మనఁబడును.

ఉదా:—హరీ+ఏతౌ - విష్ణూ+ఇమౌ - గఙ్గే+అమూ. ఇచ్చట ఈకార-ఊకార - ఏకారములు ప్రగృహ్యసంజ్ఞకము లగుటచేత నాయాసంధికార్యములు లేవని తెలియునది. హరీ ఏతౌ-విష్ణూఇమౌ-గఙ్గే అమూ.

సూ.—అదసో మాత్—౧-౧-౧౨.

అదశ్శబ్దముయొక్క మకారముమీఁది ఈకార - ఊకారములు ప్రగృహ్యము లగును.

ఉదా:—అమీ+ఈశాః = అమీఈశాః. రామకృష్ణా వమూ+ఆసాతే = రామకృష్ణావమూ ఆసాతే. సూత్రమున మకారమును గ్రహించుటచే, అదశ్శబ్దమున మకారము కంటె నవ్యవహితపరమగు ఏకారము సంభవింపదుగానఁ బూర్వసూత్రమునుండి, ఈకార - ఊకారములు మాత్రమే యనువృత్తంబు లగును. ఏకారమున కనువృత్తి లేనందున దానికిఁ బ్రగృహ్యసంజ్ఞ సిద్ధింపదు. దానంజేసి-అముకే+అత్ర-అనుచోఁ బ్రకృతిభావము లేక పూర్వరూపముచే అముకేఽత్ర-అనురూపము నిష్పన్నమయ్యెను.

సూ.—ప్రాగ్రీశ్వరాన్నిపాతాః—౧-౪-౫౬.

అధికారసూత్రము—"అధిరీశ్వరే" యనుసూత్రము వఱకు నిపాతశబ్ద మనువర్తించును.

సూ.—చాదయోఽసత్త్వే—౧-౪-౫౭.

ద్రవ్యమును బోధింపని చ-వా-హ- మున్నగునవి నిపాతము లనఁబడును.

సూ.—ప్రాదయః—౧-౪-౫౮.

ద్రవ్యవాచకములు కాని ప్ర-పరా-మున్నగునవియును నిపాతములు నాఁబడును.

సూ.—నిపాత ఏకాజనాఙ్—౧-౧-౧౪.

ఆఙ్ఙు తక్క నిపాతసంజ్ఞకమగు నొకయచ్చు ప్రగృహ్య మనఁబడును.

ఉదా:—ఇ+ఇన్ద్రః=ఇఇన్ద్రః, ఉ+ఉమేశః=ఉఉమేశః.

ఆ-అనునది జిత్తనియు, అజిత్తనియు ద్వివిధంబు. వాక్యమందును స్మరణమందును, అజిత్తుకాన-ఆ+ఏవం ను మన్యసే, ఆ+ఏవం కు తత్-అనుచో జిత్తునకే పైసంజ్ఞ నిషేధింపఁబడుటవలన నీయుదాహరణములయం దాకారమునకుఁ బ్రగృహ్యసజ్ఞ యుండుటచేఁ బ్రకృతిభావము సిద్ధించెను. ఆఏవం ను మన్యసే, ఆ ఏవం కిల తత్—ఈషదాద్యర్థములయం దాకారము జిత్తుకానఁ బ్రగృహ్యసంజ్ఞ లేదు-ఆ+ (ఈషత్) ఉష్ణమ్-(గుణము) ఓష్ణమ్.

సూ.—ఓత్—౧-౧-౧౫.

ఓకారాంతమగునిపాతము ప్రగృహ్య మగును.
ఉదా:—అహో+ఈశాః=అహో ఈశాః.

సూ. సంబుద్ధౌ శాకల్యస్యేతావనార్షే—౧-౧-౧౬.

సంబుద్ధినిమిత్తకమగు ఓకారము, లౌకికభాషయందలి ఇతిశబ్దము పరమగునపుడు వికల్పముగాఁ బ్రగృహ్యసంజ్ఞక మగును.

ఉదా:—విష్ణో+ఇతి=విష్ణోఇతి. పక్షమున-విష్ణఇతి-విష్ణవితి.

సూ. మయ ఉఞో వో వా—౮-3-33

మయ్యుకంటెఁ బరమగు ఉఞునకు అచ్చు పరమగుచో వకారము వికల్పముకా నగును.

ఉదా:—కిమ్-ఉ+ఉక్తమ్=కిమ్వుక్తమ్. ఇట వకార మసిద్ధ మగుటచే "మోఽనుస్వారః" యనుదానిచే మకారమున కనుస్వారము రాదు. పక్షమునఁ బ్రకృతిభావము-కిము ఉక్తమ్.

సూ. ఇకోఽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ—౬-౧-౧౨౭.

పదాంతమున నున్న ఇక్కులు అసవర్ణమగు అచ్చు పరమగునపుడు వికల్పముగా హ్రస్వము లగును.

ఉదా:—చక్రీ+అత్ర - (హ్రస్వము) చక్రిఅత్ర.

ఇట హ్రస్వవిధిసామర్థ్యముచే స్వరసంధి లేదు. హ్రస్వము రానిపక్షమున యణాదేశము. చక్ర్యత్ర, గౌరీ+ఔ-

ఇట నీకారము పదాంతము కానందున హ్రస్వము లేదు-యణ్ణు-గార్క్యౌ.

సూ.—అచోరహాభ్యామ్ ద్వే—౮-౪-౪౬.

అచ్చునకుఁ బరమగు రేఫహకారములమీఁది యర్ నకు ద్విత్వము వికల్పముగానగును.

ఉదా:—గౌరీ+ఔ-యణ్ణు- గౌరీయ్+ఔ - ద్విత్వము గౌర్ య్య్+ఔ=గౌర్య్యౌ. నహి+అస్తి నహ్య్+అస్తి-నహ్య్య్+అస్తి=నహ్య్యస్తి.

న సమాసే—(వా)

సమాసమునఁ బదాంతమగు ఇక్కునకు అసవర్ణములగు అచ్చులు పరమగుచో హ్రస్వము రాదు.

ఉదా:—వాప్యామశ్వః-వాపీ+అశ్వఃయణ్ణు=వాప్యశ్వః.

సూ.—ఋత్యకః—౬-౧-౧౨౮.

పదాంతమగు అక్కులు ఋకారము పరమగుచో వికల్పముగా హ్రస్వములగును.

ఉదా:—బ్రహ్మా + ఋషిః = బ్రహ్మఋషిః - పక్షమున గుణము. బ్రహ్మర్షిః—ఆ+ఋచ్ఛత్ - ఇట నాకారము పదాంతము కానందున హ్రస్వము లేదు. వృద్ధి-ఆర్ఛత్.

అచ్సంధి ప్రకరణము సమాప్తము.

# హల్సంధి ప్రకరణము.

## సూ.—స్తోః శ్చునా శ్చుః—౮-౪-౪౦

సకారతవర్గములకు శకారముతోఁగాని చవర్గముతోఁగాని సంయోగము గల్గినచో శకార చవర్గములు క్రమముగా నగును.

ఉదా:—రామస్+శేతే - రామశ్+శేతే = రామశ్శేతే, రామస్+చినోతి-రామశ్+చినోతి=రామశ్చినోతి. సత్+చిత్-సచ్+చిత్=సచ్చిత్. శార్ఙ్గిన్+జయ-శార్ఙ్గిఞ్+జయ=శార్ఙ్గిఞ్జయ.

## సూ.—శాత్—౮-౪-౪౪.

శవర్ణముకంటెఁ బరమగు తవర్గమునకు శ్చుత్వము రాదు.

ఉదా:—విశ్+నః=విశ్నః, ప్రశ్+నః=ప్రశ్నః.

## సూ.—ష్టునా ష్టుః—౮-౪-౪౧.

సకారతవర్గములకు షకారముతోఁగాని టవర్గముతోఁగాని సంయోగము గలిగినఁ గ్రమముగా షకారటవర్గములగును.

ఉదా:—రామస్+షష్ఠః - రామష్+షష్ఠః=రామష్షష్ఠః రామస్+టీకతే-రామష్-టీకతే=రామష్టీకతే. పేష్+తా-పేష్+టా=పేష్టా. తద్+టీకా-తడ్+టీకా (చర్త్వము) తట్టీకా. చక్రిన్+ఢౌకసే-చక్రిణ్+ఢౌకసే=చక్రిణ్ఢౌకసే.

సూ.—న పదాన్తాట్టోరనామ్—౮-౪-౪౨.

పదాంతమగు టవర్గముకంటె బరములును "నామ్" యొక్క యవయవముకాని సకారతవర్గములకు షకారటవర్గములు రావు.

ఉదా:—షట్+స న్తః=షట్సంతః-షట్+తే=షట్తే.-ఈడ్+తే(చర్త్వము)=ఈట్టే. ఇటడకారము పదాంతము కానందున, తకారమునకు ష్టుత్వనిషేధము లేదు.

సర్పిష్+తమ. ఇచ్చట టవర్గంబు లేదుకాన నిషేధము ప్రవర్తింపదు. ష్టుత్వము-సర్పిష్టమమ్.

అనామ్నవతినగరీణామితి వాచ్యమ్—(వా)

నామ్ అనుషష్టీబహువచనంబునకును నవతినగరీశబ్దంబులకును ష్టుత్వనిషేధము లేదు.

ఉదా:—షడ్+నామ్- షడ్+ణామ్=షణ్ణామ్. షడ్+నవతిః-షడ్+ణవతిః=షణ్ణవతిః. షడ్+నగర్యః-షడ్+ణగర్యః=షణ్ణగర్యః.

సూ.—తోః షి—౮-౪-౪౩.

తవర్గమునకు షకారము పరమగునపుడు ష్టుత్వము రాదు.

ఉదా:—సన్+షష్ఠః=సన్షష్ఠః.

సూ.—ఝలాం జశోఽన్తే—౮-౨-౩౯.

పదాంతంబులకు, ఝల్లులకు జశ్శులగును:

ఉదా:—వాక్ + ఈశః- వాగ్ + ఈశః=వాగీశః.

సూ.—యరోఽనునాసికేఽనునాసికో వా—౮-౪-౪౫.

పదాంతమగు"యర్"నకు అనునాసికము పరమగుచో అనునాసికవర్ణము వికల్పముగా నగును.

ఉదా:—ఏతద్ +మురారిః=ఏతన్మురారిః-పక్షంబున ఏతద్మురారిః.

ప్రత్యయే భాషాయాం నిత్యమ్—(వా)

ప్రత్యయము పరమగునపుడు లౌకికభాషయందు ననునాసికము నిత్యంబుగా నగు.

ఉదా:—తద్ +మాత్రం = తన్మాత్రమ్, చిద్ +మయం= చిన్మయమ్.

ఇట మాత్ర, మయ - యనునవి ప్రత్యయములుగాన ననునాసికము నిత్యము.

సూ.—తోర్లి—౮-౪-౬౦.

తవర్గమునకు లకారము పరమగుచో లకారముయొక్క సవర్ణ మగును.

ఉదా:—తద్ +లయః-తల్ +లయః=తల్లయః.

విద్వాన్ +లిఖతి-విద్వాల్ +లిఖతి=విద్వాల్లిఖతి.

ఇట నకారమనునాసికముగాన దాని కనునాసిక మగు లకారము వచ్చును.

సూ.—ఉదః స్థా స్తమ్భోః పూర్వస్య—౮-౪-౬౧.

ఉద్ అను నుపసర్గమునకుఁ బరమగు స్థా- స్తమ్భ- ధాతువులకుఁ బూర్వమగు దకారముయొక్క సవర్ణ మాదేశమగును.

సూ.—తస్మాదిత్యుత్తరస్య—౧-౧-౬౭.

పంచమీవిభక్త్యంతము నుచ్చరించి విధింపఁబడు కార్యమితరవర్ణములతో వ్యవధానమును బొందనిపరమున కగును.

సూ.—ఆదేః పరస్య—౧-౧-౫౪.

పరమునకు విధింపఁబడిన కార్య మాపరముయొక్క యాదివర్ణమున కగును.

ఉదా:—ఉద్ + స్థానమ్-స కారమునకు బాహ్యప్రయత్నముచే సమానమును, ద కారమునకు సవర్ణమును నగుధ కారము రాఁగా ఉద్ + థ్ థానమ్-అని సిద్ధింపఁగా,

సూ.—ఝరో ఝరి సవర్ణే—౮-౪-౬౫.

హల్లుకంటెం బరంబగు ఝర్ నకు సవర్ణంబగు ఝర్ పరంబగుచో లోపంబు వికల్పంబుగానగు. దీనిచే,

ఉదా:—ఉద్ + థానమ్-అని సిద్ధింపఁగా,

సూ.—ఖరి చ—౮-౪-౫౫.

ఖర్ పరమగునపుడు ఝల్లులకు చర్ లు అగును.

ఇచ్చట థ కారము ఖర్ కాన ఉద్ లోని ద కారమునకు త కారము వచ్చును. ఉత్ + థానమ్ = ఉత్థానమ్. ఉద్ +

స్తమ్భనమ్ - ఉద్+థ్తమ్భనమ్ - ఉద్+తమ్భనమ్ = ఉత్+తమ్భనమ్=ఉత్తమ్భనమ్.

లోపము వికల్పముగానఁ బక్షమున-ఉ-త్-థ్-థానమ్, ఉ-త్-థ్-తమ్భనమ్మనియు రూపంబు లగును.

సూ.—ఝయో హోఽన్యతరస్యామ్—౮-౪-౬౨.

ఝయ్యుకంటెఁ బరంబగు హకారంబునకుఁ బూర్వసవర్ణము వికల్పముగా నగును.

ఉదా:—వాగ్+హరిః-ఇట నాదమును, ఘోషమును, సంవారమును, మహాప్రాణమును నగుహకారమున కట్టిప్రయత్నములచే సమానమైనవర్గములోని నాల్గవవర్ణము వచ్చును. వాగ్+ఘ్ అరిః=వాగ్ఘరిః-పక్షంబున-వాగ్హరిః.

సూ.—శశ్ఛోఽటి—౮-౪-౬౩.

పదాంతంబగు ఝయ్యుకంటెఁ బరంబగుశవర్ణమునకు అట్టు పరమగుచో, ఛకారము వికల్పముగా నగును.

ఉదా:—తద్+శివః-దకారమునకు శ్చుత్వముచే జకారము తజ్+శివః-చర్త్వము-తచ్+శివః శవర్ణమునకు ఛత్వము తచ్+ఛివః=తచ్ఛివః. పక్షంబున తచ్శివః.

ఛత్వమమీతి వాచ్యమ్—(వా)

పూర్వసూత్రమున అట్టునకు మారుగా అమ్మును గ్రహించునది.

ఉదా:—తద్ + శ్లోకేన-తజ్ + శ్లోకేన-తచ్ + శ్లోకేన- తచ్ + ఛ్లోకేన=తచ్ఛ్లోకేన-పక్షమున-తచ్ శ్లోకేన.

సూ.—మోఽనుస్వారః—౮-3-౨3.

పదాంతంబగు మకారంబునకు హల్లు పరమగుచుండఁగా అనుస్వారమగును.

ఉదా:—హరిమ్+వన్ దే=హరిం వన్ దే.

సూ.—నశ్చాఽపదాన్తస్య ఝలి—౮-3-౨౪.

పదాంతములు కాని నకారమకారములకు ఝల్లు పరమగునపుడు అనుస్వార మగును.

ఉదా:—యశాన్+సి = యశాంసి, ఆక్రమ్+స్యతే = ఆక్రంస్యతే.

మన్+యతే. ఇట యకారము ఝల్లు కానందున ననుస్వారము లేదు. మన్యతే.

సూ.—అనుస్వారస్య యయి పరసవర్ణః—౮-౪-౫౮.

అనుస్వారమునకు యయ్యు పరమగునపుడు పరసవర్ణమగును.

ఉదా:—శాం+త=శాన్తః.

సూ.—వా పదాన్తస్య—౮-౪-౫౯.

పదాంతంబగు ననుస్వారమునకు యయ్యు పరమగుచోఁ బరసవర్ణము వికల్పముగా నగును.

ఉదా:—త్వం+కరోషి - త్వఙ్+కరోషి=త్వఙ్కరోషి. పక్షంబున-త్వం కరోషి.

సూ.—మో రాజి సమః క్వౌ—౮-3-౨౫.

క్విబంతంబగు రాజృ థాతువు పరంబగునపుడు సమ్-అనునుపసర్గంబుయొక్క మకారమునకు మకారమగును. అనుస్వారము రాదనుట.

ఉదా:—సమ్+రాట్ =సమ్రాట్. ఇట రాట్టనునది క్విబంతంబగు రాజృథాతువు.

సూ.—హే మపరే వా—౮-3-౨౬.

మకారము పరమందుఁ గల హకారము పరమగునపుడు మకారమునకు మకారము వికల్పముగా నగును.

ఉదా:—కిమ్+హ్మలయతి = కిమ్హ్మలయతి - పక్షమున ననుస్వారము—కింహ్మలయతి.

యవలపరే యవలా వా—(వా)

య-వ-ల-లుపరమందుఁ గల్గినహకారము పరమగుచో మకారమునకు య-వ-ల-లు వరుసగా వికల్పముగ నగును.

ఉదా:—కిమ్+హ్యః-కియ్+హ్యః = కియ్హ్యః. కిమ్+హ్వాలయతి-కివ్+హ్వాలయతి=కివ్హ్వాలయతి. కిమ్+హ్లాదయతి-కిల్+హ్లాదయతి = కిల్హ్లాదయతి. పక్షంబున అనుస్వారము కింహ్వః, కింహ్మలయతి, కింహ్లాదయతియనియు రూపంబులు.

## సూ.—నపరే నః—౮-3-౨౭.

నకారము పరమందుఁ గలహకారము పరమగునెడ మకారమునకు నవర్ణము వికల్పంబుగా నగును.

ఉదా:—కిమ్+హ్నుతే - కిన్+హ్నుతే=కిన్హ్నుతే - పక్షంబున అనుస్వారము—కింహ్నుతే.

## సూ.—డస్సి ధుట్—౮-3-౨౯.

డకారమునకుఁ బరమగు సకారమునకు ధుడాగమంబు వికల్పముగా నగును.

## సూ —ఆద్యన్తౌ టకితౌ—౧-౧-౪౬.

టిత్తుగాని కిత్తుగాని దేనికి విధింపఁబడునో దానికి వరుసగా నాద్యవయవముగాను నంతావయవముగాను నగును ఆగమంబనఁగా వర్ణాధిక్యంబు. ఇట ధుట్ అనునది టిత్తుగాన సకారమునకు నాద్యవయవముగా వచ్చును.

ఉదా:—షడ్+సన్తః-షడ్+ధ్సన్తః-చర్త్వము-షట్+త్సన్తః = షట్త్సన్తః—ధుడాగమంబు రానిపక్షంబున—చర్త్వము. షట్సన్తః

## సూ.—ఙ్ణోః కుక్టుక్ శరి—౮-3-౨౮.

ఙకార-ణకారములకు శ-ష-స-లు పరంబులగునపుడు వరుసగా కుక్-టుక్-అనునాగమంబులు వికల్పంబుగా నగను. ఈయాగమంబులు కిత్తులుగాన ఙ-ణ-లకంతాగమంబుగనగును.

చయోర్ద్వితీయాశ్శరి పౌష్కరసాదేరితి వాచ్యమ్—(వా.)

చయ్యులకు శర్‌లు పరమగుచుండఁగాఁ బౌష్కరసాది మహర్షి మతంబున వర్గద్వితీయవర్ణంబు లగును. (వికల్ప మనుట).

ఉదా:—ప్రాఙ్ + షష్ఠః కుగాగమంబు - ప్రాఙ్ క్ + షష్ఠః ककారంబునకు ద్వితీయవర్ణంబు-ఖ - కారంబు ప్రాఙ్ ఖ్ + షష్ఠః= ప్రాఙ్ ఖ్ షష్ఠః. పక్షంబున-కషలయోగంబుచే క్ష కారంబు-ప్రాఙ్ క్షష్ఠః-సుగణ్ + షష్ఠః-టుగాగమంబు- సుగణ్ + ట్ షష్ఠః=టకా రంబునకు ద్వితీయవర్ణంబు సుగణ్ + ఠ్ షష్ఠః = సుగణ్ ఠ్ షష్ఠ. ఠ్-వికల్పముగాన, సుగణ్ ట్ షష్ఠః. పైయాగమంబులు వికల్పం బులుగావున ప్రాఙ్ షష్ఠః - సుగణ్ షష్ఠః - అనియు రూపంబు లగును.

సూ—నశ్చ—౮-3-30

నకారాంతంబగు పదంబునకుఁ బరమగు సకారమునకు ధుడాగమంబు వికల్పంబుగా నగును.

ఉదా:—సన్+సః-సన్ ధ్ + సః-చర్త్వము - సన్ త్ + సః= సన్ త్సః-పక్షంబున-సన్ సః.

సూ.—శి తుక్—౮-3-3౧

పదాంతమగునకారమునకు శవర్ణము పరమగుచో తుగాగమంబు వికల్పముగా నగును.

ఉదా:—సన్+శమ్భుః-తుగాగమంబు-సన్ త్ + శమ్భుః- శకారము-ఛత్వము-సన్ త్ + ఛమ్భుః-త కారమునకు శ్చుత్వము

సన్ చ్+ఛమ్భుః-నకారమునకు శ్చుత్వము-సఞ్ చ్+ఛమ్భుః=
(1) సఞ్ ఛ్భుమ్భుః.పక్షంబున "ఝరో ఝరి" యనుసూత్రంబుచే
చకారమునకు లోపంబు(2)సఞ్ ఛమ్భుః. ఛత్వము రానిపక్షం
బున తుగాగమంబు సేయఁగా, (3) సఞ్ చ్శమ్భుః. తుగా
గమంబు రానిపక్షంబున, (4) సఞ్ శమ్భుః.

## సూ.—జమో హ్రస్వాదచి జముణ్ణిత్యమ్—౮-3-3౨

హ్రస్వమునకుఁ బరమగు-ఙ-ణ-న-లంతమునఁగలపదము
లకంటెఁ బరమగు-అచ్చునకు నిత్యముగా ఙుట్టు-ణుట్టు-నుట్టు-
అను నాగమములు వరుసగానగును.

ఉదా:—ప్రత్యఙ్+ఆత్మా-ఙముడాగమంబు-ప్రత్యఙ్+
ఙాత్మా=ప్రత్యఙ్ఙాత్మా. సుగణ్+ఈశః-సుగణ్+ణీశః=సుగణ్ణీశః-
సన్+అచ్యుతః-సన్+నచ్యుతః=సన్నచ్యుతః.

## సూ.—సమస్సుటి—౮-3-౫

సమ్-అనునుపసర్గమునకు సుడాగమంబు పరమగుచో
రు-అనునది యంతాదేశమగును. (ఇట రు-అనుదానిలోని
ఉకార మిత్సంజ్ఞకము.)

ఉదా:—సమ్+స్కర్తా-సర్+స్కర్తా.

## సూ.—అత్రానునాసికః పూర్వస్య తు వా—౮.3-౨.

ఈ రుప్రకరణంబున రేఫమునకు వెనుకనున్న - అచ్చు
అనునాసికము వికల్పముగా నగును.

ఉదా:—సర్+స్కర్తా-పక్షంబున-సర్+స్కర్తా.

సూ.—అనునాసికాత్పరోఽనుస్వారః—౮-3-౪.

అనునాసికము రానిపక్షమున రేఫమునకు వెనుక ననుస్వార మాగమంబుగా నగును.

ఉదా:—సంర్ +స్కర్తా-పక్షంబున-సఁర్ +స్కర్తా.

సూ. —ఖరవసానయోర్విసర్జనీయః—౮-3-౧౫.

"ఖర్" పరమగునపుడును అవసానమందును బదాంతమగు రేఫమునకు విసర్గమగును.

ఉదా:—సంః+స్కర్తా-సఁః+స్కర్తా.

సమ్పుఙ్కానాం సో వక్తవ్యః—(వా)

సమ్-పుమ్-కాన్-అనువీని విసర్గమునకు సకారమగును.

ఉదా:—సంస్ +స్కర్తా= సంస్స్కర్తా. సఁః+స్కర్తా = సఁస్+స్కర్తా=సఁస్స్కర్తా.

సూ.—పుమః ఖయ్యమ్పరే—౮-3-౬.

అమ్ము పరముగాఁగల ఖయ్యు పరమైనచో పుమ్ అను శబ్దంబునకు రుత్వంబగును.

ఉదా:—పుమ్+కోకిల-పుర్ +కోకిల - పుఁర్ +కోకిల-పుంరు+కోకిల-పుఁః+కోకిల-పుంః+కోకిల-పుఁస్+కోకిల= పుఁస్కోకిలః. పుంస్+కోకిల=పుంస్కోకిలః.

సూ.—నశ్ఛవ్యప్రశాన్—౮-3-౭

అమ్ము పరమందుఁ గల ఛవ్వు పరమగునపుడు పదాంత మగు నకారమునకు రుత్వ మగును. ప్రశాన్శబ్దంబునకు మాత్రము రుత్వంబు గాదు.

ఉదా:—చక్రిన్+త్రాయస్వ - చక్రిఁర్ + త్రాయస్వ - చక్రింర్ + త్రాయస్వ-చక్రిః+త్రాయస్వ - చక్రింః+త్రాయస్వ- అని యుండఁగా,

సూ.—విసర్జనీయస్య సః—౮-3-3౪

ఖర్ పరమగునపుడు విసర్గమునకు సకార మగును.

ఉదా:—చక్రిఁస్ + త్రాయస్వ = చక్రిఁస్త్రాయస్వ. చక్రిం స్+త్రాయస్వ=చక్రింస్త్రాయస్వ.ప్రశాన్+తనోతి=ప్రశాన్తనోతి. "అప్రశాన్" అనుటచే నిట రుత్వములేదు.

హన్+తి=హన్తి-ఇట నకారము పదాంతము కానందున రుత్వములేదు.

సూ.—నౄన్ పే—౮-3-౧౦

పకారము పరమగునపుడు నౄన్ అనుదానియంత్య నకారంబునకు రుత్వము వికల్పముగా నగును.

ఉదా:—నౄన్+పాహి - నౄఁర్ + పాహి. పక్షంబున నౄఁర్ +పాహి-నౄంర్ + పాహి - నౄంః+పాహి-నౄంః+ పాహి.

సూ.—కుప్వోః ≍క ≍పౌ చ—౮-3-3౭.

కవర్గ-పవర్గములలోని ఖర్ లు పరమగునపుడు విసర్గమునకు జిహ్వామూలీయోపధ్మానీయములు వరుసగా నగును.

ఉదా:—నౄంగ్ పాహి. నౄఁపాహి-నౄః పాహి-నౄః పాహి. రుత్వంబు రానిపక్షంబున నౄన్ పాహి.

సూ.—తస్య పరమామ్రేడితమ్—౮-౧-౨.

ద్విరుక్తము యొక్క పరరూప మామ్రేడిత మనఁబడును.

సూ.—కానామ్రేడితే—౮-3-౧౨.

ఆమ్రేడితము పరమగునపుడు కాన్ - అనుదానిలోని నకారమునకు రుత్వ మగును.

ఉదా:—కాన్+కాన్ - రుత్వంబు - కార్+కాన్ = కాఁస్కాన్-కాంస్కాన్.

సూ.—ఛే చ—౬-౧-౭3

ఛకారము పరమగునపుడు హ్రస్వమునకు తుగాగమంబగు

ఉదా:—శివ+ఛాయా-శివత్+ఛాయా. శ్చుత్వము-శివచ్ఛాయా.

సూ.—పదాన్తాద్వా—౬-౧-౭౬

పదాంతమగు దీర్ఘమునకు ఛకారము పరమైనచో తుగాగమంబు వికల్పంబుగా నగును.

ఉదా:—లక్ష్మీ+ఛాయా-తుగాగమంబు-లక్ష్మీత్ +చ్ఛాయా. శ్చుత్వము-లక్ష్మీచ్ +ఛాయా = లక్ష్మీచ్ఛాయా-పక్షమున లక్ష్మీఛాయా.

ఇది హల్సంధిప్రకరణము.

---

# విసర్గసంధిప్రకరణము.

సూ.—విసర్జనీయస్య సః—౮-౩-౩౪.

ఖర్ పరమగునపుడు విసర్గమునకు సకారమగును.

ఉదా:—విష్ణుః+త్రాతా=విష్ణుస్త్రాతా.

సూ.—వా శరి—౮-౩-౩౬.

శర్ పరమగుచుండఁగా విసర్గమునకు విసర్గము వికల్పముగా నగును.

ఉదా:—హరిః+శేతే=హరిః శేతే - పక్షంబున సత్వంబు శ్చుత్వంబు హరిశ్శేతే.

సూ.—ససజుషో రుః—౮-౨-౬౬.

పదాంతమగు సకారమునకును సజుష్శబ్దముయొక్క సకారమునకును రుత్వమగును.

ఉదా:—శివస్ +అర్చ్యః-రుత్వము-శివర్ +అర్చ్యః-అని కాఁగా,

సూ.—అతో రోరప్లుతాదప్లుతే—౬-౧-౧౧౩

ప్లుతముకాని హ్రస్వమగు అకారముకంటెఁ బరమగు రుత్వమునకుఁ బ్లుతభిన్నంబును హ్రస్వమును నగు అకారము పరమగునపుడు ఉకారమగును.

ఉదా:—శివఉ+అర్చ్యః - గుణము - శివో+అర్చః = పూర్వరూపము-శివోఽర్చ్యః.

సూ.—హశి చ—౬-౧-౧౧౪

ప్లుతభిన్నంబును హ్రస్వమునగు అకారముకంటెఁ బరంబగు రుత్వమునకు హశ్శు పరమగుచో ఉకారమగును.

ఉదా:—శివస్+వన్ద్యః - రుత్వము-శివర్+వన్ద్యః-ఉత్వము-శివఉ+వన్ద్యః. గుణము-శివో వన్ద్యః.

సూ.—భోభగోఅఘోఅపూర్వస్య యోఽశి—౮-౩-౧౭

భో-భగో-అఘో-అవర్ణము, వీనికంటెఁ బరమగు రుత్వమునకు అశ్శు పరమగుచుండఁగా యకార మాదేశమగును. భోస్-భగోస్-అఘోస్-అనునవి సకారాంతంబులగు నిపాతములు.

ఉదా:— దేవాస్+ఇహ - రుత్వము-దేవార్+ఇహ-యత్వము దేవాయ్+ఇహ-యలోపము-దేవాఇహ - యలోపంబు రానిపక్షంబున - దేవాయిహ.

భోస్+దేవాః-భోర్-దేవాః-భోయ్+దేవాః - ఇట యకారమునకు లోపము వికల్పముగాఁ బ్రాప్తించుచుండఁగా,

సూ.—హలి సర్వేషామ్—౮-౩-౨౨.

భో-భగో-అఘో-అ కారములకంటెం బరంబైన యకారమునకు హల్లు పరమగుచో నందఱిమతంబునను లోపంబగు

ఉదా:—భో దేవాః-భగో నమస్తే-అఘో యాహి.

సూ.—రోఽసుపి—౮-౨-౬౯.

అహన్శబ్దముయొక్క నకారమునకు రేఫంబగును. సు-ఔ-జస్ - మున్నగుసుప్ప్రత్యయంబులు పరంబగుచోఁ గాదు. ఇట విధింపఁబడిన రేఫ ముకారేత్సంజ్ఞకము కానందున నుత్వంబు రాదు.

ఉదా:—అహన్ + అహః-అహర్ + అహః= అహరహః. అహన్ + గణః-అహర్ + గణః=అహర్గణః.

సూ.—రో రి—౮-౩-౧౪.

రేఫమునకు రేఫము పరమగునపుడు లోపమగును.

ఉదా:—పునర్ + రమతే-పున + రమతే-అని సిద్ధింపఁగా,

సూ.—ఢ్రలోపే పూర్వస్య దీర్ఘోఽణః—౬-౩-౧౧౧

ఢకార రేఫములు లోపించుటకు నిమిత్తములగు ఢకార రేఫములు పరమగుచో అణ్ణునకు దీర్ఘంబగు.

ఉదా:—దీర్ఘము-పునారమతే-హరిస్ + రమ్యః-హరిర్ + రమ్యః-హరి + రమ్యః=హరీరమ్యః.శమ్భుస్ + రాజతే-శమ్భుర్ + రాజతే-శమ్భు + రాజతే=శమ్భూరాజతే. తృఢ్ + ఢ,వృఢ్ + ఢ "ఢో ఢేలోపః" అనుదానిచే లోపంబు - తృ + ఢ-వృ + ఢ. ఇట

ఋకారము-అణ్ణుకానందున దీర్ఘము లేదని తెలియునది. మనస్ + రథః-రుత్వము-మనర్ + రథః-ఇట రేఫమున ఉత్వమును లోపమును గూడ నొక్కసారిగాఁ బ్రాప్తించు చుండఁగా,

సూ.—విప్రతిషేధే పరం కార్యమ్—౧-౪-౨

సమబలంబులగు రెండుశాస్త్రముల కొక్క లక్ష్యమునఁ బ్రాప్తి కలుగఁగా నారెండుశాస్త్రములలో నెద్ది సూత్రసంఖ్యనుబట్టి పరంబగునో యదియే ప్రవర్తించును. ఇట నుత్వశాస్త్రముకంటె లోపశాస్త్రము పరమగుటచే లోపము ప్రాప్తించుచున్నను, "పూర్వత్రాసిద్ధమ్" అను సూత్రముచేత త్రైపాదికంబగులోపం బసిద్ధం బగుటచేత నుత్వంబగు.

ఉదా:—మనఉ + రథః-గుణంబు = మనోరథః.

సూ. ఏతత్తదోస్సులోపో౽కోరనఞ్సమాసేహలి-౬-౧౩౨

కకారరహితములును నఞ్సమాసమందు లేనివియునగు ఏతచ్ఛబ్ద - తచ్ఛబ్దముల ప్రథమైకవచనంబునకు హల్లు పరమగుచో లోపంబగును.

ఉదా:—ఏషస్ + విష్ణుః - సలోపంబు=ఏషవిష్ణుః. సస్ + శమ్భుః=సశమ్భుః. ఏషకస్ + రుద్రః. ఇట నేతచ్ఛబ్దంబు కకారసహితం బగుటచేఁ బ్రత్యయలోపంబు లేదు. రుత్వము - ఉత్వము-గుణము-ఏషకోరుద్రః. అసస్ + శివః-అసస్ - అనునది నఞ్సమాసంబుకాన సులోపంబు లేదు. శ్చుత్వము - అసశ్శివః. ఏషస్ + అత్ర-ఇట హల్లు పరమందు లేదుగాన సుప్రత్యయంబు

నకులోపంబు రాదు. ఏషర్+అత్ర-ఏషఉ+అత్ర - గుణంబు-ఏషో+అత్ర-పూర్వరూపంబు-ఏషోఽత్ర.

సూ.—సోఽచి లోపే చేత్పాదపూరణమ్—౬-౧-౧౩౪.

లోపము వచ్చిననే పాదపూర్తి యగుచో, తచ్ఛబ్దముయొక్క ప్రథమైకవచనమున కచ్చు పరమగుచుండఁగా లోపమగును.

ఉదా:—సస్+ఇమామ్. స+ఇమామ్. గుణంబు-సేమామ్-"సేమామవిడ్ఢిప్రభృతింయ-ఈశిషే" ఇది పంద్రెండక్షరంబులుగల బుక్పాదంబు. సస్+ఏషః-స+ఏషః - వృద్ధి - సైషః దాశరథీ రామః.

శ్లో. సైష దాశరథీ రామః సైష రాజా యుధిష్ఠిరః,
సైష కర్ణో మహాబాహుః సైష భీమో మహాబలః.

ఇట సకారము లోపించినఁగాని పాదములు పూరింపఁబడవు, గాన లోపంబయ్యెనని తెలియునది.

ఇది విసర్గసంధిప్రకరణము.

---

# అజన్తపుంలింగప్రకరణము.

సూ.—అర్థవదధాతురప్రత్యయఃప్రాతిపదికమ్—౧-౨-౪౫.

ధాతువును, ప్రత్యయమును, ప్రత్యయాంతమును గానట్టి యర్థబోధకమగు శబ్దస్వరూపము ప్రాతిపదిక మనఁబడును. (ధన-వన-మున్నగునవి).

హన్—(ఇది ధాతువు-)సు-(ఇది ప్రత్యయము) రామః (ఇది ప్రత్యయాంతము) వీనికిఁ బ్రాతిపదికసంజ్ఞ లేదు.

ఇటఁ బ్రత్యయపదంబు ప్రత్యయమునకును బ్రత్యయాంతమునకునుగూడఁ బ్రాతిపదికసంజ్ఞను నిషేధించును.

సూ.—కృత్తద్ధితసమాసాశ్చ—౧-౨-౪౬.

కృత్ప్రత్యయాంతములును, తద్ధిత ప్రత్యయాంతములును సమాసములును బ్రాతిపదికసంజ్ఞకంబులు.

ఉదా:—రామ - కృదన్తము. దాశరథి-తద్ధితాంతము. రాజపురుష-సమాసము.

సూ.—స్వౌజసమౌట్ఛష్టాభ్యామ్భిస్ఙేభ్యామ్భ్యస్ఙసిభ్యామ్భ్యస్ఙసోసాం ఙ్యోస్సుప్—౪-౧-౨.

| | |
|---|---|
| సు-ఔ-జస్ | ప్రథమా-సంబోధనప్రథమావిభక్తి |
| అమ్-ఔట్-శస్ | ద్వితీయావిభక్తి |
| టా-భ్యామ్-భిస్ | తృతీయావిభక్తి |
| ఙే-భ్యామ్-భ్యస్ | చతుర్థీవిభక్తి |
| ఙసి-భ్యామ్-భ్యస్ | పంచమీవిభక్తి |
| ఙస్-ఓస్-ఆమ్ | షష్ఠీవిభక్తి |
| ఙి-ఓస్-సుప్ | సప్తమీవిభక్తి |

సూ.—ఙ్యాప్ప్రాతిపదికాత్—౪-౧-౧

ఇది యధికారసూత్రంబు.

జీప్-జీష్-జీన్-టాప్-డాప్-చాప్- అనునీ ప్రత్యయము లంతంబునఁ గలదానికంటెను బ్రాతిపదికముకంటెను వక్ష్యమాణంబులగు ప్రత్యయములగును.

సూ.—ప్రత్యయః—3-౧-౧

సూ.—పరశ్చ—3-౧-౨.

ఇవి యధికారసూత్రములు. ఇఁక మీఁద విధింపఁబడునవి ప్రత్యయసంజ్ఞ కలవై పరముగా నగునని యర్థము. జ్యంతములకంటెను ఆబంతములకంటెను ప్రాతిపదికములకంటెను బరమగుచుఁ బ్రత్యయసంజ్ఞకంబులగు-సు-మున్నగునవి యగును.

సూ.—సుపః-—౧-౪-౧౦3.

సు-ఔ-జస్-మున్నగునిరువదియొక్క- ప్రత్యయములను మూఁడేసిచొప్పున నేడువిభాగములు చేయఁగా నందలి యొక్కొక్క-భాగమున నుండుప్రత్యయముల మూఁడింటికిఁ గ్రమముగా నేకవచనము, ద్వివచనము, బహువచనము ననుసంజ్ఞలగును.

సూ.—ద్వ్యేకయోర్ద్వివచనైకవచనే—౧-౪-౨౨

రెండువస్తువులను బోధించునపుడు ద్వివచనమును, ఒకవస్తువును బోధించునపు డేకవచనంబు నగును.

సూ.—బహుషు వచనమ్—౧-౪-౨౧

రెంటికంటె నధికమగువస్తువులను బోధించునపుడు బహువచనంబగును.

సూ.—విరామోఽవసానమ్—౧-౪-౧౧౦.

వర్ణములు లేకుండుట యవసానంబనంబడును.

ఉదా:—రామ-అనుప్రాతిపదికముకంటెఁ బరముగా నేక వచనసంజ్ఞకంబగు-సు - ప్రత్యయంబు చేయఁగా ఉకారంబున కిత్సంజ్ఞాలోపంబులు.

రామ+స్-రుత్వవిసర్గంబులు- రామః.

సూ.—సరూపాణామేకశేష ఏకవిభక్తౌ—౧-౨-౬౪.

అన్నివిభక్తులయందును సమానరూపముగల ప్రాతిపదికములలో నొకటి మిగులును-(ఒక్క-ప్రాతిపదికమునకే ద్వివచన బహువచనము లగుననుట)—

సూ—ప్రథమయోః పూర్వసవర్ణః—౬-౧-౧౦౨.

అక్కులకుఁ బ్రథమాద్వితీయలయొక్క యచ్చు పరమగునపుడు పూర్వసవర్ణదీర్ఘ మేకాదేశంబగు.

ఇద్దఱిని జెప్పఁదలఁచినపుడు రామ-రామ - అనియుండనిట నొకప్రాతిపదికము లోపించును. రామ+ఔ-అని యుండఁగాఁ బైసూత్రముచేఁ బూర్వసవర్ణదీర్ఘము ప్రాప్తింపఁగా,

సూ ___నాదిచి___౬-౧-౧౦౪.

అకారమునకు ఇచ్చు పరమగునపుడు పూర్వసవర్ణ దీర్ఘము రాదు.

ఉదా:___దీనిచేఁ బూర్వసవర్ణదీర్ఘము నిషేధింపఁబడఁగా, వృద్ధి-రామౌ.

సూ.___చుటూ___౧-3-౭.

ప్రత్యయమునకు మొదటనున్న చవర్గ-టవర్గము లిత్సంజ్ఞకము లగును.

సూ.___విభక్తిశ్చ___౧-౪-౧౦౪.

సుప్పులును, తిఙ్లులును విభక్తిసంజ్ఞకంబులు.

సూ.___న విభక్తౌ తుస్మాః___౧-3-౪.

విభక్తియందుండు తవర్గము, సకారము మకారమును నిత్సంజ్ఞకంబులు గావు.

ఉదా:___రామ+జస్-జకారమున కిత్సంజ్ఞాలోపంబులు. రామ+అస్. పైసూత్రముచే సకారమున కిత్సంజ్ఞ లేదు. పూర్వసవర్ణదీర్ఘము- రామాస్. రుత్వవిసర్గములు___రామాః.

సూ.___ఏకవచనమ్ సంబుద్ధిః___౨-3-౪౯.

సంబోధనప్రథమైకవచనము సంబుద్ధి యనఁబడును.

సూ.—యస్మాత్ప్రత్యయవిధి స్తదాది ప్రత్యయేఽఙ్గమ్—
౧-౪-౧౩

దేనికంటెఁ బరంబుగాఁ బ్రత్యయంబు విధింపఁబడునో యది యాదియందుఁ గలశబ్దస్వరూపము ఆప్రత్యయము పరగునపు డంగసంజ్ఞగలది యగును.

సూ.—ఏఙ్హ్రస్వాత్సమ్బుద్ధేః—౬-౧-౬౯.

ఏకారాంతమును ఓకారాంతమును హ్రస్వాంతమునగు అంగముకంటెఁ బరమగుసంబుద్ధియొక్క హల్లునకు లోపంబగు.

ఉదా:— హేరామ+స్-సంబుద్ధిలోపంబు - హేరామ-హేరామౌ-హేరామాః. హేహరి+స్-ఇట నిత్యమగుటచే సంబుద్ధిలోపమునకుఁ బూర్వము గుణంబు. హేహరే +స్ ఇచ్చట సులోపమునకై సూత్రమున - ఏఙ్పదమావశ్యకము. హేహరే-ఇట్లే హేవిష్ణో.

సూ.—అమి పూర్వః—౬-౧-౧౦౭.

అక్కన కమ్సంబంధ మగునచ్చు పరమగుచుండఁగాఁ బూర్వరూప మేకాదేశంబగును.

ఉదా:—రామ+అమ్-పూర్వరూపంబు-రామమ్-రామౌ.

సూ.—లశక్వతద్ధితే—౧-౩-౮.

తద్ధితభిన్నంబులగు ప్రత్యయముల మొదటనున్న.లకార-శకార-కవర్గము లిత్సంజ్ఞకంబులు.

ఉదా:—రామ+శస్-(శవర్ణమున కిత్సంజ్ఞాలోపంబులు) రామ+అస్-పూర్వసవర్ణదీర్ఘము - రామాస్-అని యుండఁగా,

సూ.—తస్మాచ్ఛసో నః పుంసి—౬-౧-౧౦3.

పుంలింగంబునఁ బూర్వసవర్ణదీర్ఘముకంటెఁ బరంబగు శస్ ప్రత్యయ సకారమునకు నకారమగును.

ఉదా:—రామాన్.

సూ.—అట్కుప్వాఙ్నుమ్వ్యవాయేఽపి—౮-౪-౨.

ఏకపదమునందు రేఫషకారములకంటెఁ బరమగునకారమునకు అట్టు - కవర్గము-పవర్గము - ఆఙ్ము-అనుస్వారము అను వీనితో యథాసంభవముగా వ్యవధానమున్నను ణత్వమగును. రామాణ్-అని నకారమునకు ణత్వము ప్రాప్తింపఁగా,

సూ.—పదాన్తస్య—౮-౪-3౭

పదాంతమగు నకారమునకు ణత్వము రాదు. దీనిచే ణత్వమునకు నిషేధము.

ఉదా:—రామాన్.

సూ.—టాఙసిఙసామినాత్స్యాః—౭-౧-౧౨.

హ్రస్వాకారాంతంబగు అంగముకంటెఁ బరంబగు టా-ఙసి-ఙస్ ప్రత్యయంబులకు వరుసగా ఇన-ఆత్ - స్య-అనునవి యాదేశంబు లగును.

ఉదా:—రామ+టా-రామ+ఆ-ఇనాదేశంబు గుణము ణత్వము-రామేణ.

సూ.—సుపి చ—౭-౩-౧౦౨.

అదంతంబగు అంగమునకు యఞ్ఞు ఆదియందుఁ గల సుప్పులు పరమగుచో దీర్ఘమగును.

ఉదా:—రామ+భ్యామ్ దీర్ఘము-రామాభ్యామ్.

సూ.—అతో భిస ఐస్—౭-౧-౯.

అదంతంబగు అంగముకంటెఁ బరంబగు భిస్సునకు ఐస్సగును.

ఉదా:—రామ+భిస్-రామ+ఐప్-వృద్ధి-రుత్వ-విసర్గము-రామైః ఇట ఐస్సు అనేకాల్లుకాన భిస్సునకు సర్వంబున కాదేశంబయ్యె.

సూ—ఙేర్యః—౭-౧-౧౩

అదంతాంగముకంటెఁ బరమగు చతుర్థ్యేకవచనమునకు య-యనునాదేశంబగును.

ఉదా:—రామ+ఙే-రామ+ఏ-యాదేశంబు - రామ+య - అని సిద్ధింపఁగా,

సూ.—స్థానివదాదేశోఽనల్విధౌ—౧-౧-౫౬.

ఆదేశ ముద్దేశ్యమువంటి దగును. అనఁగా నుద్దేశ్యమున్నపుడు వచ్చుకార్యము లాదేశము వచ్చినను రావచ్చునని భావము. ఉద్దేశ్యసంబంధము లగువర్ణములు మాత్రమే నిమిత్తముగాఁగల కార్యము రానేరదు.

ఉదా:—రామ+య-ఇట య-అనునాదేశ ముద్దేశ్య మగు జేవంటిదిగాన (అనఁగా జేయందుండు సుప్త్వము దీనియం దతిదేశింపఁబడినదిగాన) యకారము సుప్పగును. "సుపిచ" అను సూత్రముచే దీర్ఘము - రామాయ - రామాభ్యామ్.

సూ.—బహువచనే ఝల్యేత్—౭-3-౧౦3.

అదంతాంగంబునకు ఝలాదియు బహువచనము నగు సుప్పు పరమగుచో ఏకారమగును.

ఉదా:—రామ+భ్యస్ ఏకారము-రామేభ్యః - పచ+ ధ్వమ్. ఇట ధ్వమ్ అనునది సుప్ప్రత్యయము కానందున ఏత్వము రాదు. పచధ్వమ్.

సూ.—వాఽవసానే—౮-౪-౫౬.

అవసానమున నుండు ఝల్లులకు చర్ లు వికల్పముగా నగును.

ఉదా:—రామ+ఙసి - రామ+అస్- "ఆత్" అను నా దేశము-రామ+ఆత్. సవర్ణదీర్ఘము-రామాత్. చర్త్వముచే తకారమునకు తకారము - పక్షంబున జస్త్వము-రామాద్- రామాభ్యామ్-రామేభ్యః

రామ+ఙస్-రామ+అస్-"స్య"-అనునాదేశము రామ+ స్య=రామస్య

సూ.—ఓసి చ—౭-3-౧౦౪.

అదంతాంగంబునకు ఓస్సు పరమగుచుండఁగా ఏకార మగును.

ఉదా:—రామ+ఓస్ - ఏకారంబు - రామే+ఓస్ - అయాదేశంబు రుత్వవిసర్గములు-రామయోః.

సూ.—హ్రస్వనద్యాపో నుట్—౭-౧-౫౪.

హ్రస్వాంతము నదీసంజ్ఞకాంతము- ఆబంతమునగునంగముకంటెఁ బరమగు ఆమ్మునకు నుడాగమంబగును.

ఉదా:—రామ+ఆమ్ - నుడాగమంబు - రామ+నామ్ అని కాఁగా,

సూ.—నామి—౬-౪-3.

నామ్ము పరమగునపుడు - అజంతంబగు నంగమునకు దీర్ఘంబగును.

ఉదా:— రామా+నామ్ - ణత్వము - రామాణామ్. రామ+ఇ(ఙి)-గుణము-రామే - రామయోః. - రామ+సుప్ - రామ+సు-ఏత్వము-రామే+సు అని యుండఁగా,

సూ.—ఆదేశప్రత్యయయోః—౮-3-౫౯.

ఇణ్ కవర్గములకంటెఁ బరమును పదాంతమును కానిదానికి ఆదేశమైనట్టియుఁ బ్రత్యయమున కవయవము నగు సకార

మునకు మూర్ధన్య మగును. ఈషద్వివృతప్రయత్నముగల సకారమున కట్టి షకారమే యగును.

ఉదా:—షత్వము-రామేషు.

ఇట్లే కృష్ణ- ముకుంద- గోవింద-శివ-ఈశ్వర - మున్నగు అదంతశబ్దములప్రక్రియ నూహించునది.

సూ.—సర్వాదీని సర్వనామాని—౧-౧-౨౭.

సర్వ మున్నగునవి సర్వనామసంజ్ఞకంబులు.

సర్వ-విశ్వ-ఉభ-ఉభయ-డతర-డతమ - అన్య-అన్యతర-ఇతర-త్వత్-త్వ-నేమ-సమ-సిమ (గ) (పూర్వపరావరదక్షిణోత్తరాపరాధరాణి వ్యవస్థాయామసంజ్ఞాయామ్)పూర్వ-పర-అవర-దక్షిణ-ఉత్తర-అపర-అధర ((గ)స్వమజ్ఞాతిధనాఖ్యాయామ్)స్వ-(గ)అంతరంబహిర్యోగోపసంవ్యానయోః) అంతర-త్యద్-తద్-యద్-ఏతద్-ఇదమ్-అదస్-ఏక-ద్వి - యుష్మద్-అస్మద్-భవతు-కిమ్. ఇవి సర్వాదులు.

సూ.—జసశ్శీ—౭-౧-౧౭.

అదంతంబగు అంగముకంటె బరమును సర్వనామము కంటె విహితమునగు-జస్సునకు శీ. యగును. ఇట శీయనునది యనేకాల్లుకాన జస్సున కంతకు నాదేశంబగును.

ఉదా:—సర్వ+జస్—శీభావంబు - సర్వ+శీ-సర్వ+ఈ గుణము-సర్వే.

సూ.—సర్వనామ్నః స్మై—౭-౧-౧౪.

అదంతమగునంగముకంటెఁ బరమును సర్వనామముకంటె విహితమునగు చతుర్థ్యేకవచనమునకు స్మై-యనునాదేశం బగును.

ఉదా:—సర్వ+ఙే-సర్వ+స్మై=సర్వస్మై.

సూ.—ఙసిఙ్యోః స్మాత్స్మినౌ—౭-౧-౧౫.

అదంతమగునంగముకంటెఁ బరములును సర్వనామముకంటె విహితములునగు ఙసి-ఙి- ప్రత్యయంబులకు స్మాత్-స్మిన్-అనునవి వరుసగా నగును.

ఉదా:—సర్వ+ఙసి-సర్వ+స్మాత్=సర్వస్మాత్.

సూ.—ఆమి సర్వనామ్నస్సుట్—౭-౧-౫౨.

అకారాంతాంగముకంటెఁ బరమును సర్వనామముకంటె విహితమునగు ఆమ్మునకు సుడాగమంబగును.

ఉదా:—సర్వ+ఆమ్—సర్వ+సామ్ - ఏత్వషత్వములు సర్వేషామ్.

సర్వ+ఙి-సర్వ+స్మిన్ = సర్వస్మిన్. తక్కినరూపములు రామశబ్దంబునందుఁ బోలె నెఱుంగునది. ఇట్లే విశ్వ మున్నగు నదంతసర్వనామశబ్దముల ప్రక్రియ నూహించునది.

ఉభయశబ్దము ద్వివచనాంతమే యగును. (ఏకబహువచన ప్రత్యయములు రావనుట).

ఉదా:—ఉభ + ఔ = ఉభౌ (౨) ఉభాభ్యామ్ (3)
ఉభయోః (౨).

సర్వనామసంజ్ఞ యున్నపుడే అకచ్ ప్రత్యయము వచ్చును గాన ఉభ - శబ్దమును సర్వనామగణమునఁ జేర్చుట అకచ్ వచ్చుటకని తెలియునది. సర్వాదిగణంబున డతర-డతమ-అనునవి ప్రత్యయములు. ప్రత్యయములను గ్రహించునపుడు ప్రత్యయాంతములు గ్రహింపఁబడునుగాన,

కిమ్+డతర=కతర, కిమ్+డతమ = కతమ - మున్నగువానికి సర్వనామసంజ్ఞ సిద్ధించును.

నేమ-అనుదానికి సగమని యర్థము. సమ - శబ్దమునకు సర్వమని యర్థము. "యథాసంఖ్యమను దేశస్సమానా"మ్మను నిర్దేశముచే సదృశార్థకమగు సమశబ్దమునకు సర్వనామసంజ్ఞ లేదని తెలియునది.

సూ.—పూర్వపరావరదక్షిణోత్తరాపరాధరాణి
వ్యవస్థాయామసంజ్ఞాయామ్—౧-౧-3౪.

ఈశబ్దములకు వ్యవస్థయందును సంజ్ఞావాచకములు కానపుడును జస్సునందు సర్వనామసంజ్ఞ వికల్పముగానగును.

ఉదా:—పూర్వే-పక్షమున-పూర్వాః-

ఉత్తరాః కురవః. ఇట నుత్తరశబ్దము కురుదేశములకుఁ బేరుగాన సర్వనామసంజ్ఞ లేదు.

వ్యవస్థ యనఁగాఁ బూర్వాదిశబ్దములయొక్క యర్థముచేత నపేక్షింపఁబడు నవధియొక్క నియమము. దక్షిణాః-

గాథకాః - కుశలు లని యర్థము. ఇట దక్షిణశబ్దమునకు వ్యవస్థ యర్థము కానందున సర్వనామసంజ్ఞ లేదు.

సూ.—స్వమజ్ఞాతిధనాఖ్యాయామ్—౧-౧-౩౫.

తాను-తనది-యనునర్థములను బోధించు స్వశబ్దమునకు జస్సు పరమగునపుడు సర్వనామసంజ్ఞ వికల్పముగా నగును.

ఉదా:—స్వే-పక్షమున-స్వాః.

జ్ఞాతులను, ధనమును బోధించునపుడు సర్వనామసంజ్ఞ లేదుగాన-స్వాః-అని ఒక్క రూపముమాత్రమే యగును.

సూ.—అన్తరం బహిర్యోగోపసంఖ్యానయోః—౧-౧-౩౬.

బాహ్యార్థమును, పరిధానీయార్థమును బోధించు-అంతర శబ్దమునకు జస్సు పరమగునపుడు సర్వనామసంజ్ఞ వికల్పముగా నగును.

ఉదా:—అన్తరే అన్తరాః-వా గృహాః-బాహ్యములని యర్థము. అన్తరే అన్తరాః వా శాటకాః-పరిధానీయములని యర్థము.

సూ.—పూర్వాదిభ్యో నవభ్యో వా—౭-౧-౧౬.

పూర్వశబ్దము మొదలు తొమ్మిదిశబ్దములకుఁ బరమగు ఙసి-ఙి-ప్రత్యయంబులకు-స్మాత్-స్మిన్-లు వికల్పముగానగును.

ఉదా:—పూర్వస్మాత్-పూర్వాత్- పూర్వస్మిన్-పూర్వే. తక్కినరూపములు సర్వశబ్దమునకుఁబోలె నెఱుంగునది. ఇట్లే పర-మున్నగువానిరూపంబు లూహించునది.

సూ.-ప్రథమచరమతయాల్పార్ధకతిపయనేమాశ్చ-౧-౧-33

ప్రథమ-చరమ - తయ-అల్ప - అర్ధ-కతిపయ-నేమ-వీనికి జస్సు పరమగునపుడు సర్వనామసంజ్ఞ వికల్పముగానగును.

ఉదా:—ప్రథమే-ప్రథమాః-తయప్ - అనునది ప్రత్యయముగానఁ దదంతము గ్రహింపఁబడును.

ద్వితయే-ద్వితయాః. మిగిలినరూపంబులు రామశబ్దంబునకుంబోలె నెఱుంగునది. నేమే-నేమాః. మిగిలినరూపంబులు సర్వశబ్దమునకువలె నరయునది.

విభాషాప్రకరణే తీయస్య జిత్సూపసంఖ్యానమ్—(వా)

తీయప్రత్యయాంతములకు జిత్తులు పరమగుచో సర్వనామసంజ్ఞ వికల్పముగానగును.

ఉదా:—ద్వితీయస్మై-ద్వితీయాయ, తృతీయస్మై - తృతీయాయ-మున్నగునవి. నిర్జరః—

సూ—జరాయా జరసన్యతరస్యామ్—౭-౨-౧౦౧.

అజాదివిభక్తులు పరమగుచో జరాశబ్దమునకు జరసాదేశంబు వికల్పముగా నగును.

పదాఙ్గాధికారే తస్య చ తదన్తస్య చ—(పరి)

పదస్య - అంగస్య అను రెండధికారసూత్రములు కలవు. ఆది యనువర్తించువఱకు నుండు సూత్రములలో నుద్దేశ్యముగా గ్రహింపఁబడినదానికిని, ఆయుద్దేశ్య మంతమునఁ గలదానికిని ఆదేశములగును.

## నిర్దిశ్యమానస్యాదేశా భవన్తి—(పరి)

ఆదేశములు సూత్రమున గ్రహింపఁబడినభాగమునకే యగును.

## ఏకదేశవికృతమనన్యవత్—(పరి)

శబ్దము ఆదేశాదులచేఁ గొంత మారినను మఱి యొకటి కాఁజాలదు. ఇట నిర్జరశబ్దములోని జరాశబ్దమునకు హ్రస్వమువచ్చినను జరాశబ్దముకంటె నితరము కాఁజాలదు గాన జరసాదేశము సిద్ధించును.

ఉదా:—నిర్జర+ఔ-నిర్జస్+ఔ= నిర్జరసౌ - నిర్జరసః. జరసాదేశము రానిపక్షమందును హలాదివిభక్తులు పరమగునపుడును రామశబ్దమునకువలెఁ బ్రక్రియ నూహించునది.

ఇవి అదన్తశబ్దములు.

---

### ఆదన్తశబ్దములు.

ఉదా:—విశ్వపా+స్=రుత్వవిసర్గములు-విశ్వపాః.

విశ్వపా+ఔ. ఇటఁ బూర్వసవర్ణదీర్ఘము ప్రాప్తించుచుండఁగా,

సూ.—దీర్ఘాజ్జసి చ—౬-౧-౧౦౫.

దీర్ఘముకంటె జస్సుకాని, ఇచ్చుకాని పరమగుచోఁ బూర్వసవర్ణదీర్ఘము రాదు.

ఉదా:—విశ్వపా + ఔ-వృద్ధి=విశ్వపౌ.

విశ్వపా+జస్ - విశ్వపాః - హేవిశ్వపాః, విశ్వపామ్ - విశ్వపౌ.

సూ.—సుడనపుంసకస్య—౧-౧-౪౩.

సు- ఔ-జస్-అమ్-ఔట్ - అను నీరైదుప్రత్యయములును సర్వనామస్థానము లనఁబడును. నపుంసకలింగంబునఁ గావు.

సూ.—స్వాదిష్వసర్వనామస్థానే—౧-౪-౧౭.

కప్ప్రత్యయావధికములును, సర్వనామస్థానభిన్నములు నగు సు-మున్నగు ప్రత్యయములు పరమగునపుడు, ఆప్రత్యయమునకు వెనుకనుండుభాగము పదమనఁబడును.

సూ.—యచి భమ్—౧-౪-౧౮.

యకారమును అచ్చులును ఆదియందుఁ గల్గినట్టియు, కప్ప్రత్యయావధికములును సర్వనామస్థానములు కానివియునగు సు-ఔ-మున్నగు ప్రత్యయములు పరమగునెడ నాప్రత్యయము కంటెఁ బూర్వముననుండుభాగము భసంజ్ఞకంబు.

ఉదా:—విశ్వపా+శస్. ఇట "విశ్వపా" అనుభాగమునకుఁ బైసూత్రములచేఁ బదసంజ్ఞయు భసంజ్ఞయుఁ గూడఁ బ్రాప్తించుచుండఁగా,

సూ.—ఆకడారాదేకా సంజ్ఞా—౧-౪-౧.

ఇఁకమీఁద "కడారాః కర్మధారయే" అను సూత్రము వఱకు నొక్కొక్కదాని కొక్కొక్క సంజ్ఞయే గాని రెండు సంజ్ఞలు నొక్కమా రుండవు. అందు నేద్దిపరముగాని నిరవకాశముగాని యగునో యాసంజ్ఞయే యుండును.

ప్రకృతమునఁ బదసంజ్ఞకంటెఁ బరము నిరవకాశము గాన భసంజ్ఞయే యుండును.

సూ.—ఆతోధాతోః—౬-౪-౧౪౦.

ఆకారాంతంబగు ధాతువు-అంతంబునఁ గల్గిన యంగమునకు భసంజ్ఞకంబునకు లోపంబగును.

ఉదా:—విశ్వపా - అస్ - అలోంత్య సూత్రంబుచేత ఆకారమునకు లోపంబు-రుత్వవిసర్గములు. విశ్వపః, విశ్వపా+టా=ఆకారలోపము-విశ్వపా-విశ్వపాభ్యామ్.

ఇట్లే - శంఖధ్మా - గంధఘ్రా-మున్నగువాని రూపంబు లెఱుంగునది.

హాహా+అస్ - ఇట హాహా యనునది యాకారాంతంబైనను ఆకారాంతమగు ధాతువు చివర లేనందున ఆకార లోపంబు లేదు. హాహాన్.

ఇవి ఆదన్తశబ్దములు.

---

ఇదన్తశబ్దములు.

ఉదా:—హరిః-హరీ-హరి+జస్-హరి+అస్.

సూ.—జసి చ—౭-౩-౧౦౯.

హ్రస్వాంతంబగునంగంబునకు జస్సు పరమగుచో గుణమగును.

ఉదా:—హరే+అస్-అయాదేశంబు-హరయః-హేహరి+స్.

సూ.—హ్రస్వస్య గుణః—౭-౩-౧౦౮.

హ్రస్వాంతంబగునంగమునకు సంబుద్ధి పరమగుచో గుణమగును.

ఉదా:—హేహరే+స్-సంబుద్ధిలోపము - హేహరే-హరిమ్-హరీ-హరీన్, హరి+టా.

సూ.—శేషో ఘ్యసఖి—౧-౪-౭.

శేషపదంబు స్పష్టార్థంబు. హ్రస్వములగు ఇ-ఉ-వర్ణములంతమందుఁ గలదియు సఖిశబ్దభిన్నము నగు శబ్దస్వరూపము ఘి-సంజ్ఞకంబు.

సూ.—ఆఙో నాఽస్త్రియామ్—౭-౩-౧౨౦.

టా=విభక్తిని ఆఙ్ని ప్రాచీనులు వ్యవహరింతురు. ఘిసంజ్ఞకముకంటెఁ బరమగు ఆఙ్నకు నా-యనునది యాదేశంబగును. స్త్రీలింగంబునఁ గాదు.

ఉదా:—హరి+టా-హరి+నా-ణత్వము-హరిణా - హరిభ్యామ్-హరిభిః. సఖిశబ్దంబునకు ఘిసంజ్ఞ లేమింజేసి నాభావంబు లేదు. సఖి+ఆ-యణ్ణు=సఖ్యా.

సూ.—ఘేర్ఙితి—౭-౩-౧౧౧.

ఘి సంజ్ఞకమునకు ఙిత్తగుసుప్పు పరమగుచో గుణమగును.

ఉదా:—హరి+ఙే-హరి+ఏ-హరే+ఏ=హరయే.

సూ—ఙసిఙసోశ్చ—౬-౧-౧౧౦.

ఏ-ఓ-లకు ఙసిఙస్సులయొక్క హ్రస్వమగు అకారము పరమగుచోఁ బూర్వరూప మేకాదేశంబగును.

ఉదా:—హరి+ఙసి - హరి+అస్ - హరే+అస్ - పూర్వరూపంబు-హరేస్=హరేః-హర్యోః-హరీణామ్.

సూ.—అచ్చ ఘేః—౭-౩-౧౧౯.

హ్రస్వములగు ఇకార-ఉకారములకంటెఁ బరమగు సప్తమ్యేకవచనంబునకు ఔకారమును ఘిసంజ్ఞకమునకు హ్రస్వమగు అకారము నంతాదేశంబగును.

ఉదా:—హరి+ఇ(ఙి)-హర+ఔ-వృద్ధి=హరౌ- హరిషు. ఇట్లే కవి-రవి-మున్నగువానిరూపము లెఱుంగునది.

సూ.—అనఙ్ సౌ—౭-౧-౯౩.

సఖిశబ్దాంతమగు అంగమునకు సంబుద్ధిభిన్నంబగు సు ప్రత్యయంబు పరంబగుచో - అనఙ్ఞాదేశంబగును. ఈయాదేశంబు ఙిత్తగుటచే నంత్యమున కాదేశంబగును.

ఉదా:—సఖి+స్.(అనఙ్)-సఖన్-+స్-అని సిద్ధింపఁగా,

సూ.—అలోఽన్త్యాత్పూర్వ ఉపధా—౧-౧-౬౫.

తుదివర్ణమునకు ముందుండువర్ణముపథ యనఁబడును.

సూ.—సర్వనామస్థానే చాఽసంబుద్ధౌ—౬-౪-౮.

నకారాంతంబగు నంగంబుయొక్క యుపథకు సంబుద్ధిభిన్నంబగు సర్వనామస్థానంబు పరంబగుచో దీర్ఘంబగును.

ఉదా:—సఖాన్+స్-అని కాఁగా,

సూ.—అపృక్త ఏకాల్ప్రత్యయః—౧-౨-౪౧.

ఏకవర్ణాత్మకంబగు ప్రత్యయం బపృక్తసంజ్ఞకంబు.

సూ.—హల్ఙ్యాభ్యో దీర్ఘాత్సుతిస్యపృక్తం హల్—౬-౧-౬౮.

హలంతముకంటెను, దీర్ఘములగు ఙీ-ఆప్-ప్రత్యయంబులంతంబునఁ గలదానికంటెను బరమగు - సు,తి,సి-అనువానియొక్క యపృక్తసంజ్ఞగలహల్లు లోపించును.

ఉదా:—సఖాన్+స్-పైసూత్రంబుచేత సులోపంబు-సఖాన్.

సూ.—న లోపః ప్రాతిపదికాన్తస్య—౮-౨-౭.

ప్రాతిపదికసంజ్ఞకంబగు పదంబుతుదినకారంబు లోపించును.

ఉదా:—సఖా.

సూ.—సఖ్యురసంబుద్ధౌ—౭-౧-౯౨.

సఖిశబ్దాంతమగు అంగముకంటెఁ బరమగుసంబుద్ధి భిన్నమగు సర్వనామస్థానము ణిత్తువంటిదగును. (అనఁగా ణిత్తు పరమగునపుడు వచ్చు కార్యము లగుననుట.)

సూ.—అచో ఞ్ణితి—౭-౨-౧౧౫.

అజంతమగు నంగమునకు ఞిత్తుగాని-ణిత్తుగాని యగు ప్రత్యయము పరమగుచో వృద్ధియగును.

ఉదా:—సఖి+ఔ-ఇట ఔ ప్రత్యయము ణిత్తువంటిదిగానఁ బ్రకృతసూత్రముచేత వృద్ధి. సఖై+ఔ-ఆయాదేశము-సఖాయౌ-సఖాయః, హేసఖే, సఖాయమ్-సఖాయౌ - సఖీన్, సఖ్యా, సఖ్యై.

సూ.—ఖ్యత్యాత్పరస్య—౬-౧-౧౧౨.

యణాదేశమును పొందిన ఖి-తి-ఖీ-తీ - శబ్దములకంటెఁ బరమగు ఙసి-ఙస్సులయొక్క అకారమునకు ఉకారమాదేశమగును.

ఉదా:—సఖి+అస్-(యణ్) సఖ్యస్-అకారమున కుకారము సఖ్యుస్-రుత్వవిసర్గములు-సఖ్యుః.

సూ.—ఔత్—౭-3-౧౧౮.

హ్రస్వములగు ఇకార - ఉకారములకంటెఁ బరమగు సప్తమ్యేకవచనమునకు ఔకారమగును.

ఉదా:—సఖి+ఙి-సఖి+ఔ-యణ్ణు-సఖ్యౌ. తక్కినరూపములు హరిశబ్దమునకుం బలె నెఱుంగునది.

సూ.—పతిస్సమాస ఏవ—౧-౪-౮.

పతిశబ్దము సమాసమందు మాత్రమే ఘిసంజ్ఞకంబగును.

ఉదా:—పతి+ఙే - దీనికి ఘిసంజ్ఞ లేదుగాన గుణము రాదు. యణ్ణు-పత్యా-పత్యే-పత్యుః-పత్యౌ. తక్కినరూపంబులు హరిశబ్దంబునకుం బోలె నరయునది.

సమాసమందు ఘిసంజ్ఞ యుండుటచేత భూపతినా - భూపతయే - మున్నగురూపములు హరిశబ్దమునకుంబోలె నూహించునది.

కతిశబ్దము నిత్యబహువచనాంతము. బహువచనప్రత్యయములుమాత్రమే వచ్చును. ఇయ్యది డతిప్రత్యయాంతము. (కిమ్+డతి=కతి.)

సూ.—బహుగణవతుడతిసంఖ్యా—౧-౧-౨౩.

బహు-గణ-శబ్దములును, వతు-డతి-ప్రత్యయాంతములును సంఖ్యయను సంజ్ఞగలవి యగును.

సూ—డతి చ—౧-౧-౨౫.

డతిప్రత్యయాంతమగుసంఖ్య షట్సంజ్ఞకంబు.

సూ.—షడ్భ్యో లుక్—౭-౧-౨౨.

షట్సంజ్ఞకంబులకంటెఁ బరమగు జశ్శస్సులకు లుక్కగును.

ఉదా:—కతి+జస్-ప్రత్యయంబునకు లుక్కు- కతి.

సూ—ప్రత్యయస్య లుక్శ్లులుపః—౧-౧-౬౧.

లుక్-శ్లు-లుప్-అనుపదముల నుచ్చరించి విధింపఁబడు ప్రత్యయములయదర్శనము, వరుసగా లుక్ - శ్లు-లుప్-అను సంజ్ఞఁగలవి యగును.

సూ.—ప్రత్యయలోపే ప్రత్యయలక్షణమ్—౧-౧-౬౨.

ప్రత్యయము లోపించినను ఆప్రత్యయమునకు సంబంధించిన కార్యము వచ్చును.

ఉదా:—కతి-ఇట జస్సు లోపించినను పైసూత్రమును బట్టి "జసి చ" యనుదానిచే గుణము ప్రాప్తింపఁగా,

సూ.—న లుమతాఽఙ్గస్య—౧-౧-౬౩.

లుక్-శ్లు-లుప్-అనువీనిచే లోపము వచ్చినపుడు లుప్త ప్రత్యయనిమిత్తకమగు-అంగకార్యము రాదు. దీనిచే గుణము నిషేధింపఁబడఁగా, కతి-యనియే రూపంబు. కతిభిః-కతిభ్యః-కతీనామ్-కతిషు.

యుష్మదస్మచ్ఛబ్దంబులయు, షట్సంజ్ఞకంబులయు రూపంబులు మూఁడులింగంబులందును సమానంబుగా నుండును.

త్రి-శబ్దము నిత్యబహువచనాంతము.

ఉదా:—త్రయః-త్రీన్-త్రిభిః-త్రిభ్యః (౨)

సూ.—త్రేస్త్రయః—౭-౧-౫౩.

త్రిశబ్దమునకు ఆమ్ము పరమగుచో త్రయ-అనునాదేశమగును.

ఉదా:—త్రి+ఆమ్-త్రయ+ఆమ్- నుట్టు త్రయ+నామ్ దీర్ఘము ణత్వము త్రయాణామ్ - త్రిషు. త్రిశబ్దార్థమునకుఁ బ్రాధాన్యము లేకపోయినను త్రయాదేశంబగును.

ఉదా:—ప్రియాః త్రయః యేషాం తేషామ్ ప్రియత్రయాణామ్.

సూ.—త్యదాదీనామః—౭-౨-౧౦౨.

ద్విశబ్దమువఱకు నుండుత్యదాదులకు విభక్తి పరమగుచో అకారంబంతాదేశంబగును.

త్యదాదులు సర్వనామంబులందుఁ జెప్పఁబడినవి.

ఇట త్యదాదు లన ద్విశబ్దమువఱకు నుండునవిమాత్రమే యని భాష్యకారునియభిప్రాయము.

ఉదా:—ద్వి+ఔ - ద్వ+ఔ-వృద్ధి-ద్వౌ - (౨) ద్వాభ్యామ్ (3) ద్వయోః-(౨)

ఇవి ఇదన్తశబ్దములు.

ఈదన్తశబ్దములు.

పాతి లోకమితి-పపీః-లోకమును బరిపాలించువాఁడు గాన పపీః అనఁబడును. సూర్యుఁడనియర్థము.

ఉదా:—పపీ+ఔ-ఇటఁ బూర్వసవర్ణదీర్ఘము ప్రాప్తింపఁగా "దీర్ఘాజ్జసి చ" యనుసూత్రముచే నది నిషేధింపఁబడుటచే యణాదేశంబు పప్యౌ-(౨)పప్యః, హేపపీః, పపీమ్-పపీన్, పపీభ్యామ్ (3) పపీభిః, పప్యే-పపీభ్యః - (౨) పప్యః-(౨) పప్యోః-(౨)

పపీ+ఆమ్. ఇట హ్రస్వమగు - ఇకారము లేదుగాన నుడాగమంబు రాదు-యణాదేశంబు. పప్యామ్, పపీ+ఙి— సవర్ణదీర్ఘము=పపీ—పపీషు. ఇట్లే వాతప్రమీ, యయీ-మున్నగువానిరూపంబు లెఱుంగునది.

బహ్వ్యః శ్రేయస్యః యస్య సః (చాల శ్రేయస్సులు గలవాఁడని యర్థము)=బహుశ్రేయసీ.

సూ.—యూ స్త్ర్యాఖ్యౌ నదీ—౧-౪-3

దీర్ఘములగు ఈ-ఊ-వర్ణము లంతంబునఁగల నిత్యస్త్రీలింగంబులు నదీసంజ్ఞకంబు లగును.

ప్రథమలిఙ్గగ్రహణఞ్చ—(వా)

సమాసము చేయుటకుఁ బూర్వము స్త్రీలింగమగుశబ్దము సమాసమునఁ బ్రధానముగా స్త్రీత్వబోధకము కాకున్నను నదీసంజ్ఞక మగును.

సూ.—అమ్బార్థనద్యోర్హ్రస్వః—౭-౩-౧౦౭

అమ్బా-అకా-అల్లా-మున్నగు వానికిని,నదీసంజ్ఞకముల కును సంబోధనప్రథమైకవచనము పరమగుచో హ్రస్వమగును.

ఉదా:—హేబహుశ్రేయసీ+స్ - హ్రస్వసులోపంబులు హేబహుశ్రేయసి-బహుశ్రేయసీన్.

సూ.—ఆణ్ నద్యాః—౭-౩-౧౧౨.

నదీసంజ్ఞకాంతములకంటెఁ బరమగుఙిత్తులకు ఆడాగ మంబగును.

సూ.—ఆటశ్చ—౬-౧-౯౦.

ఆట్టునకచ్చు పరమగుచో వృద్ధి యేకాదేశమగును.

ఉదా:—బహుశ్రేయసీ+ఙే - ఆట్టు బహుశ్రేయసీ +ఆ+ఏ వృద్ధి - బహుశ్రేయసీ+ఐ+యణాదేశము బహుశ్రే యసై్య-బహుశ్రేయస్యాః-(౨)బహుశ్రేయసీనామ్.

సూ.—ఙేరామ్ నద్యామ్నీభ్యః—౭-౩-౧౧౬.

నద్యంతముకంటెను, ఆబంతముకంటెను, నీయనుశబ్ద ముకంటెను బరమగుసప్తమ్యేకవచనమునకు ఆమ్ అనునాదేశ మగును.

ఉదా:—బహుశ్రేయసీ+ఙి (ఆమ్) బహుశ్రేయసీ+ ఆమ్ (ఆట్) బహుశ్రేయసీ ఆ+ఆమ్ - వృద్ధి-బహుశ్రేయసీ+ ఆమ్ (యణ్) బహుశ్రేయస్యామ్. తక్కినరూపంబులు పఖీ శబ్దంబునకుంబోలె నెఱుంగునది.

లక్ష్మీమతిక్రాన్తః-(లక్ష్మినతిక్రమించినవాఁడు). అతిలక్ష్మీ+స్-ఇట లక్ష్మీశబ్దములోని-ఈకారము జీప్ - జీష్-జీన్-ప్రత్యయములకు సంబంధించినది కానందునఁ బ్రత్యయలోపంబు లేదు. రుత్వవిసర్గము-అతిలక్ష్మీః పైశబ్దంబునకుంబలె రూపము లూహించునది.

ప్రధీ+స్-రుత్వవిసర్గములు-ప్రధీః.

సూ.—అచి శ్నుధాతుభ్రువాం య్వోరియఙువఙౌ—౬-౪-౭౭.

శ్నుప్రత్యయాంతాంగమునకును, ఇకారాంత - ఉకారాంతధాతువులకును భ్రూ-అనునంగమునకును-అజాదిప్రత్యయములు పరమగుచో ఇయఙ్-ఉవఙ్లాదేశంబగును. ఇట స్థానసామ్యమునుబట్టి, ఇకారమున కియఙును ఉకారమున కువఙునగును.

ఉదా:—ప్రధీ+ఔ-ఇట నీకారమున కియఙు ప్రాప్తింపఁగా,

సూ.—ఏరనేకాచో ఽసంయోగపూర్వస్య—౬-౪-౮౨.

ధాత్వవయవసంయోగమునకుఁ బరముకాని ఇకారమంతమునఁ గలధాతువు అంతమునఁగల యనేకాచ్కమగు నంగమునకు అజాదిప్రత్యయములు పరమగునపుడు యణాదేశమగును. ఇయఙున కపవాదంబు—దీనిచే యణ్ణు.

ఉదా:—ప్రధ్యై-(అ)-ప్రధ్యమ్-ప్రధ్యః, ప్రధ్యి-తక్కుం గలరూపంబులు పపీశబ్దంబునకుఁ బోలె నరయునది. ఉద్+నీః= ఉన్నీః-ఉన్నీ+ఔ - ఇచ్చట నుపసర్గముయొక్కయు ధాతువుయొక్కయు నవయవములకుఁ గల్గినసంయోగముగాని కేవల ధాత్వవయవములకుఁ గల్గినసంయోగము గాకపోవుటచే యణాదేశంబు రావచ్చును. ఉన్న్యౌ-ఉన్న్యః. గ్రామణీః-గ్రామణీ+ఙి-ఆమ్ము-యణ్ణు-గ్రామణ్యామ్.

నీ+స్=నీః-నీ+ఔ - ఇది యనేకాచ్కము కానందున యణ్ణు రాదు. ఇయఙ్ఙు - నియౌ - నియః. అమ్శస్సులయందుఁ బూర్వరూపముకంటెను బూర్వసవర్ణదీర్ఘముకంటెను బరమగుట చేత ఇయఙ్ఙువచ్చును. నియమ్- నియః.

నీ+ఙి-ఆమ్ము-నీ+ఆమ్ ఇయఙ్ఙు నియామ్. సుశ్రీ+ఔ, యవక్రీ+ఔ వీనియందలి సంయోగము కేవలధాత్వవయవము లదిగాన యణ్ణు రాదు. ఇయఙ్ఙు. సుశ్రియౌ-యవక్రియౌ.

సూ.—గతిశ్చ—౧-౪-౬౦

ప్ర-పరా-మున్నగునవి క్రియలతో సంబంధించునపుడు గతిసంజ్ఞకంబులు గూడ నగును.

గతికారకేతరపూర్వపదస్య యణ్ నేష్యతే—(వా)

గతిసంజ్ఞకములకంటెను కారకములకంటెను నితరము

పూర్వపదముగాఁగల యంగమునకు యణాదేశంబు రాదని భాష్యకారులయాశయము.

ఉదా:—శుద్ధధీ+ఔ. ఇటశుద్ధశబ్దంబు గతికారకము లోఁ జేరనందున యణ్ణు రాదు. ఇయఙ్ఙు-శుద్ధధియౌ.

సూ.—న భూసుధియోః—౬-౪-౮౫.

భూ-సుధీ - శబ్దములకు అజాదులగుసుప్ప్రత్యయంబులు పరంబగుచో యణ్ణురాదు.

ఉదా:—సుధీ+ఔ - ఇయఙ్ఙు - సుధియౌ - సుధియః. ఇత్యాదులు.

సుఖమిచ్ఛతీతి - (సుఖమును గోరువాఁడు)-సుఖీః, సుతమిచ్ఛతీతి-(పుత్రుని గోరువాఁడు)-సుతీః.

సుఖీ+ఔ } యణ్ణు=సుఖ్యౌ-సుత్యౌ-(౨)
సుతీ+ఔ }

సుఖీ+అస్ } యణ్ణు=ఉకారము-సుఖ్యుః(౨) సుత్యుః(౨)
సుతీ+అస్ }

తక్కుఁగలరూపములు ప్రధీశబ్దమునకువలె నరయునది.

ఇది ఈదన్తశబ్దములు.



### ఉదన్తశబ్దములు.

శమ్భుశబ్దంబునకు హరిశబ్దంబునకుంబలెఁ బ్రక్రియ నూహించునది. ఇట్లే- విష్ణు-వాయు-భాను-మున్నగునవి.

సూ.—తృజ్వత్ క్రోష్టుః—౭-౧-౯౫.

సంబుద్ధిభిన్నమగు సర్వనామస్థానము పరమగునపుడు ఉకారాంతంబగు క్రోష్టుశబ్దమునకు ఋకారాంతమగు క్రోష్టృశబ్దం బాదేశమగును.

ఉదా:—క్రోష్టు+స్-క్రోష్టృ+స్-అని కాఁగా,

సూ.—ఋతో ఙిసర్వనామస్థానయోః—౭-3-౧౧౦.

ఋకారాంతమగు అంగమునకు ఙిప్రత్యయమును, సర్వనామస్థానంబును బరమగుచో గుణమగును. దీనిచే గుణము ప్రాప్తించుచుండఁగా,

సూ.—ఋదుశనస్పురుదంసో౽నేహసాఞ్చ—౭-౧-౯౪.

ఋదంతములకును, ఉశనస్-పురుదంసస్ - అనే హస్ శబ్దంబులకును సంబుద్ధిభిన్నమగు ప్రథమైకవచనము పరమగునపుడు అనఙ్ఙాదేశంబగును. ఈసూత్రముచే ననఙ్ఙు.

ఉదా:—క్రోష్టన్+స్-అని సిద్ధింపఁగా,

సూ.—అప్తృన్ తృచ్ స్వసృనప్తృనేష్టృత్వష్టృక్షత్తృహోతృపోతృప్రశాస్తౄణామ్—౬-౪-౧౧.

అప్ శబ్దంబుయొక్కయు, తృన్ తృచ్ ప్రత్యయాంతములయు, స్వసృ-నప్తృ - నేష్టృ-త్వష్టృ-క్షత్తృ - హోతృ-

పోతృ-ప్రశాస్తృ- శబ్దంబులయు ఉపధకు సంబుద్ధిభిన్నంబగు సర్వనామస్థానంబు పరంబగుచో దీర్ఘమగును.

ప్రకృతమున నీశబ్దము తృజంతముగాన దీర్ఘము.

ఉదా:—క్రోష్టాన్+స్ - సులోపంబు - నలోపంబు- క్రోష్టా-క్రోష్టృ+ఔ-గుణము- క్రోష్టర్+ఔ-ఉపధాదీర్ఘము- క్రోష్టార్+ఔ=క్రోష్టారౌ (౨) క్రోష్టారః—

క్రోష్టు+అస్-ఇటసర్వనామస్థానము పరముగా లేనందున క్రోష్ట్రాదేశంబు రాదు. పూర్వసవర్ణదీర్ఘము క్రోష్టూస్-సకారంబునకు నకారంబు- క్రోష్టూన్.

సూ.—విభాషా తృతీయాదిష్వచి—౭-౧-౯౭.

క్రోష్టుశబ్దమునకు టా మొదలుగాఁగల అజాదివిభక్తులు పరమగునపుడు తృజ్వద్భావము వికల్పముగానగును. (క్రోష్టృ అనునాదేశము వికల్పమనుట.)

ఉదా:—క్రోష్టు+ఆ-క్రోష్టృ+ఆ- యణ్ణు- క్రోష్ట్రా- క్రోష్ట్రే.

సూ.—ఋత ఉత్—౬-౧-౧౧౧.

హ్రస్వమగుఋకారమునకు ఙసి-ఙస్సులఅకారము పరమగుచో ఉకార మేకాదేశ మగును.

ఉదా:—క్రోష్టృ+అస్-(ఉకారంబురపరంబు) క్రోష్టుర్+స్

సూ—రాత్సస్య—౮-౨-౨౪.

రేఫముకంటెఁ బరమగుదానికి సంయోగాంతలోపము వచ్చునెడ సకారమునకేయగును. మఱియొకవర్ణమునకు రాదు.

(ఈనియమంబుచే డుర్ క్-అనుచోఁ గకారమునకు సంయోగాంతలోపంబు లేదని తెలియునది.)

ఉదా:—క్రోష్టుర్ స్-సలోపంబు రేఫంబునకు విసర్గము క్రోష్టుః-(౨) క్రోష్టోః(౨).

క్రోష్టు+ఆమ్-ఇట తృజ్వద్భావమును, నుడాగమము నొక్కసారిగాఁ బ్రాప్తింపఁగా,

నుమచిరతృజ్వద్భావేభ్యో నుట్ పూర్వవిప్రతి
షేధేన—(వా)

నుమ్ముకంటెను, అచ్చు పరమగునపుడు త్రిసృచతసృశబ్దములకు వచ్చురేఫాదేశముకంటెను, తృజ్వద్భావముకంటెను, బూర్వవిప్రతిషేధంబుచేత నుడాగమము ముందుగా వచ్చును. సమబలంబులగు రెండుశాస్త్రము లొక్కసారి ప్రాప్తించినపుడు పూర్వశాస్త్రముచేఁ గార్యముచేయుట పూర్వవిప్రతిషేధ మనఁబడును—దీనిచే నుడాగమంబు.

ఉదా:—క్రోష్టు+నామ్-"నామి" అనుదానిచే దీర్ఘంబు క్రోష్టూనామ్. క్రోష్టృ+ఇ-గుణము - క్రోష్టరి.

తృజ్వద్భావము రానిపక్షమందును హలాదివిభక్తులందును శమ్భుశబ్దంబునకుఁ బోలెఁ బ్రక్రియ యూహించునది.

ఇవి ఉదన్తశబ్దములు.

---

ఊదన్తశబ్దములు.

హూహూః-హూహ్వౌ-(౨)హూహూభ్యాః,హూహూనామ్-హూహూన్ మున్నగునవి.

అతిచమూశబ్దంబునకు నదీసంజ్ఞకములకుఁ జెప్పఁబడిన కార్య మగుట విశేషము.

ఉదా:—హేఅతిచము-అతిచమ్వై - అతిచమ్వాః (౨) అతిచమూనామ్.

ఖలపూః—(కళ్లమునూడ్చువాఁడు)

సూ.—ఓస్సుపి—౬-౪-౮౩.

ధాత్వవయవసంయోగము పూర్వమున లేనట్టి ఉకారమంతమునఁ గలధాతువుచివరఁ గలిసినట్టియు, అనేకాచ్చులుగల అంగమునకు అజాదులగుసుప్పులు పరమగునపుడు యణ్ణగును.

ఉదా:—ఖలపూ+ఔ-యణ్ణు. ఖలప్వౌ-ఖలప్వః. ఇట్లే సులూః-మున్నగునవి.

స్వభూః-స్వభువౌ-స్వభువః. వర్షాభూః-(కప్ప).

సూ.—వర్షాభ్వశ్చ—౬-౪-౮౪.

వర్షాభూశబ్దమునకు అజాదియగు సుప్పు పరమగునపుడు యణాదేశంబగును.

ఉదా:—వర్షాభూ+ఔ-యణ్ణు-వర్షాభ్వౌ-దృన్భూః.

దృన్కరపునః పూర్వస్య భువో యణ్వక్తవ్యః—(వా)

దృన్-కర-పునర్ - అనువీనికిఁ బరమగు భూశబ్దమున కజాదిసుప్పు పరమగునపుడు యణాదేశంబగును. దృన్-అను నది హింసార్థకము, నకారాంతము నగునవ్యయము.

ఉదా:—దృన్భూ+ఔ - యణ్ణు - దృన్భ్వౌ. ఇట్లే కరభ్వః-పునర్భ్వః మున్నగువానిరూపంబు లెఱుంగునది.

ఇవి ఊదన్తశబ్దములు.

---

ఋదన్తశబ్దములు.

ధాతా, హేధాతః-ధాతారౌ-ధాతారః.

ఋవర్ణాన్నస్య ణత్వం వాచ్యమ్—(వా)

ఋకారముకంటెఁ బరమగునకారమునకు ణత్వంబగును.

ఉదా:—ధాతృ+నామ్ - దీర్ఘము - ణత్వము-ధాతౄణామ్. ఇట్లే నప్తౄ-నేష్టౄ-మున్నగునవి.

ఉణాదిప్రత్యయాంతంబులకుఁ బ్రకృతిప్రత్యయవిభాగంబు కలదనియు లేదనియు రెండుమతంబులు. వానికే వ్యుత్పత్తి పక్షమనియు, నవ్యుత్పత్తిపక్షమనియు వ్యవహారము. అందు వ్యుత్పత్తిపక్షమున "అప్తృన్ని"త్యాది సూత్రమందలి తృన్ తృచ్చుల గ్రహణముచేతనే నప్త్రాదులకుఁగూడ దీర్ఘము సిద్ధించుచుండఁగా మరల ప్త్రాదులను గ్రహించుట "ఉణాదినిష్పన్నములగుతృన్తృజంతములకు దీర్ఘము వచ్చునెడ. నప్త్రాదులకు

మాత్రమే యగు" ననునియమంబు కొలఁకని తెలియునది. దానంజేసి పితృ - భ్రాతృమున్నగుశబ్దములకు నుపధాదీర్ఘము రాదు.

పితా-పితరౌ-పితరః, పితరమ్ ధాతృశబ్దంబునకుఁ బోలెఁ దక్కినరూపంబు లెఱుంగునది.

ఇట్లే జామాతా-భ్రాతాయున్నగునవి. నా-నరౌ.

సూ.—నృ చ—౬-౪-౬.

నృశబ్దమునకు "నామ్" అనునది పరమగుచో వికల్పముగా దీర్ఘమగును.

ఉదా:—నృణామ్-నౄణామ్.

ఇవి ఋదన్తశబ్దములు.

---

ఓదన్తశబ్దములు.

సూ.—గోతో ణిత్—౭-౧-౯౦.

ఓతో ణిదితి వాచ్యమ్—(వా)

ఓకారాంతమగుశబ్దముకంటె విధింపఁబడిన సర్వనామస్థానము ణిత్తువంటి దగును.

ఉదా:—గో+స్-పైసూత్రమునుబట్టి ప్రత్యయము ణిత్తువంటి దగుటచే "అచోఞ్ణితి" యనుదానిచేత వృద్ధి గౌః-గావౌ-గావః.

సూ.—ఔతోఽమ్శసోః—౬-౧-౯౩.

ఓకారమునకు-అమ్-శస్సులయొక్క అచ్చు పరమగుచో ఆకారమేకాదేశ మగును.

ఉదా:—గో+అమ్ - ఆకారము - గ్ఆ+అమ్=గామ్-గావౌ-గో+అస్=గాః, గవా, గవే-గోః ఇత్యాదులు.

ఇవి ఓదన్తశబ్దములు.

---

ఐదన్తశబ్దములు.

సూ—రాయో హలి—౭-౨-౮౫.

రైశబ్ధమునకు హలాదివిభక్తులు పరమగుచో ఆకారమాదేశంబగును.

ఉదా:—రై+స్-రాస్=రాః-

రై+ఔ-ఆయాదేశము-రాయౌ-రాయః, రాభ్యామ్-ఇత్యాదులు.

ఇవి ఐదన్తశబ్దములు.

---

ఔదన్తశబ్దములు.

గ్లౌః-గ్లావౌ-గ్లావః, గ్లౌభ్యామ్-ఇత్యాది.

ఇవి ఔదన్తశబ్దములు.

---

ఇది అజన్తపుంలింగప్రకరణము.

# అజన్తస్త్రీలింగప్రకరణము.

ఉదా:—రమా+స్=రమా.

సూ.—ఔఙ ఆపః—౭-౧-౧౮.

ఆబంతమగు అంగముకంటెఁ బరమగు ఔఙ్జునకు శీ-యగును. ప్రథమాద్వితీయాద్వివచనములకు ఔఙ్జని సంజ్ఞ. ఇందలి శకార మిత్సంజ్ఞకము.

ఉదా:— రమా+ఔ - రమా+ఈ - గుణము=రమే-రమాః.

సూ.—సంబుద్ధౌ చ—౭-3-౧౦౬.

ఆబంతమగు, అంగమునకు సంబుద్ధి పరమగుచో ఏకారమగును.

ఉదా:— హేరమా+స్ - హేరమే+స్ ఏఙ్హ్రస్వాదిత్యాదిసూత్రముచే సంబుద్ధిలోపంబు. హేరమే - హేరమే-హేరమాః, రమామ్-రమే-రమాః.

సూ.—ఆఙి చాపః—౭-3-౧౦౫.

ఆఙ్, ఓస్సులు పరమగునపు డాబంతాంగంబునకు-ఏకారమగును.

ఉదా:—రమా+ఆ-(టా)రమే+ ఆ, అయాదేశము రమయా-రమాభ్యామ్-రమాభిః.

సూ.—యాడాపః—౭-౩-౧౧౩.

ఆబంతాంగముకంటెఁ బరమగు జిత్తులైన ప్రత్యయములకు యాట్-అనునాగమంబగును.

ఉదా:—రమా+ఙే రమా+యా ఏ-వృద్ధి రమాయై-రమాభ్యః, రమాయాః-రమయోః-రమాణామ్, రమాయామ్-రమయోః-రమాసు. ఇట్లే దుర్గా-అమ్బికా మున్నగునవి.

సర్వా-సర్వే-సర్వాః.

సూ—సర్వనామ్నస్స్యాడ్ఢ్రస్వశ్చ—౭-౩-౧౧౪.

ఆబంతమగు అంగముకంటెఁ బరమును, సర్వనామముకంటె విహితము నగుజిత్తునకు స్యాట్టును, ఆప్పునకు హ్రస్వము నగును.

ఉదా:—సర్వా+ఏ - సర్వ+స్యా ఏ - వృద్ధి-సర్వస్యై, సర్వస్యాః-(౨) సర్వాసామ్, సర్వస్యామ్.

రమాశబ్దంబునకుఁబోలె తక్కినరూపంబు లెఱుంగునది. ఇట్లే-విశ్వా-మున్నగునవి.

సూ—విభాషా దిక్సమాసే బహువ్రీహౌ—౧-౧-౨౮.

దిగ్వాచకములయొక్క బహువ్రీహిసమాసమునకు సర్వనామసంజ్ఞ వికల్పముగానగును.

ఉదా:—ఉత్తరపూర్వస్యై-పక్షమున-ఉత్తరపూర్వాయై.

"తీయస్య జిత్సూపసంఖ్యాన" మ్మనువార్తికముచే తీయ

ప్రత్యయాంతములకు సర్వనామసంజ్ఞ వికల్పము. ద్వితీయస్యై-ద్వితీయాయై. ఇట్లే తృతీయా మున్నగునవి.

అమ్బా-"అమ్బార్థే"త్యాదిసూత్రముచేత హ్రస్వము. హేఅమ్బ-హేఅక్క-హేఅల్ల- జరా-(జరా+ఔ-జరస్+ఔ)= జరసౌ - జరసాదేశము రానిపక్షమున రమాశబ్దమునకువలె రూపంబులగును.

గోపాశబ్దమునకు విశ్వపాశబ్దమునకువలెఁ బ్రక్రియ నూహించునది. మతిః, మతీః, మత్యా.

సూ.—ఙితి హ్రస్వశ్చ—౧-౪-౬.

ఇయఙువఙ్స్థానులై స్త్రీశబ్దభిన్నంబులై నిత్యస్త్రీలింగంబులగు ఈకార - ఊకారములును, హ్రస్వములగు ఇ - ఉ వర్ణములును స్త్రీలింగంబున ఙిత్తు పరమగుచో నదీసంజ్ఞకములు వికల్పముగా నగును.

ఉదా:—మతి+ఙే - నదీసంజ్ఞ యున్నపక్షమున ఆట్టు. మతి+ఆఏ-వృద్ధి-యణ్ణు-మత్యై-పక్షంబున-ఘిసంజ్ఞ.

మతి+ఏ గుణము - మతే+ఏ అయాదేశము - మతయే, మత్యాః(౨)మతేః-(౨).

నదీసంజ్ఞ యున్నపక్షమున ఙి-ప్రత్యయంబునకు ఔత్వము ప్రాప్తింపఁగా,

సూ.—ఇదుద్భ్యామ్—౭-౩-౧౧౭.

నదీసంజ్ఞకములగు ఇకార-ఉకారములకంటెఁ బరమగు ఙి-అనుదానికి ఆమ్మగును.

ఉదా:— మతి+ఙి-ఆణ్ము-మతి+ఆమ్-యణ్ణు-మత్యామ్. నదీసంజ్ఞ లేనిపక్షమున - మతి+ఙి-"అచ్చఘేః" అనుసూత్రము చేత ఔకార-అకారములు. మత+ఔ = మతౌ. తక్కినరూపములు హరిశబ్దంబునకుంబోలె నెఱుంగునది. ఇట్లే బుద్ధిమున్నగునవి.

సూ.—త్రిచతురోః స్త్రియాం తిసృచతసృ—౭-౨-౯౯.

స్త్రీలింగములగు త్రి-చతుర్-శబ్దములకు విభక్తి పరమగుచోఁ గ్రమముగా తిసృ-చతసృ-అనునాదేశము లగును.

ఉదా.—త్రి+జస్-తిసృ-+జస్.

సూ.—అచిరఋతః—౭-౨-౧౦౦.

తిసృ-చతసృ - శబ్దములఋకారమునకు అజాదివిభక్తులు పరమగుచో రేఫాదేశమగును. గుణ-దీర్ఘ-ఉత్వ - ముల కపవాదము.

ఉదా:—తిస్ర్+అస్- రుత్వవిసర్గములు - తిస్రః - (౨) తిసృభిః, తిసృభ్యః-(౨).

తిసృ+ఆమ్-తిసృ+నామ్. ఇట "నామి"అనుసూత్రముచే దీర్ఘము ప్రాప్తింపఁగా,

సూ.—న తిసృచతసృ—౬-౪-౪.

తిసృ-చతసృ-శబ్దములకు నామ్ము పరమగునపుడు దీర్ఘము రాదు. ణత్వము-తిసృణామ్-తిసృషు.

ద్వి+ఔ.త్యదాద్యత్వము టాప్పు-ద్వా+ఔ-శీభావము ద్వా+శీ - ద్వా+ఈ గుణము- ద్వే - (౨) ద్వాభ్యామ్ (3) ద్వయోః (౨).

గౌరీ-గౌర్యౌ-గౌర్యః, హేగౌరి - గౌర్యై ఇత్యాది. ఇట్లే నదీ వాణీమొదలగునవి. లక్ష్మీః - గౌరీశబ్దంబునకుంబోలె తక్కినరూపంబు లరయునది. ఇట్లే తరీ-తంత్రీమున్నగునవి.

స్త్రీ-హేస్త్రి.

సూ.— స్త్రియాః—౬-౪-౭౯.

స్త్రీశబ్దమునకు అజాదిప్రత్యయములు పరమగుచో ఇయఙాదేశంబగును.

ఉదా:— స్త్రీ+ఔ-స్త్రియ్+ఔ=స్త్రియౌ-(౨) స్త్రియః.

సూ.—వామ్శసోః—౬-౪-౮౦.

అమ్శస్సులు పరమగునపుడు స్త్రీశబ్దమునకు ఇయఙాదేశము వికల్పముగానగును.

ఉదా:— స్త్రీ+అమ్-స్త్రియ్+అమ్=స్త్రియమ్. పక్షమున స్త్రీ+అమ్-పూర్వరూపము-స్త్రీమ్-స్త్రియః-స్త్రీః,స్త్రియా,స్త్రియై, స్త్రియాః-ఇయఙాదేశముకంటె బరంబగుటచే నుడాగమంబు. స్త్రీణామ్, స్త్రీషు. శ్రీః-శ్రియౌ-శ్రియః.

సూ.— నేయఙువఙ్స్థానావస్త్రీ—౧-౪-౪.

ఇయఙువఙ్ములకు స్థానులును, స్త్రీశబ్దభిన్నంబులు నగు ఈకార-ఊకారములకు నదీసంజ్ఞ లేదు.

ఉదా:—హేశ్రీః, శ్రియై - నదీసంజ్ఞ వికల్పముగాన పక్షంబున శ్రియే, శ్రియాః(౨) శ్రియః-(౨).

సూ.—వామి—౧-౪-౫.

ఇయఙువఙ్గులకు స్థానులై, స్త్రీశబ్దభిన్నంబులై, నిత్య స్త్రీలింగములగు ఈకారఊకారములు ఆమ్ము పరమగుచో నదీసంజ్ఞకములు వికల్పముగానగును.

ఉదా:—శ్రీణామ్ - పక్షమున ఇయఙ్ఙు - శ్రియామ్, శ్రియి- శ్రియామ్.

ధేనుశబ్దమునకు మతిశబ్దమునకుఁ బోలెఁ బ్రక్రియను జూచుకొనునది.

సూ.—స్త్రియాఞ్చ—౭-౧-౯౬.

స్త్రీవాచకమగు క్రోష్టుశబ్దము తృజంతరూపమును బొందును. (ఋకారాంత మగునసుట.)

సూ.—ఋన్నేభ్యో జీప్—౪-౧-౫.

హ్రస్వములగు ఋకార-నకారాంతములు నగుప్రాతిపదికములకంటె స్త్రీలింగంబున జీప్ప్రత్యయంబగును.

ఉదా:—క్రోష్టృ-క్రోష్టృ+జీప్ యణ్ణు-క్రోష్ట్రీ. దీనికి గౌరీశబ్దమునకుంబోలె రూపంబులగును.

భూః-దీనికి శ్రీశబ్దమునకువలెఁ బ్రక్రియ నరయునది. స్వయమ్భూశబ్దమునకుఁ బుంలింగమందువలె రూపంబు లగును.

సూ.—న షట్ స్వస్రాదిభ్యః—౪-౧-౧౦.

షట్సంజ్ఞకములకంటెను, స్వస్రాదులకంటెను జీప్ టాప్పులు రావు.

స్వసృ-తిసృ - చతసృ-ననాంద్మృ - దుహితృ - యాతృ-మాతృ ఇవియేడును స్వస్రాదులు.

ఉదా:—స్వసృ + స్ = స్వసా - స్వసారౌ - ఇత్యాది. మాతృశబ్దమునకు పితృశబ్దమునకువలెఁ బ్రక్రియ నెఱుంగునది. మాతృ+అస్-మాతౄ+స్-పుల్లింగముకానందునసకారమునకు నకారము రాదు. మాతౄః- ద్యోశబ్దమునకు గోశబ్దమునకుం బోలెను, రైశబ్దమునకుఁ బుంలింగమందువలెను, నౌశబ్దము గ్లౌశబ్దమునందువలెఁ బ్రక్రియ నరయునది.

ఇతి అజన్తస్త్రీలింగప్రకరణము.

---

# అజన్తనపుంసకలింగప్రకరణము.

సూ.—అతోఽమ్—౭-౧-౨౪.

అదంతము, నపుంసకమునగు అంగమునకుఁ బరమగు సు-అమ్ లకు అమాదేశంబగును.

ఉదా:—జ్ఞాన+స్-జ్ఞాన+అమ్-పూర్వరూపము జ్ఞానమ్, హేజ్ఞాన+స్-హేజ్ఞాన+అమ్ - హేజ్ఞానమ్-సంబుద్ధిలోపము - హేజ్ఞాన.

సూ.—నపుంసకాచ్చ—౭-౧-౧౯.

నపుంసకమగు అంగముకంటెఁ బరమగు - ఔజ్జునకు శీభావమగును.

ఉదా:—జ్ఞాన+ఔ-జ్ఞాన+ఈ అని సిద్ధింపఁగా,

సూ.—యస్యేతి చ—౬-౪-౧౪౮.

భసంజ్ఞకముయొక్క ఇకార - అకారములకు ఈ కారముగాని, తద్ధితప్రత్యయముగాని పరమగుచో లోప మగును.

ఇట జ్ఞానయనుదానికి భసంజ్ఞయుండుటచేత నందలి యంతిమాకారమునకు లోపము ప్రాప్తింపఁగా,

ఔఙశ్యాం ప్రతిషేధో వాచ్యః—(వా)

ఔజ్జునకాదేశమగు శీ పరమగుచో అకారమునకు లోపము రాదు.

ఉదా:—జ్ఞాన+ఈ గుణము-జ్ఞానే.

సూ.—జశ్శసోశ్శిః—౭-౧-౨౦.

నపుంసకమగు అంగముకంటెఁ బరమగు జస్-శస్సులకు శి యనునాదేశ మగును.

సూ.—శి సర్వనామస్థానమ్—౧-౧-౪౨.

శి-యనునది సర్వనామస్థానసంజ్ఞక మగును.

ఉదా:—జ్ఞాన+జస్-జ్ఞాన+ఇ అని కాఁగా

సూ.—నపుంసకస్య ఝలచః—౭-౧-౭౨.

ఝలంతము అజంతమునగు క్లీబమునకు సర్వనామ స్థానము పరమగునపుడు నుమాగమ మగును.

సూ.—మిదచోఽన్త్యాత్పరః—౧-౧-౪౭.

ఏసముదాయమునందలి యచ్చులలో నెయ్యది యంత్యమో దానికిఁ బరముగా నాసముదాయమున కంతావయవం బగుచు మిత్తగును.

ఉదా:—జ్ఞానన్+ఇ - ఉపథాదీర్ఘము - జ్ఞానాని- (3) తక్కినరూపంబులు గామశబ్దంబునకుఁ బోలె నూహించునది. ఇట్లే ధన-వన-ఫల-మున్నగునవి.

సూ.—అద్డతరాదిభ్యః పఞ్చభ్యః—౭-౧-౨౫.

నపుంసకములగు డతరాంతాదులకంటెఁ బరమగు సు-అమ్ములకు- అద్డ్- (అద్) అనునాదేశమగును. డతర-డతమ-అన్య-అన్యతర-ఇతర. ఇవి డతరాదులు.

సూ.—టేః ౬-౪-౧౪౩.

డిత్తు పరమగునపుడు భసంజ్ఞకముయొక్క టిసంజ్ఞకమునకు లోపమగును.

ఉదా:—కతర+స్-కతర+అద్ టిలోపము-కతర్+అద్ కతరద్ చర్త్వము-కతరత్ జస్త్వము-కతరద్-కతరే-కతరాణి, హేకతరత్ - పుంలింగంబునందుఁ బోలెఁ దక్కినరూపంబులు తెలియునది.

ఇక్లే కతమత్-అన్యత్-అన్యతరత్ - ఇతరత్-మున్నగు నవి. అన్యతమశబ్దము సర్వనామగణమునఁ బఠింపకపోవుట చేతను, డతమప్రత్యయాంతము కాకపోవుట చేతను జ్ఞాన శబ్దంబుఁ బోలె రూపంబులు వడయును.

ఏకతరాత్ప్రతిషేధో వక్తవ్యః—(వా)

ఏకతరశబ్దముకంటెఁ బరమగు సు - అమ్ములకు అద్ డాదేశము రాదు.

ఉదా:—ఏకతరమ్.

సూ.—హ్రస్వో నపుంసకే ప్రాతిపదికస్య—౧-౨-౪౭.

అజంతము నపుంసకమునగు ప్రాతిపదికమునకు హ్రస్వ మగును.

ఉదా:—శ్రీపా - శ్రీప+స్=శ్రీపమ్- జ్ఞానశబ్దమునకుం బోలె రూపంబు లూహించునది.

సూ.—స్వమోర్నపుంసకాత్—౭-౧-౨౩.

నపుంసకమగు అంగముకంటెఁ బరమగు సు-అమ్ములకు లుక్కగును.

ఉదా:—వారి+స్=వారి.

సూ.—ఇకోఽచి విభక్తౌ—౭-౧-౭౩.

ఇగంతము నపుంసకమునగు అంగమునకు అజాది విభక్తులు పరమగుచో నుమాగమంబగును.

ఉదా:—వారి+ఔ - వారి+శీ-వారిన్+ఈ ణత్వము వారిణీ - వారి+జస్ - వారి+శి- వారిన్+ఇ ఉపధాదీర్ఘము-వారీన్+ఇ ణత్వము-వారీణి, హేవారి+స్-లుక్కు- హేవారి.

"నలుమతాఙ్గస్య"యనునది అనిత్య మగుటచేత సంబుద్ధినిమిత్తక మగుగుణము-హేవారే,వారి+ఙే. ఇట-"నుమ్ము కంటెఁ బరముకాన "ఘేర్ఙితి"యనుదానిచేత గుణము ప్రాప్తింపఁగా,

## వృద్ధ్యౌత్వతృజ్వద్భావగుణేభ్యో నుమ్పూర్వవిప్రతిషేధేన—(వా)

వృద్ధి-ఔత్వ-తృజ్వద్భావ-గుణములను బాధించి పూర్వవిప్రతిషేధముచే నుమ్మగును.

ఉదా:—వారిన్+ఏ ణత్వము-వారిణే,వారిణః (౨)వారిణోః-(౨)వారి+ఆమ్ నుట్టు - వారి+నామ్-దీర్ఘణత్వములు-వారీణామ్, వారిణి. హలాదివిభక్తులు పరమగునపుడు హరిశబ్దంబునకుంబోలె రూపంబులు తెలియునది.

## సూ.—అస్థిదధిసక్థ్యక్ష్ణామనఙ్ఙుదాత్తః—౭-౧-౭౫.

అస్థి-దధి-సక్థి-అక్షి శబ్దములకుఁ దృతీయావిభక్తిమొదలుగాఁగల అజాదివిభక్తులు పరమగునపు డుదాత్తమగు అనఙ్ఙాదేశమగును.

## సూ.—భస్య—౬-౪-౧౨౯.

ఇది యధికారసూత్రంబు.

సూ.—అల్లోపోఽనః—౬-౪-౧౩౪.

అంగావయవమును, యకారము, అచ్చులు నాదియందుఁ గల సర్వనామస్థానభిన్నములగు స్వాదిప్రత్యయములు పరముగాఁగలదియునగు అన్ - అనుదానియొక్క అకారమునకు లోపమగును.

ఉదా:—దధి+ఆ- (అనజ్ఞు)దధన్+ఆ- అకారలోపము దధ్న్+ఆ=దధ్నా,దధ్నే,దధ్నః-(౨)దధ్నోః(౨)దధ్నామ్ (౨)

సూ.—విభాషా జిశ్యోః—౬-౪-౧౩౬.

అంగావయవమును, యకారము-అచ్చులు నాదియందుఁ గల సర్వనామస్థానభిన్నములగు, స్వాదిప్రత్యయములు పరముగాఁగలదియునగు, అన్‌యొక్క అకారమునకు జి-శీలు పరమగుచో లోపము వికల్పముగా నగును.

ఉదా:—దధ్ని-పక్షంబున- దధని. తక్కుంగల రూపంబులు వారిశబ్దంబునకుంబోలె నెఱుంగునది. ఇట్లే అస్థి-సక్థి-అక్షిఅనువానిరూపంబులు తెలియునది. సుధి-సుధినీ - సుధీని, హేసుధే హేసుధి, సుధినా ఇత్యాది. మధు-మధునీ-మధూని, హేమధో - హేమధు. సులు-సులునీ-సులూని, సులునా - ఇత్యాదులు. ధాతృ - ధాతృణీ-ధాతౄణి, హేధాతృ-హేధాతః. ఇట్లే జ్ఞాతృ-కర్తృమున్నగునవి.

సూ—ఏచ ఇగ్ ఘ్రస్వాదేశే—౧-౧-౪౮.

విధింపఁబడు హ్రస్వములలో ఏచ్చులకు ఇక్కులు మాత్రమే యగును.

ఉదా:—ప్రద్యో - హ్రస్వము - ప్రద్యు - ప్రద్యునీ-ప్రద్యూని,ప్రద్యునా-మున్నగునవి. ప్రరై-హ్రస్వము-ప్రరి-ప్రరిణీ,ప్రరీణి-ప్రరిణా-"ఏకదేశవికృతమనన్యవత్" అనుచొప్పున ఆత్వము. ప్రరాభ్యామ్, ప్రరీణామ్. సును-సునునీ - సునూని, సునునా - ఇత్యాదులు

ఇది అజన్తనపుంసకలింగప్రకరణము.

---

# హలన్తపుంలింగప్రకరణము.

## సూ.—హో ఢః—౮-౨-౩౧.

ఝల్లు పరమగునపుడును, పదాంతమందును హకారమునకు ఢకారమగును.

ఉదా:—లిహ్+స్ ప్రత్యయలోపంబు-లిహ్ ఢత్వము-లిఢ్ చర్త్వము-లిట్-పక్షంబున-జశ్త్వము-లిడ్-లిహౌ-లిహః, లిడ్భ్యామ్, లిహ్+సు-లిఢ్+సు జశ్త్వము-లిడ్+సు ధుట్టు-లిడ్ధ్+సు చర్త్వము-లిట్త్సు-పక్షంబున-లిట్సు.

## సూ.—దాదేర్ధాతోర్ఘః—౮-౨-౩౨.

ఉపదేశమున దకారాదియగు ధాతువుయొక్క హకారమునకుఁ బదాంతమందును ఝల్లు పరమగునపుడును ఘకారమగును.

సూ.—ఏకాచో బశో భష్ ఝషన్తస్య స్ధ్వోః—౮-౨-౩౭.

ధాత్వవయవంబును, ఝషంతంబునగు నేకాచ్కమున కవయవంబగుబశ్శునకు పదాంతమందును, ధ్వశబ్దంబుగాని సకారంబుగాని పరమగునపుడును, భష్భావంబగును. (అనఁగా బ-గ-డ-ద లకు వరుసగా-భ-ఘ-ఢ-ధ లాదేశంబగును.)

ఉదా:—దుహ్ భష్భావము-ఘుహ్ ఘత్వము-ధుఘ్-జ_స్త్వచ_ర్త్వములు-ధుక్-ధుగ్-దుహౌ-దుహః, ధుగ్భ్యామ్, ధుక్షు.

సూ.—వా ద్రుహముహష్ణుహష్ణిహామ్—౮-౨-౩౩.

ద్రుహ్-ముహ్-ష్ణుహ్-ష్ణిహ్‌లయొక్క హకారమునకుఁ బదాంతమందును, ఝల్లు పరమగునపుడును ఘకారము వికల్పముగానగును.

ఉదా:—ద్రుహ్ ఘత్వము-ద్రుఘ్ భష్భావము-ధ్రుఘ్-జ_స్త్వచ_ర్త్వములు-ధ్రుక్-ధ్రుగ్ ఘత్వంబు రానిపక్షంబున ఢత్వము - ధ్రుట్-ధ్రుడ్ - ద్రుహౌ-ద్రుహః, ధ్రుగ్భ్యామ్-ధ్రుడ్భ్యామ్, ధ్రుక్షు-ధ్రుట్త్సు-ధ్రుట్సు.

ఇట్లే ముహ్-ష్ణుహ్ మున్నగునవి.

సూ.—ధాత్వాదేష్షస్సః—౬-౧-౬౪.

ధాతువున కాద్యవయవంబగుషకారమునకు సకారంబగును.

ఉదా:—ష్ణుహ్ - స్నుహ్. ఇట ణకారమునకు నిమిత్త భూతంబగు షకారంబునకు సత్వంబు రాఁగాఁ దన్నిమిత్త కంబగు ణత్వము పోవునుగాన నకారము మిగులును. స్నుట్- స్నుడ్- పక్షమందు - స్నుక్ - స్నుగ్. ఇట్లే స్నిహ్-అనుదాని రూపము లెఱుంగునది.

సూ.—ఇగ్యణస్సమ్ప్రసారణమ్—౧-౧-౪౫.

యణ్ణులయొక్క—స్థానంబునఁ బ్రయోగింపఁబడు ఇక్కులు సంప్రసారణసంజ్ఞకంబులు.

విశ్వవాట్-విశ్వవాడ్-విశ్వవాహౌ-విశ్వవాహః, విశ్వ వాహమ్-విశ్వవాహౌ.

సూ.—వాహ ఊఠ్—౬-౪-౧౩౨.

భసంజ్ఞకంబగు వాహ్ అనుదానికి సంప్రసారణసంజ్ఞకం బగు ఊఠ్గును.

సూ.—సంప్రసారణాచ్చ—౬-౧-౧౦౮.

సంప్రసారణంబున కచ్చుపరంబగుచోఁ బూర్వరూపం బేకాదేశంబగును.

ఉదా:—విశ్వవాహ్+అస్ (శస్) వకారంబునకూఠు విశ్వ-ఊఆహ్+అస్ పూర్వరూపము-విశ్వఊహ్+అస్"ఏత్యేధ" తిత్యాదిసూత్రంబుచే వృద్ధి. విశ్వౌహ్+అస్=విశ్వౌహః-ఇత్యా దులు.

సూ.—చతురనడుహోరాముదాత్తః—౭-౧-౯౮.

చతుర్-అనడుహ్ అనుశబ్దంబులకు సర్వనామస్థానంబు పరంబగుచో నుదాత్తంబగు ఆమ్ము ఆగమంబగును.

సూ.—సావనడుహః—౭-౧-౮౨.

అనడుహ్ శబ్దంబునకుఁ బ్రథమైకవచనంబు పరం బగుచో నుమాగమంబగును. ఈసూత్రములోనికి ఆత్ అనునది యనువర్తించునుగాన, విశేషవిహితమైనను నుమ్ముచేత ఆమ్ము బాధింపఁబడదు. అమ్ము (ఆమ్ము) చేత నుమ్మును బాధింపఁబడదు.

ఉదా:—అనడుహ్+స్ ఆమ్ము-అనడు+ఆహ్+స్ యణ్ణు-అనడ్వాహ్+స్ నుమ్ము-అనడ్వాన్హ్+స్ సులోపంబు-సంయోగాంతలోపము-అనడ్వాన్, సంయోగాంతలోపం బసిద్ధంబగుఁగాన నలోపంబు రాదు.

సూ.—అమ్ సంబుద్ధౌ—౭-౧-౯౯.

సంబుద్ధి పరంబగుచో చతుర్-అనడుహ్ శబ్దములకు అమాగమంబగును.

ఉదా:—హే అనడుహ్+స్-అనడు+అహ్+స్-యణ్ణు-అనడ్వహ్+స్ నుమ్ము - అనడ్వన్హ్+స్-సులోపసంయోగాంత లోపములు - హే అనడ్వన్ - అనడ్వాహౌ - (౨)అనడుహః, అనడుహః.

సూ.—వసుస్రంసుధ్వంస్వనడుహాం దః—౮-౨-౭౨.

సకారాంతంబగు వసుప్రత్యయాంతమునకును, స్రంసు-ధ్వంసు-అనడుహ్ శబ్దంబులకును బదాంతమందు దకారంబగును.

ఉదా:—అనడుహ్ + భ్యామ్ దకారము = అనడు ద్భ్యామ్ ఇత్యాదులు. విద్ + వస్ = విద్వస్ + విద్వాన్. ఇది సాంతంబు గాదు.

స్రస్ + త = స్రస్తమ్, ధ్వస్ + త = ధ్వస్తమ్. ఇట సకారము పదాంతము కాదు. దానంజేసి దత్వము రాదు.

సూ.—సహేస్సాడస్సః—౮-3-౫౬.

సాడ్ రూపంబగు సహధాతువుయొక్క సకారమునకు మూర్ధన్యం బాదేశంబగును.

ఉదా:—తురాసాహ్-ఇట సకారంబునకుం బ్రయత్న ముచే నంతరతమంబగు షకారంబాదేశంబగును. తురాషాహ్-ఢత్వచర్త్వజస్త్వములు-తురాషాట్ - తురాషాడ్ - తురాసాహౌ-తురాసాహః, తురాషాడ్భ్యామ్. ఇత్యాదులు.

సూ.—దివ ఔత్—౭-౧-౮౪.

దివ్ అను ప్రాతిపదికమునకు సుప్రత్యయము పర మగుచో ఔకారం బంతాదేశంబగును.

ఉదా:—సుదివ్ + స్ - సుదిఔ + స్ యణ్ణు-సుద్యౌ + స్ = సుద్యౌః-సుదివౌ-సుదివః.

సూ.—దివ ఉత్—౬-3-౧3౧.

దివ్ అను ప్రాతిపదికమునకుం బదాంతమున ఉకార మంతాదేశమగును.

ఉదా:—సుదివ్+భ్యామ్ - సుది ఉ+భ్యామ్ యణ్ణు-సుద్యుభ్యామ్. ఇత్యాదులు.

చతుర్+అస్ (జస్) ఆమ్ము - చతుఆర్+అస్ యణ్ణు చత్వార్+అస్=చత్వారః.

చతుర్+అస్ (శస్) = చతురః, చతుర్భిః, చతుర్భ్యః మున్నగునవి.

సూ.—షట్చతుర్భ్యశ్చ—౭-౧-౫౫.

షట్సంజ్ఞకంబులకును చతుర్శబ్దంబునకును బరమగు ఆమ్మునకు నుడాగమంబగును.

సూ.—రషాభ్యాం నో ణస్సమానపదే—౮-౪-౧.

సమానపదంబునందు రేఫషకారములకంటెఁ బరమగు నకారమునకు ణత్వంబగును.

ఉదా:—చతుర్+ఆమ్ నుమ్ము-చతుర్+నామ్ ణత్వము-చతుర్+ణామ్-"అచో రహాభ్యామిత్యాదిసూత్రముచే ణకార ద్విత్వము - చతుర్ణ్ ణామ్-పక్షంబున-చతుర్ణామ్, చతుర్+సు. ఇట రేఫమునకు విసర్గము ప్రాప్తింపఁగా,

సూ.—రోస్సుపి—౮-౩-౧౬.

సప్తమీబహువచనంబు పరమగుచుండఁగా రు-అను దానికే విసర్గమగునుగాని యితరంబగు రేఫమునకుఁ గాదు.

షత్వము-చతుర్+షు. ఇట షకారంబునకు ద్విత్వంబు ప్రాప్తింపఁగా,

సూ.—శరో౽చి—౮-౪-౪౯.

అచ్చు పరమగుచుండఁగా శ-ష-సలు ద్విత్వంబును బొరయవు. దీనిచే ద్విత్వము నిషేధింపఁబడఁగా,

ఉదా:—చతుర్షు-అని రూపంబగును.

సూ.—మో నో ధాతోః—౮-౨-౬౪.

మాంతంబగు ధాతువుయొక్క మకారమునకుఁ బదాంతంబున నకారంబగును.

ఉదా:—ప్రశామ్=ప్రశాన్-ప్రశాన్భ్యామ్ ఇత్యాది.

సూ.—కిమః కః—౭-౨-౧౦౩.

విభక్తి పరంబగుచో కిమ్‌శబ్దమునకు క - అనునాదేశంబగును.

ఉదా:—కిమ్+స్-క+స్ రుత్వవిసర్గములు-కః-కిమ్+ఔ-క+ఔ వృద్ధి = కౌ - కే, సర్వశబ్దంబునకుఁబోలె దీనిరూపంబులూహించునది.

సూ.—ఇదమో మః—౭-౨-౧౦౮.

సుప్రత్యయము పరమగునపుడు ఇదమ్ శబ్దముయొక్క మకారమునకు మకారాదేశంబగును. "త్యదాదీనామః" అనుదానిచేఁ బ్రాప్తించు అత్వమున కపవాదంబు.

సూ.—ఇదో౽య్ పుంసి—౭-౨-౧౧౧.

సుప్రత్యయము పరమగుచో పుంస్త్వంబున - ఇదమ్

శబ్దముయొక్క ఇద్ - అనుభాగంబునకు అయ్-అనునాదేశ మగును.

ఉదా:—ఇదమ్+స్-అయమ్+స్ సులోపంబు-అయమ్-ఇదమ్+ఔ త్యదాద్యత్వము-ఇదఅ+ఔ అని సిద్ధింపఁగా,

సూ.—అతో గుణే—౬-౧-౯౭.

పదాంతంబు కాని అకారమునకు గుణసంజ్ఞకములు పర మగుచోఁ బరరూపం బేకాదేశంబగును.

దీనిచేఁ బరరూపము - ఇద+ఔ.

సూ.—దశ్చ—౭-౨-౧౦౯.

విభక్తి పరమగుచో ఇదమ్శబ్దముయొక్క దకారంబునకు మకారంబగును.

ఉదా:—ఇమ+ఔ వృద్ధి=ఇమౌ-ఇమే. త్యదాదులకు సంబోధనంబు లేదని ప్రాయోవాదంబు.

సూ.—అనాప్యకః—౭-౨-౧౧౨.

కకారరహితంబగు ఇదమ్శబ్దముయొక్క ఇద్దునకు ఆప్పగువిభక్తి పరమగుచో అన్-అనునది యాదేశంబగును.

ఆప్-అనునది టాప్రత్యయంబులోని ఆకారంబునకు సుప్ప్రత్యయంబులోని పకారంబుతోఁ జేయఁబడిన ప్రత్యాహారంబగుటచేతఁ దృతీయావిభక్తిమొదలుకొని యున్న సుబ్విభక్తులనన్నిటిని బోధించును.

ఉదా:—ఇదమ్+ఆ(టా) -త్యదాద్యత్వపరరూపములు. ఇద+ఆ=(అన్) అన్ - అ+ఆ-అన+ఆ ఇనాదేశంబు అన+ఇన గుణము-అనేన.

సూ.—హలి లోపః—౭-౨-౧౧౩.

కకారరహితంబగు ఇదమ్ శబ్దముయొక్క ఇద్దునకు హలాదులగు తృతీయాదివిభక్తులు పరమగుచో లోపంబగును.

ఉదా:—ఇదమ్+భ్యామ్-ఇద+భ్యామ్. అలోన్త్యపరిభాషచే నిట దకారమాత్రంబునకు లోపము ప్రాప్తింపఁగా,

నానర్థకేఽలోన్త్యవిధిరనభ్యాసవికారే—(పరి)

అర్థవంతము కానిదానియందలోన్త్యవిధి ప్రవర్తింపదు. అభ్యాసమర్థవంతము కాకున్నను దత్కార్యమున నయ్యది ప్రవర్తించును. ఇట ఇద-అనునది యర్థవంతము కానియందలి ఇద్-అనుభాగము అర్థవంతము కానందున నలోన్త్యవిధి ప్రవర్తింపదు.

ఉదా:—ఇద+భ్యామ్ ఇద్దునకు లోపంబు-అ+భ్యామ్.

సూ.—ఆద్యన్తవదేకస్మిన్—౧-౧-౨౧.

ఎయ్యది పూర్వపరములు లేక యొక్కటియే యుండునో దానికిఁ దదాదితదంతములకు విధింపఁబడుకార్యము తదాది తదంతములందువలె నగును.

"సుపి చ" యనుసూత్రముచే దీర్ఘము=ఆభ్యామ్-ఇదమ్+భిస్-ఇద+భిస్-అ+భిస్ ఇట భిస్సునకైస్సు ప్రాప్తింపఁగా,

సూ.—నేదమదసోరకోః—౭-౧-౧౧.

కకారరహితంబులగు-ఇదమ్ - అదస్ శబ్దములయొక్క-భిస్సున కైస్సు రాదు. ఏత్వము.

ఉదా:—ఏభిః, అస్మై-ఏభ్యః, అస్మాత్, అస్య-అనయోః-ఏషామ్, అస్మిన్-ఏషు.

సూ.—ద్వితీయాటౌస్స్వేనః—౨-౪-౩౪.

ద్వితీయావిభ_క్తియును, టా-ఓస్సులును బరమగు-చో నన్వాదేశంబున ఇదమేతచ్ఛబ్దములకు ఏన-అనునాదేశంబగును.

ఏదేని యొక కార్యమును విధించుటకు గ్రహింపఁబడిన దానిని మఱియొక కార్యమును విధించుటకుఁ దిరిగి గ్రహించుట యన్వాదేశం బనంబడును. ఎట్లనఁగా "అనేన వ్యాకరణమధీతమ్. ఏనం ఛందోఽధ్యాపయ"ఇట వ్యాకరణాధ్యయనమును జేసెనని చెప్పుటకు గ్రహింపఁబడినదే ఛందస్సును నేర్పుమనుటకుఁ దిరిగి గ్రహింపఁబడినందుననిది యన్వాదేశ మనఁబడును. ఇట్లే "అనయోః పవిత్రం కులమ్, ఏనయోః ప్రభూతం ధనమ్" ఇత్యాదులందు నెఱుంగునది.

ఉదా:—ఇదమ్+అమ్-ఏన+అమ్ పూర్వరూపము-ఏనమ్ ఏనౌ-ఏనాన్, ఏనేన, ఏనయోః. (౨)

రాజ+స్ - దీర్ఘ-సులోప-నలోపంబులు=రాజా- హే రాజన్-ఇట నలోపంబు ప్రాప్తింపఁగా,

సూ.—న ఙిసంబుద్ధ్యోః—౮-౨-౮.

సంబుద్ధియును, స_ప్తమ్యేకవచనమును పరమగునపుడు నకారంబునకు లోపంబు రాదు.

ఉదా:— హేరాజన్.

బ్రహ్మణి నిష్ఠా అస్య బ్రహ్మనిష్ఠః. బ్రహ్మన్+ఙి+నిష్ఠా+స్ బ్రహ్మన్+నిష్ఠ, ఇటఁ బూర్వసూత్రముచే ఙిప్రత్యయనిమిత్తకంబగు నలోపనిషేధంబు ప్రాప్తింపఁగా,

ఙావుత్తరపదే ప్రతిషేధో వక్తవ్యః—(వా)

ఉత్తరపదపరకమగు ఙిప్రత్యయంబు పరంబగుచో నలోపాభావంబునకుఁ బ్రతిషేధంబగును. (అనఁగా నలోపము వచ్చుననుట) బ్రహ్మనిష్ఠః.

రాజానౌ-(౨)రాజానః, రాజన్+అస్ అల్లోపము శ్చుత్వము-రాజ్ఞః, రాజ్ఞా.

సూ.—నలోపస్సుప్స్వరసంజ్ఞాతుగ్విధిషు కృతి—౮-౨-౨.

సుబ్విధియందును, స్వరవిధియందును, సంజ్ఞావిధియందును, కృత్పరకమగు తుగాగమవిధియందును నలోపం బసిద్ధంబగును. ఇతరస్థలములఁ గాదు. కావున రాజన్+జస్+అశ్వ+స్ రాజ+అశ్వ ఇత్యాదిస్థలములందు నలోపంబసిద్ధంబు కాదు గాన సవర్ణదీర్ఘము సిద్ధించుచున్నది. రాజాశ్వః.

రాజన్+భ్యామ్-రాజ+భ్యామ్. ఇటనలోపంబసిద్ధంబగుటచే సుపిచ యనుదానిచే దీర్ఘము రాదు. రాజభ్యామ్-కావుననే ఐస్త్వమును ఏత్వమునుగూడ రావని తెలియునది. రాజభిః, రాజభ్యః, రాజ్ఞి - రాజని ఇత్యాదులు.

యజ్వా-యజ్వానౌ-యజ్వానః,యజ్వానమ్-యజ్వానౌ-యజ్వన్+అస్ ఇట అల్లోపము ప్రాప్తింపఁగా,

సూ.—న సంయోగాద్వమన్తాత్—౬-౪-౧౩౭.

వకారాంతమును, మకారాంతము నగు సంయోగము కంటెఁ బరమగు అన్-యొక్క అకారమునకు లోపంబురాదు.

ఉదా:—యజ్వనః, యజ్వనా-యజ్వభ్యామ్-యజ్వభిః ఇత్యాదులు. బ్రహ్మణః-బ్రహ్మణా-బ్రహ్మభ్యామ్-బ్రహ్మభిఃమున్న గునవి. వృత్రహన్+స్.

సూ.—ఇన్ హన్ పూషార్యమ్ణాం శౌ—౬-౪-౧౨.

ఇన్-హన్-పూషన్-అర్యమన్ అనువానికి శి అనునది పరమగునపుడే యుపథా దీర్ఘంబగును. దీనిచే నిట నుపథాదీర్ఘ నిషేధము ప్రాప్తింపఁగా,

సూ.—సౌ చ—౬-౪-౧౩.

ఇన్-హన్-పూషన్-అర్యమన్ అనువానికి సంబుద్ధిభిన్నం బగు ప్రథమైకవచనము పరమగునపుడు గూడ నుపథా దీర్ఘ మగును.

ఉదా:—వృత్రహాన్+స్ సులోప-నలోపంబులు వృత్రహా, హే వృత్రహన్.

సూ.—ఏకాజుత్తరపదే ణః—౮-౪-౧౨.

ఏసమాసముయొక్క యుత్తరపద మేకాచ్కమో యట్టిసమాసంబునందుఁ బూర్వపదస్థంబగు నిమిత్తంబుకంటెఁ బరంబైనట్టియు, ప్రాతిపదికాంతముగాని, నుమ్ముగాని,విభక్త్యవయవముగాని యైన నకారంబునకు ణకారంబగును.

ఉదా:—వృత్రహణౌ-(౨)వృత్రహణః, వృత్రహణమ్.

సూ.—హో హన్తేర్ఞ్ణిన్నేషు—౭-౩-౫౪.

ఞిత్తుగాని ణిత్తుగాని యగు ప్రత్యయంబును, నకారంబును బరంబగుచో హనధాతువుయొక్క హకారమునకు కుత్వంబగును.

ఉదా:—వృత్రహన్+అస్(శస్)అల్లోపంబు వృత్రహ్న్+అస్.ఇటనకారముపరంబైనది కాన హకారమునకుఁ గుత్వముచే ఘకారము-వృత్రఘ్నః ఇత్యాది. ఇట్లే శార్ఙ్గిన్-యశస్విన్-అర్యమన్-పూషన్ మున్నగువాని ప్రక్రియ తెలియునది.

సూ.—మఘవా బహులమ్—౬-౪-౧౨౮.

మఘవన్శబ్దంబునకు తృ - యనునది యంతాదేశము వికల్పముగానగును. ఋకార మిత్సంజ్ఞకము.

సూ.—ఉగిదచాం సర్వనామస్థానేఽధాతోః—౭-౧-౭౦.

ధాతుభిన్నంబగు ఉగిత్తుకును, నలోపియగు అఞ్చుధాతువునకును సర్వనామస్థానంబు పరంబగుచో నుమాగమంబగును.

ఉదా:—మఘవన్+స్-మఘవత్ స్+ నుమ్ము - మఘవన్త్+స్ ప్రత్యయలోపంబు-మఘవన్త్ సంయోగాంతలోపము-మఘవన్ ఉపధాదీర్ఘము - మఘవాన్-బహుళగ్రహణముచేత నుపధాదీర్ఘమునుగూర్చి సంయోగాంతలోపం బసిద్ధంబు గాదు. మఘవన్తౌ-మఘవన్తః, హేమఘవన్, మఘవద్భ్యామ్ తృత్వంబు

రానిపక్షంబున - మఘవా - సర్వనామస్థానంబు పరంబగుచోఁ రాజన్ శబ్దంబునకుం బోలె రూపంబు లెఱుంగునది.

సూ.—శ్వయువమఘోనామతద్ధితే—౬-౪-౧౩౩.

అన్నంతములును భసంజ్ఞకంబులునునగు-శ్వన్-యువన్-మఘువన్ శబ్దంబులకు తద్ధిత భిన్నప్రత్యయంబు పరంబగుచోఁ సంప్రసారణంబగును.

ఉదా:—మఘువన్+అస్-(శస్) వకారంబునకు సంప్రసారణము-మఘుఉఅన్+అస్-పూర్వరూపము - మఘుఉన్+అస్ గుణము-మఘోన్+అస్=మఘోనః, మఘువభ్యామ్.ఇట్లే శ్వన్-యువన్ ఇత్యాదులు.

యువన్+అస్ (శస్) వకారంబునకు సంప్రసారణంబు-యుఉఅన్+అస్+యూన్+అస్ - యకారమునకు సంప్రసారణంబు ప్రాప్తించుచుండగా,

సూ.—న సంప్రసారణే సమ్ప్రసారణమ్—౬-౧-౩౭

సంప్రసారణము పరమగుచోఁ బూర్వమందున్న యణ్ణునకు సంప్రసారణంబు రాదు.

యూనా-యువభ్యామ్. ఇత్యాది. అర్వా-హేఅర్వన్.

సూ.—అర్వణస్త్రసావనఞః—౬-౪-౧౨౭.

నఞ్ రహితంబగు అర్వన్శబ్దాంతాంగమునకు తృ-యనునది. యంతాదేశంబగును. ప్రథమైకవచనంబునఁ గాదు.

ఉదా:—అర్వన్+ఔ-అర్వత్+ఔ నుమ్ము=అర్వన్త్+ఔ=అర్వన్తౌ-అర్వన్తః, అర్వద్భ్యామ్ ఇత్యాది.

సూ.—పథిమథ్యృభుక్షామాత్ —౭-౧-౮౫.

పథిన్-మథిన్-ఋభుక్షిన్ శబ్దంబులకు సుప్రత్యయంబు పరంబగుచో అకారం బంతాదేశంబగును.

సూ.—ఇతోఽత్సర్వనామస్థానే—౭-౧-౮౬.

పథిన్-మథిన్-ఋభుక్షిన్‌శబ్దంబుల ఇకారంబునకు సర్వనామస్థానంబు పరంబగుచో అకారమగును.

సూ—థో న్థః—౭-౧-౮౭.

పథిన్ - మథిన్‌శబ్దంబులథకారమునకు న్థ - యనునాదేశంబు సర్వనామస్థానంబు పరంబగుచో నగును.

ఉదా:—పథిన్+స్ ఆకారము-పథిఆ+స్ ఇకారంబున కకారంబు-పథఆ+స్ థకారమునకు న్థాదేశము పన్థాఆ+స్=పన్థాస్=పన్థాః-పన్థానౌ(౨)-పన్థానః, పన్థానమ్.

సూ.—భస్య టేర్లోపః.—౭-౧-౮౮.

భసంజ్ఞకంబులగు పథ్యాదుల టి-సంజ్ఞకమునకు లోపంబగును.

ఉదా:—పథిన్+అస్ టిలోపంబు - పథ్+అస్ = పథః, పథా-పథిభ్యామ్. ఇట్లేమథిన్ - ఋభుక్షిన్‌శబ్దంబులప్రక్రియ యూహించునది.

సూ.—ష్ణాన్తా షట్—౧-౧-౨౪.

షకారాంతమును, నకారాంతమును నగుసంఖ్యావాచకము షట్సంజ్ఞకంబు.

పఞ్చన్‌శబ్దంబు నిత్యబహువచనాంతంబు.

ఉదా:—పఞ్చన్+జస్ షడ్భ్యోలుక్-అనుదానిచే జస్సు నకు లోపము-నలోపము-పఞ్చ-పఞ్చభిః-పఞ్చభ్యః-(౨)

పఞ్చన్+ఆమ్ ఇది షట్సంజ్ఞకంబుగాన నుడాగమము-పఞ్చన్+నామ్.

సూ.—నోపధాయాః—౬-౪-౭.

నాంతంబగు అంగముయొక్క యుపధకు నామ్ము పర మగుచో దీర్ఘంబగును.

ఉదా:—పఞ్చాన్+నామ్ నలోపంబు - పఞ్చానామ్-పఞ్చసు.

సూ.—అష్టన ఆ విభక్తౌ—౭-౨-౮౪.

అష్టన్‌శబ్దమునకు హలాదివిభక్తులు పరమగుచో ఆకా రంబు వికల్పముగా నగును.

ఇది వికల్పంబుగాన "అష్టనోదీర్ఘాత్" త్తను సూత్రమందలి దీర్ఘగ్రహణంబు సార్థకంబయ్యెను.

సూ.—అష్టాభ్య ఔశ్—౭-౧-౨౧.

కృతాకారంబగు అష్టన్‌శబ్దంబుకంటెఁ బరంబగు జస్ శస్సులకు ఔశ్ - అనునది యాదేశమగును. అష్టభ్యః-అని చెప్పఁదగి యుండఁగా ఆత్వము చేసి నిర్దేశించుట జస్ శస్సులు హలాదులు కాకపోయినను ఆత్వనిమిత్తంబు లగునని జ్ఞాపితంబయ్యె.

ఉదా:—అష్టన్+జస్ ఆత్వము - అష్టా+జస్ ఔశ్శు-అష్టా+ఔ వృద్ధి-అష్టౌ-(౨) అష్టాభ్యః-(౨) అష్టానామ్-అష్టాసు-ఆత్వంబు రానిపక్షంబున అష్ట-(౨). పఞ్చన్ శబ్దంబునకు వలె రూపంబు లగును.

సూ.—ఋత్విగ్దధృక్స్రగ్దిగుష్ణిగఞ్చుయుజి క్రుఞ్చాం చ—3-౨-౫౯.

ఋతు+యజ్-ధృష్-సృజ్ - దిశ్-ఉద్+ష్ణిహ్-అఞ్చు-యుజ్-క్రుఞ్చ్ అనువీనికంటెఁ బరముగా-క్విన్ ప్రత్యయంబగు. అఞ్చుధాతువునకు సుబంతంబు ఉపపదంబగునపుడే యగును. యుజ్-క్రుఞ్చ్ధాతువులకుఁ గేవలములకే యగును. సృజ్ ధాతువునకు అమాగమంబును, క్రుఞ్చ్ధాతువునకు నలోపాభావంబు దీనిచే నిపతింపఁబడియెను. మఱియు ఉద్+ష్ణిహ్-అనుచో దకారలోపంబును, ధృష్ధాతువునకు ద్విత్వంబును నీసూత్రంబుచేతనే నిపతింపఁబడియెను. క్విన్ప్రత్యయంబులోని కకారనకారంబు లిత్సంజ్ఞకంబులు.

సూ.—కృదతిఙ్—3-౧-౯3.

"ధాతోః" అనుసూత్రాధికారంబున తిఙ్లులకంటె భిన్నంబులగు ప్రత్యయంబులు కృత్సంజ్ఞకంబులు.

సూ.—వేరపృక్తస్య—౬-౧-౬౭.

అపృక్తసంజ్ఞకమగు వకారమునకు లోపంబగును.

సూ.—క్విన్ప్రత్యయస్య కుః—౮-౨-౬౨.

దేనికంటెఁ గ్విన్ప్రత్యయంబు చేయఁబడునో యట్టిశబ్ద స్వరూపంబునకుఁ బదాంతంబునఁ గవర్గమంతాదేశమగును.

ఉదా:—ఋతు+యజ్+క్విన్ యకారంబునకు సంప్రసారణము. ఋతు+ఇజ్+వ్ యణ్ణు-ఋత్విజ్+వ్ వలోపంబు-ఋత్విజ్. ఏతత్సూత్రవిహితంబగు కుత్వం బసిద్ధంబగుటచే "చోః కుః"అనుదానిచేతఁ గుత్వంబు. ఋత్విగ్ - చర్త్వజశ్త్వములు-ఋత్విక్-ఋత్విగ్-ఋత్విజౌ-ఋత్విజః, ఋత్విగ్భ్యామ్.

సూ.—యుజేరసమాసే—౭-౧-౭౧.

యుజిర్ ధాతువునకు సర్వనామస్థానంబు పరంబగుచో నుమ్మగును; సమాసంబునఁ గాదు.

ఉదా:—యుజ్+స్ - నుమ్ము - యున్జ్+స్ ప్రత్యయలోపము-యున్జ్ సంయోగాంతలోపము - యున్ కుత్వము-యుఙ్-యుఞ్జౌ-(౨)యుఞ్జః, యుజః, యుగ్భ్యామ్.

సూ.—చోః కుః—౮-౨-30.

చవర్గమునకు ఝల్లు పరమగునపుడును,బదాంతమందును కవర్గంబగును.

ఉదా:—సుయుజ్+స్-సుయుజ్ కుత్వము-సుయుగ్-సుయుక్, సుయుజా-సుయుగ్భ్యామ్. ఖన్-ఖఞ్జౌ, ఖన్భ్యామ్.

సూ.—వ్రశ్చ భ్రశ్చ సృజమృజయజ
రాజభ్రాజచ్ఛశాం షః—౮.౨-౩౬.

వ్రశ్చ్-భ్రస్జ్-సృజ్-మృజ్-యజ్-రాజ్-భ్రాజ్ ధాతువులకును, ఛకారాంత-శకారాంతములకును ఝల్లు పరమగునపుడును, బదాంతమందును షకారం బంతాదేశంబగును.

ఉదా:—రాజ్+స్-సులోపంబు రాజ్ షత్వము - రాష్-రాట్-రాడ్ - రాజౌ-(౨)-రాజః, రాడ్భ్యామ్-(3)-ఇత్యాది. ఇట్లే విభ్రాట్-దేవేట్-విశ్వసృట్ ఇత్యాదులు.

సూ.—పరౌ వ్రజేః షః పదాన్తే—(ఉణా)

పరి, యనునది యుపపదంబుగాఁగల వ్రజధాతువునకుఁ గ్విప్ ప్రత్యయంబును దీర్ఘంబు నగు పదాంతమున షత్వంబు గూడ నగును.

ఉదా:—పరి+వ్రజ్=పరివ్రాజ్ షత్వము-పరివ్రాష్- పరి పరివ్రాట్-పరివ్రాడ్-పరివ్రాజౌ.

సూ—విశ్వస్య వసురాటోః—౬-3-౧౨౮.

విశ్వశబ్దంబునకు ఉత్తరపదంబులగు వసుశబ్దంబుగాని, రాట్-అనునదిగాని పరంబగుచో దీర్ఘంబగును.

ఉదా:—విశ్వారాట్-విశ్వారాడ్ - విశ్వరాజౌ, విశ్వారాడ్భ్యామ్.

సూ.—స్కోస్సంయోగాద్యోరన్తే చ—౮-౨-౨౯.

పదాంతముగాని, ఝల్పరకముగాని యగు సంయోగమున కాద్యవయవంబులగు సకార - కకారంబులకు లోపంబగును.

ఉదా:—భ్రస్జ్+క్విన్ సంప్రసారణపూర్వరూపంబులు. భృస్జ్, భృస్జ్+స్-భృస్జ్ సకారలోపము - భృజ్ షత్వము-భృష్-భృట్-భృడ్ - భృస్జ్+ఔ సకారంబునకు శ్చుత్వంబు భృశ్+ఔ శకారంబునకు జకారంబు-భృజ్జ్+ఔ = భృజ్జౌ-భృజ్జః, భృడ్భ్యామ్ ఇత్యాదులు.

త్యద్+స్ త్యదాద్యత్వపరరూపములు. త్య+స్.

సూ.—తదోస్సస్సావనన్త్యయోః—౭-౨-౧౦౬.

త్యదాదులయొక్క యనంత్యములగు త-ద-లకు సుప్రత్యయంబు పరంబగుచో సకారంబగును.

ఉదా:—స్యః-త్యౌ-త్యే, సః-తౌ-తే, యః-యౌ-యే, ఏషః-ఏతౌ-ఏతే.

సూ.—ఙే ప్రథమయోరమ్—౭-౧-౨౮.

యుష్మదస్మచ్ఛబ్దంబులకంటెఁ బరమగు ఙేప్రత్యయంబునకును, బ్రథమాద్వితీయలకును అమ్-అను ఆదేశంబగును.

సూ.—మపర్యన్తస్య—౭-౨-౯౧.

ఇది యధికారసూత్రము.

సూ.—త్వాహౌ సౌ—౭-౨-౯౪.

యుష్మదస్మచ్ఛబ్దంబులయొక్క మపర్యంతమునకు త్వ-అహ అనునాదేశము లగును.

సూ.—శేషే లోపః—౭-౨-౯౦.

యుష్మదస్మచ్ఛబ్దంబుల టిసంజ్ఞకమునకు లోపంబగును.

ఉదా:—యుష్మద్+స్ యుష్మద్+అమ్ త్వఅద్+అమ్-త్వద్+అమ్ టిలోపము-త్వ్+అమ్=త్వమ్. అస్మద్+స్ అస్మద్+అమ్ అహఅద్+అమ్ అహద్+అమ్ అహ్+అమ్=అహమ్.

సూ.—యువావౌ ద్వివచనే—౭-౨-౯౨.

ద్విత్వవిశిష్టమును బోధించునట్టి యుష్మదస్మచ్ఛబ్దంబుల యొక్కమపర్యంతమునకు విభక్తి పరమగుచో యువ-ఆవ అనునాదేశము లగును.

సూ.—ప్రథమాయాశ్చ ద్వివచనే భాషాయామ్—౭.౨.౮౮.

యుష్మదస్మచ్ఛబ్దంబులకుఁ బ్రథమాద్వివచనము పరమగుచో లౌకికభాషయందు ఆత్వ మగును.

ఉదా:—యుష్మద్+ఔ యుష్మద్+అమ్ యువఅద్+అమ్ యువద్+అమ్.యువఅ+అమ్. సవర్ణదీర్ఘము - యువా+అమ్ పూర్వరూపము - యువామ్. అస్మద్+ఔ అస్మద్+అమ్ ఆవఅద్+అమ్ ఆవద్+అమ్ ఆవఅ+అమ్ ఆవా+అమ్=ఆవామ్.

సూ.—యూయవయౌ జసి—౭-౨-౯౩.

యుష్మదస్మచ్ఛబ్దంబులయొక్క మపర్యంతమునకు జస్సు పరమగుచో వరుసగా యూయ-వయ అనునాదేశము లగును.

ఉదా:—యుష్మద్+జస్-యుష్మద్+అమ్-యూయద్+అమ్=యూయమ్-వయమ్.

సూ.—త్వమావేకవచనే—౭-౨-౯౭.

ఏకత్వవిశిష్టబోధకములగు యుష్మదస్మచ్ఛబ్దములయొక్క మపర్యంతమునకు విభక్తి పరమగుచోఁ గ్రమముగా త్వ-మ యను నాదేశంబు లగును.

సూ.—ద్వితీయాయాఞ్చ—౭-౨-౮౭.

యుష్మదస్మచ్ఛబ్దములయంత్యమునకు ద్వితీయావిభక్తి పరమగునపుడును ఆత్వమగును.

ఉదా:—త్వామ్-మామ్.

సూ.—శసో న—౭-౧-౨౯.

యుష్మదస్మచ్ఛబ్దంబులకంటెఁ బరమగుశస్సునకు నకారంబగును. అమ్మున కపవాదము.

ఉదా:—యుష్మద్+అస్-(శస్) "ఆదేః పరస్య" యను దానిచే అకారమునకు నకారము. యుష్మద్+న్స్ ఆత్వము - యుష్మా+న్స్ సంయోగాంతలోపము-యుష్మాన్-అస్మాన్.

సూ.—యోఽచి—౭-౨-౮౯.

యుష్మదస్మచ్ఛబ్దంబులకు ఆదేశభిన్నంబులగు అజాది విభక్తులు పరంబగుచో యకారం బాదేశమగును.

ఉదా:—యుష్మద్ +ఆ-(టా), త్వ-అద్ +ఆ-త్వద్ +ఆ దకారమునకు యకారము. త్వయ్+ఆ=త్వయా-మయా.

సూ.—యుష్మదస్మదోరనాదేశే—౭-౨-౮౬.

యుష్మదస్మచ్ఛబ్దంబుల కాదేశభిన్నంబులగు హలాది విభక్తులు పరమగుచో ఆకారంబగును.

ఉదా:—యుష్మద్+భ్యామ్ - యువద్+భ్యామ్ ఆకారము - యువాభ్యామ్ - (3) ఆవాభ్యామ్ - (3) యుష్మాభిః- అస్మాభిః.

సూ.—తుభ్యమహ్యౌ జయి—౭-౨-౯౫.

యుష్మదస్మచ్ఛబ్దంబుల మపర్యంతమునకుఁ జతుర్థ్యేక వచనంబు పరంబగుచో తుభ్య-మహ్యయనునాదేశంబులగును.

ఉదా:—తుభ్యమ్-మహ్యమ్.

సూ.—భ్యసోఽభ్యమ్—౭-౧-3౦.

యుష్మదస్మచ్ఛబ్దంబులకంటెఁ బరమగు - భ్యస్సునకు అభ్యమ్ అనునాదేశ మగును.

ఉదా:—యుష్మభ్యమ్-అస్మభ్యమ్.

సూ.—ఏకవచనస్య చ—౭-౧-౩౨.

యుష్మదస్మచ్ఛబ్దంబులకంటెఁ బరమగు పంచమ్యేకవచనమునకు అత్ అనునాదేశ మగును.

ఉదా:—యుష్మద్+అప్ (ఙసి) త్వత్-మత్.

సూ.—పఞ్చమ్యా అత్—౭-౧-౩౧.

యుష్మదస్మచ్ఛబ్దంబులకంటెఁ బరమగు పంచమీబహువచనమునకు అత్ అనునాదేశ మగును.

ఉదా:—యుష్మత్-అస్మత్.

సూ.—తవమమౌ ఙసి—౭-౨-౯౬.

యుష్మదస్మచ్ఛబ్దంబులమపర్యంతమునకు షష్ఠ్యేకవచనంబు పరంబగుచో తవ-మమయనునాదేశములగును.

సూ.—యుష్మదస్మద్భ్యామ్ ఙసోఽశ్—౭-౧-౨౭.

యుష్మదస్మచ్ఛబ్దంబులకంటెఁ బరమగు షష్ఠ్యేకవచనమునకు అశ్-అనునాదేశమగును.

ఉదా:—యుష్మద్+అస్-(ఙస్) తవాదేశంబు-తవఅద్+అస్ పరరూపము-తవద్+అప్. అస్సున కకారంబు-తవద్+అ-టిలోపంబు-తవ్+అ=తవ-మమ, యువయోః-ఆవయోః

సూ.—సామ ఆకమ్—౭-౧-౩౩.

యుష్మదస్మచ్ఛబ్దంబులకంటెఁ బరమగు సామ్-(ఆమ్) అనుదానికి ఆకమ్-అనునది యగును.

ఉదా:—యుష్మద్ +ఆమ్- యుష్మద్ +ఆకమ్ టిలోపము-యుష్మాకమ్-అస్మాకమ్, త్వయి-మయి, యువయోః - ఆవయోః, యుష్మాసు-అస్మాసు.

సూ.—యుష్మదస్మదోష్షష్ఠీచతుర్థీ
ద్వితీయాస్థయోర్వాంనావౌ—౮-౧-౨౦.

పదముకంటెఁ బరంబై పాదాదిని లేనట్టి షష్ఠీ-చతుర్థీ-ద్వితీయావిభక్తివిశిష్టములగు యుష్మదస్మచ్ఛబ్దంబులకుఁ గ్రమముగా వామ్-నౌ అనునాదేశంబు లగును.

సూ.—బహువచనస్య వస్నసౌ—౮-౧-౨౧.

పదంబులకంటెఁ బరంబులును బాదాదిని లేనివియును షష్ఠీ-చతుర్థీ-ద్వితీయాబహువచనవిశిష్టములు నగు యుష్మదస్మచ్ఛబ్దంబులకు వరుసగా వస్-నస్ యనునవి యాదేశంబు లగును.

సూ.—తేమయావేకవచనస్య—౮-౧-౨౨.

పదంబుకంటెఁ బరంబులును బాదాదిని లేనివియును షష్ఠీ-చతుర్థ్యేకవచనవిశిష్టములు నగు యుష్మదస్మచ్ఛబ్దంబులకు సొరిదిని తే-మే యనునాదేశము లగును.

సూ.—త్వామౌ ద్వితీయాయాః—౮-౧-౨౩.

పదంబుకంటెఁ బరంబులును, బాదాదిని లేనివియు, ద్వితీయైకవచనవిశిష్టంబులు నగుయుష్మదస్మచ్ఛబ్దంబులకు నోలిని త్వా-మా యనునాదేశము లగును.

ఉదా:—

శ్లో. శ్రీశస్త్వావతు మాపీహ దత్తాత్తే మేఽపి శర్మసః
స్వామీ తే మేఽపి సహరిః పాతు వామపి నౌ విభుః
సుఖం వాం నౌ దతాత్వీశః పతిర్వామపి నౌ హరిః
సోఽవ్యాద్వో నశ్శివం వో నో దద్యాత్సేవ్యో౽త్ర వస్సనః.

ఇట నధో రేఖాంకితంబులగు శబ్దంబులు పైసూత్రంబులకుఁ గ్రమంబుగా నుదాహరణంబులని తెలియునది.

సమానవాక్యేనిఘాతయుష్మదస్మదాదేశా వక్తవ్యాః - (వా)

నిమిత్తమగుపదమును యుష్మదస్మదాదిశబ్దంబులు నేకవాక్యగతంబు లగునపుడే పైఁజెప్పన ంయాదేశములును అనుదాత్తస్వరము నగును.

అనన్వాదేశే వా వక్తవ్యాః—(వా)

పైయాదేశంబులు అన్వాదేశంబు కానపుడు వికల్పముగా నగును. అన్వాదేశంబునమాత్రము నిత్యముగా నగును.

ఉదా:—ధాతా తే తవ వా అపత్యమ్ తస్మై తే హరయే నమః-ఇత్యాది.

సుపాత్-సుపాద్, సుపాదమ్-సుపాదౌ (౨)

సూ.—పాదః పత్—౬-౪-౧౩౦.

పాద్-అనునది యంతమునఁ గలదియు భసంజ్ఞకమునగు అంగమున కవయవంబగు పాచ్ఛబ్దంబునకు పద్-అను నాదేశ మగును.

ఉదా:—సుపాద్+అస్ (శస్) పదాదేశంబు - సుపదః, సుపదా-సుపాద్భ్యామ్.

అగ్నిమత్-అగ్నిమద్-అగ్నిమథౌ, అగ్నిమథమ్.

సూ.—అనిదితాంహలఉపధాయాః క్ఙితి—౬-౪-౨౪.

ఇదిత్తులు కానట్టియు, హలంతంబులును నగు అంగంబుల యొక్క యుపధాభూతంబగు నకారంబునకు కిత్తుగాని ఙిత్తు గాని పరంబగుచో లోపంబగును.

ఉదా:—ప్ర-అఞ్చ్-క్విన్ నలోపము- ప్ర+అచ్ సువ్లు. ప్ర-అన్చ్-సంయోగాంతలోపము-ప్రాన్-నకారమునకు "క్విన్ప్ర త్యయస్య కుయనుసూత్రముచేతఁ గుత్వంబు. ప్రాజ్ - ప్రాఞ్చౌ. (౨) ప్రాఞ్చః

సూ.—అచః—౬-౪-౧౩౮.

లుప్తనకారంబును అసర్వనామస్థానయజాదిస్వాదిపరకము నగు అఞ్చుధాతువుయొక్క అకారమునకు లోపంబగును.

సూ.—చౌ—౬-౩-౧౩౮.

లుప్తనకారంబగు అఞ్చుధాతువు పరమగుచోఁ బూర్వ పదముయొక్క అణ్ణునకు దీర్ఘంబగును.

ఉదా:—ప్ర+అఞ్చు ప్ర+అచ్ అల్లోపంబు-ప్రచ్+అస్ దీర్ఘము-ప్రాచ్+అస్ = ప్రాచః, ప్రాగ్భ్యామ్. ప్రత్యఙ్-ప్రత్యఞ్చౌ (౨) ప్రతీచః, ప్రత్యగ్భ్యామ్. ఉదఙ్-ఉదఞ్చౌ-(౨)

సూ.—ఉద ఈత్—౬-౪-౧౩౯.

ఉద్ అనునుపసర్గముకంటెఁ బరమును, లుప్తనకారంబును, అసర్వనామస్థానయజాదిస్వాదిపరకమునగు అఞ్చుధాతువుయొక్క అకారమునకు ఈకారంబగును.

ఉదా:—ఉద్-అఞ్చ్+అస్ (శస్) నలోపంబు-ఉదచ్+అస్ అకారంబునకీకారంబు-ఉదీచ్ + అస్=ఉదీచః, ఉదీచా-ఉదగ్భామ్.

సూ.—సమస్సమి—౬-3-౯3.

అప్రత్యయాంతంబగు అఞ్చుధాతువు పరంబగుచో సమ్-అనునుపవర్గమునకు సమి-యను నాదేశమగును.

ఉదా:—సమ్యఙ్-సమ్యఞ్చౌ- (౨) సమి+అఞ్చ్+అస్-సమి+అచ్ + అస్. అల్లోపంబు ఇకారంబునకు దీర్ఘంబు-సమీచ్+అస్ సమీచః, సమ్యగ్భ్యామ్.

సూ.—సహస్య సధ్రిః—౬-3-౯౫.

అప్రత్యయాంతంబగు అఞ్చుధాతువు పరంబగుచో సహశబ్దంబునకు సధ్రి యనునాదేశంబగును.

ఉదా:—సహ+అఞ్చతి అనువిగ్రహమున-సధ్ర్యఙ్.

సూ.—తిరసస్తిర్యలోపే—౬-౩-౯౪.

అలుప్తాకారంబును, అప్రత్యయాంతంబునగు అఞ్చు ధాతువు పరంబగుచో తిరస్ శబ్దంబునకు తిరి-యను నాదేశం బగును.

ఉదా:—తిర్యజ్-తిర్యఞ్చౌ - (౨) తిర్యఞ్చః, తిరశ్చః, తిర్యగ్భ్యామ్.

సూ.—నాఞ్చేః పూజాయామ్—౬-౪-౩౦.

పూజార్థకంబగు అఞ్చుధాతువుయొక్క యుపధాభూతంబగు నకారంబునకు లోపంబు రాదు. దానంజేసి ఉగిదచామిత్యాదిసూత్రంబుచే విహితంబగునుమ్ము రాదు.

ఉదా:—ప్ర-అఞ్చ్=ప్రాఞ్చ్ సంయోగాంతలోపంబు కుత్వంబు-ప్రాఙ్-ప్రాఞ్చౌ నలోపంబు లేమింజేసి అకారంబునకు లోపంబు లేదు. ప్రాఞ్చః, ప్రాఙ్భ్యామ్, ప్రాఙ్క్షు. ఇట్లే పూజార్థమున ప్రత్యఙ్-మున్నగువానిరూపంబు లెఱుంగునది.

క్రుఙ్-క్రుఞ్చౌ - క్రుఙ్భ్యామ్. పయోముక్ - పయోముగ్ - పయోముచౌ, పయోముగ్భ్యామ్.

మహత్+స్ ఉగిత్తగుటచే నుమ్ము-మహన్త్+స్ - అని సిద్ధింపఁగా,

సూ.—సాన్తమహతస్సంయోగస్య—౬-౪-౧౦.

సాంతసంయోగసంబంధియు, మహచ్ఛబ్దసంబంధియు నగు నకారముయొక్క యుపధకు సంబుద్ధిభిన్నంబగు సర్వనామస్థానంబు పరంబగుచో దీర్ఘంబగును.

ఉదా:—మహాన్త్+స్ సులోప-సంయోగాంతలోపంబులు. మహాన్-మహాన్తౌ - మహాన్తః, హేమహన్, మహతః, మహద్భ్యామ్.

సూ.—అత్వసన్తస్య చాధాతోః—౬-౪-౧౪.

అతు-అనునది యంతమునఁ గల యంగముయొక్కయు, ధాత్వవయవభిన్నంబగు అస్సు అంతంబునఁగల యంగముయొక్కయు, నుపధకు సంబుద్ధిభిన్నంబగు సుప్రత్యయంబు పరంబగుచో దీర్ఘంబగును.

ఉదా:—ధీమత్+స్ దీర్ఘము-నుమ్ము - సులోపసంయోగాంతలోపంబులు-ధీమాన్-ధీమన్తౌ-ధీమన్తః, హేధీమన్.

శసాది ప్రత్యయంబులందు మహచ్ఛబ్దంబునకుంబోలెఁ బ్రక్రియ నడయునది.

భాతేర్డవతుః—(ఉణా).

భా ధాతువుకంటెఁ బరముగా డవతు ప్రత్యయంబగు. ఈప్రత్యయమందలి డకారమిత్సంజ్ఞంబుగానఁ దత్సామర్థ్యముచేఁ బ్రకృతి భసంజ్ఞకము కాకున్నను టిలోపంబగును.

ఉదా:—భా+అవత్ టిలోపంబు-భవత్-దీర్ఘమునుమ్ము-భవాన్-భవన్తౌ.

శత్రంతంబగు భవత్ అనునది అత్వంతంబు గాకపోవుటచే దీర్ఘంబు రాదు. (భవతీతి) భవన్-భవన్తౌ ఇత్యాది.

సూ.—ఉభే అభ్యస్తమ్—౬-౧-౫.

ఆఱవ యధ్యాయమందలి ద్విత్వప్రకరణమున విధింపఁబడిన ద్విత్వముతోఁ గూడినశబ్దస్వరూపములు రెండును గలిసి యభ్యస్త మనఁబడును.

సూ.—నాభ్యస్తాచ్ఛతుః—౭-౧-౭౮.

అభ్యస్తసంజ్ఞకముకంటెఁ బరంబగు శత్రుప్రత్యయమునకు నుమ్ము రాదు.

ఉదా:—దదత్-దదతౌ.

సూ.—జక్షిత్యాదయష్షట్—౬-౧-౬.

(1) జక్ష, (2) జాగృ, (3) దరిద్రా, (4) శాసు, (5) చకాసృ, (6) దీధీఙ్ (7) వేవీఙ్ -ఈయేడుధాతువులు నభ్యస్తసంజ్ఞకంబులు.

ఉదా:—జక్షత్ - జక్షతౌ-జక్షతః, ఇట్లే జాగ్రత్-దరిద్రత్-శాసత్ - చకాసత్ - దేధ్యత్-వేవ్యత్ అనునవి. గుప్-గుబ్-గుపౌ-గుపః, గుబ్భ్యామ్

సూ.—త్యదాదిషు దృశోఽనాలోచనే కఞ్చ—3-౨-౬౦.

త్యదాదు లుపపదంబు లగుచో జ్ఞానార్థకంబు కాని దృశిర్-ధాతువుకంటెఁ బరంబుగా కఞ్-ప్రత్యయంబగును. చ శబ్దంబుచే క్విన్-ప్రత్యయంబునగును.

సూ.—ఆ సర్వనామ్నః—౬-3-౯౧.

దృక్ - దృశ - వతు లు పరంబగుచో సర్వనామంబున కాకారం బంతాదేశంబగును.

ఉదా:—తద్+దృశ్+క్విన్ = తాదృశ్ షత్వము - తాదృష్ జ_స్త్వము-తాదృడ్ కుత్వము-తాదృగ్ చ_ర్త్వము- తాదృక్-తాదృగ్.

(ష-డ-గ-కాః అనఁగా-షత్వ-జ_స్త్వ-కుత్వ-చ_ర్త్వంబులని యర్థము. ఇట్లే మీఁద నెఱుంగునది.)

తాదృశౌ-తాదృశః, తాదృగ్భ్యామ్.

విశ్+స్ సులోపంబు-విశ్ - షత్వజ_స్త్వచ_ర్త్వముఁలు- విట్-విడ్-విశౌ-విశః, విడ్భ్యామ్.

సూ.—నశేర్వా—౮-౨-౬3.

ణశ ధాతువునకుఁ బదాంతంబునఁ గవర్గం బంతాదేశం బగును.

ఉదా:—నశ్-నక్-నగ్ పక్షంబున షత్వంబు-నట్-నడ్- నశౌ-నశః, నగ్భ్యామ్-నడ్భ్యామ్.

సూ.—స్పృశోఽనుదకే క్విన్—3-2-58.

ఉదకశబ్దభిన్నంబగు సుబంతం బుపపదంబగుచో స్పృశ-ధాతువుకంటెఁ బరముగా క్విన్ప్రత్యయంబగును.

ఉదా:—ఘృతం స్పృశతీతి-ఘృతస్పృశ్-క్విన్=కుత్వము ఘృతస్పృక్-ఘృతస్పృగ్-ఘృతస్పృశౌ-ఘృతస్పృశః, ష-డ-గ-కంబులు, దధృక్-దధృగ్ - దధృషౌ-దధృషః, దధృగ్భ్యామ్ ఇత్యాదులు.

రత్నాని ముష్ణాతీతి రత్నముట్ - రత్నముడ్ - రత్నముషౌ-రత్నముషః, రత్నముడ్భ్యామ్.

షట్+జస్=షట్-(2) షడ్భిః-షడ్భ్యః-(2) షణ్ణామ్-షట్సు.

పిపఠిష్+స్-పిపఠిష్-రుత్వమునుగూర్చి షత్వ మసిద్ధమగుటచే రుత్వంబు-పిపఠిర్ అని కాఁగా,

సూ.—ర్వోరుపధాయా దీర్ఘ ఇకః—8-2-76.

రేఫాంతముగాని, వకారాంతముగాని యగు ధాతువు యొక్క యుపధాభూతంబగు ఇక్కునకు పదాంతమున దీర్ఘమగును.

ఉదా:—పిపఠీః-పిపఠిషౌ-పిపఠిషః,పిపఠీర్భ్యామ్ ఇత్యాది.

సూ.—నుమ్విసర్జనీయశర్వ్యవాయేఽపి—౮-3-౫౮.

నుమ్ము-విసర్గము-శర్ అనువానితోఁ బ్రత్యేకముగా వ్యవధానమున్నను, ఇణ్ కవర్గములకంటెఁ బరమగు సకారమునకు మూర్ధన్యంబాదేశంబగును.

ఉదా:—పిపఠిష్+సు రుత్వదీర్ఘములు-పిపఠీర్+సు విసర్గసత్వములు-పిపఠీస్+సు-పిపఠీస్+షు-ష్టుత్వంబుచే సకారంబునకు షకారంబు పిపఠీష్+షు=పిపఠీష్షు సత్వంబు రానిపక్షంబున-పిపఠీఃషు.

చికీః-చికీర్షౌ-చికీర్షః, చికీర్భ్యామ్, చికీర్షు. విద్వాన్-విద్వాంసౌ, హేవిద్వన్.

సూ.—వసోస్సమ్ప్రసారణమ్—౬-౪-౧3౧.

వస్వంతంబగు భసంజ్ఞకంబునకు సంప్రసారణంబగును.

ఉదా:—విద్వస్+అస్ (శస్)-సంప్రసారణము పూర్వరూపము. విదుస్+అస్=విదుషః, దత్వంబు-విద్వద్భ్యామ్.

సూ.—పుంసోఽసుఙ్—౭-౧-౮౯.

పుంస్ - అనుశబ్దంబునకు సర్వనామస్థానంబు వివక్షితమగుచో అసుఙాదేశంబగును (అస్).

ఉదా:—పుంస్-సుప్రత్యయవివక్షయందు అసుఙ్-పుమస్ నుమ్ము దీర్ఘము సంయోగాంతలోపము - పుమాన్-హేపుమన్, పుమాంసౌ-పుంసః, పుంభ్యామ్, పుంసు.

ఉశనస్+స్-అనఙ్=ఉశనా-ఉశనసౌ.

అస్య సంబుద్ధౌ వాఽనఙ్ నలోపశ్చ వా వాచ్యః—(వా).

ఉశనశ్శబ్దంబునకు సంబుద్ధియందు వికల్పముగా అనఙ్ఙగును. నలోపంబును వికల్పముగానగును.

ఉదా:—హేఉశనస్+స్ అనఙ్-హేఉశనన్+స్-సులోప-నలోపములు-హే ఉశన నలోపంబు రానిపక్షంబున-హేఉశనన్ అనఙ్ రానిచో-హేఉశనః-హేఉశనసౌ, ఉశనోభ్యామ్, ఉశనస్సు.

అనేహా-అనేహసౌ-హేఅనేహః. వేధాః-వేధసౌ-హేవేధః, వేధోభ్యామ్.

సూ.—అదస ఔ సులోపశ్చ—౭-౨-౧౦౭.

అదశ్శబ్దమునకుఁ బ్రథమైకవచనము పరమగుచో ఔకారమంతాదేశంబును సులోపంబు నగును.

ఉదా:—అదస్+స్-అదౌ - "తదోస్సస్సావనన్త్యయోః" -అనుదానిచే సత్వము=అసౌ.

అదస్+ఔ - త్యదాద్యత్వపరరూపములు వృద్ధి-అదౌ-అని సిద్ధింపఁగా.

సూ.—అదసోఽసేర్దాదు దో మః—౮-౨-౮౦.

సకారాంతంబుకాని అదశ్శబ్దముయొక్క దకారంబునకుం బరమగుదానికి ఉ-ఊలును, దకారంబునకు మకారంబు

నగును. ఆంతరతమ్యంబుచే హ్రస్వమునకు ఉకారంబును దీర్ఘమునకు ఊకారమును నగును.

ఉదా:—అమూ-అదస్+అస్ - (జస్) అద+అస్ శీభావంబు-అద+ఈ గుణము-అదే అని కాఁగా.

సూ.—ఏత ఈద్బహువచనే—౮-౨-౮౧.

బహుత్వవిశిష్టమును బోధించు అదశ్శబ్దముయొక్క-దకారమునకుఁ బరమగు-ఏకారంబునకు -ఈకారంబును - దకారంబునకు మకారంబు సాదేశంబులగును.

ఉదా:—అమీ - పూర్వత్రాసిద్ధమ్మనుచొప్పున ఉత్వ - మత్వము లసిద్ధము లగుటచే ముందుగా విభక్తికార్యంబును బిమ్మట ఉత్వ-మత్వములు నగును.

ఉదా:—అము+అమ్-పూర్వరూపంబు=అముమ్-అమూ-అమూన్.

అదస్+ఆ అద+ఆ అము+ఆ నాభావంబు-అము+నా=అమునా. ఇట నాభావంబును గూర్చి ముత్వ మసిద్ధమగుచుండఁగా,

సూ.—న ము నే—౮-౨-3.

నాభావంబు చేయవలసి యుండఁగాఁగాని. చేసినఁగాని ముత్వం బసిద్ధంబు గాదు.

ఉదా:—అమునా-అమూభ్యామ్-(3)అమీభిః,అముష్మై-అమీభ్యః-(౨) అముష్మాత్,అముష్య-అముయోః-(౨) అమీషామ్, అముష్మిన్-అమీషు.

ఇది హలంతపుంలింగప్రకరణము.

---

# హలన్తస్త్రీలింగప్రకరణము.

సూ.—నహో ధః—౮-౨-3౪.

ణహధాతువుయొక్క హకారమునకు ఝల్లు పరమగునపుడును బదాంతమందును ధకారంబగును.

సూ.—నహివృతివృషివ్యధిరుచిసహితనిషుక్వౌ-౬-3-౧౧౬.

ద్విబంతంబులగు-ణహ-వృతు-వృషు - వ్యధ-రుచ-షహ-తను ధాతువు లుత్తరపదంబు లగుచోఁ బూర్వపదంబునకు దీర్ఘంబగును.

ఉదా:—ఉప-నహ్ దీర్ఘంబు ధత్వంబు=ఉపానధ్-ఉపానత్-ఉపానద్-ఉపానహౌ, ఉపానత్సు. ఉష్ణిహ్+స్-క్విన్నంతంబగుటచేఁ గుత్వంబుచేత హకారంబునకు ఘకారంబు ఉష్ణిఘ్-ఉష్ణిక్-ఉష్ణిగ్-ఉష్ణిహౌ, ఉష్ణిగ్భ్యామ్, ఉష్ణిక్షు. ద్యౌః-దివౌ-దివః, ద్యుభ్యామ్. గీః-గిరౌ=గిరః. పూః-పురౌ-పురః. చతస్రః-చతసృణామ్. కా-కే-కాః. సర్వాశబ్దంబునకుంబోలె దీనిప్రక్రియయరయునది.

సూ.—యస్సౌ—౭-౨-౧౧౦.

ఇదమ్శబ్దముయొక్క దకారమునకుఁ బ్రథమైకవచనము పరమగుచోఁ యకారంబగును.

ఉదా:—ఇదమ్+స్ - ఇదమోమ యనుసూత్రముచేత మకారమునకు మకారము, దకారమునకు యకారము-ఇయమ్+స్ సులోపంబు=ఇయమ్.

ఇదమ్+ఔ ఇద+ఔ టాప్పు-ఇదా+ఔ శీభావంబు - గుణము-ఇదే. దశ్చ యనుసూత్రముచే దకారంబునకు మకారంబుఇమే (౨) ఇమాః-(౨)ఇమామ్, అనయా-ఇదమ్+భ్యామ్ ఇద+భ్యామ్ ఇదా+భ్యామ్ : హలిలోప యనుసూత్రముచే నిద్దునకు లోపంబు-ఆ+భ్యామ్=ఆభ్యామ్-(3) ఆభిః, అస్యై, అస్యాః - (౨) అనయోః (౨) ఆసామ్, అస్యామ్ - ఆసు. స్రక్ - స్రజౌ- స్రజః,స్రగ్భ్యామ్. త్యద్+స్ త్య+స్ త్యా+స్ = స్యా - త్యే-త్యాః. ఇట్లే తద్ -ఏతద్ -ఇత్యాదులు.

వాక్ -వాగ్ -వాచౌ - వాచః, వాగ్భ్యామ్, వాక్షు. అప్శబ్దంబు నిత్యబహువచనాంతంబు.

అప్+జస్ అప్తృన్నిత్యాదిసూత్రంబుచేదీర్ఘము-ఆపః-అపః-అప్+భిస్-అని యుండఁగా,

సూ—అపో భి—౭-౪-౪౮.

అప్ శబ్దంబునకు భకారాదిప్రత్యయంబులు పరమగుచోఁ దకారంబంతాదేశంబగును. జశ్త్వము-అద్భిః.

ఉ—అద్భ్యః--(౨) అపామ్-అప్సు. దిక్-దిగ్-దిశౌ-దిశః, దిగ్భ్యామ్.

క్విన్ప్రత్యయస్య కు యనుసూత్రమందలి ప్రత్యయగ్రహణ సామర్థ్యముచేఁ గేవలదృశ్ ధాతువునకు "త్యదాదిష్విత్యాది సూత్రముచేఁ గ్విన్ప్రత్యయము రాకపోయినను, "క్విన్ప్రత్యయస్య కు" యనుసూత్రముచేఁ గుత్వంబగునని తెలియునది.

ఉదా:—దృశ్=దృక్-దృగ్-దృశౌ-దృశః,దృగ్భ్యామ్. త్విట్-త్విడ్-త్విషౌ-త్విషః,త్విడ్భ్యామ్.

సజుష్+స్ - సజుష్ రుత్వంబు-సజుర్ ఉపధాదీర్ఘము-సజూర్ = సజూః-సజుషౌ, సజూర్భ్యామ్. ఆశీః- ఆశిషౌ, ఆశీర్భ్యామ్.

అసౌ-అదస్+ఔ-అదే మత్వోత్వములు-అమూ-అమూః, అముయా-అమూభ్యామ్(౩)అమూభిః, అముష్యై-అమూభ్యః, (౨)అముష్యాః (౨)అముయోః (౨) అమూషామ్,అముష్యామ్-అమూషు.

ఇది హలన్తస్త్రీలిఙ్గప్రకరణము.

---

# హలన్తనపుంసకలింగప్రకరణము.

సు+అనడుహ్ = స్వనడుహ్+స్-"స్వమోర్నపుంసకా"త్తనుసూత్రముచే సుప్రత్యయంబునకు లుక్కు, దత్వాచర్త్వములు-స్వనడుత్-స్వనడుద్ - స్వనడుహీ (౨) స్వనడుహ్+జస్-

శిభావంబు "చతురనడుహోరాముదాత్త" యనుసూత్రముచేత నామ్ను-స్వనడ్వాంహి. ఇట్లే సంబోధనప్రథమయందును, ద్వితీయావిభక్తి యందును రూపంబు లెఱుంగునది. తక్కినరూపంబులు పుల్లింగంబునందుఁ బోలె నరయునది.

వాః-వారీ - వారి, వారా - వార్భ్యామ్. చత్వారి. కిమ్-కే-కాని. ఇదమ్-ఇమే-ఇమాని.

అన్వాదేశే నపుంసకే ఏనద్వక్తవ్యః—(వా)

అన్వాదేశంబున నపుంసకలింగమందు ఇదమేతచ్ఛబ్దంబులకు ఏనద్-అనునాదేశంబగును.

ఉదా:— ఏనత్-ఏనద్-ఏనే - ఏనాని,ఏనేన,ఏనయోః.

(౨) బ్రహ్మ.

సంబుద్ధౌ నపుంసకానాం నలోపో వా—(వా)

సంబుద్ధి పరంబగుచో నపుంసకంబులకు నలోపంబు వికల్పంబుగానగును.

ఉదా:—హేబ్రహ్మన్-హేబ్రహ్మ. అహన్+స్ రేఫాదేశంబు-అహర్+స్ అహః. అహన్+ఔ శీభావంబు-అహన్+ఈ "విభాషాఙిశ్యోః" అనుదానిచే వికల్పంబుగా నల్లోపంబు-అహ్నీ పక్షంబున - అహనీ-అహన్+అస్ (జస్) శిభావంబు-ఉపధాదీర్ఘము-అహాని, అహ్నీ

సూ—అహన్—౮-౨-౬౮.

అహన్శబ్దంబునకుఁ బదాంతంబున రుత్వంబగును.

ఉదా:—అహన్+భ్యామ్ - అహరు+భ్యామ్ ఉత్వము, గుణము=అహోభ్యామ్. దణ్డి - దణ్డినీ-దణ్డీని,దణ్డనా-దణ్డిభ్యామ్. సుపథిటిలోపంబు-సుపథీ-సుపన్థాని. ఊర్క్-ఊర్గ్ - ఊర్జీ-ఊన్ర్జి-(నకార రేఫజకారములసంయోగంబు)తత్-తే-తాని.యత్-యే-యాని. ఏతత్-ఏతే-ఏతాని.గవాక్-గోచీ-గవాఞ్చి, సంబోధన ప్రథమాద్వితీయావిభక్తులయందును రూపంబులిట్లేయగును. గోచా-గవాగ్భ్యామ్. శకృత్-శకృతీ-శకృన్తి-శకాని, శక్నా-శకృతా ఇత్యాది. దదత్-దదతీ.

సూ—వా నపుంసకస్య—౭-౧-౭౯.

అభ్యస్తసంజ్ఞకంబుకంటెఁ బరంబగు శతృప్రత్యయం బంతంబునఁ గల్గిన నపుంసకాంగంబునకు సర్వనామస్థానంబు పరంబగుచో నుమ్ము వికల్పముగానగును.

ఉదా:—దదత్+జస్ దదత్+ఇ నుమ్ము=దదన్తి. పక్షంబున-దదతి. తుదత్.

సూ—ఆచ్ఛీనద్యోర్నుమ్—౭-౧-౮౦.

అవర్ణాంతాంగంబునకుఁ బరంబగు శతృప్రత్యయావయవ మంతమునఁ గల యంగమునకు శీ-కాని, నదీసంజ్ఞకంబులుగాని పరంబగుచో నుమ్ము వికల్పముగా నగును.

ఉదా:—తుదత్+ఔ తుదత్+శీ నుమ్ము = తుదన్తీ-పక్షంబున- తుదతీ- తుదత్+జస్-తుదత్+ఇ నుమ్ము-తుదన్తి-భాత్-భాన్తీ- భాతీ-భాన్తి. పచత్.

సూ—శప్ శ్యనోర్నిత్యమ్—౭-౧-౮౧.

శప్శ్యన్నులయొక్క అకారముకంటెఁ బరంబగుశతృప్రత్యయావయవం బంతమందుఁ గలయంగమునకు శీ-గాని, నదీసంజ్ఞకములుగాని పరమగుచో నిత్యముగా నుమ్మగును.

ఉదా:—పచత్+ఔ-పచత్+ఈ నుమ్ము-పచన్తీ-పచన్తి. దీవ్యత్ - దీవ్యన్తీ-దీవ్యన్తి. ధనుః - ధనుషీ - ధనుస్+జస్ - ధనుస్+శి నుమ్ము-ధనున్స్+ఇ - సాంత మహతస్సంయోగస్య యను సూత్రముచేత దీర్ఘంబు-ధనూన్స్+ఇ అనుస్వారము ధనూంస్+ఇ - "నుమ్విసర్జనీయ" యనుదానిచేత షత్వము-ధనూంష్+ఇ=ధనూంషి,ధనుషా-ధనుర్భ్యామ్. ఇట్లే చక్షుస్-హవిస్ మున్నగువాని ప్రక్రియ తెలియునది. పయః-పయసీ-పయాంసి, పయసా-పయోభ్యామ్.

సుపుమ్-సుపుంసీ-సుపుమాంసి.

అదః-విభక్తికార్యానంతరము మత్వోత్వములు-అమూ-అమూని. తక్కినరూపంబులు పుంలింగంబందుఁబోలె నూహించునది.

ఇది హలన్తనపుంసకలింగప్రకరణము.

---

# అవ్యయప్రకరణము.

సూ.—స్వరాదినిపాతమవ్యయమ్—౧-౧-౩౭.

స్వరాదులును, నిపాతంబులు నవ్యయంబు లనఁబడును.

స్వర్-అన్తర్-ప్రాతర్-పునర్ - సనుతర్ - ఉచ్చైస్ - నీచైస్-శనైస్-ఋధక్-ఋతే- యుగపత్ - ఆరాత్ - పృథక్- హ్యస్-శ్వస్-దివా-రాత్రౌ-సాయమ్-చిరమ్-మనాక్ - ఈషత్- జోషమ్-తూష్ణీమ్-బహిస్-ఆవిస్-అవస్-అధస్-సమయా-నికషా- స్వయమ్-వృథా-నక్తమ్-నఞ్-హేతౌ-ఇద్ధా-అద్ధా-సామి-వత్- (గణ) బ్రాహ్మణవత్ - క్షత్రియవత్-సనా-సనత్-సనాత్-ఉపధా- తిరస్-అన్తరా-అన్తరేణ-జ్యోక్ - కమ్-శమ్ - సహసా - వినా- నానా-స్వస్తి-స్వధా - అలమ్ - వషట్-శ్రౌషట్ - వౌషట్- అన్యత్-అస్తి-ఉపాంశు-క్షమా - విహాయసా - దోషా-మృషా- మిథ్యా-ముధా-పురా-మిథో - మిథస్ - ప్రాయస్-ముహుస్- ప్రవాహుకమ్-ప్రవాహికా - ఆర్యహలమ్-అభీక్ష్ణమ్-సాకమ్- సార్ధమ్-సమమ్-నమస్-హిరుక్-ధిక్-అథ-అమ్-ఆమ్-ప్రతామ్- ప్రశాన్-ప్రతాన్-మా-మాఙ్-(ఇది యాకృతిగణంబు) చ-వా- హ-అహ-ఏవ-ఏవమ్-నూనమ్-శశ్వత్-యుగపత్ - భూయస్ - కూపత్-సూపత్-కువిత్-నేత్-చేత్-చణ్-కచ్చిత్ - కించిత్- యత్ర-నహ-హన్త-మాకిః-మాకీమ్-నకిః - ఆకిమ్-మాఙ్-నఞ్- యావత్-తావత్-త్వై-ద్వై-న్వై-రై - శ్రౌషట్ - వౌషట్- స్వాహా-స్వధా-తుమ్-తథాహి-ఖలు-కిల - అథో-అథ-సుష్ఠు-స్మ- ఆదహ.

## ఉపసర్గవిభక్తిస్వరప్రతిరూపకాశ్చ—(గణ.)

ఉపసర్గసదృశంబులును, విభక్తిసదృశంబులును, స్వరసదృశంబులును చాదిగణంబులోనివి.

అవదత్తమ్-అహంయుః-అస్తిక్షీరా-అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఏ-ఐ-ఓ-ఔ-పశు-శుకమ్-యథాకథాచ-పాట్ - ప్యాట్-అఙ్గ-హై-హే-భోః-అయే-ద్య-విషు-ఏకపదే-యుత్ - ఆతః-(చాదియు నాకృతిగణంబు)పాశప్ ప్రత్యయమునకు వెనుకనున్న తసిల్మున్నగు ప్రత్యయంబు లంతంబునఁగలవియు నవ్యయంబులు. సమాసాంతప్రత్యయంబులకు వెనుకనున్నశస్-మున్నగు ప్రత్యయంబు లంతమునఁ గలవియు నవ్యయంబులు. అమ్ - ఆమ్-తసి-వతి-నా-నాఞ్-అనుప్రత్యయములంతమునఁ గలవియు నవ్యయంబులు. అతః-ఇత్యాది.

సూ.—కృన్మేజన్తః—౧-౧-౩౯.

మకారాంతంబును నేజంతంబును నగుకృత్ప్రత్యయమంతమునఁ గలశబ్దస్వరూపంబును నవ్యయంబు,

ఉదా:—స్మారంస్మారమ్-జీవసే-పిబధ్యై.

సూ.—క్త్వాతోసున్కసునః—౧-౧-౪౦.

క్త్వా-తోసున్-కసున్ ప్రత్యయంబులంతమునఁగలవియు నవ్యయంబులు.

ఉదా:—కృత్వా-ఉదేతోః-విసృపః.

సూ.—అవ్యయీభావశ్చ—౧-౧-౪౧.

అవ్యయీభావసమాసంబును నవ్యయంబగును.

ఉదా:—అధిహరి.

సూ.—అవ్యయాదాప్సుపః—౨-౪-౮౨.

అవ్యయంబులకంటె విహితములగు-ఆప్పునకును సుప్పునకును లుక్కగును.

ఉదా:—తత్ర శాలాయామ్.

అన్నిలింగములందును, విభక్తులన్నింటియందును, వచనంబులన్నింటను నేకశబ్దస్వరూపము విభిన్నస్వరూపంబును బొరయక యొక్కవిధమయగునది యవ్యయ మనఁబడును.

అవ-అపి అనెడు నుపసర్గముల మొదటి - అకారమునకు లోపంబును, హలంతశబ్దంబులకుం గొన్నింటికి-ఆప్పును నగునని భాగురిమహర్షి చెప్పుచున్నాఁడు.

ఉదా:—అవగాహః-వగాహః-అపిధానమ్ - పిధానమ్-వాచ్+ఆ=వాచా. నిశ్ +అ=నిశా. దిశ్ +ఆ=దిశా.

ఇది అవ్యయప్రకరణము.

---

# తిఙన్తప్రకరణము.

భ్వాదులు.

లట్-లిట్-లుట్-ల్రుట్-లేట్-లోట్-లఙ్-లిఙ్-లుఙ్-ల్రుఙ్ అని లకారములు దశవిధములు.అందు లేట్టు వేదమునందు మాత్రమే ప్రయోగింపఁబడును.

సూ.—లః కర్మణి చ భావే చాకర్మకేభ్యః—3-4-69.

ధాతువులు సకర్మకములును నకర్మకములునని రెండు తెఱఁగులుగా నుండును. పైఁజెప్పినలకారములు సకర్మకధాతువులకంటె వచ్చునపుడు, కర్మమునుగాని కర్తనుగాని బోధించును. అకర్మకధాతువులకుఁ బరమగునపుడు భావమును (క్రియను) గాని కర్తనుగాని బోధించును.

సూ.—వర్తమానే లట్—3-2-123.

వర్తమానక్రియను బోధించుధాతువునకుఁ బరముగా లట్ అనుప్రత్యయ మగును. లట్ ప్రత్యయములోని అకార టకారము లిత్సంజ్ఞకములు. లకారమునకు మాత్ర ముచ్చారణసామర్థ్యమునంజేసి యిత్సంజ్ఞ లేదు. ఇట్లే తక్కినలకారములందును ల్ అనునదిమాత్రమే మిగిలి, తక్కినవి యిత్సంజ్ఞచే లోపించునని తెలియునది.

భూ సత్తాయామ్,ఉండుట.ఇయ్యది యకర్మకము.అనఁగాఁ గర్మము సంభవింపనిది గాన వర్తమానకాలక్రియను బోధించునపుడు కర్త్రర్థమందు లకారము చేయఁగా భూ+ల్ అని సిద్ధింపఁగా,

సూ.—తిప్తస్ఝిసిప్థస్థమిబ్వస్మస్తాతాంఝథాసాథాన్ధ్వమిడ్వహిమహిఙ్—3-4-78.

తిప్-తస్-ఝి-సిప్-థస్-థ-మిప్-వస్-మస్-త-ఆతామ్-ఝ-థాస్-ఆథామ్-ధ్వమ్-ఇట్-వహి-మహిఙ్ - ఈపదునెనిమిదియు లకారమున కాదేశములగును.

సూ.—లః పరస్మైపదమ్—౧-౪-౯౯.

లకారస్థానమున వచ్చినయాదేశములు పరస్మైపదము లనఁబడును.

సూ.—తఙానావాత్మనేపదమ్—౧-౪-౧౦౦.

తఙ్ (అనఁగాఁ బైనఁజెప్పినపదునెనిమిది ప్రత్యయములలో మొదటితొమ్మిదిగాక మిగిలినతొమ్మిదియును) శానచ్-కానచ్ ప్రత్యయములును లకారమున కాదేశమైనను నాత్మనేపదము లనఁబడును. (అనఁగాఁ బరస్మైపదసంజ్ఞ వీని కుండదనుట.)

సూ.—అనుదాత్తఙిత ఆత్మనేపదమ్—౧-3-౧౨.

అనుదాత్తముగాని, ఙకారముగాని యిత్సంజ్ఞకముగాఁగల (ఏధ-చక్షిఙ్ మున్నగునవి) ధాతువులకంటెఁ బరమగు లకారముయొక్క స్థానమున నాత్మనేపద మగును.

సూ.—స్వరితఞితః కర్త్రభిప్రాయే క్రియాఫలే—౧-3-౭౨.

క్రియాఫలంబు కర్తను బొందునపుడు స్వరితముగాని ఞకారముగాని యిత్సంజ్ఞకముగాఁ గల-యజ- ణీఞ్ మున్నగు ధాతువులకంటెఁ బరమగులకారమునకు ఆత్మనేపద మాదేశ మగును.

క్రియాఫల మన్యునిబొందునపుడు వక్ష్యమాణలక్షణంబుచేఁ బరస్మైపద మగును గాన నిట్టిధాతువు లుభయపదు లనఁబడును.

సూ.—శేషాత్కర్తరి పరస్మైపదమ్—౧-3-౭౮.

ఆత్మనేపదనిమిత్తరహితం బగుధాతువుకంటెఁ బరమగు లకారస్థానమునఁ గర్త్రర్థంబునఁ బరస్మైపదమగును. అనఁగా నాత్మనేపదము కర్తను గర్మమును భావమును (క్రియను) గూడ బోధించుననియుఁ, బరస్మైపదము కర్తను మాత్రమే బోధించుననియు నెఱుంగునది. భూధాతువు పరస్మైపదిముగానఁ బరస్మైపదసంజ్ఞకములగు తిప్-తస్ మున్నగు తొమ్మిదిప్రత్యయములు నొకసారిగాఁ బ్రాప్తింపఁగా,

సూ.—తిఙస్త్రీణిత్రీణి ప్రథమమధ్యమోత్తమాః—
౧-౪-౧౦౧.

తిఙ్ఙులలోఁ బరస్మైపదాత్మనేపదములందలి మూఁడేసి ప్రత్యయములు కలిసి, ప్రథమ మధ్యమోత్తమ సంజ్ఞలను వరుసగా నొందును.

| | |
|---|---|
| తిప్-తస్-ఝి<br>త+ఆతామ్-ఝ | ప్రథమము |
| సిప్-థస్-థ<br>థాస్-ఆథామ్-ధ్వమ్ | మధ్యమము |
| మిప్-వస్-మస్<br>ఇట్-వహి-మహిఙ్ | ఉత్తమము |

వీనినే ప్రథమపురుషమనియుఁ, మధ్యమపురుషమనియు, నుత్తమపురుష మనియు వ్యవహరింతురు.

## సూ.—తాన్యేకవచనద్వివచనబహువచనాన్యేకశః ౧-౪-౧౦౨.

ప్రథమాదిసంజ్ఞలుగల తిఙ్ఙులలో మూఁడేసి ప్రత్యయములు వేఱువేఱుగా వరుసను ఏకవచనము-ద్వివచనము-బహువచనము నని వ్యవహరింపఁబడును.

| పరస్మైపదములు. | ఆత్మనేపదములు. |
|---|---|
| ఏక-ద్వి-బహు | ఏక-ద్వి-బహు |
| తిప్-తస్-ఝి | త-ఆతామ్-ఝ |
| సిప్-థస్-థ | థాస్-ఆథామ్-ధ్వమ్ |
| మిప్-వస్-మస్ | ఇట్-వహి-మహిఙ్ |

## సూ.—యుష్మద్యుపపదే సమానాధికరణే స్థానిన్యపి మధ్యమః—౧-౪-౧౦౫.

తిఙ్ఙుచేఁ జెప్పఁబడుకర్తనుగాని కర్మమునుగాని బోధించునట్టి యుష్మచ్ఛబ్దము ప్రయోగింపఁబడినను, అధ్యాహృతమయినను మధ్యమపురుష మగును.

ఉదా:—త్వం గచ్ఛ-హరిణా త్వం ముచ్యసే. మున్నగునవి.

## సూ.—అస్మద్యుత్తమః—౧-౪-౧౦౭.

తిఙ్ఙుచేఁ జెప్పఁబడుకర్తనుగాని కర్మమునుగాని బోధించు అస్మచ్ఛబ్దము ప్రయోగింపఁబడినను, అధ్యాహృతమైనను-ఉత్తమపురుష మగును.

ఉదా:—అహం గచ్ఛామి-హరిణా అహం ముచ్యే. ఇత్యాదులు.

సూ.—శేషే ప్రథమః—౧-౪-౧౦౮.

యుష్మదస్మచ్ఛబ్దభిన్నశబ్దప్రయోగములం దంతటను ప్రథమపురుషమే యగును.

ఉదా:—భవాన్ గచ్ఛతిసః, పశ్యతి, రామః స్తూయతే ఇత్యాదులు. తిప్ అనుదానిలోని పకారమున కిత్సంజ్ఞాలోపములు చేయఁగా భూ+తి-అని కాఁగా,

సూ.—తిఙ్ శిత్సార్వధాతుకమ్.—౩-౪-౧౧౩.

"ధాతోః" అనునధికారమున విధింపఁబడు తిఙ్లులును, శవర్ణమిత్సంజ్ఞకముగాఁగల ప్రత్యయములును, సార్వధాతుకములనఁబడును.

సూ.—కర్తరి శప్—౩-౧-౬౮.

కర్త్రర్థకమగుసార్వధాతుకము పరమగుచో ధాతువుకంటెఁ బరముగా శప్ (అ) అనుప్రత్యయ మగును. దీనినే వికరణప్రత్యయమని వ్యవహరింతురు. ఇట్లే దీనికపవాదములగు శ్యన్ మొదలగువానిని గూడ నెఱుంగునది.

ఉదా:—భూ+అ+తి అని యుండఁగా,

సూ.—సార్వధాతుకార్ధధాతుకయోః—౭-౩-౮౪.

సార్వధాతుకముగాని యార్ధధాతుకముగాని పరమగుచో, ఇగంతాంగమునకు గుణమాదేశమగును.

ఉదా:—భో౯అ+తి అవాదేశము-భవ్+అ+తి=భవతి-భూ+తస్ భూ+అ+తస్ భో+అ+తస్ భవ్+అ+తస్=సకారమునకు రుత్వవిసర్గములు=భవతః.

సూ.—ఝోఽన్తః.—౭-౧-3.

ప్రత్యయావయవ మగుఝకారమునకు అన్త్ అను నాదేశమగును.

ఉదా:—భూ+ఝి భూ+అ+ఝి భో+అ+ఝి భో+అ+అన్తి భవ్+అ+అన్తి భవ+అన్తి పరరూపము = భవన్తి, భవసి-భవథః-భవథ, భవ+మిప్ పకారమునకిత్సంజ్ఞాలోపములు-భవ+మి అని యుండఁగా,

సూ.—అతో దీర్ఘో యఞి—౭-3-౧౦౧.

హ్రస్వాకార మంతమునఁగలయంగమునకు యఞ్ ప్రత్యాహారబోధ్యవర్ణము లాదియందుఁగల సార్వధాతుకము పరమగుచో దీర్ఘమగును.

ఉదా:—భవామి-భవావః-భవామః. స భవతి-తౌ భవతః-తే భవన్తి, త్వం భవసి-యువాం భవథః-యూయం భవథ, అహం భవామి-ఆవాం భవావః-వయం భవామః. ఇట్లే యన్ని లకారములందు నుదాహరణము లెఱుంగునది.

సూ.—పరోక్షే లిట్—3-౨-౧౧౫.

అనద్యతనభూత కాలికము పరోక్షము నగుక్రియను బోధించుధాతువుకంటెఁ బరముగా లిట్ (ల్) అగును.

గడచినరాత్రిలోఁ గొంతకాలమును రాఁబోవురాత్రి లోఁ గొంతభాగమును గలిసినపగటిని అద్యతనమని వ్యవహ రింతురు. భూతము భవిష్యత్తునని యనద్యతనము ద్వివిధము. భూత మనఁగా జరిగినది.భవిష్యత్తనఁగా రాఁబోవునది.పరోక్ష మనఁగాఁ దాను జూడనిది.

ఉదా:—భూ+ల్ (లిట్) భూ+తి.

సూ.—పరస్మైపదానాం ణలతుసుస్థలథుసణల్వమాః— 3-౪-౮౨.

లిట్టుస్థానమున వచ్చినతిబాదులకుఁ దొమ్మిదింటికి వరు సగా ణల్ (అ) అతుస్-ఉస్-థల్ (థ) అథుస్-అ-ణల్ (అ) వ-మ అనునవి యాదేశములగును.

ఉదా:—భూ+అ అని సిద్ధింపఁగా,

సూ.—భువో వుగ్లుఙ్లిటోః—౬-౪-౮౮.

భూధాతువునకు లుఙ్గుయొక్కగాని లిట్టుయొక్కగాని యచ్చు పరమగునపుడు వుక్ (వ్) అనునాగమంబగును.

ఉదా:—భూవ్+అ.

సూ.—లిటి ధాతోరనభ్యాసస్య—౬-౧-౮.

లిట్టు పరమగునపుడు అభ్యాససంజ్ఞకము లేనిధాతువున కవయవ మగునట్టియు, ఒకయచ్చుకలదియు నగు మొదటిఖండ మునకును, అట్టిది అజాదిధాతువైనయెడల ద్వితీయఖండమున

కును ద్విత్త్వమగును. (అనఁగా నాయాఖండములు రెండు మాఱు లుచ్చరింపఁబడుననుట).

ఉదా:—భూవ్+భూవ్+అ.

సూ.—పూర్వోఽభ్యాసః—౬-౧-౪.

రెండుమార్లుచ్చరింపఁబడిన దానిలోని మొదటిభాగ మభ్యాసము నాఁబడును. ఈసంజ్ఞ యాఱవయధ్యాయమున విధించిన ద్విరుక్తమందుమాత్రమే ప్రవర్తించును.

సూ.—హలాదిశ్శేషః—౭-౪-౬౦.

అభ్యాసములోని మొదటిహల్లుదక్కఁ దక్కినహల్లు లన్నియు లోపించును. దీనిచే వకారలోపము.

ఉదా:—భూ భూవ్+అ.

సూ.—హ్రస్వః—౭-౪-౫౯.

అభ్యాసములోని యచ్చునకు హ్రస్వమగును.

ఉదా:—భు భూవ్+అ.

సూ.—భవతేరః—౭-౪-౭౩.

లిట్టు పరమగునపుడు భూధాతువుయొక్క యభ్యాసము లోని ఉకారమునకు అకార మాదేశమగును.

ఉదా:—భభూవ్+అ.

సూ.—అభ్యాసే చర్చ—౮-౪-౫౪.

అభ్యాసమునందలి ఝల్లులకు చర్ లును జశ్శులును నా దేశము లగును. ఝశ్శులకుజశ్శులును,ఖయ్యులకు చర్ లును అగునని తెలియునది.

ఉదా:—బభూవ్ +అ=బభూవ-బభూవతుః-బభూవుః,

సూ.—లిట్చ—3-౪-౧౧౫.

లిట్టున కాదేశంబులగుతిఙ్లులు ఆర్ధధాతుకము లనఁ బడును.

సూ.—ఆర్ధధాతుకస్యేడ్వలాదేః—౭-౨-3౫.

వల్ప్రత్యాహారబోధ్యవర్ణము లాదియందుఁ గల యార్ధధాతుకమునకు ఇట్ (ఇ) అనునాగమంబగును.

ఉదా:—బభూవ్ +థ బభూవ్ +ఇథ=బభూవిథ-బభూవ్ +అథుస్ = బభూవథుః-బభూవ్ +అ = బభూవ, బభూవ్ +అ= బభూవ-బభూవ్ +ఇవ=బభూవివ-బభూవ్ +ఇమ=బభూవిమ.

సూ.—అనద్యతనే లుట్—3-3-౧౫.

అనద్యతనభవిష్యత్కాలిక క్రియను బోధించుధాతువు కంటెఁ బరముగా లుట్ (ల్) అగును.

ఉదా:—భూ+ల్ (లుట్) భూ+తి.

సూ.—స్యతాసీ లృలుటోః—3-౧-33.

లృఙ్లు-లృట్టులుపరమగునపుడు స్య-అను ప్రత్యయమును, లుట్టు పరమగుచో తాస్-అనుప్రత్యయమును ధాతువునకుఁ

బరముగానగును. ఇవి శప్పు శ్యన్ను మున్నగువానికి బాధకంబులు.

ఉదా:—భూ+తాస్+తి.

సూ.—ఆర్ధధాతుకం శేషః—3-४-౧౧४.

తిఙ్లులుశిత్తులుగాని "ధాతోః" అనుపదముచే విధింపఁబడుప్రత్యయము లార్ధధాతుకము లనంబడును. ఇట తాస్- అనునది యార్ధధాతుకముగాన నిడాగమము.

ఉదా:—భూ+ఇతాస్+తి.

సూ.—లుటః ప్రథమస్య డారౌరసః—౨-४-౮౫.

లుట్టుయొక్క ప్రథమపురుషమున మూఁడువచనములకు డా (ఆ) రౌ-రస్ అనునవి వరుసగానగును.

ఉదా:—భూ+ఇతాస్+ఆ డిత్వసామర్థ్యముచే భసంజ్ఞ లేకున్నను టిలోపంబగును. భూ+ఇత్+ఆ గుణావాదేశములు- భవ్+ఇత్+ఆ=భవితా

సూ.—తాసస్త్యోర్లోపః—౭-४-౫౦.

సకారాదియగు ప్రత్యయము పరమగునపుడు తాస్ ప్రత్యయముయొక్కయు, అస్ ధాతువుయొక్కయు నంత్యవర్ణమునకు లోపమగును.

సూ.—రిచ—౭-౪-౫౧.

రేఫాదిప్రత్యయము పరమగునపుడును తాస్ అనుదాని యొక్కయు, అస్ ధాతువుయొక్కయు నంత్యవర్ణమునకు లోపంబగును.

ఉదా:—భవితాస్+రౌ=భవితారౌ - భవితాస్+రస్=భవితారః, భవితాస్+సి=భవితాసి-భవితాస్థః - భవితాస్థ, భవితాస్మి-భవితాస్వః-భవితాస్మః.

సూ.—లృట్ శేషే. చ—3-3-౧3.

మఱియొకక్రియప్రయోజనముగాఁ గలక్రియను బోధించుపదము ప్రయోగింపఁబడినను, బ్రయోగింపఁబడకున్నను జరుగఁబోవుక్రియనుబోధించుధాతువుకంటెఁబరముగా లృట్ (ల్) అనుప్రత్యయ మగును.

ఉదా:—భూ+ల్ (లృట్) భూ+తి భూ+స్య-తి భో+స్య+తి భవ్+స్య+తి ఇడాగమము-భవ్+ఇస్య+తి భవ్+ఇష్య+తి=భవిష్యతి-భవిష్యతః-భవిష్యన్తి, భవిష్యసి-భవిష్యథః-భవిష్యథ, భవిష్యామి-భవిష్యావః-భవిష్యామః.

సూ.—లోట్చ—3-3-౧౬౨.

విధి-నిమంత్రణము - ఆమంత్రణము-అధీష్టము - సంప్రశ్నము-ప్రార్థనము అనునర్థములయందు ధాతువుకంటెఁ బరముగా లోట్ (ల్) ప్రత్యయమగును.

సూ.—ఆశిషి లిఙ్లోటౌ—3-3-౧౭3.

ఆశీర్వచనార్థమునఁ గూడ ధాతువునకుఁ బరముగా లిఙ్ (ల్) లోట్ (ల్) ప్రత్యయములగును.

ఉదా:—భూ+ల్ (లోట్) భూ + తి భూ+అ+తి. భో+అ+తి భవ్ +అ+తి అని యుండఁగా,

సూ.—ఏరుః—3-౪-౮౬.

లోడాదేశములందలి ఇకారమునకు ఉకార మగును.

ఉదా:—భవ్ +అ+తు=భవతు.

సూ.—తుహ్యోస్తాతఙ్ఙాశిష్యన్యతరస్యామ్ — ౭-౧-3౫.

ఆశీరర్థమునందలి తు-హి అను ప్రత్యయములకు తాతఙ్ (తాత్) అనునాదేశము వికల్పముగా నగును.

ఇట ఙిత్వమునకు సంప్రసారణాదులు ప్రయోజనముగాన నితరప్రయోజనములు లేని అనఙ్ఙు మున్నగువానియందు బాధకముగాఁ బ్రవర్తించునట్టి "ఙిచ్చ" యను పరిభాష యిందుఁ బ్రవర్తింపదు. తాతఙ్ఙు అనేకాల్లుగాన సర్వాదేశముగ నగును.

ఉదా:—భవ+తు-భవ+ తాత్ =భవతాత్

సూ.—లోటో లఙ్వత్—3-౪-౮౫.

లోట్టునకు లఙ్ఙునకువలెనే కార్యము లగును. అనఁగా లఙ్ఙు ఙిత్తుగాన ఙిత్తునకుఁ జెప్పఁబోవు కార్యములు లోట్టునకుఁ గూడ నగునని యెఱుంగునది.

సూ.—తస్థస్థమిపాం తాంతంతామః—3-౪-౧౦౧.

జిత్తున కాదేశములగు తస్-థస్-థ - మిప్ అనువానికిఁ గ్రమముగా తామ్-తమ్-త-అమ్ అనునాదేశము లగును.

ఉదా:—భవ+తస్ భవతామ్ - భవ+ఝి భవ+అన్తి భవ+అన్తు=భవన్తు,

సూ.—సేర్హ్యపిచ్చ—3-౪-౮౭.

లోడాదేశమగు - సి అనుదానికి హి యనునాదేశమగును. సిప్ప్రత్యయమందలి పకారేత్సంజ్ఞకత్వముమాత్రము దీనియం దుండదు.

ఉదా:—భవ+సి భవ+హి.

సూ.—అతో హేః—౬-౪-౧౦౫.

హ్రస్వాకారాంత మగునంగమునకుఁ బరమగు - హి యనుదానికి లుక్కగును.

ఉదా:—భవ-భవ+సి భవ+హి భవ+తాత్ = భవతాత్-భవ+థస్ భవ+తమ్=భవతమ్ - భవ+థ భవ+త = భవత, భవ+మి అని యుండఁగా,

సూ.—మేర్నిః—3-౪-౮౯.

లోడాదేశమగు - మి యనుదానికి - ని యనునాదేశమగును.

ఉదా:—భవ+ని

సూ.—ఆడుత్తమస్య పిచ్చ—౩-౪-౯౨.

లోడాదేశంబగునుత్తమపురుషమునకు ఆట్ (ఆ)అను నాగమ మగును. మఱియు నీయాగమమందుఁ బకారేత్సంజ్ఞకత్వముకూడ నుండును.

ఉదా:—భవ+ఆని సవర్ణదీర్ఘము=భవాని

పాణినిసూత్రమున నికారోచ్చారణసామర్థ్యముఁనంజేసి హి-ని యనువానిలోని యికారమునకు ఉకారము రాదు.

సూ.—తేప్రాగ్ధాతోః—౧-౪-౮౦.

గతిసంజ్ఞకములు నుపసర్గసంజ్ఞకములును ధాతువునకుఁ బూర్వమున వ్యవధానము లేకయే ప్రయోగింపవలయును.

సూ.—ఆని లోట్—౮-౪-౧౬.

ఉపసర్గమునందలి నిమిత్తము (రేఫము) కంటెఁ బరమును లోడాదేశమగు ..ఆని యనుప్రత్యయమున కవయవమునగు నకారమునకు ణకార మగును.

ఉదా:—ప్ర+భవాని=ప్రభవాణి.

దురష్షత్వణత్వయోరుపసర్గత్వప్రతిషేధోవక్తవ్యః—(వా)

షత్వముగాని ణత్వముగాని చేయునపుడు దుర్ అను దానికి ఉపసర్గసంజ్ఞ యుండదు.

ఉదా:—దుర్+స్థితిః = దుఃస్థితిః దుర్+భవాని = దుర్భవాని.

అన్తశ్శబ్దస్యాఙ్కివిధిణత్వేషూపసర్గత్వం వాచ్యమ్—(వా)

అఙ్ - కి యను ప్రత్యయము:లును, ణత్వమును జేయు నపుడు అన్తర్ అనునవ్యయ ముపసర్గసంజ్ఞక మగును.

ఉదా:—అన్తర్+భవాని=అన్తర్భవాణి.

సూ.—నిత్యం ఙితః—3-౪-౯౯.

సకారాంతమును ఙిత్తునకాదేశము నగు నుత్తమపురుష మునకు నిత్యముగా లోపమగును. "అలోన్త్యస్య" యనుపరి భాషచే సకారము లోపించును.

ఉదా:—భవ+వస్ భవ+ఆవస్ భవ+ఆవ=భవావ - భవ+మస్ భవ+ఆమస్ భవ+ఆమ=భవామ.

సూ.—అనద్యతనే లఙ్—3-౨-౧౧౧.

అద్యతనభిన్నము భూతము నగు క్రియను బోధించు ధాతువుకంటెఁ బరముగా లఙ్(ల్) అను ప్రత్యయ మగును.

సూ.—లుఙ్లఙ్లృఙ్క్ష్వడుదాత్తః—౬-౪-౭౧.

లుఙ్-లఙ్-లృఙ్ ప్రత్యయములు పరమగునపు డంగమున కుదాత్త మగు-అట్(అ) అనునాగమ మగును.

ఉదా:—భూ+ల్ (లఙ్) అభూ+ల్ అభూ+తి అభూ+అ+తి అభో+అ+తి అభవ్+అ+తి అని యుండఁగా,

సూ.—ఇతశ్చ—3-౪-౧౦౦.

జిత్తగులకారమున కాదేశమును, ఇకారాన్తము నగు పరస్మైపదమునకు లోపమగును. అలోన్త్యపరిభాషచేత ఇకారము లోపించును.

ఉదా:—అభవ్+అ+త్=అభవత్-అభవతామ్-అభవ+ఝి అభవ+అన్తి అభవ+అన్త్ పరరూపము-అభవన్త్ సంయోగాంతలోపము=అభవన్, అభవః-అభవతమ్-అభవత, అభవమ్-అభవావ-అభవామ.

సూ.—విధినిమన్త్రణామన్త్రణాధీష్టసంప్రశ్నప్రార్థనేషు లిఙ్ 3-3-౧౬౧.

విధి (తనకంటెఁదక్కువయగుభృత్యుఁడుమున్నగువానిని బ్రేరేపించుట.) నిమంత్రణము (దౌహిత్రుఁడు మున్నగువాని నావశ్యకమగుశ్రాద్ధభోజనాదులయందుఁబ్రేరించుట.) ఆమంత్రణము (స్వేచ్ఛనొసంగుట.) అధీష్టము (గౌరముతోఁగూడిన వ్యాపారము) సంప్రశ్నము (ఇదియా అదియా అని విచారణము చేయుట.) ప్రార్థనము (కోరుట) అను నీయర్థములందు ధాతువునకుఁబరముగా లిఙ్(ల్)ప్రత్యయ మగును.

సూ.—యాసుట్పరస్మైపదేషూదాత్తో ఙిచ్చ—3-౪-౧౦3.

లిఙాదేశములగుపరస్మైపదములకుదాత్తమగు యాసుట్ (యాస్) అను నాగమంబగును. అది ఙిత్తువంటిదిగూడ నగును.

ఉదా:—భూ+ల్ భూ+తి భూ+అ+తి భో+అ+తి భవ్+అ+తి భవ+యాస్+తి భవ+యాస్+త్ అనియుండఁగా,

సూ.—లిఙస్సలోపోఽనన్త్యస్య—౭-౨-౭౯.

సార్వధాతుకమగులిఙ్ఙుయొక్క యంత్యము గానిసకారమునకు లోపమగును. దీనిచే సకారమునకు లోపము ప్రాప్తింపఁగా,

సూ.—అతో యేయః—౭-౨-౮౦.

హ్రస్వాకారముకంటెఁ బరమును, సార్వధాతుకమునకవయవము నగు-యాస్ అనుదానికి ఇయ్ అనునాదేశ మగును. (యేయః అనుచో సంధి యార్షము.)

ఉదా:—భవ+ఇయ్+త్ గుణము-భవేయ్+త్.

సూ.—లోపో వ్యోర్వలి—౬-౧-౬౬.

వల్లు పరమగునపుడు వకారయకారములకు లోపమగును. దీనిచే యకారలోపము.

ఉదా:—భవేత్-భవేయ్+తస్ భవేయ్+తామ్ భవే+తామ్=భవేతామ్.

సూ.—ఝేర్జుస్—3-౪-౧౦౮.

లిఙ్ఙునకాదేశమగు - ఝి యనుప్రత్యయమునకు జుస్ (ఉస్)అనునాదేశ మగును.

ఉదా:—భవ+ఝి భవ+ఉస్ భవ+యాస్+ఉస్ భవ+ఇయ్+ఉస్=భవేయుః, భవ+యాస్+సి భవ+ఇయ్+స్ భవ+ఇ+స్=భవేః-భవేతమ్-భవేత, భవేయమ్-భవేవ-భవేమ.

సూ.—లిఙాశిషి—3-౪-౧౧౬.

ఆశీర్లిఙ్జున కాదేశమగు-తిఙ్జు ఆర్ధధాతుకమనఁబడును.

సూ.—కిదాశిషి—3-౪-౧౦౪.

ఆశీర్లిఙ్జునందలి యాసుట్టు కిత్తువంటిదగును.

ఉదా:—భూ+తి భూ+త్ ఇది యార్ధధాతుకముగాన శప్పురాదు. భూ+యాస్+త్ "స్కోస్సంయోగాద్యోరన్తే చ" యనుసూత్రముచే సకారమునకు లోపము. భూ+యాత్

సూ.—గ్క్ఙితి చ—౧-౧-౫.

గిత్తుగాని కిత్తుగాని ఙిత్తుగాని నిమిత్తముగాఁ గలవియు ఇగ్లక్షణములు (ఇక్పదము నుచ్చరించి విధింపఁబడినవియు.) నగు గుణవృద్ధులు రావు. ఇట యాస్ అనునది కిత్తుగాన నార్ధధాతుకనిమిత్తక మగుగుణము రాదు.

ఉదా:—భూయాత్ - భూయాస్తామ్ - భూయాసుః, భూయాః-భూయాస్తమ్-భూయాస్త,భూయాసమ్-భూయాస్వ-భూయాస్మ.

సూ.—లుఙ్—3-౨-౧౧౦.

భూతకాలికక్రియను బోధించుధాతువుకంటెఁ బరముగా లుఙ్(ల్)అను ప్రత్యయ మగును.

సూ — మాఙి లుఙ్ — 3-3-౧౭౫.

మాఙ్ను బ్రయోగించునపుడు లుఙ్మాత్రమే యగును. లకారము లన్నింటికి నిది బాధకము.

సూ.— స్మోత్తరే లఙ్ చ — 3-3-౧౭౬.

స్మ అనునవ్యయము పరమునఁ గల మాఙ్ను బ్రయోగించునపుడు లఙ్ను లుఙ్నుగూడ నగును.

సూ.— చ్లి లుఙి — 3-౧-౪3.

లుఙ్ పరమగునపుడు ధాతువుకంటెఁ బరముగా చ్లి (ల్) యనుప్రత్యయ మగును. ఇది శప్పుమున్నగువానికి బాధకము.

సూ.— చ్లేస్సిచ్ — 3-౧-౪౪.

చ్లిప్రత్యయమునకు సిచ్ (స్) అనునది యాదేశ మగును.

ఉదా:— భూ+ల్(లుఙ్) భూ+తి భూ+త్ అభూ+త్ అభూ+స్+త్

సూ.— గాతిస్థాఘుపాభూభ్యస్సిచః పరస్మైపదేషు
౨-౪-౭౭.

ఇణ్ ధాతువున కాదేశమగు - గా యనుదానికంటెను, ష్ఠాధాతువుకంటెను, ఘుసంజ్ఞకములకంటెను, పా(పానార్థకము) భూధాతువులకంటెను బరమగు సిచ్చునకుఁ బరస్మైపదములు పరమగుచో లుక్కగును.

ఉదా:— అభూ+త్ ఇటగుణము ప్రాప్తింపఁగా,

సూ.—భూసువో స్తిజి—౭-3-౮౮.

భూ-షూఙ్ ధాతువులకు సార్వధాతుకమగు తిఙ్లు పర మగుచో గుణము రాదు.

ఉదా:—అభూత్-అభూతామ్-అభూవన్, అభూః-అభూ తమ్-అభూత, అభూవమ్-అభూవ-అభూమ.

సూ.—న మాఙ్యోగే—౬-౪-౭౪.

మాఙ్తో సంబంధించునపుడు అట్-ఆట్ అనునాగమ ములు రావు.

ఉదా:—మా భవాన్ భూత్, మాస్మ భవత్, మాస్మ భూత్.

సూ.—లిఙ్నిమిత్తే లృఙ్ క్రియాతిపత్తౌ—3-3-౧3౯.

లిఙ్నకు నిమిత్త మనఁగాఁ గార్య కారణభావాదికము. అట్టినిమిత్త మున్నపుడు భవిష్యదర్థమును బోధించుధాతువు కంటెఁ బరముగా, క్రియసిద్ధింపనియపుడు లృఙ్ (ల్) అను ప్రత్యయమగును.

ఉదా:—భూ+ల్ (లృఙ్) భూ+తి అభూ+తి అభూ+స్య +తి అభో+స్య+తి అభో+ఇస్య+తి అభవ్+ఇస్య+తి అభవ్+ ఇస్య+త్ అభవ్+ఇష్య+త్ =అభవిష్యత్-అభవిష్యతామ్-అభ విష్యన్, అభవిష్యః-అభవిష్యతమ్ - అభవిష్యత, అభవిష్యమ్- అభవిష్యావ-అభవిష్యామ. సువృష్టిశ్చేదభవిష్యత్ తదా సుభిక్ష మభవిష్యత్. ఇత్యాదులు లృఙున కుదాహరణంబులు.

(౨) అత=సాతత్యగమనే (ఎడతెగకనడచుట.)

ఉదా:—అత్+అ+తి=అతతి.

సూ.—అత ఆదేః—౭-౪-౭౦.

అభ్యాసమునందలి మొదటిహ్రస్వాకారమునకు దీర్ఘమగును.

ఉదా:—అ+అత్+అ ఆ+అత్+అ ఆత్+అ=ఆత - ఆతతుః-ఆతుః,ఆతిథ-ఆతథుః-ఆత, ఆత-ఆతివ-ఆతిమ. అతిష్యతి. అతతు.

సూ.—ఆడజాదీనామ్—౬-౪-౭౨.

లుఙ్ - లఙ్ - లృఙ్ ప్రత్యయములు పరమగునపుడు అజాదియగునంగమునకు ఆట్ (ఆ) అనునాగమ మగును.

ఉదా:—ఆతత్. అతేత్-అతేతామ్, అత్యాత్-అత్యాస్తామ్,అత్+ల్ (లుఙ్) ఆత్+తి అత్+స్+త్ ఆ-అత్+స్+త్ ఆత్+స్+త్ ఆత్+ఇస్+త్ అని యుండఁగా,

సూ.—అస్తిసిచోఽపృక్తే—౭-౩-౯౬.

సిచ్చునకును, అస్ ధాతువునకును నాదేశము లేనపుడు వీనికంటెఁ బరమైన అపృక్తసంజ్ఞక మగుహల్లునకు ఈట్ (ఈ) అనునాగమ మగును.

ఉదా:—ఆత్+ఇస్+ఈత్ అని యుండఁగా,

సూ.—ఇట ఈటి—౮-౨-౨౮.

ఇట్టుకంటెఁ బరమగు సకారమునకు ఈట్టుపరమగునపుడు లోపమగును.

ఉదా:—ఆత్+ఇ+ఈత్ ఇట సవర్ణదీర్ఘమును గూర్చి త్రైపాదికంబగుసలోపం బసిద్ధంబు కావలసియుండఁగా,

సిజ్లోపపకాదేశే సిద్ధో వాచ్యః—(వా)

ఏకాదేశము చేయునపుడు సిజ్లోప మసిద్ధము గాదు. సవర్ణదీర్ఘము

ఉదా:—ఆతీత్-ఆతిష్టామ్

సూ.—సిజభ్యస్తవిదిభ్య శ్చ—3-౪-౧౦౯.

సిచ్చుకంటెను, అభ్యస్తముకంటెను, విదధాతువుకంటెను బరమగు జిత్తునకాదేశమైన ఝిప్రత్యయమునకు జుస్ (ఉస్) అనునాదేశ మగును.

ఉదా:—ఆతిషుః, ఆతీః - ఆతిష్టమ్ - ఆతిష్ట, ఆతిషమ్- ఆతిష్వ ఆతిష్మ. ఆతిష్యత్.

(3) షిధ=గత్యామ్ (నడచుట.)

సూ.—పుగన్తలఘూపధస్య చ—౭-3-౮౬.

పుగాగమ మంతమునఁ గలదియు, లఘువర్ణము ఉపధగాఁ గలదియు నగు అంగమున కవయవమగు ఇక్కునకు సార్వధాతుకముగాని, యార్ధధాతుకముగాని పరమగునపుడు గుణ మాదేశమగును.

సూ.—హ్రస్వం లఘు—౧-౪-౧౦.

హ్రస్వము లఘు వనంబడును.

సూ.—సంయోగే గురు—౧-౪-౧౧.

సంయోగము పరమగునపుడు హ్రస్వము గురువు నాఁబడును.

సూ.—దీర్ఘఞ్చ—౧-౪-౧౨.

దీర్ఘముగూడ గురువనంబడును. "ధాత్వాదేష్షస్స" యనుసూత్రముచేత షకారమునకు సకారము-సేధతి. షత్వము-సిషేధ.

సూ.—అసంయోగాల్లిట్కిత్—౧-౨-౫.

సంయోగముకంటెఁ బరము గానిదియుఁ, బకారేత్సంజ్ఞకము కానిదియు నగులిడాదేశము కి త్తగును. దీనిచే గుణనిషేధంబు.

ఉదా:—సిషిధతుః-సిషిధుః, సిషేధిథ - సిషిధథుః-సిషిధ, సిషేధ-సిషిధివ-సిషిధిమ. సేధితా. సేధిష్యతి. సేధతు. అసేధత్-సేధేత్. సిధ్యాత్. అసేధీత్. అసేధిష్యత్. ఇట్లే. (౪) చితీ- (౫) శుచ మున్నగునవి. (౬) గద=వ్యక్తాయాం వాచి (స్పష్టముగా నుచ్చరించుట.)

ఉదా:—గదతి

సూ.—నేర్గదనదపతపదఘుమాస్యతిహన్తియాతివాతి ద్రాతిప్సాతివపతివహతి శామ్యతిచినోతిదేగ్ధిషు చ— ౮-౪-౧౭.

ఉపసర్గమునందలి రేఫముకంటెం బరమగు-ని అనుదాని యొక్క నకారమునకు గద-నద-పత్ల-పద-ఘు-(దాఙ్-దాణ్-దో-దేఙ్-ధేట్-ధాఙ్) మా-(మాఙ్-మేఙ్) షో-హన్-యా-వా-ద్రా-ప్సా-వప్-వహ-శము-చిఞ్-దిహ ధాతువులు పరమగు నపుడు ణకార మాదేశమగును.

ఉదా:— ప్రణిగదతి.

సూ.—కుహోశ్చుః—౭-౪-౬౨.

అభ్యాసమునందలి కవర్గమునకును, హకారమునకును చవర్గ మాదేశమగును.

సూ.—అత ఉపధాయాః—౭-౨-౧౧౬.

ఞిత్తుగాని ణిత్తుగాని యగుప్రత్యయము పరమగుచో, ఉపధ యగు హ్రస్వాకారమునకు వృద్ధి యగును.

ఉదా:—గద్+అ గగద్+అ జగద్+అ జగాద్+అ= జగాద-జగదతుః-జగదుః, జగదిథ-జగదథుః-జగద.

సూ.—ణలుత్తమో వా—౭-౧-౯౧.

ఉత్తమపురుషమగు ణల్లు వికల్పముగా ణిత్తగును. కాన వృద్ధివికల్పముగా నగును.

ఉదా:—జగాద. పక్షమున - జగద. జగదివ-జగదిమ. గదితా. గదిష్యతి. గదతు. అగదత్. గదేత్. గద్యాత్.

సూ.—అతో హలాదేర్లఘోః—౭-౨-౭.

హలాదిధాతువుయొక్క లఘ్వకారమునకుఁ బరస్మై పదము పరమునఁగల ఇడాదిసిచ్చు పరమగునపుడు వృద్ధి వికల్పముగా నగును.

ఉదా:—అగాదీత్ - అగదీత్. అగదిష్యత్. ఇట్లే ఖద= ఇత్యాదులు. (౭) ణద=అవ్యక్తే శబ్దే (ధ్వనిచేయుట.)

సూ.—ణో నః—౬-౧-౬౫.

ధాతువున కాదియగుణకారమునకు నకారమగును. నర్ద-నట-(ణిజన్తము) నాథృ-నాధృ-టునది-నక్క-న్యా-నృతీ ధాతువులుగాక తక్కిన నకారాదిధాతువు లన్నియు ఉపదేశమున (ధాతుపాఠమున) ణకారము కలవని యెఱుఁగునది.

సూ.—ఉపసర్గాదసమాసేఽపి ణోపదేశస్య—౮-౪-౧౪.

ఉపసర్గమునందలి నిమిత్తము (అనఁగా రేఫము) కంటెఁ బరమగుణోపదేశధాతువుయొక్క నకారమునకు ణకారమగును.

ఉదా:—ప్రణదతి- ప్రణినదతి, నదతి. ననాద.

సూ.—అత ఏకహల్మధ్యేఽనాదేశాదేర్లిటి—౬-౪-౧౨౦.

ఏయంగమునకు లిట్టు నిమిత్తముగాఁ గలయాదేశము మొదట నుండదో యాయంగమున కవయవ మగునదియు, సం

యుక్తములుగాని రెండుహల్లుల నడుమ నున్నట్టియు హ్రస్వా కారమునకు కిత్తగులిట్టు పరమగుచో, ఏకార మాదేశమగును. అభ్యాసమును లోపించును.

ఉదా:— నేదతుః- నేదుః.

సూ— థలి చ సేటి— ౬-౪-౧౨౧.

ఉక్తవిధంబగు హ్రస్వాకారమునకు ఇడాదియగుథల్లు పరమగునపుడును, ఏత్వమును అభ్యాసలోపము నగును.

ఉదా:— నేదిథ - నేదథుః - నేద, ననాద-ననద-నేదివ-నేదిమ. నదితా. నదిష్యతి. నదతు. అనదత్. నదేత్. నద్యాత్. అనాదీత్. అనదీత్. అనదిష్యత్ (౮) టునది=(సమృద్ధౌ-సంతోషించుట)

సూ.— ఆదిర్ఞిటుడవః— ౧-౩-౫.

ఉపదేశకాలమున ధాతువున కాదియందుండు-ఞి-టు-డు అనునవి యిత్సంజ్ఞకము లగును.

సూ.— ఇదితోనుమ్ ధాతోః— ౭-౧-౫౮.

అంత్యమగు హ్రస్వేకారమిత్సంజ్ఞగాఁగల ధాతువునకు నుమ్ (న్) అనునాగమ మగును.

ఉదా:— నద్. నన్ద్+తి నన్ద్+అ+తి=నన్దతి. ననన్ద. నన్దితా. నన్దిష్యతి. నన్దతు.అనన్దత్ నన్దేత్. నన్ద్యాత్. అనన్దీత్ అనన్దిష్యత్. ఇట్లే ణిది=కుత్సాయామ్. గడి=వదనైకదేశే. చది=ఆహ్లాదే. క్రది=ఆహ్వానే రోదనేచ. మున్నగువాని రూపంబులు

తెలియునది. (౯) అర్చ = పూజాయామ్(పూజించుట) అర్చతి. అ+అర్చ్+అ. "అతఆదేః" అనుసూత్రముచేత నభ్యాసమునకు దీర్ఘము-ఆ+అర్చ్+అ అని సిద్ధింపఁగా,

సూ.—తస్మాన్నుడ్ద్విహలః—౭-౪-౭౧.

రెండుహల్లులు గలధాతువుయొక్క దీర్ఘమగు - ఆకారముకంటెఁ బరమగుదానికి నుట్ (న్) అనునాగమంబగును.

ఉదా:—ఆ+న్అర్చ్+అ = ఆనర్చ-ఆనర్చతుః. అర్చితా. అర్చిష్యతి. అర్చతు-ఆర్చత్. అర్చేత్. అర్చ్యాత్. ఆర్చీత్. ఆర్చిష్యత్. (౧౦) వ్రజ=గతౌ (వెళ్లుట) వ్రజతి. వవ్రాజ. వ్రజితా. వ్రజిష్యతి. వ్రజతు. అవ్రజత్. వ్రజేత్. వ్రజ్యాత్.

సూ.—వదవ్రజహలన్తస్యాచః—౭-౨-౩.

వద-వ్రజ-హలన్తమునగునంగముయొక్క అచ్చునకుఁ బరస్మైపదపరకమగు సిచ్చు పరమగునపుడు వృద్ధియగును. ఇట వద-వ్రజ ధాతువులు హలంతములైనను. నిత్యముగా వృద్ధి వచ్చుటకై మరల గ్రహింపఁబడినవి.

ఉదా:—అవ్రాజీత్. అవ్రజిష్యత్. (౧౧) కటే=వర్షావరణయోః (వర్షించుట - ఆవరించుట) కటతి. చకాట. కటితా. కటిష్యతి. కటతు. అకటత్. కటేత్. కట్యాత్.

సూ.—హ్మ్యన్తక్షణశ్వసజాగృణిశ్వ్యేదితామ్—౭-౨-౫.

హకారమకారయకారాంతధాతువులకును, క్షణు-శ్వస-జాగృ-శ్వి ధాతువులకును, ణ్యంతధాతువులకును, ఏకారమిత్సం

జ్ఞగాఁగలధాతువులకును ఇడాదియగు సిచ్చు పరమగునపుడు వృద్ధి రాదు.

ఉదా:—అకటీత్. అకటిష్యత్. (౧౨) గుపూ=రక్షణే (రక్షించుట.)

సూ.—గుపూధూపవిచ్ఛిపణిపనిభ్య ఆయః—3-౧-౨౮.

గుపూ-ధూప-విచ్ఛ-పణ-పన ధాతువులకంటెఁ బరముగా స్వార్థమున ఆయ-యను ప్రత్యయ మగును.

సూ.—సనాద్యన్తా ధాతవః—3-౧-3౨.

సన్-క్యచ్-కామ్యచ్-క్యజ్-క్యష్-క్విప్(ఆచారార్థకము) ణిచ్-యజ్-యక్-ఆయ-ఈయజ్ - ణిజ్ అను పండ్రెండుప్రత్యయము లంతమునఁ గలవి ధాతువులనఁబడును. కాన లడాదు లగును.

ఉదా:—గుప్+ఆయ గుణము-గోపాయ+అ+తి గోపాయ+తి=గోపాయతి.

సూ.—ఆయాదయ ఆర్ధధాతుకే వా—3-౧-3౧.

ఆర్ధధాతుకము వివక్షిత మగునపుడు ఆయ-ఈయజ్-ణిజ్ ప్రత్యయములు వికల్పముగా నగును.

కాస్యనేకా చ ఆమ్వక్తవ్యః—(వా)

కాసృధాతువుకంటెను, అనేకాచ్కధాతువుకంటెను లిట్టు పరమగునపుడు ఆమ్-అను ప్రత్యయ మగును. ఆస-కాసృ ధాతువులకు-ఆమ్విధానసామర్థ్యము చేత, ఆమ్ములోని మకార

మున కిత్సంజ్ఞ లేదు. (అనఁగా-ఆమ్ము మిత్తయినచో-ఆస-కాసృ-ధాతువులకు ఆమ్మును విధించుట వ్యర్థ మగుననుట.)

సూ.—అతో లోపః—౬-౪-౪౮.

ఆర్ధధాతుకోపదేశకాలమున హ్రస్వాకారాంతమగు నంగముయొక్క హ్రస్వాకారమునకు ఆర్ధధాతుకము పర మగుచో లోపమగును.

సూ.—ఆమః—౨-౪-౮౧.

ఆమ్ముకంటెఁ బరమగుదానికి లుక్కగును.

సూ.—కృఞ్చానుప్రయుజ్యతే లిటి—3-౧-౪౦.

ఆమంతముకంటెఁ బరముగా లిట్పరకములగు - కృఞ్-భూ-అస ధాతువు లనుప్రయుక్తంబగును.

ఉదా:—గోపాయ+ఆమ్ - ల్ గోపాయ్+ఆమ్+ల్ గోపాయ్+ఆమ్=గోపాయామ్+కృ+ల్ (లిట్) గోపాయామ్+కృ+అ ద్విత్వముకంటెఁ బరమగుటచే వృద్ధి ప్రాప్తింపఁగా,

సూ.—ద్వివచనేఽచి—౧-౧-౫౯.

ద్విత్వము చేయఁబోవునపుడు ద్విత్వమునకు నిమిత్త మగు అచ్చు పరమగుచో, అచ్చున కాదేశము రాదు. అను ప్రయుక్తము లగు ధాతువులకు ద్విత్వాదికంబు.

ఉదా:—గోపాయామ్+కృ+కృ+అ అనియుండఁగా,

సూ.—ఉరత్—౭-౪-౬౬.

అభ్యాసమునందలి ఋవర్ణమునకుఁ బ్రత్యయము పరమగునపుడు హ్రస్వాకార మాదేశమగును.

ఉదా:—గోపాయామ్+కర్+కృ + అ చుత్వాదికము-ఉత్తరఖండమున వృద్ధి = గోపాయాంచకార - ద్విత్వముకంటె యణాదేశము పరమైనను "ద్విర్వచనేఽచి" యనుదానిచే ద్విత్వమే ముందుగా నగును. గోపాయాంచక్రతుః.

సూ.—ఏకాచ ఉపదేశేఽనుదాత్తాత్—౭-౨-౧౦.

ఉపదేశకాలమున నేకాచ్కమును, అనుదాత్తము నగు ధాతువుకంటెఁ బరమగువలాద్యార్ధధాతుకమునకు ఇడాగమము రాదు.

ఊకారాంత (భూ-లూ) ములును, ౠకారాంత (కౄ-తౄ) ధాతువులును, యు (మిశ్రణార్థకము) రు (శబ్దార్థకము) రుజ్ (గతిరేషణార్థకము) క్ష్ణు (తేజనార్థకము) శీజ్ (స్వప్నార్థకము) ష్ణు (ప్రస్రవణార్థకము) ణు (స్తుత్యర్థకము) టుక్షు (శబ్దార్థకము) టుఓశ్వి (గతివృద్ధ్యర్థకము) డీజ్ (విహాయోగమనార్థకము) శ్రిఞ్ (సేవార్థకము) వృజ్ (సంభక్త్యర్థకము)వృఞ్ (వరణార్థకము) ఈధాతువులుగాక తక్కినయేకాచ్కములగు అజంతధాతువు లన్నియును అనుదాత్తము లనఁబడును.

కకారాంతములయందు - శక్ల (సామర్థ్యార్థకము). ఒకటియు, చకారాంతములలో-డుపచష్(పాకార్థకము)పచి(వ్యక్తి

కరణార్థకము) ముచ్ఛ (మోక్షణార్థకంబు) రిచిర్ (విరేచనార్థకము) రిచ (వియోజనసంపర్చనార్థకము) వచ (పరిభాషణార్థకంబు) వచి (బ్రూఞ్ ధాతువునకాదేశమగునది) విచిర్ (పృథగ్భావార్థకము) షిచ (క్షరణార్థకము). అనునీయాఱును, ఛకారాంతములయందు- ప్రచ్ఛ (జ్ఞీప్సార్థకంబు) ధాతువొకటియు, జకారాంతములలో త్యజ (హానార్థకము) ణిజిర్ (శౌచపోషణార్థకంబు) భజ (సేవార్థకము) భఞ్జో (ఆమర్దనార్థకము) భుజ (పాలనాభ్యవహారార్థకము) భుజో (కౌటిల్యార్థకము) భ్రస్జ(పాకార్థకంబు)టుమస్జో (శుద్ధ్యర్థకము)యజ(దేవపూజాద్యర్థకము) యుజిర్(యోగార్థకము)యుజ (సమాధ్యర్థకము) రుజో (భంగార్థకంబు) విజిర్ (పృథగ్భావార్థకంబు) షఞ్జ-(సంగార్థకము) సృజ(విసర్గార్థకము.) అనునవి పదునైదును, దకారాంతధాతువులయందు-అద (భక్షణార్థకము) క్షుదిర్ (సంపేషణార్థకము) ఖిద(దైన్యార్థకము) ఛిదిర్ (ద్వైధీకరణార్థకము) తుద (వ్యథనార్థకంబు)ణుద(ప్రేరణార్థకము)పద (గత్యర్థకము)భిదిర్ (విదారణార్థకంబు)విద (సత్తార్థకము)విద (విచారణార్థకము:)విద్ల(లాభార్థకంబు)శద్ల(శాతనార్థకంబు) షద్ల(విశరణాద్యర్థకము) ఞిష్విదా (గాత్రప్రక్షరణార్థకము)స్కందిర్ (గతిశోషణార్థకము) హద (పురీషోత్సర్గార్థకంబు) అనునీపదునాఱును, ధకారాంతములలో పల- క్రుధ (క్రోధార్థకము)క్షుధ (బుభుక్షార్థకంబు)బుధ (అవగమనార్థకము) బన్ధ(బన్ధనార్థకము)యుధ (సంప్రహారార్థకంబు)రుధిర్ (ఆవరణార్థకము) అను+రుధ (కామార్థకము) రాధ (సంసిద్ధ్యర్థ

కము)వ్యధ(తాడనార్థకంబు)శుధ (శౌచార్థకంబు) సాధ(సంసిద్ధ్యర్థకము)షిధూ(సంరాద్ధ్యర్థకంబు) ఈపదునొకండును,నకారాంతములలో-మన(జ్ఞానార్థకము)హన (హింసాగత్యర్థకము)అనునవి రెండును, పకారాంతంబులయందు-ఆప్ల (వ్యాప్త్యర్థకము) క్షిప (ప్రేరణార్థకము) ఛుప (స్పర్శార్థకంబు) తప (సంతాపార్థకంబు) తప-(ఐశ్వర్యార్థకము) తప (దాహార్థకము) ణిజభావపక్షమున తిప్ప(క్షరణార్థకము) తృప(ప్రీణనార్థకము) దృప (హర్షవిమోచనార్థకంబు)లిప(ఉపదేహార్థకము)లుప(ఛేదనార్థకము) డువప్(బీజసంతానార్థకము) శప (ఉపాలంభార్థకంబు) ఞిష్వప్ (శయనార్థకంబు)సృప్ల (గత్యర్థకము) అనునీపదుమూఁడును, భకారాంత ధాతువులలో-యభ (మైథునార్థకము) రభ (రాభస్యార్థకము) డులభష్(ప్రాప్త్యర్థకము.) ఈమూఁడును,మకారాంతములందు-గమ్లు (గత్యర్థకము) ణమ-(శబ్దప్రహ్వత్వార్థకంబు) యమ (ఉపరమార్థకంబు)రమ (క్రీడార్థకము.) అనునీనాల్గును, శకారాంతములలోపల-క్రుశ(ఆహ్వాన-రోదనార్థకంబు)దంశ(దశనార్థకము) దిశ (అతిసర్జనార్థకము)దృశిర్ (ప్రేక్షణార్థకము)మృశ (ఆమర్శనార్థకము)రిశ-రుశ(హింసార్థకంబులు)లిశ (అల్పీభావార్థకంబు) లిశ (గత్యర్థకము)విశ (ప్రవేశార్థకంబు) స్పృశ (సంస్పర్శనార్థకంబు)-ఈపదియును, షకారాంతములయందు-కృష (విలేఖనార్థకము)త్విష (దీప్త్యర్థకము)తుష (తుష్ట్యర్థకము)ద్విష (అప్రీత్యర్థకము) దుష(వైకృత్యార్థకము)పుష (పుష్ట్యర్థకంబు) పిష్ల (సంచూర్ణనార్థకంబు)విష్ల (వ్యాప్త్యర్థకంబు) శిష (విశేషణార్థ

కంబు)శుష (శోషణార్థకంబు)శ్లిష (ఆలింగనార్థకము.) అను పదునొకండును, సకారాంతములలో-ఘస్ల (అదనార్థకంబు)వస (నివాసార్థకము) అనునవి రెండును, హకారాంతములయందు -దహ (భస్మీకరణార్థకంబు)దిహ (ఉపచయార్థకంబు)దుహ (ప్రపూరణార్థకము)ణహ (బంధనార్థకము) మిహ (సేచనార్థకము) రుహ (బీజజన్మార్థకము-ప్రాదుర్భావార్థకము) లిహ (ఆస్వాదార్థకంబు)వహ (ప్రాపణార్థకము) అను నీయెనిమిదియును గలిసి మొత్తము హలంతధాతువులు నూటమూఁడును అనుదాత్తములు నాఁబడును.

ఉదా:—గోపాయాంచకర్థ - గోపాయాం చక్రథుః - గోపాయాంచక్ర, గోపాయాంచకార-గోపాయాంచకర-గోపాయాంచకృవ-గోపాయాంచకృమ. గోపాయాంబభూవ. గోపాయామాస. జుగోప-జుగుపతుః-జుగుపుః.

సూ.—స్వరతిసూతిసూయతిధూఞూదితోవా—౭-౨-౪౪.

స్వృ-షూజ్. - (ఆదాదికము - దైవాదికము) ధూఞ్ ధాతువులకంటెను, ఊకారమిత్సంజ్ఞగాఁ గలధాతువులకంటెను బరమగు వలాద్యార్ధధాతుకమునకు ఇడాగమము వికల్పముగా నగును.

ఉదా:—జుగోపిథ పక్షంబున-జుగోప్థ. గోపాయితా - గోపితా-గోప్తా. గోపాయిష్యతి - గోపిష్యతి-గోప్స్యతి. గోపాయతు. అగోపాయత్. గోపాయేత్. గోపాయ్యాత్. గుప్యాత్. అగోపాయీత్.

సూ.—నేటి—౭-౨-౪.

హలంత ధాతువునకు ఇడాదియగు సిచ్చు పరమగుచో వృద్ధి రాదు.

ఉదా:—అగోపీత్-అగౌప్సీత్.

సూ.—ఝలో ఝలి—౮-౨-౨౬.

ఝల్లుకంటెఁ బరమగుసకారమునకు ఝల్లు పరమగుచో లోపమగును.

ఉదా:—అగౌప్తామ్-అగౌప్సుః, అగౌప్సీః-అగౌప్తమ్-అగౌప్త, అగౌప్సమ్-అగౌప్స్వ- అగౌప్స్మ. అగోపాయిష్యత్-అగోపిష్యత్-అగోప్స్యత్. (౧౩) క్షి=క్షయే (క్షీణించుట.)

ఉదా:—క్షయతి. చిక్షాయ-చిక్షియతుః - చిక్షియుః, చిక్షియ్+థ ఇట ఏకాచఉపదేశేఽనుదాత్తాత్తనుసూత్రముచేత నిట్టునకు నిషేధము ప్రాప్తింపఁగా,

సూ.—కృసృభృవృస్తుద్రుస్రుశ్రువో లిటి—౭-౨-౧౩.

డుకృఞ్-కృఞ్-సృ - డుభృఞ్-భృఞ్-వృఞ్ - వృఞ్-ష్టుఞ్-ద్రు-స్రు-శ్రు అనునీధాతువులకంటెఁ బరమగునపుడే లిట్టున కిడాగమము రాదు గాన నితరధాతువులు అనిట్టులైనను నిడాగమము వచ్చును.

సూ.—అచస్తాస్వత్థల్యనిటో నిత్యమ్—౭-౨-౬౧.

ఉపదేశకాలమున నజంతమును, తాస్ ప్రత్యయమందు నిత్యముగా నిట్టులేనిదియు నగుధాతువుకంటెఁ బరమగు థల్లునకు ఇడాగమము రాదు.

సూ.—ఉపదేశేఽత్వతః—౭-౨-౬౨.

ఉపదేశకాలమున హ్రస్వాకారము కలదియు, తాస్సునందు నిత్యముగా నిడాగమరహితము నగుధాతువుకంటెఁ బరమగు థల్లునకు నిడాగమము రాదు.

సూ.—ఋతో భారద్వాజస్య—౭-౨-౬౩.

తాస్సునందు నిత్యముగా నిడాగమరహితంబగు ధాతువు హ్రస్వఋకారాంత మగునపుడే థల్లునకు భారద్వాజునిమతమున నిడాగమము రాదు. తక్కినధాతువు లన్నిటికంటెను బరమగుథల్లునకిడాగమ మగును. ఇట నియ్యది సంగ్రహంబు. తాస్సునందు నిత్యానిట్టగుధాతువు అజంతముగాని హ్రస్వాకారము కలదిగాని యగుచో థల్లునం దిడాగమము వికల్పముగానగును. తాస్సునందు నిత్యముగాన నిట్టగుధాతువు హ్రస్వఋకారాంత మగుచో థల్లునం దందఱిమతంబునను నిడాగమము రాదు. వెనుకఁ జెప్పిన-కృ మున్నగుధాతువులు లిట్టునందిడాగమంబు నొందవు. ఈయెనిమిదియును గాక తక్కిన ధాతువులన్నియు లిట్టునందు సేట్టు లగును.

ఉదా:—చిక్షయిథ - చిక్షేథ-చిక్షియథుః - చిక్షియ, చిక్షాయ-చిక్షయ - చిక్షియివ-చిక్షియిమ. క్షేతా. క్షేష్యతి. క్షయతు అక్షయత్. క్షయేత్.

సూ.—అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః—౭-౪-౨౫.

అజంతాంగంబునకు యకారమాదియందుఁగల ప్రత్యయము పరమగుచో దీర్ఘమగును. ఆయకారాదిప్రత్యయము కృత్తుగాని సార్వధాతుకముగాని యైనచో రాదు.

ఉదా:—క్షీయాత్.

సూ.—సిచి వృద్ధిః పరస్మైపదేషు—౭-౨-౧.

ఇగన్తాంగమునకుఁ బరస్మైపదము పరముగాఁ గలసిచ్చు పరమగుచో వృద్ధియగును.

ఉదా:—అక్షైషీత్. అక్షేష్యత్.

(౧౪) తప=సంతాపే (తపించుట.)

ఉదా:—తపతి. తతాప - తేపతుః-తేపుః, తేపిథ-తతప్థ. తప్తా. తప్స్యతి. తపతు. అతపత్. తపేత్. తప్యాత్. అతాప్సీత్-అతాప్తామ్. అతప్స్యత్.

(౧౫) క్రము=పాదవిక్షేపే (నడచుట.)

సూ.—వా భ్రాశభ్లాశభ్రముక్రముక్లముత్రసిత్రుటిలషః ౩-౧-౭౦.

భ్రాశృ-భ్లాశృ-భ్రము-క్రము - క్లము-త్రసీ-త్రుట-లష ధాతువులకంతెఁ గర్తృసార్వధాతుకము పరమగునపుడు శ్యన్

(య్) అను ప్రత్యయము వికల్పముగానగును, పక్షమున శప్ప గును.

సూ.—క్రమః పరస్మైపదేషు—౭-3-౭౬.

క్రముధాతువుయొక్క యచ్చునకుఁ బరస్మైపదము పరముగాఁగలశిత్తు పరమగునపుడు దీర్ఘమగును.

ఉదా:—క్రామ్యతి శ్యన్ను రానిపక్షమున - క్రామతి. చక్రామ. క్రమితా. క్రమిష్యతి. క్రామ్యతు - క్రామతు. అక్రామ్యత్-అక్రామత్. క్రామ్యేత్ - క్రామేత్. క్రమ్యాత్. అక్రమీత్. అక్రమిష్యత్.

(౧౬) పా=పానే (త్రాగుట.)

సూ.—పాఘ్రాధ్మాస్థామ్నాదాణ్దృశ్యర్తిసర్తిశదసదాం, పిబజిఘ్రధమతిష్ఠమనయచ్ఛపశ్యర్ఛధౌశీయసీదాః-
౭-3-౭౮.

ఇత్సంజ్ఞకమగు శవర్ణమాదియందుఁ గలప్రత్యయము పరమగుచో, పా-ఘ్రా-ధ్మా-స్థా-మ్నా-దాణ్-దృశిర్-ఋ-సృ-శద్ల - షద్ల అనునీపదునొకండుధాతువులకును వరుసగా పిబ-జిఘ్ర-ధమ్-తిష్ఠ్-మన్ - యచ్ఛ్-పశ్య్- ఋచ్ఛ్-ధౌ-శీయ్-సీద్ అనుపదునొకండాదేశములగును.

పిబ-అనునది యదంతమగుటచే లఘూపధము కానందున గుణము రాదు.

ఉదా:—పిబతి.

సూ.—ఆత ఔ ణలః—౭-౧-౩౪.

ఆకారాంతమగుధాతువుకంటెఁ బరమగుణల్లునకు ఔకారం బాదేశంబగును.

ఉదా:—పపా+అ పపా+ఔ=పపౌ.

సూ.—ఆతో లోప ఇటి చ—౬-౪-౬౪.

అజాదులును ఆర్ధధాతుకములు నగు కిత్తుజిత్తులుగాని, ఇట్టుగాని పరమగుచో ఆకారమునకు లోపమగును.

ఉదా:—పపా+అతుస్ పప్+అతుస్ = పపతుః-పపుః, పపిథ-పపాథ-పపథుః-పప, పపౌ-పపివ-పపిమ. పాతా. పాస్యతి. పిబతు. అపిబత్. పిబేత్.

సూ.—ఏర్లిఙి—౬-౪-౬౭.

దాణ్-దాణ్-దో-దేజ్-ధాఞ్-ధేట్-మా-స్థా-గై-పా (పానార్థకము) ఓహాక్-షో ధాతువులకు ఆర్ధధాతుకము, కిత్తునగులిఙ్గు పరమగునపుడు ఏకారమాదేశమగును.

ఉదా:—పా+యాత్ పే+యాత్=పేయాత్-గాతిస్థా యనుసూత్రముచే సిచ్చునకు లుక్కు. అపాత్-అపాతామ్.

సూ.—ఆతః—౩-౪-౧౧౦.

సిచ్చునకు లుక్కు వచ్చినపుడు ధాతువు ఆకారాంతమగునపుడే ఝిప్రత్యయమునకు జుస్ (ఉస్) అను ఆదేశమగును.

సూ.—ఉస్యపదాన్తాత్—౬-౧-౯౬.

పదాంతముగాని అవర్ణముకంటె ఉస్సు పరమగుచోఁ బరరూప మేకాదేశంబగును

ఉదా:—అపా+ఉస్ అప్+ఉస్ = అపుః, అపాస్యత్.

(౧౭) గ్లై - మ్లై=హర్షక్షయే (వాడిపోవుట) హర్షక్షయమన ధాతుక్షయము.

ఉదా:—గ్లాయతి.

సూ.—ఆదేచ ఉపదేశేఽశితి—౬-౧-౪౫.

ఉపదేశమున. ఏజంతమగుధాతువునకు ఆత్వమగును, శిత్తుపరమగుచోఁ గాదు.

ఉదా:—జగ్లౌ. గ్లాతా. గ్లాస్యతి. గ్లాయతు. అగ్లాయత్. గ్లాయేత్.

సూ.—వాన్యస్య సంయోగాదేః—౬-౪-౬౮.

ఏర్లిజి యనుసూత్రమునఁ జెప్పఁబడినధాతువులు గాక తక్కినసంయోగ మాదియందుఁ గలధాతువులయొక్క ఆ కారమునకు కిత్తును, నార్ధధాతుకము నగులిఙ్లు పరమగునపుడు ఏత్వము వికల్పముగానగును.

ఉదా:—గ్లేయాత్-గ్లాయాత్.

సూ.—యమరమనమాతాం సక్చ—౭-౨-౭౩.

యమ-రమ-ణమ-ధాతువులకును, ఆకారాంతధాతువులకును సక్ (స్) అనునాగమమును, ఈధాతువులకంటెఁ బరమగు సిచ్చునకుఁ బరస్మైపదము పరమగునపుడు ఇడాగమమునగును.

ఉదా:—అగ్లా+స్+ఈత్ అగ్లాస్+స్+ఈత్ అగ్లాస్+ఇస్+ఈత్ అగ్లాస్+ఇ+ఈత్ సవర్ణదీర్ఘము-అగ్లాసీత్ - అగ్లాసిష్టామ్. అగ్లాస్యత్. ఇట్లే మ్లాయతి మున్నగునవి.

(౧౮) హ్వృ=కౌటిల్యే (కుటిలత్వము)

ఉదా:—హ్వరతి.

సూ.—ఋతశ్చ సంయోగాదేర్గుణః—౭-౪-౧౦

హ్రస్వఋకారాంతమును, సంయోగమాదియందుఁగలదియు నగునంగమునకు లిట్టు పరమగుచో గుణమగును.

ఉదా:—జహ్వృ+అ జహ్వర్+అ ఉపధావృద్ధి-జహ్వార్+అ=జహ్వార-జహ్వరతుః-జహ్వరుః, జహ్వర్థ - జహ్వరథుః - జహ్వర, జహ్వార-జహ్వర-జహ్వరివ-జహ్వరిమ. హ్వర్తా.

సూ.—ఋద్ధనోః స్యే—౭-౨-౭౦.

హ్రస్వఋకారాంతధాతువుకంటెను, హనధాతువుకంటెను బరమగు-స్య అను ప్రత్యయమునకు ఇడాగమమగును.

ఉదా:—హ్వరిష్యతి. హ్వరతు. అహ్వరత్. హ్వరేత్.

సూ.—గుణోఽర్తిసంయోగాద్యోః—౭-౪-౨౯.

ఋధాతువునకును, సంయోగాదియగు ఋదంతధాతువునకును యక్ప్రత్యయముగాని, యకారాదియగు ఆర్ధధాతుకలిఙ్గుగాని పరమగునపుడు గుణమగును.

ఉదా:—హ్వర్యాత్. అహ్వార్షీత్. అహ్వరిష్యత్.

(౧౯) శ్రు=శ్రవణే (వినుట)

సూ.—శ్రువః శృచ—3-౧-౭౪.

శ్రు ధాతువునకుఁ గర్త్రర్థకసార్వధాతుకము పరమగుచో శృ-అనునాదేశమును, శ్ను (ను) ప్రత్యయమునగును. శప్పున కపవాదము.

సూ.—సార్వధాతుకమపిత్—౧-౨-౪.

పకారేత్సంజ్ఞకముగాని సార్వధాతుకము ఙిత్తువంటి దగును.

ఉదా:—శ్రు+తి శృ+ను+తి శృ+నో+తి ణత్వము = శృణోతి-శృణుతః.

సూ.—హుశ్నువోస్సార్వధాతుకే—౬-౪-౮౭.

హు ధాతువుయొక్క ఉకారంబునకును, శ్నుప్రత్యయాంతమును అనేకాచ్కము నగునఁగముయొక్క సంయోగ పూర్వకముగాని ఉకారమునకును అజాదిసార్వధాతుకము పరమగునపుడు యణ్ణగును.

ఉదా:—శృను+అన్తి శృన్వ్+అన్తి=శృణ్వన్తి, శృణోషి-శృణుథః-శృణుథ, శృణోమి-శృణు+వస్.

సూ.—లోపశ్చాస్యాన్యతరస్యాం మ్వోః—౬-౪-౧౦౭.

సంయోగము పూర్వమున లేనిప్రత్యయోకారమునకు మకారముగాని,వకారముగాని పరమగునపుడు లోపము వికల్పముగానగును.

ఉదా:—శృణ్వః - శృణువః-శృణ్మః-శృణుమః. శుశ్రావ-శుశ్రువతుః-శుశ్రువుః, శుశ్రోథ-శుశ్రువథుః-శుశ్రువ, శుశ్రావ-శుశ్రవ-శుశ్రువ-శుశ్రుమ. శ్రోతా. శ్రోష్యతి:శృణోతు-శృణుతాత్-శృణుతామ్-శృణ్వన్తు.

## సూ.—ఉతశ్చ ప్రత్యయాదసంయోగపూర్వాత్—౬-౪-౧౦౬.

సంయోగపూర్వకముగాని ప్రత్యయోకారముకంటె బరమగు-హి అనుప్రత్యయమునకు లుక్కగును.

ఉదా:—శృణు-శృణుతాత్-శృణుతమ్-శృణుత, శృణు+ఆని గుణావాదేశములు = శృణవాని-శృణవావ - శృణవామ. అశృణోత్-అశృణుతామ్-అశృణ్వన్, అశృణోః-అశృణుతమ్ - అశృణుత, అశృణవమ్. అశృణ్వ - అశృణువ-అశృణ్మ-అశృణుమ. శృణుయాత్-శృణుయాతామ్ - శృణుయుః, శృణుయాః-శృణుయాతమ్, శృణుయాత. శృణుయామ్-శృణుయావ-శృణుయామ. శ్రూయాత్. అశ్రౌషీత్. అశ్రోష్యత్.

(౨౦) గమ్లు=గతౌ (వెళ్లుట).

## సూ.—ఇషుగమియమాం ఛః—౭-౩-౭౭.

ఇషు-గమ్లు-యమ ధాతువులకు శిత్తు పరమగుచో ఛకారమాదేశమగును.

ఉదా:—గమ్+అ+తి గఛ్+అ+తి తుగాగమంబు-గచ్ఛ+అ+తి=గచ్ఛతి. జగామ.

సూ.—గమహనజనఖనఘసాం లోపః క్ఙిత్యనజి-
౬-౪-౯౮.

గమ్లు-హన-జనీ-ఖను-ఘస్లృ ధాతువులయొక్క యుపధకు అజాదియగు కిత్తుగాని, ఙిత్తుగాని పరమగునపుడు లోపమగును. అజ్ ప్రత్యయము పరమగునపుడు రాదు.

ఉదా:—జగమ్+అతుస్ జగ్మ్+అతుస్=జగ్మతుః-జగ్ముః, జగమిథ-జగన్థ - జగ్మథుః-జగ్మ, జగామ-జగమ-జగ్మివ - జగ్మిమః గన్తా.

సూ.—గమేరిట్పరస్మైపదేషు—౭-౨-౫౮.

గమ్లు ధాతువుకంటెఁ బరమగు సకారాదియైన యార్ధధాతుకమునకుఁ బరస్మైపదములు పరమగునపుడు ఇడాగమమగును.

ఉదా:—గమిష్యతి. గచ్ఛతు. అగచ్ఛత్. గచ్ఛేత్. గమ్యాత్.

సూ.—పుషాదిద్యుతాద్యౢదితః పరస్మైపదేషు—3-౧-౫౫

శ్యన్వికరణములగు - పుష మున్నగు ధాతువులకంటెను, ద్యుత మొదలగు ధాతువులకంటెను, ఌకారమిత్సంజ్ఞగాఁ గల ధాతువులకంటెను బరమగు చ్లి ప్రత్యయమునకు అఙ్(అ) అనునాదేశమగును. అనజి యనుటచేత నుపధా లోపము రాదు.

ఉదా:—అగమత్. అగమిష్యత్.

ఇవి పరస్మైపదులు.

## ఆత్మనేపది ధాతువులు.

(౧) ఏధ=వృద్ధౌ (వర్ధిల్లుట) ఇయ్యది యనుదాత్త మిత్సంజ్ఞకముగాఁ గలది.

### సూ.—టిత ఆత్మనేపదానాం టేరే—3-౪-౭౯.

టిత్తులగు లకారముల కాదేశమగునాత్మనే పదముల యొక్క టిసంజ్ఞకమునకు ఏకారమగును.

ఉదా:—ఏధ్+అ+త ఏధ్+అ+తే=ఏధతే.

### సూ.—ఆతో ఙితః—౭-౨-౮౧.

హ్రస్వాకారముకంటెఁ బరమగు ఙిత్తుయొక్క ఆకారమునకు ఇయ్ అనునాదేశమగును.

ఉదా:—ఏధ+ఆతామ్ ఏధ+ఇయ్+తామ్ యకారలోపము-ఏధ+ఇతామ్ ఏకారాము-ఏధ+ఇతే గుణము=ఏధేతే-ఏధన్తే.

### సూ.—థాసస్సే—3-౪-౮౦.

టిత్తగు లకారమున కాదేశమగు థాస్ ప్రత్యయమునకు సే అనునాదేశమగును.

ఉదా:—ఏధసే-ఏధేథే-ఏధధ్వే, ఏధ+ఏ పరరూపము = ఏధే-ఏధావహే-ఏధామహే.

సూ.—ఇజాదేశ్చ గురుమతో౽నృచ్ఛః—3-౧-3౬.

లిట్టు పరమగునపుడు ఇజాదియు గురుమంతంబును; బుచ్ఛ ధాతుభిన్నంబు నగు ధాతువుకంటెఁ బరముగా ఆమ్ అను ప్రత్యయ మగును.

సూ.—ఆమ్ప్రత్యయవత్కృఞో౽నుప్రయోగస్య-
౧-3-౬3.

(ఆమ్ ప్రత్యయము దేనికంటెఁ జేయఁబడునో యాప్రకృతి ఆమ్ప్రత్యయ మనఁబడును. ఇది యతద్గుణసంవిజ్ఞానబహువ్రీహిసమాసము. చిత్రములగు గోవులుకలవానిని దోడితెమ్మనునపుడు గోవుల కానయనమునం దన్వయము లేనట్లు,ఇటఁ బ్రత్యయమును విడిచి ప్రకృతిమాత్రమే గ్రహింపఁబడును. క్రియలో నవయవపదార్థముల నన్వయింపకపోవుటయే యతద్గుణసంవిజ్ఞానము.) ఆమ్మయొక్క ప్రకృతికివలెనే యనుప్రయుజ్యమానంబగు కృఞ్ ధాతువునకును బరముగా నాత్మనేపదమగును.

సూ.—లిటస్తఝయోరేశిరేచ్—3-౪-౮౧.

లిడాదేశములగు-త-ఝ అనుప్రత్యయములకు వరుసగా ఏశ్ (ఏ)ఇరేచ్ (ఇరే) అనునాదేశము లగును.

ఉదా:—ఏధాంచకృ+త ఏధాంచకృ+ఏ=ఏధాంచక్రే-ఏధాంచక్రాతే ఏధాంచకృ+ఝ ఏధాంచకృ+ఇరే = ఏధాంచక్రిరే,ఏధాంచకృషే-ఏధాంచక్రాథే.

సూ.—ఇణష్షీధ్వం లుఙ్లిటాం ధోఽఙ్గాత్—౮-౩-౭౮.

ఇణ్ణంతాంగముకంటె బరమగు-షీధ్వమ్-లుఙ్ - లిట్టుల యొక్క- ధకారమునకు మూర్ధన్యము (ఢ)ఆదేశమగును.

ఉదా:—ఏధాంచకృఢ్వే, ఏధాంచక్రే - ఏధాంచకృవహే-ఏధాంచకృమహే. ఏధాంబభూవ. ఏధామాస.ఏధితా-ఏధితారౌ-ఏధితారః.

ఏశ్ - ఇరేచ్-సే యనిపాణిని ఏకారసహితముగ నుచ్చరించుటచే నాత్మనేపదముల కాదేశములగువాని టిసంజ్ఞకమునకు నేత్వము రాదు.

ఉదా:—ఏధితాసే-ఏధితాసాథే

సూ.—ధి చ—౮-౨-౨౫.

ధకారాదిప్రత్యయము పరమగునపుడు సకారమునకు లోపమగును.

ఉదా:—ఏధితాధ్వే.

సూ.—హ ఏతి—౭-౪-౫౨.

తాస్ప్రత్యయముయొక్కయు, అసధాతువుయొక్కయు సకారమునకు ఏకారము పరమగునపుడు హకారమగును.

ఉదా:—ఏధితాస్+ఏ ఏధితాహ్+ఏ=ఏధితాహే-ఏధితాస్వహే-ఏధితాస్మహే.ఏధిష్యతే-ఏధిష్యేతే-ఏధిష్యన్తే,ఏధిష్యసే-ఏధిష్యేథే-ఏధిష్యధ్వే,ఏధిష్యే-ఏధిష్యావహే-ఏధిష్యామహే.

సూ.—ఆమేతః—3-౪-౯౦.

లోట్టుయొక్క ఏకారమునకు ఆమ్ అనునాదేశమగును.

ఉదా:—ఏధ+తే ఏధ+తామ్ = ఏధతామ్-ఏధేతామ్-ఏధన్తామ్.

సూ.—సవాభ్యాం వామౌ—3-౪-౯౧.

సకారవకారములకంటెఁ బరమగులోట్టుయొక్క ఏకారమునకు వరుసగా వ-అమ్ అనునాదేశము లగును.

ఉదా:—ఏధ+సే ఏధ+స్వ = ఏధస్వ-ఏధేథామ్-ఏధ + ధ్వే ఏధ+ధ్వమ్=ఏధధ్వమ్.

సూ.—ఏత ఐ—3-౪-౯3.

లోడుత్తమపురుషముయొక్క ఏకారమునకు ఐకారమగును.

ఉదా:—ఏధ+ఏ ఏధ+ఐ = ఏధై-ఏధావహై - ఏధామహై. ఆ+ఏధత "ఆటశ్చ" యనుసూత్రముచేత వృద్ధి=ఐధత-ఐధేతామ్-ఐధన్త, ఐధథాః, ఐధేథామ్-ఐధధ్వమ్, ఐధే-ఐధావహి-ఐధామహి.

సూ.—లిఙస్సీయుట్—3-౪-౧౦౨.

లిఙాదేశమగునాత్మనేపదములకు సీయుట్ (సీయ్) అనునాగమ మగును.

ఉదా:— ఏధ+త ఏధ+సీయ్+త సకారయకారములకు లోపము-ఏధ+ఈ+త గుణము=ఏధేత-ఏధేయాతామ్.

సూ.—ఝస్య రన్—౩-౪-౧౦౫.

లిఙ్ఙుయొక్క ఝప్రత్యయమునకు రన్ అనునాదేశమగును.

ఉదా:—ఏధ+ఝ ఏధ+రన్ ఏధ+సీయ్‌రన్=ఏధేరన్, ఏధేథాః-ఏధేయాథామ్-ఏధేధ్వమ్.

సూ.—ఇటోఽత్—౩-౪-౧౦౬.

లిఙాదేశమగు-ఇట్టునకు అత్ (అ) అనునాదేశమగును.

ఉదా:—ఏధ+ఇ ఏధ+అ ఏధ+ఈయ్-అ=ఏధేయ-ఏధేవహి-ఏధేమహి.

సూ.—సుట్తిథోః—౩-౪-౧౦౭.

లిఙ్ఙుయొక్క తకారథకారములకు సుట్ (స్) అనునాగమ మగును.

ఉదా:—ఏధ్+త ఏధ్+సీయ్-త ఏధ్+సీయ్+స్+త ఏధ్+సీస్+త ఏధ్+ఇసీస్+త ఇది యార్ధధాతుకముగాన సలోపంబు లేదు. షత్వ ష్టుత్వములు. ఏధిషీష్ట-ఏధిషీయాస్తామ్-ఏధిషీరన్, ఏధిషీష్ఠాః-ఏధిషీయాస్థామ్ - ఏధిషీధ్వమ్, ఏధిషీయ-ఏధిషీవహి-ఏధిషీమహి. ఐధిష్ట-ఐధిషాతామ్.

సూ.—ఆత్మనేపదేష్వనతః—౭-౧-౫.

హ్రస్వాకారముకంటెఁ బరముకాని ఆత్మనేపదముల యొక్క ఝకారమునకు అత్ అనునాదేశమగును.

ఉదా:—ఐధ్+ఇస్+ఝ ఐధ్+ఇస్+అత్+అ షత్వము= ఐధిషత, ఐధిష్ఠాః - ఐధిషాథామ్-ఐధిఢ్వమ్, ఐధిషి-ఐధిష్వహి-ఐధిష్మహి. ఐధిష్యత-ఐధిష్యేతామ్-ఐధిష్యన్త,ఐధిష్యథాః, ఐధిష్యేథామ్-ఐధిష్యధ్వమ్, ఐధిష్యే-ఐధిష్యావహి-ఐధిష్యామహి.

(౨) కము=కాన్తౌ (కోరుట).

సూ.—కమేర్ణిఙ్—3-౧-30.

కముధాతువుకంటెఁ బరముగా స్వార్థమున ణిఙ్ (ఇ) అను ప్రత్యయమగును. ఇది ఙిత్తుగాన నాత్మనేపది యగును. "అతఉపధాయా"యను సూత్రముచేత విహితమగువృద్ధి ఇగ్లక్షణము గానందున "క్ఙితి చ" యనుసూత్రముచే నిషేధము లేదు.

ఉదా:—కమ్+ఇ కామి+అ+తే గుణము-అయాదేశము =కామయతే.

సూ.—అయామన్తాల్వాయ్యేత్న్విష్ణుషు—౬-౪-౫౫.

ఆమ్-అన్త - ఆలు - ఆయ్య - ఇత్ను-ఇష్ణు అనునీయాలు ప్రత్యయములు పరమగునపుడు ణిప్రత్యయమునకు అయ్ అను నాదేశమగును.

ఉదా:—కామి+ ఆమ్. కామ్+అయ్+ఆమ్ = కామయామ్. కామయాంచక్రే—"ఆయాదయ"యనుసూత్రముచేత ణిఙ్ఙు వికల్పముగానగును.

ఉదా:—చకమే-చకమాతే - చకమిరే, చకమిషే-చకమాథే-చకమిధ్వే, చకమే-చకమివహే-చకమిమహే. కామయితా-కామయితాసే, కమితా. కామయిష్యతే - కమిష్యతే. కామయతామ్. అకామయత. కామయేత. కామయిషీష్ట-కమిషీష్ట.

సూ.—ణిశ్రిద్రుస్రుభ్యః కర్తరి చఙ్—3-౧-౪౮.

ణిప్రత్యయాంతముకం బైను, శ్రిఞ్ - ద్రు-స్రు ధాతువులకం బైను బరమగు చ్లిప్రత్యయమునకుఁ గర్త్రర్థకమగు లుఙ్పరమగుచో చఙ్ (అ) అనునాదేశమగును.

ఉదా:—కామి+అ+త అనియుండ నిటయణ్ప్రాప్తింపఁగా,

సూ.—ణేరనిటి—౬-౪-౫౧.

ఇడాదిగాని యార్ధధాతుకము పరమగునపుడు ణిప్రత్యయమునకు లోపమగును. కాన యణ్ రాదు.

ఉదా:—కామ్+అ+త అని కాఁగా,

సూ.—ణౌ చఙ్యుపధాయా హ్రస్వః—౭-౪-౧.

చఙ్పరముగాఁగల ణిప్రత్యయము పరమగునపుడు అంగముయొక్క యుపధకు హ్రస్వమగును.

ఉదా:—కమ్+అ+త ఇట ణిప్రత్యయము లోపించినను "ప్రత్యయలోపే ప్రత్యయలక్షణ" మ్మనుదానిచేతఁ బ్రత్యయపరత్వ మూహించునది.

సూ.—చజి—౬-౧-౧౧.

చఙ్ఞు పరమగుచో నభ్యాససంజ్ఞకము లేనిధాతువున కవయవ మగునట్టియు, నేకాచ్కము నగు మొదటిఖండమున కును, అట్టిది యజాదిధాతువగునెడ రెండవఖండమునకును ద్విత్వమగును.

ఉదా:—కమ్+కమ్+అ+త చుత్వాదికము - చకమ్+అ+త.

సూ.—సన్వల్లఘుని చఙ్పరేఽనగ్లోపే—౭-౪-౯౩.

ఏయంగమునకు చఙ్పరకమగు ణిప్రత్యయము పరమ గునో, యట్టియంగముయొక్క లఘుపరకమగునభ్యాసమునకు ణిప్రత్యయనిమిత్తకమగు అగ్లోపము లేనపుడు సన్ అనుప్రత్య యము పరమగునపుడుంబోలెఁ గార్యమగును.

సూ.—సన్యతః—౭-౪-౭౯.

అభ్యాసముయొక్క హ్రస్వాకారమునకు సన్ప్రత్యయము పరమగునపుడు ఇకారమగును. ఇట సన్వద్భావముచేత నికా రము వచ్చి,

ఉదా:—చికమ్+అ+త అని సిద్ధింపఁగా,

సూ.—దీర్ఘో లఘోః—౭-౪-౯౪.

సన్వద్భావమునకు విషయమగుచుండఁగా, అభ్యాసము యొక్క లఘువునకు దీర్ఘమగును.

ఉదా:—చీకమ్+అ+త అడాగమము = అచీకమత-ణిజ్లు రానిపక్షమున,

కమేః ణ్లేశ్చఙ్వాక్తవ్యః—(వా)

కముథాతువుకంటెఁ బరమగు చ్లిప్రత్యయమునకు చఙ్ (అ) అను నాదేశమగును. ణిజ్లు రానందున సన్వద్భావమును, ఇత్వదీర్ఘములును లేవు.

ఉదా:—అచకమత. అకామయిష్యత-అకమిష్యత.

(3) అయ-గతౌ (వెళ్లుట.)

ఉదా:—అయతే.

సూ.—ఉపసర్గస్యాయతౌ—౮-౨-౧౯.

అయధాతువు పరముగాఁగల యుపసర్గనుయొక్క రేఫమునకు లకారమాదేశమగును.

ఉదా:—ప్లాయతే-పలాయతే.

సూ.—దయాయాసశ్చ—౩-౧-౩౭.

దయ-అయ-ఆస ధాతువులకంటె ఇట్టు పరమగునపుడు ఆమ్ అనుప్రత్యయ మగును.

ఉదా:—అయాంచక్రే. అయితా. అయిష్యతే. అయతామ్. ఆయత. అయేత. అయిషీష్ట.

సూ.—విభాషేటః—౮-౩-౭౯.

ఇణ్ణునకుఁ బరమైన యిట్టుకంటెఁ బరమగు-షీధ్వమ్-లుఙ్-లిట్టులయొక్క ధకారమునకు మూర్ధన్యము వికల్పముగానగును.

ఉదా:—అయిషీఢ్వమ్-అయిషీధ్వమ్. ఆయిష్ట, ఆయిఢ్వమ్-ఆయిధ్వమ్. ఆయిష్యత.

(౪) ద్యుత=దీప్తౌ (ప్రకాశించుట) ఉదా:—ద్యోతతే.

సూ.—ద్యుతిస్వాప్యోస్సమ్ప్రసారణమ్—౭-౪-౬౭.

ద్యుతధాతువుయొక్కయు, ణ్యంతమగు - ఞిష్వప్ ధాతువుయొక్కయు నభ్యాసమునకు సంప్రసారణ మగును.

ఉదా:—ద్యుద్యుత్+ఏ దిద్యుత్+ఏ=దిద్యుతే.

సూ.—ద్యుద్భ్యో లుఙి—౧-౩-౯౧.

ద్యుతాదులకంటెఁ బరమగులుఙ్లునకుఁ బరస్మైపదము వికల్పముగా నగును. "పుషాదిద్యుతాది" యనుసూత్రముచేఁ బరస్మైపదము పరమగునపుడు చ్లిప్రత్యయమునకు అఙాదేశము వచ్చును.

ఉదా:—అద్యుతత్. అద్యోతిష్ట. అద్యోతిష్యత. (౫) శ్వితా=వర్ణే. (౬) ఞిమిదా=స్నేహనే. (౭) ఞిష్విదా=స్నేహన మోచనయోః (౮) రుచ=దీప్తావభిప్రీతౌచ. (౯) ఘుట=పరివర్తనే (౧౦) శుభ=దీప్తౌ. (౧౧) క్షుభ=సంచలనే. (౧౨-౧౩) ణభ-తుభ=హింసాయామ్. (౧౪-౧౫-౧౬) స్రంసు-ధ్వంసు-భ్రంసు=అవస్రంసనే. ధ్వంసు = గతౌచ. లుఙ్లునం దఙ్లు పరమగునపుడు నకారలోపము.

ఉదా:—అస్రసత్. అస్రంసిష్ట.(౧౭) స్రమ్భు=విశ్వాసే. (౧౮)వృతు-వర్తనే (వర్తించుట) వర్తతే. వవృతే. వర్తితా.

సూ.—వృద్భ్యః స్యసనోః—౧-౩-౯౨.

స్య ప్రత్యయవిషయమునను, సన్ ప్రత్యయవిషయమునను వృతాదు లయిదింటికంటెఁ బరముగాఁ బరస్మైపదము వికల్పముగనగును.

సూ.—న వృద్భ్యశ్చతుర్భ్యః—౭-౨-౫౯.

వృతు - వృధు-శృధు - స్యన్దూ. అను నీనాల్గుధాతువుల కంటెను బరమగు సకారాద్యార్ధధాతుకమునకు తజానప్రత్యయములు లేనపుడు ఇడాగమము రాదు.

ఉదా:—వర్త్స్యతి, వర్తిష్యతే. వర్తతామ్. అవర్తత. వర్తేత. వర్తిషీష్ట. అవృతత్, అవర్తిష్ట. అవర్త్స్యత్. అవర్తిష్యత. ధాతుపాఠమునందలి ద్యుత మొదలుకొని కృపూ=సామర్థ్యే అనుదానివఱకును ద్యుతాదులని యెఱుంగునది.

(౧౯) దద=దానే (ఇచ్చుట) ఉదా:—దదతే.

సూ.—న శసదదవాదిగుణానామ్—౬-౪-౧౨౬.

శసు-దద ధాతువులయొక్కయు, వకారము మొదటఁగల ధాతువులయొక్కయు, గుణశబ్దము నుచ్చరించి విధింపఁబడిన దానియొక్కయు అకారమునకు ఏత్వము, నభ్యాసలోపమును రావు.

ఉదా:—దదదే-దదదాతే-దదదిరే. దదితా. దదిష్యతే. దదతామ్. అదదత. దదేత. దదిషీష్ట. అదదిష్ట. అదదిష్యత.

(౨౦) త్రపూష్=లజ్జాయామ్ (లజ్జించుట.)

ఉదా:—త్రపతే.

సూ.—తౄఫలభజత్రపశ్చ—౬-౪-౧౨౨.

తౄ-ఞిఫలా-ఫల - భజ-త్రపూష్ ధాతువులయొక్క-అకారమునకు కిత్తగు లిట్టుగాని, సేట్టగుథల్లుగాని పరమగు నపుడు ఏకారము, నభ్యాసమునకు లోపము నగును.

ఉదా:—త్రేపే. త్రపితా-త్రప్తా.త్రపిష్యతే,త్రప్స్యతే. త్రపతామ్. అత్రపత. త్రపేత. త్రపిషీష్ట,త్రప్సీష్ట. అత్రపిష్ట, అత్రప్త. అత్రపిష్యత, అత్రప్స్యత.

ఇవి యాత్మనేపదులు.

---

## అజన్తోభయపదులు.

(౧) శ్రిఞ్=సేవాయామ్-(సేవించుట) శ్రయతి,శ్రయతే శిశ్రాయ-శిశ్రియతుః, శిశ్రియే. శ్రయితా.శ్రయిష్యతి, శ్రయిష్యతే. శ్రయతు,శ్రయతామ్.అశ్రయత్, అశ్రయత.శ్రయేత్, శ్రయేత. శ్రీయాత్. శ్రయిషీష్ట. చఙ్పరమగునపుడు లఘూపధగుణముకంటె నంతరంగమగుటచేత ఇయఙాదేశము ముందుగావచ్చును. అశిశ్రియత్, అశిశ్రియత. అశ్రయిష్యత్, అశ్రయిష్యత.

(౨) భృఞ్=భరణే (భరించుట) భరతి, భరతే. బభార - బభ్రతుః-బభ్రుః, బభర్థ, బభృవ-బభృమ.బభ్రే, బభృషే, భర్తా, భర్తాసి, భర్తాసే. భరిష్యతి, భరిష్యతే. భరతు, భరతామ్. అభరత్, అభరత. భరేత్, భరేత.

సూ.—రిజ్ శయగ్లిఙ్క్షు—౭-౪-౨౮.

శ (వికరణ) ప్రత్యయమును, యక్ప్రత్యయమును, య కారాద్యార్ధధాతుకమగు లిఙ్గును బరమగునపుడు హ్రస్వఋకారమునకు రిజ్ (రి) అనునాదేశమగును.

ఉదా:—భృ+యాత్ భ్రి+యాత్=భ్రియాత్ పూర్వసూత్రమునుండి రీఙ్ అనుపదమనువర్తించుచుండఁగా, రిఙ్గును విధించుటచే నిట "అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః" అను సూత్రముచేత దీర్ఘము రాదు.

సూ.—ఉశ్చ—౧-౨-౧౨.

ఋకారముకంటెఁ బరములును, ఝలాదులు నగులిఙ్గును, ఆత్మనేపదపరకమగు సిచ్ప్రత్యయమును కిత్తులగును.

ఉదా:—భృషీష్ట-భృషీయాస్తామ్. అభార్షీత్.

సూ.—హ్రస్వాదఙ్గాత్—౮-౨-౨౭.

హ్రస్వాంతాంగముకంటెఁ బరమగు సిచ్చునకు ఝల్లు పరమగుచో లోపమగును

ఉదా:—అభృ+స్+త=అభృత, అభరిష్యత్, అభరిష్యత.(3)హృఞ్ = హరణే (హరించుట) హరతి, హరతే. జహార, జహ్రే, జహర్థ-జహ్రివ-జహ్రిమ, జహ్రిషే. హర్తా. హరిష్యతి, హరిష్యతే. హరతు, హరతామ్. అహరత్, అహరత. హరేత్, హరేత. హ్రియాత్. హృషీష్ట- హృషీయాస్తామ్. అహార్షీత్, అహృత. అహరిష్యత్, అహరిష్యత.(౪)ధృఞ్=ధారణే(ధరించుట)ధరతి,

ధరతే. (౫) ణీఞ్=ప్రాపణే(పొందించుట)నయతి; నయతే. (౬) డు పచష్=పాకే (వండుట) ఇటనుండిస్వరితేత్తులు. పచతి; పచతే. పపాచ, పేచిథ-పపక్థ, పేచే. పక్తా. (౭) భజ=సేవాయామ్ (సేవించుట) భజతి; భజతే. బభాజ, భేజే. భక్తా. భక్ష్యతి; భక్ష్యతే. అభాక్షీత్; అభక్త-అభక్షాతామ్. (౮)యజ=దేవపూజాసంగతికరణదానేషు (దేవతలఁ బూజించుట-కలిసికొనుట-ఇచ్చుట); యజతి; యజతే.

సూ.—లిట్యభ్యాసస్యోభయేషామ్—౬-౧-౧౭.

వచ-ఞిష్వప్-యజ-డువప్-వహ-వస-వేఞ్-వ్యేఞ్-హ్వేఞ్-వద-టుఓశ్వి అను వచ్యాదిధాతువులయొక్కయు, గ్రహ-జ్యా-వయ్ (వేఞ్ ధాతువునకాదేశము)-వ్యధ-వశ-వ్యచ-ఓవ్రశ్చూ-ప్రచ్ఛ-భ్రస్జ అనుగ్రహ్యాదులయొక్కయు నభ్యాసమునకు లిట్టు పరమగునపుడు సంప్రసారణమగును.

ఉదా:—ఇయాజ.

సూ.—వచిస్వపియజాదీనాం కితి—౬-౧-౧౫.

వచ-ఞిష్వప్ ధాతువులకును, యజాదిధాతువులకును కిత్తు పరమగునపుడు సంప్రసారణమగును.

ఉదా:—ఈజతుః-ఈజుః, ఇయజిథ - ఇయష్ఠ; ఈజే; యష్టా.

సూ —షఢోః కస్సి—౮-౨-౪౧.

షకారమునకును, ఢకారమునకును సకారము పరమగుచో కకారమగును.

ఉదా:—యజ్+స్యతి యష్+స్యతి యక్+స్యతి షత్వము=యక్ష్యతి-యక్ష్యతే. ఇజ్యాత్ - యక్షీష్ట. అయాక్షీత్-అయష్ట.

(౯) వహ=ప్రాపణే-(వహించుట) ఉదా:—వహతి-వహతే. ఉవాహ-ఊహతుః-ఊహుః, ఉవహిథ-ఈధాతువు అకారము కలదగుటచేత భారద్వాజనియమంబుచే థల్లునకు ఇడాగమంబు వైకల్పికంబుగాన, ఇడాగమము రానిపక్షమున ఢత్వము-ఉవఢ్+థ అని కాఁగా,

సూ.—ఝషస్తథోర్ధోఽధః—౮-౨-౪౦.

ఝష్షుకంటెఁ బరమగు తకారథకారములకు ధకారమగును, ధాఞ్ధాతువుకంటెఁ బరమగువానికి మాత్రము రాదు.

ఉదా:—ఉవఢ్+థ ఉవఢ్+ఢ అనియుండఁగా,

సూ.—ఢో ఢే లోపః—౮-3-౧3.

ఢకారమునకు ఢకారము పరమగునపుడు లోపమగును. ఉదా:—ఉవ+ఢ.

సూ.—సహివహోరోదవర్ణస్య—౬-౩-౧౧౨.

షహ-వహ ధాతువులయొక్క అకారమునకు ఢకారము లోపించినపుడు ఓకారమగును.

ఉదా:—ఉవోఢ; ఊహే. వోఢా. వక్ష్యతి. అవాక్షీత్ - అవోఢామ్-అవాక్షుః, అవాక్షీః-అవోఢమ్-అవోఢ, అవాక్షమ్-అవాక్ష్వ-అవాక్ష్మ. అవోఢ-అవక్షాతామ్ - అవక్షత, అవోఢాః - అవక్షాథామ్ - అవోఢ్వమ్, అవక్షి-అవక్ష్వహి-అవక్ష్మహి.

ఇవి భ్వాదులు.



అదాదులు.

(౧) అద=భక్షణే (భక్షించుట.)

సూ.—అదిప్రభృతిభ్యః శపః—౨-౪-౭౨.

అద మున్నగు ధాతువులకంటెఁ బరమగు శప్పునకు లుక్కగును.

ఉదా:—అద్+అ+తి అద్+తి చర్త్వము=అత్తి-అత్తః-అదన్తి, అత్సి-అత్థః-అత్థ, అద్మి-అద్వః-అద్మః.

సూ.—లిట్యన్యతరస్యామ్—౨-౪-౪౦.

అదాధాతువునకు లిట్టు పరమగునపుడు ఘస్ల (ఘస్) అను నాదేశము వికల్పముగానగును.

ఉదా:—జఘాస - జఘుస్+అతుస్ ఉపధాలోపము - జఘ్స్+అతుస్ ఘకారమునకు చర్త్వము-జక్+స్+అతుస్.

సూ.—శాసివసిఘసీనాఞ్చ—౮-3-౬౦.

ఇణ్ కవర్గములకంటెఁ బరమగు-శాసు-వస-ఘస్లు ధాతువులయొక్క సకారమునకు షకారమగును.

ఉదా:—జక్+ష్+అతుస్ = జక్షతుః-జక్షుః, జఘసిథ-జక్షథుః-జక్ష, జఘాస-జఘస-జక్షివ-జక్షిమ. ఘస్లాదేశము రాని పక్షమున ఆద-ఆదతుః-ఆదుః.

సూ.—ఇడత్త్యర్తివ్యయతీనామ్—౭-౨-౬౬.

అద-ఋ-వ్యేఞ్ ధాతువులకంటెఁ బరంబగు థల్లునకు ఇడాగమము నిత్యముగానగును.

ఉదా:—ఆదిథ, ఆదివ. అత్తా. అత్స్యతి. అత్తు-అత్తాత్-అత్తామ్-అదన్తు.

సూ.—హుఝల్భ్యో హేర్ధిః—౬-४-౧౦౧.

హుధాతువుకంటెను ఝలంతధాతువులకంటెను బరమగు-హి ప్రత్యయమునకు ధి-యనునాదేశమగును.

ఉదా:—అద్+హి అద్+ధి=అద్ధి - అత్తాత్-అత్తమ్ - అత్త, అదాని-అదావ-అదామ.

సూ.—అదస్సర్వేషామ్—౭-3-౧౦౦.

అదధాతువుకంటెఁ బరమగు అపృక్తసార్వధాతుకమునకు అడాగమమగును.

ఉదా:—ఆదత్-ఆత్తామ్-ఆదన్, ఆదః-ఆత్తమ్-ఆత్త, ఆదమ్-ఆద్వ-ఆద్మ. అద్యాత్-అద్యాతామ్-అద్యుః; అద్యాత్-అద్యాస్తామ్-అద్యాసుః.

సూ.—లుఙ్సనోర్ఘస్లృ—౨-౪-౩౭.

అదధాతువునకు లుఙ్గాని సన్ప్రత్యయముగాని పరమగునపుడు ఘస్లృ(ఘస్) అనునాదేశమగును. ఘస్లాదేశము ఌదిత్తుగాన "పుషాదిద్యుతాది" యను సూత్రముచే అఙ్ వచ్చును.

ఉదా:—అఘసత్. ఆత్స్యత్.

(౨) హన=హింసాగత్యోః (హింసించుట నడచుట.)

ఉదా:—హన్తి.

సూ.—అనుదాత్తోపదేశవనతితనోత్యాదీనామనునాసిక
లోపో ఝలి క్ఙితి—౬-౪-౩౭.

అనునాసికాంతములును అనుదాత్తోపదేశములు నగు-యమ-రమ-ణమ-గమ్ల-హన - మన ధాతువులకును, వన-వను ధాతువులకును, అనునాసికాంతములగు-తను-షణు-క్షణు-క్షిణు-ఋణు-తృణు-ఘృణు-వను-మను అనుతనోత్యాదులకును ఝలాది యగు కిత్తుగాని ఙిత్తుగాని పరమగుచో లోపమగును.

ఉదా:—హతః-ఘ్నన్తి, హంసి-హథః - హథ, హన్మి-హన్వః-హన్మః. జఘాన-జఘ్నతుః-జఘ్నుః.

సూ.—అభ్యాసాచ్చ—౭-౩-౫౫.

అభ్యాసముకంటెఁ బరమగు హనధాతువుయొక్క హ కారమునకుఁ గుత్వమగును.

ఉదా:—జఘనిథ - జఘన్థ - జఘ్నథుః-జఘ్న, జఘాన-జఘన-జఘ్నివ-జఘ్నిమ. హన్తా. హనిష్యతి. హన్తు-హతాత్-హతామ్-ఘ్నన్తు,

సూ.—హన్తేర్జః—౬-౪-౩౬.

హనధాతువునకు హిప్రత్యయము పరమగునపుడు జ-అనునాదేశమగును.

సూ.—అసిద్ధవదత్రాభాత్—౬-౪-౨౨.

ఈసూత్రము మొదలు ఈపాదము సమాప్తియగువఱకును ఆభీయ మనఁబడును. సమానాశ్రయమగు నాభీయము చేయఁబోవునపుడు ఆభీయమసిద్ధమగును. సమానాశ్రయ మన ఒకేనిమిత్తముకలదిగాని,యొకేస్థానముకలదిగాని యని యర్థము. ఈసూత్రముచే జాదేశ మసిద్ధమగుటచేత 'అతోహేః' అను దానిచే హిప్రత్యయమునకు లుక్కు రాదు.

ఉదా:—జహి-హతాత్-హతమ్-హత, హనాని-హనావ-హనామ. అహన్-అహతామ్-అఘ్నన్, అహన్-అహతమ్-అహత, అహనమ్-అహన్వ-అహన్మ. హన్యాత్.

సూ.—ఆర్ధధాతుకే—౨-౪-౩౫.

ఇది యధికారసూత్రము.

సూ.—హనో వధ లిఙి—౨-౪-౪౨.

సూ.—లుఙి చ—౨-౪-౪౩.

ఆర్ధధాతుకము వివక్షితమగుచుండ హనధాతువునకు లిఙ్ఙుగాని లుఙ్ఙుగాని పరమగుచో వధ-యనునాదేశమగును ఈయాదేశ మదంతముగాన "అతోలోప" అనుసూత్రముచే అత్తునకు లోపము.

ఉదా:—వధ్యాత్-వధ్యాస్తామ్-వధ్యాసుః, అవధీత్. అహనిష్యత్.

(3) యు=మిశ్రణేఽమిశ్రణే చ (కలుపుట-కలుపకుండుట.)

సూ.—ఉతోవృద్ధిర్లుకిహలి—౭-3-౮౯.

లుగ్విషయమున ఉత్తునకు పకారేత్సంజ్ఞకమును హలాదియునగు సార్వధాతుకము పరమగుచో వృద్ధియగును; అభ్యస్తముయొక్క ఉకారమునకుఁ గాదు.

ఉదా:—యౌతి - యుతః-యువన్తి, యౌషి-యుథః - యుథ, యౌమి - యువః - యుమః. యుయావ, యుయవిథ, యుయావ - యుయువ - యుయువివ. యవితా. యవిష్యతి. యౌతు-యుతాత్, యుహి. అయౌత్ - అయుతామ్-అయువన్. యు+యాత్ ఇట నుత్తునకు వృద్ధిరాదు. భాష్యమున పకారేత్సంజ్ఞకము జిత్తు కాదనియు, జిత్తు పకారేత్సంజ్ఞకము కాదనియు వ్యాఖ్యానము చేయుటచే విశేషవిహితమగు

జిత్త్వము పిత్త్వమును బాధించునుగాన సార్వధాతుకము పకారేత్సంజ్ఞకము కాదని యెఱుంగునది. యుయాత్-యుయాతామ్-యుయుః; యూయాత్-యూయాస్తామ్-యూయాసుః. అయావీత్. అయవిష్యత్. ఇట్లే-ణు=స్తుతౌ, టుక్షు=శబ్దే, క్ష్ణు=తేజనే, ష్ణు=ప్రస్రవణే అనువానిరూపంబు లూహించునది.

(౪) యా=ప్రాపణే (పొందుట.)

ఉదా:— యాతి - యాతః - యాన్తి; ప్రణియాతి. యయౌ, యయిథ-యయాథ, యయివ - యయిమ. యాతా. యాస్యతి. యాతు. అయాత్-అయాతామ్.

సూ.—లఙశ్శాకటాయనస్యైవ—౩-౪-౧౧౧.

ఆదన్తధాతువుకంటెఁ బరమును లఙ్జున కాదేశమునగు-ఝి ప్రత్యయమునకు జుస్ (ఉస్) అనునాదేశము వికల్పముగా నగును.

ఉదా:—అయుః, అయాన్. యాయాత్ - యాయాతామ్-యాయుః; యాయాత్-యాయాస్తామ్ - యాయాసుః. అయాసీత్. అయాస్యత్.

(౫) వా = గతిగన్ధనయోః (వెళ్లుట-సూచించుట) (౬) భా=దీప్తౌ. (౭) ష్ణా=శౌచే. (౮) శ్రా=పాకే. (౯) ద్రా=కుత్సాయాం గతౌ. (౧౦) ప్సా=భక్షణే. (౧౧) పా=రక్షణే. (౧౨) రా=దానే. (౧౩) లా=ఆదానే. (౧౪) దాప్ = లవనే. (౧౫) ఖ్యా=ప్రకథనే ఈధాతువు సార్వధాతుకమునందు మాత్రమే ప్రయోగింపఁబడును. (౧౬) విద=జ్ఞానే. (తెలిసికొనుట.)

సూ.—విదో లటో వా—3-4-83.

ఆదాదికవిదధాతువుకంటెఁ బరములును, లట్టునకాదేశములునగు పరస్మైపదములకు ణల్-అతుస్ మున్నగునాదేశములు వరుసను వికల్పముగానగును.

ఉదా:—వేద-విదతుః - విదుః, వేత్థ-విదథుః-విద, వేద-విద్వ-విద్మ. పక్షమున-వేత్తి-విత్తః-విదన్తి.

సూ.—ఉషవిదజాగృభ్యోఽన్యతరస్యామ్—3-1-38.

లిట్టు పరమగుచో, ఉష-విద - జాగృ ధాతువులకంటెఁ బరముగా ఆమ్ప్రత్యయము వికల్పముగానగును. సూత్రమున విదధాతువున కదన్తత్వము నిపతించుటచేత ఆమ్ము పరమగునపుడు గుణము రాదు.

ఉదా:—విదాంచకార; వివేద, వివేదిథ - వివిదివ-వివిదిమ. వేదితా. వేదిష్యతి.

సూ.—విదాంకుర్వన్త్విత్యన్యతరస్యామ్—3-1-41.

విద ధాతువుకంటె లోట్టు పరమగునపుడు ఆమ్మును, గుణము లేకపోవుటయును, లోట్టునకు లుక్కును, లోడంత కృఞ్ ధాత్వనుప్రయోగంబును నీసూత్రముచే నిపతింపఁబడియెను. సూత్రమున "విదాంకుర్వన్తు" అని ప్రథమపురుష బహువచనాంతముగా నిర్దేశింపఁబడినను నందలిపురుషము, వచనమును వివక్షితములు గావు.

సూ.—తనాదికృఞ్భ్య ఉః—౩-౧-౭౯.

తనుమున్నగు ధాతువులకంటెను, కృఞ్ ధాతువుకంటెను కర్త్రర్థకసార్వధాతుకము పరమగునపుడు ఉ-అను (వికరణ) ప్రత్యయమగును. శప్పున కపవాదము.

ఉదా:—విదాంకృ+ఉ + తు ఋకారోకారములకు గుణము విదాంకరోతు.

సూ.—అత ఉత్సార్వధాతుకే—౬-౪-౧౧౦.

ఉప్రత్యయాంతమగు కృఞ్ ధాతువుయొక్క అత్తునకు కిత్తుగాని ఙిత్తుగాని యగు సార్వధాతుకము పరమగునపుడు హ్రస్వమగు ఉకారమగును.

ఉదా:— విదాంకురుతాత్ - విదాంకురుతామ్-విదాంకుర్వన్తు, విదాంకురు, విదాంకరవాణి; వేత్తు. అవేత్ - అవిత్తామ్-అవిదుః.

సూ.—దశ్చ—౮-౨-౭౫.

ధాతువుయొక్క పదాంతదకారమునకు సిప్పు పరమగునపుడు రు(ర్) అనునాదేశము వికల్పముగానగును.

ఉదా:—అవేః. అవేత్. విద్యాత్-విద్యాతామ్; విద్యాస్తామ్. అవేదీత్. అవేదిష్యత్.

(౧౭) అస=భువి (ఉండుట.)

ఉదా:—అస్తి.

సూ.—శ్నసోరల్లోపః—౬-౪-౧౧౧.

కిత్తుగాని జిత్తుగాని యగుసార్వధాతుకము పరమగు నపుడు శ్నమ్ - అనుప్రత్యయముయొక్కయు, అసధాతువు యొక్కయు హ్రస్వమగు అకారమునకు లోపమగును.

ఉదా:—స్తః-సన్తి, అసి-స్థః-స్థ, అస్మి-స్వః-స్మః.

సూ.—ఉపసర్గప్రాదుర్భ్యామస్తిర్యచ్పరః—౮-౩-౮౭.

యకారముగాని అచ్చుగాని పరమగునపుడు ఉపసర్గము నందలి ఇణ్ణుకంటెను, ప్రాదుస్ అనునవ్యయముకంటెను బర మగు అస ధాతువుయొక్క సకారమునకు షకారమగును.

ఉదా:—నిష్యాత్-ప్రాదుష్యాత్; నిషన్తి - ప్రాదుషన్తి. అభి+స్తః ఇట అచ్చుగాని యకారముగాని సకారముకంటెc బరముగా లేవుగాన షత్వము లేదు. అభిస్తః

సూ.—అస్తేర్భూః—౨-౪-౫౨.

ఆర్ధధాతుకవిషయమున అసధాతువునకు భూ-అనునా దేశ మగును.

ఉదా:—బభూవ. భవితా. భవిష్యతి. అస్తు - స్తాత్- స్తామ్-సన్తు.

సూ.—ఘ్వసోరేద్ధావభ్యాసలోపశ్చ—౬-౪-౧౧౯.

హి ప్రత్యయము పరమగునపుడు ఘుసంజ్ఞకములకును అసధాతువునకును ఏకారమగును. అభ్యాసమును లోపించును. ఆభీయంబగు .చేత నేత్వ మసిద్ధమగునుగాన - హి ప్రత్యయ

మునకు ధిత్వమగును. 'శ్నసోరల్లోప' యనుసూత్రముచేత నకారలోపంబు.

ఉదా:—ఏధి-స్తాత్-స్తమ్-స్త, అసాని-అసావ-అసామ. ఈట్లు ఆసీత్-ఆస్తామ్-ఆసన్. స్యాత్ - స్యాతామ్-స్యుః. భూయాత్. అభూత్. అభవిష్యత్.

(౧౮) ఇణ్=గతౌ (వెళ్లుట.)

ఉదా:—ఏతి-ఇతః.

సూ.—ఇణో యణ్—౬-౪-౮౧.

అజాదిప్రత్యయము పరమగునపుడు ఇణ్ ధాతువునకు యణాదేశ మగును. ఉదా:-యన్తి.

సూ.—అభ్యాసస్యాసవర్ణే—౬-౪-౭౮.

సవర్ణము గానియచ్చు పరమగునపుడు ఇకార-ఉకారములకు ఇయఙ్ (ఇయ్)-ఉవఙ్ (ఉవ్) అనునాదేశములు క్రమముగానగును.

ఉదా:—ఇ+ఇ+అ ఇఐ+అ ఇయాయ్+అ=ఇయాయ.

సూ.—దీర్ఘ ఇణః కితి—౭-౪-౬౯.

ఇణ్ ధాతువుయొక్క యభ్యాసమునకు కిత్తగులిట్టు పరమగునపుడు దీర్ఘమగును. ఇ+ఇయ్+అతుస్ ఈ+ఇయ్+అతుస్ సవర్ణదీర్ఘము = ఈయతుః-ఈయుః, ఇయయిథ-ఇయేథ. ఏతా. ఏష్యతి. ఏతు-ఇతాత్, ఇహి. ఐత్ - ఐతామ్-ఆయన్. ఇయాత్. ఈయాత్.

సూ.—ఏతేర్లిఙి—౭-౪-౨౪.

కిత్తును నార్ధధాతుకము నగు లిఙ్ఙు పరమగునపుడు ఉప సర్గముకంటెఁ బరమగు ఇణ్ ధాతువుయొక్క అణ్ణునకు హ్రస్వ మగును. నిరియాత్. అభి+ఈయాత్ సవర్ణదీర్ఘము = అభీ యాత్.

సూ.—అన్తాదివచ్చ—౬-౧-౮౫.

ఏకాదేశంబగునది పూర్వమున కంతమువంటిదియుఁ, బర మున కాదివంటిదియు నగును. ఇట సవర్ణదీర్ఘము అభి-అను దానిలోని ఇకారమువంటిదియు, ఈయాత్ - అనుదానిలోని ఈకారమువంటిదియుఁ గూడ నగుటచేత నుపసర్గముకంటె నిణ్ ధాతువుయొక్క అణ్ణు పరమగునుగాన 'ఏతేర్లిఙి' యను దానిచేత హ్రస్వము ప్రాప్తింపఁగా,

ఉభయత ఆశ్రయణే నాన్తాదివత్—(పరి).

'అన్తాదివచ్చ' యనుదానిచేఁ బూర్వాంతత్వపరాదిత్వ ములు రెండునొకేసారిగా నతిదేశింపఁబడవు గాన నిట హ్రస్వము లేదు. సమ్+ఆ+ఈయాత్ సమ్+ఏయాత్. ఇట నేకారము అణ్ణు కానందున హ్రస్వము లేదు. సమేయాత్.

సూ.—ఇణోగాలుఙి—౨-౪-౪౫.

ఇణ్ ధాతువునకు లుఙ్ఙు పరమగునపుడు గా - యను నాదేశమగును. "గాతిస్థా" యనుసూత్రముచే సిచ్చునకు లుక్కు-అగాత్. ఐష్యత్.

(౧౯) శీఙ్=స్వప్నే (నిద్రించుట)

సూ.—శీఙస్సార్వధాతుకే గుణః—౭-౪-౨౧.

శీఙ్ ధాతువునకు సార్వధాతుకము పరమగునపుడు గుణమగును. ఇది "క్ఙితి చ" యనుదాని కపవాదంబు.

ఉదా:—శేతే-శయాతే.

సూ.—శీఙో రుట్—౭-౧-౬.

శీఙ్ ధాతువుకంటెఁ బరమును, ఝకారమున కాదేశము నగు-అత్ అనుదానికి రుట్(ర్) అనునాగమ మగును. శేరతే, శేషే-శయాథే-శేధ్వే, శయే-శేవహే-శేమహే. శిశ్యే శిశ్యాతే-శిశ్యిరే. శయితా. శయిష్యతే. శేతామ్-శయాతామ్-శేరతామ్. అశేత-అశయాతామ్; అశేరత. శయీత-శయీయాతామ్-శయీరన్, శయిషీష్ట-శయిషీఢ్వమ్ (ధ్వమ్.). అశయిష్ట-అశయిఢ్వ(ధ్వ)మ్. అశయిష్యత.

(౨౦) ఇఙ్=అధ్యయనే (చదువుట.)

ఇఙ్-ఇక్ ధాతువు లెప్పుడును అధి - యనునుపసర్గము పూర్వమునఁ గలిగియే ప్రయోగింపఁబడును.

ఉదా:—అధీతే-అధీయాతే-అధీయతే.

సూ.—గాఙ్ లిటి—౨-౪-౪౯.

ఇఙ్ ధాతువునకు లిట్టు పరమగునపుడు గాఙ్(గా)అనునాదేశ మగును. అధిజగే. అధ్యేతా. అధ్యేష్యతే. అధీతామ్-అధీయాతామ్-అధీయతామ్, అధీష్వ-అధీయాథామ్-అధీధ్వమ్,

అధ్యయై-అధ్యయావహై-అధ్యయామహై. అధ్యైత-అధ్యైయాతామ్-అధ్యైయత, అధ్యైథాః-అధ్యైయాథామ్-అధ్యైధ్వమ్, అధ్యైయి-అధ్యైవహి-అధ్యైమహి. అధీయీత-అధీయీయాతామ్-అధీయీరన్, అధ్యేషీష్ట.

సూ.—విభాషాలుఙ్లృఙోః—౨-౪-౫౦.

లుఙ్గాని లృఙ్గాని పరమగునపుడు ఇఙ్ ధాతువునకు గాఙా దేశము వికల్పముగా నగును.

సూ.—గాఙ్కుటాదిభ్యోఽఞ్ణిన్ ఙిత్—౧-౨-౧.

గాఙా దేశముకంటెను, కుటమున్నగు ధాతువులకంటెను బరములును ఞిత్తు ణిత్తులుగాని ప్రత్యయములు ఙిత్తులవంటి వగును.

సూ.—ఘుమాస్థాగాపాజహాతిసాం హలి—౬-౪-౬౬.

హలాదియును కిత్తుగాని ఙిత్తుగాని యగు నార్ధధాతుకము పరమగునపుడు ఘుసంజ్ఞకములయొక్కయు, మా-మాఙ్-మేఙ్-స్థా-గై-గాఙ్ (గత్యర్థకము)- గాఙ్ (ఇఙా దేశము)-పా (పానార్థకము)-ఓహాక్-షో ధాతువులయొక్కయు ఆకారమునకు ఈకారమగును.

ఉదా:—అధ్యగీష్ట; అధ్యైష్ట. అధ్యగీష్యత; అధ్యైష్యత.

(౨౧) దుహ=ప్రపూరణే (పితుకుట). ఇదిస్వరితేత్కము. ఉదా:—దోగ్ధి-దుగ్ధః-దుహన్తి, ధోక్షి; దుగ్ధే-దుహాతే-దుహతే, ధుక్షే-దుహాథే-ధుగ్ధ్వే, దుహే-దుహ్వహే-దుహ్మహే. దుదో

హః; దుదుహే. దోగ్ధా. ధోక్ష్యతి; ధోక్ష్యతే. దోగ్ధు-దుగ్ధాత్-దుగ్ధామ్-దుహన్తు, దుగ్ధి - దుగ్ధాత్ - దుగ్ధమ్-దుగ్ధ, దోహాని; దుగ్ధామ్ - దుహాతామ్ - దుహతామ్, ధుక్ష్వ - దుహాథామ్-ధుగ్ధ్వమ్, దోహై - దోహావహై - దోహామహై. అధోక్(గ్) - అదుగ్ధామ్ - అదుహన్, అదోహమ్; అదుగ్ధ - అదుహాతామ్ - అదుహత, అధుగ్ధ్వమ్. దుహ్యాత్; దుహీత.

సూ.—లిఙ్సిచావాత్మనేపదేషు—౧-౨-౧౧.

ఇక్కునకు సమీపమగు హల్లుకంటెఁ బరమగునవియు, ఝలాదులునగు లిఙ్సిచ్చులు నాత్మనేపదము పరముగాఁ గలసిచ్చును కిత్తులగును.

ఉదా:—ధుక్షీష్ట, ధుక్షీఢ్వమ్.

సూ.—శలఇగుపధాదనిటః క్సః—3-౧-౪౫.

ఇగుపధంబును శలంతము నగు ధాతువుకంటెఁ బరమగు నిడాగమవిరహితమైన చ్లిప్రత్యయమునకు క్స+(స) అనునాదేశమగును.

ఉదా:—అదుహ్+స + త్ ఘత్వము - భష్భావము-చర్త్వషత్వములు=అధుక్షత్.

సూ.—లుగ్వా దుహదిహలిహగుహామాత్మనేపదే దన్త్యే-
౭-3-౭3.

దుహ-దిహ-లిహ-గుహాధాతువులయొక్క క్సప్రత్యయమునకు దంత్యాదియగు తఙ్ పరమగునపుడు లుక్కు వికల్పముగా నగును.

ఉదా:—అదుగ్ధ-అధుక్షత.

సూ.—క్సస్యాఽచి—౭-౩-౭౨.

అజాది యగు ప్రత్యయము (తఙు) పరమగునపుడు క్సప్రత్యయమునకు లోపమగును.

ఉదా:—అధుక్షాతామ్ - అధుక్షన్త, అదుగ్ధాః - అధుక్షథాః-అధుక్షాథామ్-అధుగ్ధ్వమ్-అధుక్షధ్వమ్, అధుక్షి-అదుహ్వహి-అధుక్షావహి-అధుక్షామహి. అధోక్ష్యత.

(౨౧) దిహ=ఉపచయే (వృద్ధినొందుట)

దుహధాతువునకుంబోలె దీనిరూపంబు లరయునది. ప్రణిదేగ్ధి.

(౨౨) లిహ=ఆస్వాదనే (ఆస్వాదించుట.)

ఉదా:—లేఢి - లీఢః-లిహన్తి, లేక్షి; లీఢే - లిహాతే - లిహతే, లిక్షే-లిహాథే-లీఢ్వే; లిలేహ; లిలిహే. లీఢాసి; లీఢాసే. లేక్ష్యతి; లేక్ష్యతే. లేఢు-లీఢాత్ - లీఢామ్-లిహన్తు, లీఢి, లేహాని; లీఢామ్, లిక్ష్వ, లీఢ్వమ్. అలేట్ (డ్). - అలిక్షత్; అలిక్షత. అలీఢ. అలేక్ష్యత్; అలేక్ష్యత.

(౨౩) బ్రూఞ్ = వ్యక్తాయాం వాచి (పలుకుట.) ఇది యుభయపది.

సూ.—బ్రువః పఞ్చానామాదిత ఆహో బ్రువః-
3-౪-౮౪.

బ్రూఞ్ ధాతువుకంటెఁ బరమగు లట్టుయొక్క తిబాదు
లైదింటికిని, ణల్ మున్నగునైదును వరుసగా నాదేశమగును.
బ్రూఞ్ ధాతువునకు ఆహ్- యనునాదేశమునగును.

ఉదా:—ఆహ-ఆహతుః-ఆహుః.

సూ.—ఆహస్థః—౮-౨-౩౫.

ఝల్లు పరమగునపుడు ఆహ్-అనుదానికి థ్-అనునాదేశ
మగును.

ఉదా:—ఆహ్+థ ఆథ్+థ చర్త్వము=ఆత్థ-ఆహథుః.

సూ.—బ్రువ ఈట్—౭-౩-౯౩.

బ్రూఞ్ ధాతువుకంటెఁ బరమును హలాదియునగు పకా
రేత్సంజ్ఞకప్రత్యయమునకు ఈట్ (ఈ) అనునాగమ మగును.

ఉదా:—బ్రవీతి-బ్రూతః-బ్రువన్తి, బ్రవీషి - బ్రూథః-
బ్రూథ, బ్రూవః; బ్రూతే-బ్రువాతే-బ్రువతే, బ్రూషే, బ్రువే-
బ్రూవహే.

సూ.—బ్రువో వచిః—౨-౪-౫౩.

ఆర్ధధాతుకవిషయమున బ్రూఞ్ ధాతువునకు వచ్-అను
నాదేశమగును. అభ్యాసమునకు సంప్రసారణము.

ఉదా:—ఉవాచ - ఊచతుః-ఊచుః, ఉవచిథ - ఉవక్థ, ఊచివ; ఊచే. వక్తా. వక్ష్యతి; వక్ష్యతే. బ్రవీతు-బ్రూతాత్-బ్రూతామ్-బ్రువన్తు, బ్రూహి, బ్రవాణి; బ్రూతామ్, బ్రవై. అబ్రవీత్; అబ్రూత, అబ్రవమ్. బ్రూయాత్; బ్రువీత. ఉచ్యాత్; వక్షీష్ట.

సూ.—అస్యతివక్తిఖ్యాతిభ్యోఽజ్—3 ౧-౫౨.

అసు-వచ్-ఖ్యా (చక్షిఙ్ ధాతువునకాదేశము) ధాతువులకంటెఁ బరమగు చ్లిప్రత్యయమునకు అఙ్ (అ) అనునాదేశమగును.

సూ.—వచ ఉమ్—౭-౪-౨౦.

వచ్-అను ధాతువునకు అఙ్ పరమగునపుడు ఉమ్+ (ఉ)-అనునాగమమగును.

ఉదా:—అవచ్ + అ+త్ అవ+ఉచ్+అ+త్ గుణము= అవోచత్; అవోచత. అవక్ష్యత్; అవక్ష్యత. "చర్కరీతం చ" యఙ్లుగంతమును చర్కరీతమని ప్రాచీనులు వ్యవహరింతురు. యఙ్లుగంత ధాతువులుగూడ నదాదులలోనివని యెఱుంగునది.

(౨౪) ఊర్ణుఞ్=ఆచ్ఛాదనే (ఆచ్ఛాదించుట) ఇది సేట్టు.

సూ.—ఊర్ణోతేర్విభాషా—౭-3-౯౦.

హలాదియగు పిత్సార్వధాతుకము పరమగునపుడు ఊర్ణుఞ్ ధాతువునకు వృద్ధి వికల్పముగానగును.

ఉదా:—ఊర్ణౌతి-ఊర్ణోతి-ఊర్ణుతః-ఊర్ణువన్తి; ఊర్ణుతే-ఊర్ణువాతే-ఊర్ణువతే.

ఊర్ణోతేరామ్నేతి వాచ్యమ్—(వా)

ఊర్ణుఞ్ ధాతువునకు లిట్టు పరమగునపుడు ఆమ్ము రాదు.

సూ.—నన్ద్రాస్సంయోగాదయః—౬-౧-౩.

అచ్చుకంటెఁ బరములును, సంయోగమునకు మొదట నున్నవియు నగు-నకార-దకార-రేఫంబులు ద్విత్వమును బొరయవు. దీనిచేత రేఫమునకు ద్విత్వము రానందున ను-అను దానికి మాత్రమే ద్విత్వము.

ఉదా:—ఊర్ణునావ-ఊర్ణునువతుః-ఊర్ణునువుః.

సూ.—విభాషోర్ణోః—౧-౨-౩.

ఊర్ణుఞ్ ధాతువుకంటెఁ బరమగు ఇడాదిప్రత్యయము జిత్తువంటిది వికల్పముగానగును.

ఉదా:—ఊర్ణునువిథ - ఊర్ణునవిథ, ఊర్ణునువే-ఊర్ణునువిషే - ఊర్ణునువిఢ్వే (ధ్వే), ఊర్ణునువివహే. ఊర్ణువితా; ఊర్ణవితా. ఊర్ణువిష్యతి (తే) ఊర్ణవిష్యతి-(తే). ఊర్ణౌతు-ఊర్ణోతు, ఊర్ణవాని; ఊర్ణుతామ్, ఊర్ణుష్వ, ఊర్ణవై.

సూ.—గుణోఽపృక్తే—౭-౩-౯౧.

అపృక్తము హలాదియు నగుపిత్సార్వధాతుకము పరమగునపుడు ఊర్ణుఞ్ ధాతువునకు గుణమగును. ఇది వృద్ధికపవాదము.

ఉదా:—ఔర్ణోత్-ఔర్ణుతామ్, ఔర్ణోః, ఔర్ణవమ్-ఔర్ణువ. ఊర్ణుయాత్, ఊర్ణుయాః. ఊర్ణువీత-ఊర్ణువిషీష్ట-ఊర్ణవిషీష్ట.

సూ.—ఊర్ణోతేర్విభాషా—౭-౨-౬.

ఇడాదియుఁ బరస్మైపదపరకము నగుసిచ్చు పరమగుచో ఊర్ణుఞ్ ధాతువునకు వృద్ధి వికల్పముగానగును. పక్షమున గుణము.

ఉదా:—ఔర్ణావీత్-ఔర్ణవీత్ - ఔర్ణువీత్; ఔర్ణావిష్టామ్-ఔర్ణవిష్టామ్-ఔర్ణువిష్టామ్, ఔర్ణవిష్ట; ఔర్ణువిష్ట. ఔర్ణవిష్యత్ (త); ఔర్ణువిష్యత్, ఔర్ణువిష్యత.

ఇవి అదాదులు.

—•—

జుహోత్యాదులు.

(౧) హు=దానాదనయోః (దేవతోద్దేశముగా సంస్కృతాగ్ని యందు హవిస్సునుంచుట, భక్షించుట.)

సూ.—జుహోత్యాదిభ్యః శ్లుః—౨-౪-౭౫.

హు-మున్నగు ధాతువులకంటెఁ బరమగు శప్పునకు శ్లువు(లోపము) అగును.

సూ.—శ్లౌ—౬-౧-౧౦.

శ్లువు వచ్చినపుడు ధాతువునకు ద్విత్వమగును.

ఉదా:—హు+తి హుహు+తి అభ్యాసమునకు చుత్వము. ఉత్తరఖండమున గుణము=జుహోతి-జుహుతః.

సూ.—ఆదభ్యస్తాత్—౭-౧-౪.

అభ్యస్తముకంటెఁ బరమగు ఝుకారమునకు అత్-అను నాదేశమగును; అన్త్-అనునాదేశమున కపవాదము. "హుశ్నువోస్సార్వధాతుకే" యనుసూత్రముచేత యణ్=జుహ్వతి.

సూ.—భీహ్రీభృహువాం శ్లువచ్చ—3-౧-3౯.

లిట్టు పరమగునపుడు ఞిభీ-హ్రీ-డుభృఞ్-హుధాతువులకుఁ బరమగుచు-ఆమ్ము వికల్పముగ నగును. మఱియు నాయామ్ము పరమగునపుడు శ్లువునందు వలెఁ. గార్యమగును. ద్విత్వము.

ఉదా:—జుహవాంచకార; జుహావ,జుహవిథ-జుహోథ, జుహువివ. హోతా. హోష్యతి. జుహోతు - జుహుతాత్ - జుహుతామ్ -జుహ్వతు, జుహుధి, జుహవాని. అజుహోత్-అజుహుతామ్.

సూ.—జుసి చ—౭-3-౮3.

అజాదియగు జుస్సు పరమగునపుడు ఇగన్తాంగమునకు గుణమగును. ఉదా:—అజుహవుః. జుహుయాత్. హూయాత్. అహౌషీత్. అహోష్యత్.

(౨) ఞిభీ=భయే (భయపడుట.) ఉదా:—బిభేతి.

సూ.—భియోఽన్యతరస్యామ్—౬-౪-౧౧౫.

ఞిభీ-ధాతువునకు హలాదియు, కిత్తుగాని జిత్తుగాని యగుసార్వధాతుకము పరమగునపుడు హ్రస్వమైన-ఇకారము వికల్పముగా నగును.

ఉదా:—బిభితః-బిభీతః-బిభ్యతి.బిభయాఞ్చకార;బిభాయ, బిభయిథ-బిభేథ, బిభ్యివ, బిభ్యిమ. భేతా. భేష్యతి. బిభేతు-బిభితాత్ - బిభీతాత్, బిభిహి-బిభీహి. అబిభేత్-అబిభయుః. బిభియాత్-బిభీయాత్. భీయాత్. అభైషీత్. అభేష్యత్.

(3) హ్రీ=లజ్జాయామ్-(సిగ్గుపడుట.)

జిహ్రేతి - జిహ్రీతః- జిహ్రియతి. జిహ్రయాంచకార; జిహ్రాయ. హ్రేతా. హ్రేష్యతి. జిహ్రేతు. అజిహ్రేత్. జిహ్రీయాత్. హ్రీయాత్. అహ్రైషీత్. అహ్రేష్యత్.

(౪) పౄ=పాలనపూరణయోః (పాలించుట-పూరించుట.)

సూ.—అర్తిపిపర్త్యోశ్చ—౭-౪-౭౭.

ఋధాతువుయొక్కయు, పౄధాతువుయొక్కయు అభ్యాసమునకు శ్లువు వచ్చినపు డిత్వమగును.

ఉదా:—పిపర్తి.

సూ.—ఉదోష్ఠ్యపూర్వస్య—౭-౧-౧౦౨.

అఙ్గావయవమగు ఓష్ఠ్యవర్ణము పూర్వమునఁ గలిగిన ౠకారము అంతమునఁగల యంగమునకు హ్రస్వమైన-ఉకారమగును.

సూ.—హలి చ—౮-౨-౭౭.

రేఫాంతముగాని, వకారాంతముగాని యగుధాతువు యొక్క యుపధాభూతమగు ఇక్కునకు హల్లు పరమగునపుడు దీర్ఘమగును.

ఉదా:—పిపూర్తః-పిపురతి. పపార.

సూ.—శౄద్దౄప్రాం హ్రస్వో వా—౭-౪-౧౨.

శౄ-దౄ-పౄ ధాతువులకు కిత్తగులిట్టు పరమగుచో హ్రస్వము వికల్పముగానగును.

ఉదా:—ప ప్రతుః-పప్రుః, హ్రస్వము కానిపక్షమున.

సూ.—ఋచ్ఛత్యౄతామ్—౭-౪-౧౧.

ఋచ్ఛ (తుదాది) ఋ-ధాతువులకును, ౠకారంత ధాతువులకును లిట్టు పరమగునపుడు గుణమగును.

ఉదా:—పపరతుః-పపరుః, పపరిథ, పప్రివ.

సూ.—వౄతో వా—౭-౨-౩౮.

వృజ్-వృఞ్ ధాతువులకంటెను, ౠదంత ధాతువులకంటెను బరమగు ఇట్టునకు దీర్ఘము వికల్పముగానగును. లిట్టునందుఁ గాదు.

ఉదా:—పరీతా; పరితా. పరీష్యతి; పరిష్యతి. పిపర్తు-పిపరతు. పిపూర్హి. అపిపః - అపిపూర్తామ్ - అపిపరుః. పిపూర్యాత్. పూర్యాత్. అపారీత్.

సూ.—సిచి చ పరస్మైపదేషు—౭-౨-౪౦.

పరస్మైపదపరకమగు సిచ్చు పరమగుచో "వృతోవా" యనుసూత్రముచేత ఇట్టునకు దీర్ఘము రాదు.

ఉదా:—అపారిష్టామ్.అపరీష్యత్. అపరిష్యత్.

(౫) ఓహాక్=త్యాగే (విడుచుట,)ఉదా:—జహాతి.

సూ.—జహాతేశ్చ—౬-౪-౧౧౬.

కిత్తుగాని, జిత్తుగాని యగుహలాదిసార్వధాతుకముపర మగునపుడు ఓహాక్-ధాతువునకు హ్రస్వమైన-ఇకారము వికల్ప ముగానగును. ఉదా:—జహితః.

సూ.—ఈహల్యఘోః—౬-౪-౧౧౩.

హలాదియు కిత్తుగాని జిత్తుగానియు నగుసార్వధాతు కము పరమగుచో శ్నా-ప్రత్యయముయొక్కయు అభ్యస్తము యొక్కయు ఆకారమునకు ఈకారమగును. ఘుసంజ్ఞకములకుఁ గాదు. ఉదా:—జహీతః.

సూ.—శ్నాభ్యస్తయోరాతః—౬-౪-౧౧౨.

కిత్తుగాని జిత్తుగాని యగుసార్వధాతుకము పరమగు నపుడు శ్నా-ప్రత్యయముయొక్కయు, అభ్యస్తసంజ్ఞకము యొక్కయు ఆకారమునకు లోపమగును.

ఉదా:—జహతి. జహౌ. హాతా. హాస్యతి. జహాతు- జహితాత్-జహీతాత్.

సూ.—ఆ చ హౌ—౬-౪-౧౧౭.

ఓహాఙ్ ధాతువునకు హి ప్రత్యయము పరమగునపుడు ఆకారమగును. ఇకారము ఈకారముగూడనగును.

ఉదా:—జహాహి - జహిహి - జహీహి. అజహాత్ - అజహుః.

సూ.—లోపో యి—౬-౪-౧౧౮.

యకారాదియగు సార్వధాతుకము పరమగుచో ఓహాఙ్ ధాతువుయొక్క ఆకారమునకు లోపమగును.

ఉదా:—జహ్యాత్-"ఏర్లిఙి" అనుదానిచేత ఏకారము= హేయాత్. అహాసీత్. అహాస్యత్.

(౬) మాఙ్=మానే శబ్దే చ (కొలుచుట-ధ్వనిచేయుట)

సూ.—భృఞామిత్—౭-౪-౭౬.

భృఞ్-మాఙ్-ఓహాఙ్ అను నీమూడు ధాతువులయొక్కయు నభ్యాసమునకు శ్లువు వచ్చినపుడు హ్రస్వమైన ఇకారమగును.

ఉదా:—మిమీతే-మిమాతే-మిమతే. మమే. మాతా. మాస్యతే. మిమీతామ్. అమిమీత. మిమీత. మాసీష్ట. అమాస్త. అమాస్యత.

(౭) ఓహాఙ్=గతౌ (వెళ్లుట)

ఉదా:—జిహీతే-జిహాతే-జిహతే, జహే. హాతా. హాస్యతే. జిహీతామ్. అజిహీత. జిహీత-హాసీష్ట. అహాస్త. అహాస్యత.

(౮) డుభృఞ్ = ధారణపోషణయోః (ధరించుట - పోషించుట.)

ఉదా:—బిభర్తి-బిభృతః-బిభ్రతి; బిభృతే - బిభ్రాతే-బిభ్రతే. బిభరాంచకార, బభార, బభర్థ, బభృవ; బిభరాంచక్రే, బభ్రే. భర్తా. భరిష్యతి; భరిష్యతే. బిభర్తు, బిభరాణి; బిభృతామ్. అబిభః-అబిభృతామ్-అబిభరుః; అబిభృత. బిభృయాత్; బిభ్రీత. భ్రియాత్; భృషీష్ట. అభార్షీత్; అభృత. అభరిష్యత్; అభరిష్యత.

(౯) డుదాఞ్=దానే (ఇచ్చుట)

ఉదా:—దదాతి-దత్తః-దదతి; దత్తే - దదాతే-దదతే. దదౌ-దదే. దాతా. దాస్యతి; దాస్యతే. దదాతు.

సూ.—దా ధా ఘ్వదాప్—౧.౧-౨౦.

డుదాఞ్-దాణ్-దో-దేఙ్ ధాతువులును, డుధాఞ్-ధేట్ ధాతువులును ఘుసంజ్ఞకంబు లగును.

"ఘ్వసోః" అనుసూత్రముచేత ఏకారము=దేహి, దత్తామ్. అదదాత్; అదత్త. దద్యాత్; దదీత. దేయాత్; దాసీష్ట. అదాత్-అదాతామ్-అదుః.

సూ.—స్థాఘ్వోరిచ్చ—౧-౨-౧౭.

ఆత్మనేపదములు పరమగునపుడు స్థా ధాతువునకును, ఘు-సంజ్ఞకములకును హ్రస్వమైన ఇకార మంతాదేశమగును. సిచ్చుకిత్తువంటిదగును.

ఉదా:—అదిత. అదాస్యత్; అదాస్యత.

(౧౦) డుధాఞ్ = ధారణపోషణయోః (ధరించుట - పోషించుట.)

ఉదా:—దధాతి.

సూ.—దధ స్తథోశ్చ—౮-౨-౩౮.

ఝషన్తమును ద్విరుక్తము నగు ధాఞ్ ధాతువుయొక్క బశ్శులకు తకార-థకార-సకారములుగాని, ధ్వశబ్దముగాని పరమగునపుడు భష్షులగును.

ఉదా:—ధత్తః-దధతి, దధాసి - ధత్థః; ధత్తే-దధాతే-దధతే, ధత్సే - ధద్ధ్వే, ఘ్వసోరిత్యాదిసూత్రము చేత నేత్వాభ్యాసలోపములు. ధేహి. అదధాత్; అధత్త. దధ్యాత్; దధీత. ధేయాత్, ధాసీష్ట. అధాత్; అధిత. అధాస్యత్; అధాస్యత.

(౧౧) ణిజిర్ = శౌచపోషణయోః (పరిశుద్ధి-పోషించుట)

ఇరఇత్సంజ్ఞావాచ్యా—(వా)

ఇర్-అనుదాని కిత్సంజ్ఞ యగును.

సూ.—ణిజాం త్రయాణాం గుణః శ్లౌ—౭-౪-౭౫.

ణిజిర్ - విజిర్ - విష్ఌ ధాతువులయభ్యాసమునకు శ్లువు వచ్చినపుడు గుణమగును.

ఉదా:—నేనేక్తి - నేనిక్తః - నేనిజతి; నేనిక్తే. నినేజ; నినిజే. నేక్తా. నేక్ష్యతి; నేక్ష్యతే. నేనేక్తు, నేనిగ్ధి.

సూ.—నాభ్యస్తస్యాచి పితి సార్వధాతుకే—౭-౩-౮౭

అభ్యస్తసంజ్ఞకమునకు అజాదియగుపిత్సార్వధాతుకము పరమగుచో లఘూపధ గుణము రాదు.

ఉదా:—నేనిజాని- నేనిక్తామ్.అనేనేక్ (గ్)-అనేనిక్తామ్ అనేనిజుః, అనేనిజమ్, అనేనిక్త. నేనిజ్యాత్. నిజ్యాత్. నేనిజీత; నిక్షీష్ట.

సూ.—ఇరితో వా—౩-౧-౫౭.

ఇర్-అనునది ఇత్సంజ్ఞగాఁ గలధాతువుకంటెఁ బరమగు చ్లిప్రత్యయమునకుఁ బరస్మైపదములు పరమగునపుడు అఙ్ (అ) అనునాదేశము వికల్పముగానగును.

ఉదా:—అనిజత్, అనైక్షీత్; అనిక్త. అనేక్ష్యత్; అనేక్ష్యత.

ఇవి జుహోత్యాదులు.

---

దివాదులు.

(౧) దివు=క్రీడా-విజిగీషా - వ్యవహార - ద్యుతి- స్తుతి- మోద-మద-స్వప్న - కాన్తి-గతిషు (క్రీడించుట - జయమును గోరుట-వ్యవహరించుట - ప్రకాశించుట- స్తుతించుట - సంతోషించుట-మదించుట-నిద్రించుట-కోరుట- వెళ్లుట)

సూ.—దివాదిభ్యః శ్యన్—౩-౧-౬౯.

కర్త్రర్థకమగు సార్వధాతుకము పరమగుచో దివు - మున్నగు ధాతువులకంటెఁ బరముగా శ్యన్ (య) అను (వికరణ) ప్రత్యయమగును. శప్పున కపవాదము.

ఉదా:—దివ్+య+తి 'హలిచ' యనుసూత్రముచేత దీర్ఘము=దీవ్యతి. దిదేవ. దేవితా. దేవిష్యతి. దీవ్యతు. అదీవ్యత్. దీవ్యేత్. దీవ్యాత్. అదేవీత్. అదేవిష్యత్.

(౨) షివు=తంతుసంతానే (కుట్టుట) దివుధాతువునకుఁ బోలె దీనిప్రక్రియ యూహించునది.

(3) నృతీ=గాత్రవిక్షేపే. (నాట్యముసేయుట)

ఉదా:—నృత్యతి. ననర్త. నర్తితా.

సూ.—సేఽసిచికృతచృతఛృదతృదనృతః—౭-౨-౫౭.

కృతీ-చృతీ - ఉచ్ఛృదిర్ - ఉతృదిర్ - నృతీధాతువులకంటెఁ బరమును, సిజ్భిన్నమును, సకారాదియు నగు నార్ధధాతుకమునకు ఇడాగమము వికల్పముగానగును.

ఉదా:—నర్తిష్యతి; నర్త్స్యతి. నృత్యతు. అనృత్యత్. నృత్యేత్. నృత్యాత్. అనర్తీత్. అనర్తిష్యత్; అనర్త్స్యత్.

(౪) త్రసీ = ఉద్వేగే (భయపడుట) వాభ్రాశ-యను సూత్రముచేత శ్యన్ను వికల్పముగా నగును.

ఉదా:—త్రస్యతి; త్రసతి-తత్రాస.

సూ.—వాజ్యాభ్రముత్రసామ్—౬-౪-౧౨౪.

జ్యా-జ్యాష్-భ్రము-త్రసీ ధాతువులకు కిత్తగు లిట్టు గాని, ఇడాదియగు థల్లుగాని పరమగుచో నేత్వాభ్యాసలోప ములు వికల్పముగా నగును.

ఉదా:—త్రేసతుః, తత్రసతుః-త్రేసిథ-తత్రసిథ. త్రసితా.

(౫) శో=తనూకరణే (పదనువెట్టుట)

సూ.—ఓతఃశ్యని—౭-౩-౭౧.

శ్యన్ను పరమగునపుడు ఓకారమునకు లోపమగును.

ఉదా:—శ్యతి-శ్యతః - శ్యన్తి. శశౌ - శశతుః-శశుః శశిథ-శశాథ. శాతా. శాస్యతి. శ్యేత్. శాయాత్.

సూ.—విభాషాఘ్రాధేట్శాచ్ఛాసః—౨-౪-౭౮.

ఘ్రా-ధేట్-శో - ఛో-షో ధాతువులకంటెఁ బరమగు సిచ్చునకుఁ బరస్మైపదములు పరమగుచో లుక్కు- వికల్పముగా నగును.

ఉదా:—అశాత్ - అశాతామ్ - అశుః, "యమరమ నమాతామ్" అను సూత్రముచేత ఇట్టును సగాగమమును రాఁగా, అశాసీత్-అశాసిష్టామ్ అనురూపములు సిద్ధించును.

(౬) ఛో=ఛేదనే(ఛేదించుట) ఛ్యతి(౭) షో=అన్తకర్మణి (చంపుట) స్యతి. ససౌ. (౮) దో=అవఖణ్డనే (ఖండించుట) ద్యతి. దదౌ. దేయాత్. అదాత్. (౯) వ్యధ=తాడనే (కొట్టుట)

సూ.—గ్రహిజ్యావయివ్యధివష్టివిచతివృశ్చతిపృచ్ఛతి భృజ్జతీనాం జితిచ—౬-౧-౧౬.

"లిట్యభ్యాసస్య" అనుసూత్రమున వివరింపఁబడిన గ్రహ్యాదిధాతువులకు కిత్తుగాని జిత్తుగాని పరమగుచో సంప్రసారణమగును.

ఉదా:—విధ్యతి. వివ్యాధ-వివిధతుః-వివిధుః, వివ్యధిథ, వివ్యద్ధ. వ్యద్ధా. వ్యత్స్యతి. విధ్యేత్. విధ్యాత్. అవ్యాత్సీత్-అవ్యాద్ధామ్.

(౧౦) పుష = పుష్టౌ (పోషించుట). పుష్యతి. పుపోష, పుపోషిథ. పోష్టా. పోక్ష్యతి. "పుషాదిద్యుతాది" అను సూత్రముచేత అఙ్-అపుషత్.

(౧౧) శుష = శోషణే (శుష్కించుట). శుష్యతి. శుశోష. అశుషత్. తుష=ప్రీతౌ (తృప్తినొందుట) దుషవైకృత్యే (వికారమునొందుట). ఇత్యాదుల ప్రక్రియ యూహించునది.

(౧౨) ణశ=అదర్శనే (కనుపడకుండుట.)

ఉదా:—నశ్యతి. ననాశ, నేశతుః.

సూ.—రధాదిభ్యశ్చ—౭-౨-౪౫.

రధ-ణశ-తృప-దృప-ద్రుహ-ముహ-ష్ణుహ-ష్ణిహ-ధాతువులకంటెఁ బరమగు వలాద్యార్ధధాతుకమునకు ఇడాగమము వికల్పముగానగును. ఉదా:—నేశిథ.

సూ.—మస్జినశోర్ఝలి—౭-౧-౬౦.

టుమస్జో-ణశ ధాతువులకంటె ఝలాదిప్రత్యయము పర మగునపుడు నుమ్ (న్) అను నాగమ మగును.

ఉదా:—ననంష్ఠ - నేశివ-నేశ్వ - నేశిమ-నేశ్మ. నశితా; నంష్టా. నశిష్యతి; నఙ్క్ష్యతి. నశ్యతు. అనశ్యత్. నశ్యేత్. నశ్యాత్. అనశత్.

(౧౩) షూఙ్=ప్రాణిప్రసవే (ప్రసవించుట) సూయతే. సుషువే. "స్వరతిసూతి" యనుదానిచేతఁ బ్రాప్తించు వికల్ప మును బాధించి, క్రాదినియమముచేత నిత్యముగా లిట్టులో నిడాగమము వచ్చును. సుషువిషే-సుషువివహే-సుషువిమహే. సవితా; సోతా. సవిషీష్ట; సోషీష్ట. అసవిష్ట; అసోష్ట. (౧౪) దూఙ్ =పరితాపే (పరితపించుట) దూయతే.

(౧౫) దీఙ్=క్షయే (నశించుట) దీయతే.

సూ.—దీఙో యుడచి క్ఙితి—౬-౪-౬౩.

దీఙ్ ధాతువుకంటెఁ బరమును, అజాదియు, కిత్తుగాని ఙిత్తుగానియునగు, ఆర్ధధాతుకమునకు యుట్ (య్) అను నాగమమగును.

ఉదా:—దిదీయ్+ఏ ఇట నాభీయమగుటచేత యుడా గమ మసిద్ధమగునుగాన యణ్ణు ప్రాప్తింపఁగా,

పుగ్యుటావువజ్యణోస్సిద్ధౌ వక్తవ్యౌ—(వా)

ఉపజాదేశము చేయునపుడు పుగాగమమును, యణాదేశముచేయునపుడు యుడాగమమును, అసిద్ధములు గావు. కాన యణ్ణు లేదు. దిదీయే.

సూ.—మీనాతిమినోతిదీఙాం ల్యపి చ—౬-౧-౫౦.

మీఙ్-మిఞ్-దీఙ్ ధాతువులకు ల్యప్పుగాని, శిద్భిన్నమును, ఏచ్చునకు నిమిత్తము నగు ప్రత్యయముగాని పరమగుచో ఆకార మాదేశమగును.

ఉదా:—దాతా. దాస్యతి.

స్థాఘ్వోరిత్త్వే దీఙః ప్రతిషేధః—(వా)

'స్థాఘ్వోరిచ్చ' యనుదానిచేఁ బ్రాప్తమగు ఇత్వము దీఙ్ ధాతువునకు రాదు. ఉదా:—అదాస్త.

(౧౬) డీఙ్ = విహాయసాగతౌ (ఎగురుట) డీయతే. డిడ్యే. డయితా. (౧౭) పీఙ్=పానే (పానముచేయుట) పీయతే పేతా. అపేష్ట. (౧౮) మాఙ్=మానే (కొలుచుట) మాయతే. మమే. (౧౯) జనీ=ప్రాదుర్భావే (పుట్టుట) ప్రాదుర్భావ మనఁగా నభివ్యక్తిగాని, యుత్పత్తిగాని యర్థము.

సూ.—జ్ఞాజనోర్జా—౭-౩-౭౯.

జ్ఞా-జనీ ధాతువులకు శిత్తు పరమగునపుడు జా-యను నాదేశమగును.

ఉదా:—జాయతే. జజ్ఞే, జజ్ఞిషే - జజ్ఞివహే. జనితా. జనిష్యతే.

సూ.—దీపజనబుధపూరితాయిప్యాయిభ్యోఽన్యతరస్యామ్—3-౧-౬౧.

దీపీ-జనీ-బుధ (దైవాదికము) పూరీ-తాయ్ఱు-ఓప్యాయీ ధాతువులకంటెఁ బరమగు చ్లిప్రత్యయమునకు, ఏకవచనమగు తశబ్దము పరమగునపుడు, చిణ్ (ఇ) అను నాదేశము వికల్పముగానగును.

సూ.—చిణో లుక్—౬-౪-౧౦౪.

చిణ్ణుకంటెఁ బరమగుదానికి లుక్కగును.

సూ.—జనివధ్యోశ్చ—౭-3-3౫.

జనీ-వధ (ఇది హింసార్థకము ధాతుపాఠమున లేనిది) ధాతువులయొక్క యుపధకు చిణ్ణును, ఞిత్తుగాని ణిత్తుగాని యగుకృత్తును, బరమగుచో వృద్ధిరాదు.

ఉదా:—అజని. అజనిష్ట.

(౨౦) దీపీ=దీప్తౌ (ప్రకాశించుట) దీప్యతే. దిదీపే. దీపితా. అదీపి. అదీపిష్ట. (౨౧) పద=గతౌ (వెళ్లుట) పద్యతే. పేదే. పత్తా. పత్సీష్ట.

సూ.—చిణ్ తే పదః—3-౧-౬౦

పదధాతువుకంటెఁ బరమగు చ్లిప్రత్యయమునకు, ఏకవచనమగు తశబ్దము పరమగుచో చిణ్-అనునాదేశంబగును.

ఉదా:—అపాది-అపత్సాతామ్-అపత్సత. (౨౨) ఖిద=దైన్యే (ఖేదించుట) (౨౩) విద = సత్తాయామ్ (ఉండుట) విద్యతే. వేత్తా. విత్సీష్ట. అవిత్త. (౨౪) బుధ=అవగమనే (తెలిసికొనుట) బుధ్యతే. బోద్ధా. భోత్స్యతే. భుత్సీష్ట. అబోధి. అబుద్ధ-అభుత్సాతామ్. (౨౫) యుధ=సంప్రహారే (కొట్టుట) యుధ్యతే. యుయుధే. యోద్ధా. అయుద్ధ. (౨౬) సృజ=విసర్గే (సృజించుట) సృజ్యతె. ససృజే, ససృజిషే.

సూ.—సృజిదృశోర్ఝల్యమకితి—౬-౧-౫౮.

సృజ-దృశిర్ ధాతువులకు కిద్భిన్నమగు ఝలాదిప్రత్యయము పరమగుచో, అమ్ (అ) అనునాగమ మగును.

ఉదా:—స్రష్టా. స్రక్ష్యతే. సృక్షీష్ట. అసృష్ట-అసృక్షాతామ్. (౨౭) మృష = తితిక్షాయామ్ (ఓరిమి) మృష్యతి; మృష్యతే. మమర్ష, మమర్షిథ; మమృషిషే. మర్షితాసి; మర్షితాసే. మర్షిష్యతి; మర్షిష్యతే. అమృషత్. అమర్షిష్ట; (౨౮) ణహ=బన్ధనే (బంధించుట) నహ్యతి; నహ్యతే. ననాహ; ననద్ధ-నేహిథ; నేహే. నద్ధా. నత్స్యతి; నత్స్యతే. అనాత్సీత్; అనద్ధ.

ఇవి దివాదులు.

---

స్వాదులు.

(౧) షుఞ్=అభిషవే (స్నానముచేయించుట, పిండుట, స్నానముసేయుట.)

సూ.—స్వాదిభ్యః శ్నుః—3-౧-౭3.

షుఞ్ మున్నగు ధాతువులకంటెఁ గర్త్రర్థకసార్వధాతుకము పరమగుచో, శ్ను (ను) అను(వికరణ) ప్రత్యయమగును. శప్పునకపవాదము.

ఉదా:—సు+ను+తి గుణము=సునోతి - సునుతః-"హు శ్నువోః" అనుసూత్రము చేత యణ్ణు=సున్వన్తి, సున్వః - సునువః; సునుతే-సున్వాతే-సున్వతే, సున్వహే-సునువహే. సుషావ; సుషువే. సోతా. సును, సునవాని - సునవై; సునుయాత్. సూయాత్.

సూ.—స్తుసుధూఞ్భ్యః పరస్మైపదేషు—౭-౨-౭౨.

ష్టుఞ్-షుఞ్-షు-ధూఞ్ ధాతువులకంటెఁ బరమగు సిచ్చునకుఁ బరస్మైపదములు పరమగునపుడు, ఇడాగమమగును.

ఉదా:—అసావీత్; అసోష్ట. (౨) చిఞ్=చయనే (ప్రోగు సేయుట) చినోతి; చినుతే.

సూ.—విభాషా చేః—౭-3-౫౮.

చిఞ్ధాతువుయొక్క యభ్యాసముకంటెఁ బరమగు దానికి సన్ను గాని, లిట్టుగాని, పరమగునపుడు కుత్వము వికల్పముగానగును.

ఉదా:—చికాయ; చిచాయ-చిక్యే; చిచ్యే. అచైషీత్; అచేష్ట. (3) స్తృఞ్=ఆచ్ఛాదనే (ఆచ్ఛాదించుట) స్తృణోతి; స్తృణుతే.

సూ.—శర్పూర్వాః ఖయః—౭-౪-౬౧.

శర్పూర్వకములగు అభ్యాసముయొక్క ఖయ్యులు శేషించును; మిగిలినహల్లులు లోపించును.

ఉదా:—తస్తార-త స్తరతుః. త స్తరే-"గుణో ర్తిసంయో గాద్యోః" అనుదానిచేత గుణము. స్తర్యాత్.

సూ.—ఋతశ్చ సంయోగాదేః—౭-౨-౪౩.

ఋదంతమును, సంయోగాదియునగు నంగముకంటెఁ బరమగు లిఙ్లునకుఁగాని, సిచ్చునకుఁగాని, తఙ్లు పరమగుచో ఇట్టు వికల్పముగా నగును.

ఉదా:— స్తరిషీష్ట; స్తృషీష్ట. అ స్తరిష్ట; అ స్తృత. (౪) ధూఞ్=కమ్పనే (కంపించుట) ధూనోతి; ధూనుతే. దుధావ "స్వరతిసూతి" యనుసూత్రముచేత ఇట్టు వికల్పముగనగును. దుధవిథ; దుధోథ.

సూ.—శ్ర్యుకః కితి—౭-౨-౧౧.

శ్రిఞ్ ధాతువుకంటెను, నేకాచ్కములగు ఉగంతములకంటెను, బరమగు-గిత్తు-కిత్తులకు ఇడాగమంబు రాదు.

"స్వరతిసూతి-" యనుసూత్రముచేత విధింపఁబడినవికల్పమీనిషేధముకంటెఁ బరమైనను, అష్టాధ్యాయియందు ఇట్టివి కరణమునకు ముందుగా నిషేధప్రకరణము నారంభించుటచే 'శ్ర్యుకఃకిత' యనుదానిచేత నిడాగమనిషేధము ప్రాప్తించుచున్నను, క్రాదినియమముచే నిత్యముగానే యిడాగమ మగును.

ఉదా:—దుధువివ; దుధువే. అధావీత్; అధవిష్ట - అధోష్ట. అధవిష్యత్-అధోష్యత్ - అధవిష్యతామ్- అధోష్యతామ్. అధవిష్యత-అధోష్యత.

ఇవి స్వాదులు.

---

తుదాదులు.

(౧) తుద=వ్యథనే (దుఃఖించుట).

సూ.—తుదాదిభ్యశ్శః—3-౧-౭౭.

తుద మున్నగు ధాతువులకంటెఁ గర్త్రర్థకసార్వధాతుకము పరమగునపుడు, శ(అ) అను (వికరణ) ప్రత్యయమగును. శప్పున కపవాదము.

ఉదా:—తుదతి; తుదతే. తుతోద, తుతోదిథ; తుతుదే. తోత్తా. అతౌత్సీత్; అతుత్త. (౨) ణుద=ప్రేరణే (ప్రేరించుట) నుదతి; నుదతే. నునోద; నునుదే. నోత్తా (3) భ్రస్జ=పాకే (వండుట).

'గ్రహిజ్యా' యనుసూత్రముచేత సంప్రసారణము. సకారమునకు శ్చుత్వముచే శవర్ణము. దానికి జశ్త్వముచే జకారము=భృజ్జతి; భృజ్జతే.

సూ.—భ్రస్జోరోపధయో రమన్యతరస్యామ్—౬-౪-౪౭.

భ్రస్జధాతు రేఫముయొక్కయు, నుపధయొక్కయు స్థానమున నార్ధధాతుకము పరమగునపుడు, రమ్(ర్)అనునాగమము

వికల్పముగానగును. ఇది మిత్తుగాన నంత్యాచ్చుకంటెఁ బరము గానగును. స్థానమునందనుట చేత రేఫోపధలు నివర్తించును.

ఉదా:—బభర్జ - బభర్జతుః; బభర్జిథ-బభర్ష్ఠ; బభ్రజ్జ-బభ్రజ్జతుః, బభ్రజ్జిథ-"స్కోస్సంయోగాద్యోః" అనుసూత్రము చేత సకారలోపము. "వ్రశ్చభ్రస్జ" యను సూత్రముచేత షత్వము-బభ్రష్ఠ, బభర్జే-బభ్రజ్జే. భర్ష్టా-భ్రష్టా. భర్క్ష్యతి - భ్రక్ష్యతి. కిత్తులును జిత్తులును బరమగునపుడు రమాగమమును బాధించి, పూర్వవిప్రతిషేధముచే సంప్రసారణము. భృజ్జ్యాత్-భృజ్జ్యాస్తామ్-భృజ్జ్యాసుః. భర్క్షీష్ట-భ్రక్షీష్ట. అభార్క్షీత్-అభ్రాక్షీత్; అభర్ష్ట-అభ్రష్ట. (౮) కృష=విలేఖనే (గీయుట-దువ్వుట) కృషతి; కృషతే. చకర్ష; చకృషే.

సూ.—అనుదాత్తస్య చర్దుపధస్యాన్యతరస్యామ్—
౬-౧-౫౯.

ఉపదేశకాలమున ననుదాత్తము, ఋుదుపధము నగు ధాతువునకు కిద్భిన్నము, ఝలాదియు నగుప్రత్యయము పరమగుచో, అమాగమము వికల్పముగానగును.

ఉదా:—క్రష్టా-కర్ష్టా. కృష్యాత్; కృక్షీష్ట.

స్పృశమృశకృషతృపదృపాం చ్లేస్సిజ్వా వాచ్యః—(వా)

స్పృశ-మృశ-కృష-తృప-దృప (ఈ రెండును దైవాదికములు) ధాతువులకంటెఁ బరమగు చ్లిప్రత్యయమునకు సిచ్చు వికల్పముగానగును. సిచ్చు పరమగునపు డమాగమమును వికల్పము గానగును.

ఉదా:—అక్రాక్షీత్ - అకార్క్షీత్. పక్షమున క్సాదే శము-అకృక్షత్. తఙ్ఝు పరమగుచో సిచ్చు కిత్తుగాన నమాగ మము రాదు. అకృష్ట-అకృక్షాతామ్ - అకృక్షత; అకృక్షత-అకృక్షాతామ్-అకృక్షన్త.

(౫) మిల=సంగమే (కలియుట) మిలతి; మిలతే. మిమేల. మేలితా. అమేలీత్. (౬) ముచ్లృ = మోక్షణే (విడుచుట.)

సూ.—శే ముచాదీనామ్—౭-౧-౫౯.

ముచ్లృ-లిప-విద్లృ-లుప్లృ-షిచ-కృతీ-ఖిద-పిశ అను నీయెనిమిది ధాతువులకును, శ(వికరణ)ప్రత్యయము పరమగునపుడు నుమాగమ మగును. అనుస్వారపరసవర్ణములు.

ఉదా:—ముఞ్చతి;ముఞ్చతే.మోక్తా.ముచ్యాత్;ముక్షీష్ట. అముచత్; అముక్త-అముక్షాతామ్ - అముక్షత. (౭) లుప్లృ = ఛేదనే(ఛేదించుట) లుమ్పతి; లుమ్పతే. లోప్తా. అలుపత్. అలుప్త. (౮) విద్లృ=లాభే(పొందుట) విన్దతి; విన్దతే. వివేద; వివిదే. విద్లధాతువు వ్యాఘ్రభూత్యాదులమతమున సేట్టు. వేదితా-భాష్యకారునిమతమున ననిట్టు పరివేత్తా - పరియనునది వర్జనార్థకము. (౯) షిచ=క్షరణే (తడుపుట) సిఞ్చతి; సిఞ్చతే.

సూ.—లిపిసిచిహ్వశ్చ—౩-౧-౫౩.

లిప-షిచ-హ్వేఞ్ ధాతువులకంటెఁ బరమగు చ్లిప్రత్యయమునకు అఙా దేశమగును.

ఉదా:—అసిచత్.

సూ.—ఆత్మనేపదేష్వన్యతరస్యామ్—3-౧-౫౪.

లిప-షిచ-హ్వేఞ్ ధాతువులకంటెఁ బరమగు చ్లిప్రత్యయమునకు ఆత్మనేపదములు పరమగునపుడు, అఙాదేశము వికల్పమునగును.

ఉదా:—అసిచత; అసిక్త. (౧౦) లిప=ఉపదేహే (వృద్ధి నొందుట, పూయుట) లిమ్పతి; లిమ్పతే. లేప్తా. అలిపత్; అలిపత - అలిప్త.

ఇవియుభయపదులు.

(౧౧) కృతీ=ఛేదనే (ఛేదించుట) కృన్తతి. చకర్త. కర్తితా. కర్తిష్యతి-కర్త్స్యతి. అకర్తీత్. (౧౨) ఖిద=పరిఘాతే (కొట్టుట) ఖిన్దతి. చిఖేద. ఖేత్తా. (౧౩) పిశ=అవయవే (ఇది దీపనార్థమందునువర్తించును.) పింశతి. పేశితా. "త్వష్టారూపాణిపింశతు" అనిప్రయోగము. (౧౪) ఓవ్రశ్చూ=ఛేదనే (ఛేదించుట) "గ్రహిజ్యా" యనుసూత్రముచేత సంప్రసారణము. వృశ్చతి-"లిట్యభ్యాసస్య" యనుసూత్రముచేత రేఫమునకు సంప్రసారణముగ ఋకారము వచ్చును. 'ఉరత్' అనుదానిచే నాఋకారమునకు ప్రత్యయనిమిత్తకమగు అకారము—దానికి స్థానివద్భావము చేయఁగా "న సంప్రసారణే సంప్రసారణ" మ్మనునిషేధముచే వకారమునకు సంప్రసారణము రాదు.వవ్రశ్చ, వవ్రశ్చిథ, వవ్రష్ఠ. వ్రశ్చితా-వ్రష్టా. వ్రశ్చిష్యతి - వ్రక్ష్యతి. అవృశ్చత్. వృశ్చ్యాత్. అవ్రశ్చీత్.

అవ్రాక్షీత్ (౧౫)వ్యచ=వ్యాజీకరణే.(మిష పెట్టుట)విచతి.వివ్యాచ-వివిచతుః. వ్యచితా. వ్యచిష్యతి. విచ్యాత్. అవ్యాచీత్-అవ్యచీత్. "వ్యచేఃకుటాదిత్వమనసి" అనునది యిటఁ బ్రవర్తింపదు "అస్సు"కృత్తుగాన "అనసి" యనుపర్యుదాసముచేఁ దద్భిన్నము తత్సదృశమునగు కృత్తునందు మాత్రమే ప్రవర్తించును (౧౬) ఉఛి=ఉఞ్ఛే (గింజెలు ఏఱుకొనుట) ఉఞ్ఛతి (౧౭) ఋచ్ఛ=గతీన్ద్రియప్రలయమూర్తిభావేషు. ఋచ్ఛతి-"ఋచ్ఛత్యౄతామ్" ష్మనుదానిచే గుణము-"తస్మాన్నుడ్ద్విహలః"అనుసూత్రమందలి-ద్విహల్పద మనేకహల్కుల కుపలక్షకము (అనఁగా నొకటికంటె నధికమగుహల్కులు కలదియనుట.) దానంజేసి యిటనుడాగమంబు—ఆనర్చ్ఛ - ఆనర్చ్ఛతుః. ఋచ్ఛితా. (౧౮) ఉజ్ఝి = ఉత్సర్గే (విడుచుట) - ఉజ్ఝతి. (౧౯) లుభ = విమోహనే (విమోహన మన నాకులీకరణము)- ఉదా:—లుభతి.

సూ.—తీషసహలుభరుషరిషః—౭-౨-౪౮.

ఇష (తౌదాదికము)-షహ-లుభ-రుష - రిషధాతువుల కంటెఁ బరమగు తకారాద్యార్ధధాతుకమునకు, ఇడాగమము వికల్పనముగానగును.

ఉదా:—లోభితా - లోబ్ధా. లోభిష్యతి. (౨౦-౨౧) తృప-తృమ్ఫ=తృప్తౌ. తృపతి. తతర్ప. తర్పితా. లుఙ్గున సిచ్చు నిత్యము - అతర్పీత్. 'స్పృశమృశ' యనువార్తికము అజప వాద మగుటచే నందు దైవాదికములగు తృప దృప ధాతు

వులకే గ్రహణముగాన సిజ్వికల్పము లేదు. శవికరణము జిత్తు గాన నలోపము రాఁగా,

## శేతృమ్ఫాదీనాం నుమ్వాచ్యః—(వా)

తృమ్ఫాదులకు శ (వికరణ) ప్రత్యయము పరమగుచో నుమాగమం బగును. ఇందలి యాదిశబ్దము ప్రకారవాచకము గాన నకారానుషక్తములగు ధాతువులు తృమ్ఫాదులని తెలియ నగును.

ఉదా:—తృమ్ఫతి. తతృమ్ఫ. తృఫ్యాత్. (౨౨-౨3) మృడ-పృడ=సుఖనే(సుఖించుట)మృడతి.పృడతి(౨౪)శున=గతౌ (వెళ్లుట) శునతి. (౨౫) ఇష - ఇచ్ఛాయామ్ (కోరుట) - ఇచ్ఛతి. ఏషితా - ఏష్టా. ఏషిష్యతి. ఇష్యాత్. ఐషీత్. (౨౬) కుట=కౌటిల్యే. గాఙ్కుటాదిసూత్రమువలన జిత్త్వముండుటచే గుణములేదు - చుకుటిథ, చుకోట - చుకట. కుటితా. (౨౭) పుట=సంశ్లేషణే. (కలిసికొనుట)పుటతి. పుటితా. (౨౮) స్ఫుట= వికసనే (వికసించుట) స్ఫుటతి.స్ఫుటితా.(౨౯-3౦)స్ఫుర-స్ఫుల= సంచలనే (కదలుట) స్ఫురతి. స్ఫులతి.

## సూ.—స్ఫురతిస్ఫులత్యోర్నిర్నివిభ్యః—౮-3-౭౬.

నిర్-ని-వి అనునట్టియుపసర్గములకంటెబరమగు స్ఫుర-స్ఫుల ధాతువులయొక్క సకారమునకు షత్వము వికల్పముగా నగును.

ఉదా:—నిష్ఫురతి - నిస్ఫురతి. నిష్ఫలతి - నిస్ఫలతి. (31) ణూ=స్తవనే (స్తుతించుట) "పరిణూతగుణోదయః" అని ప్రయోగము. నువతి. నునావ. నువితా. (32) టుమస్జో=శుద్ధౌ.శ్చుత్వము-జశ్త్వము=మజ్జతి. మమజ్జ. "మస్జినశో" అను దానిచేత నుమ్ము.

మస్జేరన్త్యాత్పూర్వో నుమ్వాచ్యః—(వా)

మస్జో ధాతువునకు, అంత్యవర్ణముకంటెఁ బూర్వమున నుమాగమ మగును. అంత్యాచ్చునకుఁ బరముగా రాదనుట. సంయోగాదిలోపము. మమజ్క్థ-మమజ్జిథ. మఙ్క్తా. మఙ్క్ష్యతి. అమాఙ్క్షీత్ - అమాఙ్క్తామ్ - అమాఙ్క్షుః. (33) రుజో=భఙ్గే(విఱుగుట)రుజతి.రోక్తా. రోక్ష్యతి. అరౌక్షీత్-అరౌక్తామ్. (34) భుజో=కౌటిల్యే.దీనిరూపంబులు పైదానికింబోలె నెఱుంగునది (35) విశ = ప్రవేశనే (ప్రవేశించుట) విశతి. (36) మృశ=ఆమర్శనే (స్పృశించుట) "అనుదాత్తస్య చ" యను దానిచేత అమాగమవికల్పము - సిచ్చు=అమ్రాక్షీత్-అమార్క్షీత్. క్సాదేశము-అమృక్షత్. (37) షద్ల=విశరణగత్యవసాదనేషు. "పాఘ్రాధ్మా"సూత్రముచే సీదాదేశము-సీదతి - తుదాదులలోఁ జెప్పుటచేత "ఆచ్ఛీనద్యోర్నుమ్మను దానిచేనుమ్ము వికల్పము గానగును-సీదతీ-సీదన్తీ. (38) శద్ల=శాతనే (పడను పెట్టుట).

సూ.—శదేశ్శితః—౧-3-౬౦.

శిత్తునకు విషయమగు శద్లధాతువుకంటెఁ బరముగ నాత్మనేపదమగును.

ఉదా:—శీయా దేశము-శీయతే. శీయతామ్. అశీయత. శీయేత. శశాద. శత్తాసి. శత్స్యతి. అశదత్. అశత్స్యత్.(3౯) కృ=వి క్షేపే (చిమ్ముట)

సూ.—బూత ఇద్ధాతోః—౭-౧-౧౦౦.

బూదంతధాతువగు నంగమునకు హ్రస్వమైన ఇకార మగును.

ఉదా:—కిరతి. చకార - చకరతుః-చకరుః. కరితా- కరీతా. కీర్యాత్. అకారీత్.

సూ.—కిరతౌ లవనే—౬-౧-౧3౯.

ఉప-యనునట్టియుపసర్గముకంటెఁ బరమును, ఛేదనార్థకమునగు కృధాతువునకు సుట్ (స్)-అను నాగమ మగును.

ఉదా:—ఉపస్కిరతి.

సూ.—అడభ్యాసవ్యవాయేఽపి సుట్కాత్పూర్వ ఇతివక్తవ్యమ్—(వా)

అడాగమముతోఁగాని, అభ్యాసముతోఁగాని, వ్యవధానమున్నను,సుట్టు క కారముకంటెఁ బూర్వముగనే యగును.

ఉదా.—ఉపాస్కిరత్. ఉపచస్కార.

## సూ. హింసాయాం ప్రతేశ్చ—౬-౧-౧౪౦.

హింసార్థమున ఉప-ప్రతి అనునట్టి యుపసర్గములకంటెఁ బరమగు కౄధాతువునకు సుడాగమమగును.

ఉదా:—ఉపస్కిరతి. ప్రతిస్కిరతి.

(౪౦) గౄ=నిగరణే (భక్షించుట)

## సూ.—అచి విభాషా—౮-౨-౨౧.

అజాదిప్రత్యయము పరమగునపుడు గౄధాతువు యొక్క రేఫమునకు లత్వము వికల్పముగా నగును.

ఉదా:—గిలతి, గిరతి. జగాల, జగార; జగలిథ, జగరిథ. గలితా-గలీతా, గరితా-గరీతా. (౪౧) ప్రచ్ఛ=జ్ఞీప్సాయామ్ (అడుగుట.) 'గ్రహిజ్యా' యనుసూత్రముచేత సంప్రసారణము - పృచ్ఛతి. పప్రచ్ఛ-పప్రచ్ఛతుః, పప్రచ్ఛిథ-పప్రష్ఠ. ప్రష్టా. ప్రక్ష్యతి. అప్రాక్షీత్. (౪౨) మృఙ్ = ప్రాణత్యాగే (మరణించుట)

## సూ.—మ్రియతేర్లుఙ్లిఙోశ్చ—౧-౩-౬౧.

లుఙ్ఙునకుగాని, లిఙ్ఙునకుగాని ప్రకృతియగునట్టియు, శిత్తునకు విషయమగునట్టియు, మృఙ్ధాతువుకంటెఁ బరముగా నాత్మనేపద మగును. ఇటఁదప్ప మఱియెచ్చటను నాత్మనేపదము రాదు. రిఙ్ఙు-ఇయఙ్ఙు=మ్రియతే. మమార, మమర్థ, మమ్రివ. మర్తాసి. మరిష్యతి. మృషీష్ట. అమృత. (౪3) పృఙ్ = వ్యాయామే (పనిచేయుట) తఱుచుగా నీధాతువునకు

వి-ఆఙ్ అనునవి పూర్వముగనుండును-వ్యాప్రియతే. వ్యాపప్రే-వ్యాపప్రాతే. వ్యాపరిష్యతే. వ్యాపృత - వ్యాపృషాతామ్. (౮౮) జుషీ=ప్రీతిసేవనయోః (ప్రీతినొందుట - సేవించుట) జుషతే. జుజుషే. (౮౯) ఓవిజీ = భయచలనయోః (భయపడుట - చలించుట) ఈథాతువుతఱుచుగా, ఉద్ - అనునుపసర్గముతోఁ గూడియుండును. ఉద్విజతే.

సూ.—విజ ఇట్—౧-౨-౨.

ఓవిజీథాతువుకంటెఁ బరమగు నిడాది ప్రత్యయము జిత్తువంటి దగును. కాన గుణము లేదు.

ఉదా:—ఉద్విజితా.

ఇవి తుదాదులు



రుధాదులు.

(౧) రుధిర్ = ఆవరణే (ఆవరించుట-అరికట్టుట)

సూ.—రుధాదిభ్యః శ్నమ్—౩-౧-౭౮.

కర్త్రర్థకసార్వధాతుకము పరమగునపుడు రుధిర్ - మున్నగు ధాతువులకంటెఁ బరముగా శ్నమ్ (న) అను వికరణప్రత్యయ మగును—శప్పున కపవాదము.

ఉదా:—రుధ్+తి రునధ్+తి ణత్వాదికము=రుణద్ధి - "శ్నసోరల్లోపః" అనుదానిచేత అకారలోపము - అనుస్వార పరసవర్ణములు. 'ఝరో ఝరి' యనుసూత్రముచే ధకారలోపము. రున్ధః-రున్ధన్తి, రుణత్సి - రున్ధః - రున్ధ, రుణధ్మి-

రున్ధ్వః - రున్ధ్మః; రున్ధే - రున్ధాతే - రున్ధతే, రున్త్సే-రున్ధాథే - రున్ధ్వే, రున్ధ్వే - రున్ధ్వహే- రున్ధ్మహే.రురోధ; రురుధే. రోద్ధా. రోత్స్యతి; రోత్స్యతే. రుణద్ధు-రున్ధాత్ - రున్ధామ్-రున్ధన్తు, రున్ధి, రుణధాని-రుణధావ-రుణధామ; రున్ధామ్-రున్ధాతామ్-రున్ధతామ్, రున్త్స్వ, రుణధై-రుణధావహై-రుణధామహై. అరుణత్ (ద్)- అరున్ధామ్ - అరున్ధన్, అరుణత్ (ద్)-అరుణః. అరున్ధ - అరున్ధాతామ్-అరున్ధత. రున్ధ్యాత్; రున్ధీత. రుధ్యాత్; రుత్సీష్ట. అరుధత్ - అరౌత్సీత్; అరుద్ధ. అరోత్స్యత్; అరోత్స్యత. (౨) భిదిర్=విదారణే (3) ఛిదిర్ = ద్వైధీకరణే (౪) యుజిర్ = యోగే (౫) రిచిర్=విరేచనే (తొలఁగించుట, ఉదరమును (మలమును) శుభ్రపఱుచుట) రిణక్తి; రిఙ్క్తే. రిరేచ. రేక్తా. రేక్ష్యతి. అరిణక్-అరిచత్. అరైక్షీత్. అరిక్త. (౬) విచిర్ = పృథగ్భావే (వేఱగుట) వినక్తి: విఙ్క్తే. (౭) క్షుదిర్ = సంపేషణే (నూరుట.) క్షుణత్తి; క్షున్త్తే. క్షోత్తా. అక్షుదత్. అక్షౌత్సీత్; అక్షుత్త. (౮) ఉచ్ఛృదిర్=దీప్తిదేవనయోః (ప్రకాశించుట, క్రీడించుట) ఛృణత్తి; ఛృన్త్తే. చచ్ఛర్ద- "సేసిచి" యను సూత్రముచే సకారాద్యార్ధధాతుకమునకు నిడ్వికల్పము. చచ్ఛృత్సే, చచ్ఛృదిషే. ఛర్దితా. ఛర్దిష్యతి-ఛర్త్స్యతి. అచ్ఛృదత్. అచ్ఛర్దీత్; అచ్ఛర్దిష్ట. (౯) ఉతృదిర్ = హింసానాదరయోః (హింసించుట, నిరాకరించుట) తృణత్తి; తృన్త్తే. (౧౦) కృతీ=ఛేదనే-వేష్టనేచ (ఛేదించుట, చుట్టుకొనుట) కృణత్తి. (౧౧-౧౨) తృహ-హిసి=హింసాయామ్ (హింసించుట)

సూ.—తృణహ ఇమ్—౭-౩-౯౨

హలాదియుఁ బకారేత్సంజ్ఞకము నగు ప్రత్యయము పరమగుచో, శ్నమ్ముతోఁ గూడిన-తృహధాతువునకు ఇమ్ (ఇ) అనునాగమ మగును.

ఉదా:—తృనహ్+తి తృన+ఇ+హ్+తి గుణము = తృనేహ్+తి ణత్వాదికము=తృణేఢి-తృణ్ఢః. తతర్హ. తర్హితా. అతృణేట్.

సూ.—శ్నాన్నలోపః—౬-౪-౨౩

శ్నమ్ ప్రత్యయముకంటెఁ బరమగు నకారమునకు లోపమగును.

ఉదా:—హిన్స్+తి హినన్స్+తి హినస్+తి=హినస్తి. జిహింస. హింసితా.

సూ.—తిప్యనస్తేః—౮-౨-౭౩.

పదాంతమగు సకారమునకు తిప్పు పరమగునపుడు దకారమగును. అసధాతువుయొక్క సకారమునకు రాదు. "ససజుషో రుః" అనుసూత్రమున కపవాదము.

ఉదా:—అహినత్ - అహినద్ - అహింస్తామ్ - అహింసన్.

సూ.—సిపి ధాతోరుర్వా—౮-౨-౭౪.

ధాతువుయొక్క పదాంతసకారమునకు సిప్పు పరమగునపుడు రుత్వము వికల్పముగా నగును.

ఉదా:—అహినః-పక్షమునఙశ్త్వము - అహినత్ (ద్)
(౧౩) ఉన్దీ = క్లేదనే (తడుపుట) ఉనత్తి - ఉన్తః - ఉన్దన్తి. ఉన్దాఞ్చకార. ఔనత్ - ఔన్తామ్-ఔన్దన్, ఔనః; ఔనత్ (ద్)-ఔనదమ్.(౧౪) అఞ్జూ=వ్యక్తిమ్రక్షణకాన్తిగతిషు.(వ్యక్తి యనఁగా వివేచనము-మ్రక్షణమనస్నిగ్ధత్వము.)అనక్తి-అఙ్క్తః అఞ్జన్తి, ఆనఞ్జ, ఆనఞ్జిథ; ఆనఙ్క్థ. అఞ్జితా-అఙ్క్తా. అఙ్గ్ధి - అనజాని. ఆనక్.

## సూ.—అఞ్జేస్సిచి—౭-౨-౭౧.

అఞ్జూధాతువుకంటెఁ బరమగు సిచ్చునకు ఇట్టు నిత్యముగానగును.

ఆఞ్జీత్. (౧౫) తఞ్చూ = సంకోచనే (దుఃఖించుట) తనక్తి. తఙ్క్తా - తఞ్చితా. (౧౬) ఓవిజీ = భయచలనయోః. (భయపడుట - చలించుట) వినక్తి-విఙ్క్తః, "విజఇట్" అను దానిచేత నిడాదిప్రత్యయమునకు ఙిత్వ ముండునుగాన గుణము రాదు. వివిజిథ. విజితా. అవినక్. అవిజీత్. (౧౭) శిష్ల=విశేషణే (విడఁదీయుట) శినష్టిశింష్టః-శింషన్తి, శినక్షి. శిశేష, శిశేషిథ. శేష్టా. శేక్ష్యతి. హిప్రత్యయమునకు ధిభావంబు ఝల్త్వముచే డకారము-ష్టుత్వముచే ఢకారము వికల్పముగా డలోపము - అనుస్వారపరసవర్ణములు = శిణ్ఢి, శినషాణి. అశినట్. శింష్యాత్-శిష్యాత్. అశిషత్. (౧౮) పిష్ల=సంచూర్ణనే (పిండిచేయుట) పైదానివలెనే రూపంబు లూహించునది. (౧౯)

భఞ్జో=ఆమర్దనే-(మర్దించుట) 'శ్నాన్నలోప' యనుసూత్రము చేత నకారలోపము - భనక్తి. బభఞ్జిథ, బభఙ్క్థ. భఙ్క్తా. భఙ్గ్ధి. అభాఙ్క్షీత్. (౨౦) భుజ = పాలనాభ్యవహారయోః (పాలించుట, భుజించుట) భునక్తి. భోక్తా. భోక్ష్యతి. అభునక్. అభౌక్షీత్.

సూ.—భుజోఽనవనే—౧-3-౬౬.

పాలనభిన్నార్థమున భుజధాతువుకంటెఁ బరముగా నాత్మనేపద మగును.

ఉదా:—ఓదనం భుఙ్క్తే, మహీం భునక్తి. ఇటఁ బాల నంబర్థం బగుటచేత నాత్మనేపదము కాదు. (౨౧) ఞిఇన్ధీ=దీప్తౌ (ప్రకాశించుట) ఇన్ధే-ఇన్ధాతే-ఇన్ధతే, ఇన్త్సే-ఇన్ధ్వే. ఇన్ధాంచక్రే. ఇన్ధితా. ఇన్ధామ్-ఇన్ధాతామ్, ఇనధై. ఐన్ధ- ఐన్ధాతామ్, ఐన్ధాః. (౨౨) విద=విచారణే (విచారించుట) విన్తే, వేత్తా.

ఇవి రుధాదులు.

---

తనాదులు.

(౧) తను=(విస్తారే (విస్తరించుట.)

సూ.—తనాదికృఞ్భ్య ఉః— 3-౧-౭౯.

తను మొదలుగాఁగల ధాతువులకును, డుకృఞ్ ధాతువునకును బరముగాఁ గర్త్రర్థకసార్వధాతుకము పరమగుచో 'ఉ' అనువికరణప్రత్యయ మగును. శప్పున కపవాదము.

ఉదా:—తన్+ఉ+తి గుణము=తనోతి, తన్వః=తనువః-తన్మః-తనుమః; తనుతే, తన్వహే-తనువహే-తన్మహే - తనుమహే. తతాన-తేనతుః; తేనే. తనితాసి; తనితాసే. తనిష్యతి; తనిష్యతే. తనోతు, తను; తనవాని; తనుతామ్. అతనోత్; అతనుత. తనుయాత్; తన్వీత. తన్యాత్; తనిషీష్ట; అతానీత్-అతనీత్; అతానిష్ట-అతనిష్ట.

సూ.—తనాదిభ్యస్తథాసోః—౨-౪-౭౯.

ఏకవచనమగు తశబ్దముగాని థాస్ప్రత్యయముగాని పరమగునపుడు, తనుమున్నగు ధాతువులకంటెఁ బరమగు సిచ్చునకు వికల్పముగా లుక్కగును.

అనునాసికలోపము=అతత పక్షమున-అతనిష్ట-అతథాః-అతనిష్ఠాః. అతనిష్యత్; అతనిష్యత.(౨)షణు=దానే (ఇచ్చుట) సనోతి; సనుతే.

సూ.—యే విభాషా—౬-౪-౪౩.

జన - జనీ-షణు-ఖను ధాతువులకు యకారాదియును, కిత్తుగాని ఙిత్తుగానియగు ప్రత్యయము పరమగునపుడు ఆకారము వికల్పముగానగును.

ఉదా:—సాయాత్-సన్యాత్.

సూ.—జనసనఖనాం సఞ్ఝలోః—౬-౪-౪౨.

జన-జనీ-షణు-ఖను ధాతువులకు ఝలాదులగు సన్-కిత్-ఙిత్ ప్రత్యయములు పరమగునపుడు ఆకారమగును.

ఉదా:—అసాత-అసనిష్ట - అసాథాః - అసనిష్ఠాః. (3) క్షణు=హింసాయామ్ (హింసించుట) క్షణోతి; క్షణుతే "హ్మ్యన్తక్షణ" యనుసూత్రముచేత వృద్ధినిషేధము-అక్షణీత్; అక్షత-అక్షణిష్ట-అక్షథాః-అక్షణిష్ఠాః. (౪) క్షిణు చ=(క్షిణుధాతువును హింసార్థము ననువర్తించును.) సంజ్ఞాపూర్వకంబగు విధి యనిత్యంబగుటచేత నిట గుణము రాదని యాత్రేయాదుల యాశయము. ఇయ్యది భాష్యకారసమ్మతము గానందున గుణము రానగునని మఱికొందఱమతము. క్షిణోతి-క్షేణోతి. క్షేణితా. అక్షేణీత్; అక్షిత-అక్షేణిష్ట. (౫) తృణు = అదనే (తినుట) తృణోతి-తర్ణోతి; తృణుతే-తర్ణుతే. (౬) డుకృఞ్ = కరణే (చేయుట) కరోతి - "అత ఉత్సార్వధాతుకే" అను సూత్రముచేత ఉకారము-కురుతః.

సూ.—న భకుర్ఛురామ్—౮-౨-౭౯.

భసంజ్ఞకముయొక్కయు, డుకృఞ్ - ఛుర ధాతువుల యొక్కయు నుపధకు దీర్ఘము రాదు.

ఉదా:—కుర్వన్తి.

సూ.—నిత్యం కరోతేః—౬-౪-౧౦౮.

డుకృఞ్ధాతువుకంటెఁ బరమగు ప్రత్యయోకారము నకు మకారముగాని, వకారముగాని పరమగునపుడు నిత్యముగా లోపమగును. కుర్వః - కుర్మః; కురుతే, కుర్వహే - కుర్మహే. చకార; చక్రే. కర్తాసి; కర్తాసే. కరిష్యతి; కరిష్యతే. కరోతు-కురుతాత్-కురుతామ్. అకరోత్; అకురుత.

సూ.—యే చ—౬-౪-౧౦౯.

డుకృఞ్ ధాతువుకంటెఁ బరమగు ప్రత్యయోకారమునకు యకారాదిప్రత్యయము పరమగునపుడు లోపమగును. కుర్యాత్; కుర్వీత. క్రియాత్; కృషీష్ట. అకార్షీత్; అకృత. అకరిష్యత్; అకరిష్యత.

సూ.—సంపరిభ్యాం కరోతౌ భూషణే—౬-౧-౧౩౭.

సూ.—సమవాయే చ—౬-౧-౧౩౮.

సమవాయ మనఁగా సంఘము. భూషణార్థముననుసంఘాతార్థమునను సమ్-పరి అనునట్టి యుపసర్గములకంటెఁ బరమగు డుకృఞ్ ధాతువునకు సుట్ (స్) అనునాగమ మగును.

ఉదా:—సంస్కరోతి (అలంకరించుచున్నాఁడు.) సంస్కుర్వన్తి (సంఘీభవించుచున్నారు.) "సంస్కృతం భక్షాః" అను నిర్దేశముంబట్టి భూషణార్థముగాకున్నను సంపూర్వక డుకృఞ్ ధాతువునకు నొకచో సుడాగమం బగునని సూచింపఁ బడియెను.

సూ.—ఉపాత్ప్రతియత్నవైకృతవాక్యాధ్యాహారేషు చ—౬-౧-౧౩౯.

ఉప - యనుదానికంటెఁ బరమగు డుకృఞ్ ధాతువునకు భూషణార్థమునను, సంఘాతార్థమునను, ప్రతియత్నార్థమునను, వైకృతార్థమునను, వాక్యాధ్యాహారార్థమునను

సుడాగమమగును. ప్రతియత్న మనఁగా గుణాధానము. వికృతమే వైకృత మనఁబడును. (అనఁగా వికారమని యర్థము) వాక్యాధ్యాహార మనఁగా నాకాంక్షితమగు నేకదేశమునకుఁ బూరణము.

ఉదా:—ఉపస్కృతా కన్యా, ఉపస్కృతాః బ్రాహ్మణాః, ఏధోదకస్యోపస్కురుతే, ఉపస్కృతం భుఙ్క్తే, ఉపస్కృతం బ్రూతే.

(౭) వను = యాచనే (యాచించుట) వనుతే. వవనే. చాంద్రమతమునఁ బరస్మైపదముగూడ నుండును. వనోతి. (౮) మను=అవబోధనే (తలంచుట) మనుతే. మేనే. మనితా. మనిష్యతే. మనుతామ్. అమనుత. మన్వీత. మనిషీష్ట. అమత-అమనిష్ట. అమనిష్యత.

ఇవి తనాదులు

---

క్ర్యాదులు.

(౧) డుక్రీఞ్=ద్రవ్యవినిమయే (కొనుట.)

సూ.—క్ర్యాదిభ్యః శ్నా—3-౧-౮౧.

డుక్రీఞ్ మున్నగు ధాతువులకంటెఁ బరముగాఁ గర్త్రర్థకమగు సార్వధాతుకము పరమగుచో శ్నా (నా) అను వికరణప్రత్యయమగును. శప్పునకు బాధకము.

ఉదా:— క్రీ+తి క్రీ+నా+తి ణత్వము=క్రీణాతి - "ఈ హల్యఘో" యను సూత్రముచేత నీకారము - క్రీణీతః - "ఝో న్త"యను దానిచేత ఝకారమున కంతాదేశము "శ్నా భ్య స్తయో రాత" యను సూత్రముచేత నాకారలోపము - క్రీణన్తి, క్రీణాసి- క్రీణీథః- క్రీణీథ, క్రీణామి- క్రీణీవః- క్రీణీమః; క్రీణీతే- క్రీణాతే- క్రీణతే, క్రీణీషే- క్రీణాథే- క్రీణీధ్వే, క్రీణే- క్రీణీవహే- క్రీణీమహే. చిక్రాయ - చిక్రియతుః - చిక్రియుః చిక్రయిథ-చిక్రేథ, చిక్రియివ; చిక్రియే, చిక్రియిషే. క్రేతాసి (సే). క్రేష్యతి (తే). క్రీణాతు క్రీణీతాత్-క్రీణీతామ్. అక్రీణాత్; అక్రీణీత. క్రీణీయాత్; క్రీణీత. క్రీయాత్; క్రేషీష్ట. అక్రైషీత్; అక్రేష్ట. అక్రేష్యత్ (త). (౨) ప్రీఞ్=తర్పణే- కాన్తౌచ (కాంతియనఁగాఁగోరిక) - ప్రీణాతి; ప్రీణీతే. (3) శ్రీఞ్=పాకే (వండుట)-శ్రీణాతి; శ్రీణీతే. (४) మీఞ్-హింసాయామ్ (హింసించుట)

సూ.—హినుమీనా—౮-४-౧౫.

ఉపసర్గస్థమగు నిమిత్తముకంటెఁ బరమగు హి - మీఞ్ ధాతువులయొక్క నకారమునకు ణత్వమగును.

ఉదా:— ప్రమీణాతి; ప్రమీణీతే. 'మీనాతిమినోతి' యనుసూత్రముచేత ఆకారము - మమౌ-మిమ్యతుః, మమిథ- మమాథ; మిమ్యే. మాతా. మాస్యతి. మీయాత్. మాసీష్ట. అమాసీత్-అమాసిష్టామ్; అమాస్త (౫) షిఞ్=బన్ధనే (బంధిం

చుట) సినాతి; సినీతే. సిషాయ; సిష్యే. నేతా. (౬) స్కుఞ్=ఆప్లవనే. (ఈదుట-ఉద్ధరించుట)

సూ.—స్తమ్భుస్తుమ్భుస్కమ్భుస్కుమ్భుస్కుఞ్భ్యః శ్నుశ్చ—౩-౧-౮౨.

స్తమ్భు-స్తుమ్భు-స్కమ్భు-స్కుమ్భు అను రోధనార్థకములును సౌత్రములు నగు నీనాలుగు పరస్మైపదిధాతువులకంటెను, స్కుఞ్ ధాతువుకంటెను, బరముగా శ్ను ప్రత్యయమును, చకారముచే శ్నా ప్రత్యయము నగును.

స్కునోతి-స్కునుతే; స్కునాతి - స్కునీతే. చుస్కావ; చుస్కువే. స్కోతా. అస్కౌషీత్; అస్కోష్ట.

సూ.—హలః శ్నశ్శానజ్ఝౌ—౩-౧-౮౩.

హల్లుకంటెఁ బరమగు శ్నా - ప్రత్యయమునకు హి - ప్రత్యయము పరమగుచో శానచ్-(ఆన) అను నాదేశమగును.

ఉదా:— స్తభాన. స్తభ్నుహి.

సూ.—జౄస్తమ్భుమ్రుచుమ్లుచుగ్రుచుగ్లుచుగ్లుఞ్చు శ్విభ్యశ్చ—౩-౧-౫౮.

జౄ-జౄష్-స్తమ్భు-మ్రుచు-మ్లుచు - గ్రుచు-గ్లుచు-గ్లుఞ్చు - టుఓశ్వి ధాతువులచ్లి ప్రత్యయమునకు అఙ్ (అ) అను నాదేశము వికల్పముగానగును.

## సూ.—స్తన్భేః—౮-౩-౬౭.

ఉపసర్గస్థమగు నిమిత్తముకంటెం బరమగు స్తన్భు-అను సౌత్ర ధాతువుయొక్క సకారమునకు షకారమగును.

ఉదా:—వ్యష్టభత్. అస్తమ్భీత్.

(౭) యుఞ్=బన్ధనే (బంధించుట) యునాతి; యునీతే. యోతా. (౮) క్నూఞ్ - శబ్దే. (ధ్వనిచేయుట) క్నూనాతి; క్నూనీతే. క్నవితా. (౯) ద్రూఞ్ = హింసాయాం. (హింసించుట) ద్రూణాతి; ద్రూణీతే. (౧౦) ద్రూఞ్=హింసాయామ్. (హింసించుట) ద్రూణాతి; ద్రూణీతే. (౧౧) పూఞ్=పవనే (పవిత్రముచేయుట.)

## సూ.—ప్వాదీనాం హ్రస్వః—౭-౩-౮౦.

పూఞ్-లూఞ్ - స్తౄఞ్-కౄఞ్ - వౄఞ్ - ధూఞ్-శౄ-పౄ-వౄ-భౄ-మౄ-దౄ-జౄ-ఝౄ- ధౄ-నౄ-కౄ-ఋ-గౄ - జ్యా-రీ - లీ-వ్లీ-ప్లీ అను నీయిరువదినాల్గుధాతువుల కును శిత్తు పరమగునపుడు హ్రస్వమగును.

పునాతి; పునీతే. పవితా. (౧౨) లూఞ్=ఛేధనే-(ఛేదించుట) లునాతి; లునీతే. (౧౩) స్తౄఞ్ = ఆచ్ఛాదనే (ఆచ్ఛాదించుట) స్తృణాతి-'శర్పూర్వాః ఖయ' యను సూత్రముచేత ఖయ్యులుమాత్రము శేషించును. తస్తార-తస్తరతుః; తస్తరే. స్తరితా-స్తరీతా. స్తృణీయాత్; స్తృణీత. స్తీర్యాత్.

సూ.—లిజ్సిచోరాత్మనేపదేషు—౭-౨-౪౨.

వృఙ్-వృఞ్ ధాతువులకంటెను, ౠకారాంతధాతువులకంటెను బరమగు లిఙ్ఙునకును, సిచ్చునకును తఙ్ఙుపరమగునపుడు ఇడాగమము వికల్పముగానగును.

సూ.—న లిజి—౭-౨-౩౯.

వృఙ్-వృఞ్ ధాతువులకంటెను, ౠదంతధాతువులకంటెను, బరమగు నిట్టునకు లిఙ్ఙు పరమగుచో దీర్ఘము రాదు.

ఉదా:— స్తరిషీష్ట-"ఉశ్చ"యను సూత్రముచే కిత్వము-స్తీర్షీష్ట. "సిచి చ పరస్మైపదేషు" అను దానిచేత దీర్ఘనిషేధము. అస్తారీత్-అస్తారిష్టామ్ - అస్తారిషుః. అస్తరీష్ట-అస్తరిష్ట-అస్తీర్ష్ట. (౧౪) కౄఞ్ = హింసాయామ్ (హింసించుట) - కృణాతి; కృణీతే. చకార; చకరే (౧౫) వౄఞ్=వరణే (వరించుట) వృణాతి; వృణీతే. వవార; వవరే. వరితా-వరీతా. "ఉదోష్ఠ్యపూర్వస్య" యనుసూత్రముచేత నుకారము - వూర్యాత్; వరిషీష్ట - వూర్షీష్ట. అవారీత్ - అవారిష్టామ్; అవరిష్ట - అవరీష్ట-అవూర్ష్ట. (౧౬) ధూఞ్=కమ్పనే (కదల్చుట) ధునాతి; ధునీతే. దుధవిథ—దుధోథ. ధోతా - ధవితా. అధావీత్; అధవిష్ట-అధోష్ట. (౧౭) గ్రహ=ఉపాదానే (స్వీకరించుట) గృహ్ణాతి; గృహ్ణీతే. జగ్రాహ; జగృహే.

సూ.—గ్రహోఽలిటి దీర్ఘః—౭-౨-౩౭.

ఏకాచ్కమగు గ్రహధాతువుకంటె విధింపఁబడిన ఇట్టు నకు దీర్ఘమగును-లిట్టునందుఁగాదు.

ఉదా:—జగ్రహిథ; జగృహిషే. గ్రహీతా. గృహ్ణాతు. "హలఃశ్న శ్శానజ్ఝౌ" అను సూత్రముచే శానజాదేశము. గృహాణ. గృహ్ణీయాత్; గృహ్ణీత. గృహ్యాత్; గ్రహీషీష్ట. "హ్మ్యన్త"యను దానిచే వృద్ధినిషేధము - అగ్రహీత-అగ్రహీష్టామ్; అగ్రహీష్ట - అగ్రహీషాతామ్. అగ్రహీషత. అగ్రహీష్యత్; అగ్రహీష్యత. (౧౮) కుష-నిష్కర్షే-కుష్ణాతి. కోషితా.

సూ.—నిరః కుషః—౭-౨-౪౬.

నిర్-అను నుపసర్గముతోఁగూడిన కుషధాతువుకంటెఁ బరమగు వలాద్యార్ధధాతుకమునకు నిడాగమము వికల్పముగా నగును.

ఉదా:—నిష్కోషితా-నిష్కోష్టా. నిరకోషీత్. నిరకుక్షత్. (౧౯)అశ=భోజనే(భుజించుట) అశ్నాతి. ఆశ. అశితా. అశిష్యతి. అశ్నాతు. అశాన. (౨౦) ముష = స్తేయే (దొంగిలించుట). మోషితా. ముషాణ. (౨౧) జ్ఞా=అవబోధనే (తెలిసికొనుట). జానాతి. జజ్ఞౌ. (౨౨) వృఙ్ = సంభక్తౌ (కలియుట) వృణీతే. వవృషే; వవృఢ్వే. వరితా-వరీతా. అవరిష్ట-అవరీష్ట. అవృత.

ఇది క్ర్యాదులు.

చురాదులు.

(౧) చుర= స్తేయే (దొంగిలించుట.)

సూ.—సత్యాపపాశరూపవీణాతూలశ్లోకసేనాలోమత్వచ వర్మవర్ణచూర్ణచురాదిభ్యో ణిచ్—3-౧-౨౫.

సత్యాప-(ఆపుగాగమాంతంబు నిపాతంబు) పాశ-రూప-వీణా-తూల-శ్లోక-సేనా-లోమన్-త్వచ (ఘుప్రత్యయాంతమును, సంవరణార్థకము నగుత్వచధాతువు) వర్మన్-వర్ణ - చూర్ణ అను ప్రాతిపదికములకంటెను, చుర-మున్నగు ధాతువులకంటెను బరముగా ణిచ్ (ఇ) అను ప్రత్యయమగును. ఇయ్యది చురాదులకంటెఁ బరమగుచో స్వార్థమునే బోధించును.

ఉదా:—చుర్+ఇ 'పుగన్త' యను సూత్రముచేత గుణము - చోర్+ఇ = చోరి "సనాద్యన్తా ధాతవ" యను సూత్రముచేత ధాతుసంజ్ఞ సిద్ధింపఁగా తిప్ప్రత్యయము, కర్తరి శప్పనుసూత్రముచే శప్పు. చోరి+తి చోరి+అ+తి గుణాయాదేశములు=చోరయతి.

సూ.—ణిచశ్చ—౧-3-౭౪.

క్రియాఫలంబు కర్తృగామియగుచో,ణిజంతముకంటెఁ బరముగా నాత్మనేపదమగును. చోరయతే. చోరయాంచక్రే-చోరయామాస. చోరయితా. చోరయేత్. చోర్యాత్. చోరయిషీష్ట. లుఙ్లున అచోర్+ఇ+త్ అనిరాఁగా, "ణిశ్రిద్రు" అనుసూత్రముచేత చఙాదేశము - అచోర్+ఇ+అ+త్

"ణౌచఙి" యనుదానిచేత నుపధాహ్రస్వము అచుర్+ఇ+అ+త్. "చఙి"యను సూత్రముచే ద్విత్వము. అచుర్ చుర్+ఇ+అ+త్ "హలాదిశ్శేష" యనుదానిచే రేఫమునకు లోపము. అచుచుర్+ఇ+అ+త్. "దీర్ఘోలఘోః" అనుసూత్రముచేత నభ్యాసమునకు దీర్ఘము. అచూచుర్+ఇ+అ+త్. "ణేరనిటి" యనుసూత్రముచే ణిలోపము = అచూచురత్; అచూచురత.

(౨) కథ=వాక్యప్రబన్ధే (చెప్పుట.) "అతో లోప"యనుసూత్రముచేత అకారలోపము.

సూ.—అచః పరస్మిన్ పూర్వవిధౌ—౧-౧-౫౭.

పరనిమిత్తకమును, అచ్చుయొక్క స్థానమున వచ్చినదియు నగు ఆదేశము స్థానియగునచ్చుకంటెఁ బూర్వముగాఁ జూడఁబడినదానియొక్క స్థానమునఁ గార్యముచేయఁబడునపుడు స్థానివంటిదగును. ఇట అకారలోపము వచ్చినను స్థానివద్భావముచేత నకార మున్నట్లు యగుఁగాన నుపధా వృద్ధి రాదు.

ఉదా:—కథయతి - ఇది ణినిమిత్తకాల్లోపికాన దీర్ఘసన్వద్భావములు లేవు. అచకథత్.

(3) గణ=సంఖ్యానే (లెక్కపెట్టుట) గణయతి.

సూ.—ఈ చ గణః—౭-౪-౯౭.

గణధాతువుయొక్క యభ్యాసమునకు చఙ్ పరకమగు

ణిప్రత్యయము పరమగునపుడు ఈకారమును, అకారము నగును.

ఉదా:—అజీగణత్-అజగణత్.

ఇని చురాదులు.

---

ణ్యన్తప్రక్రియ.

సూ.—స్వతన్త్రః కర్తా—౧-౪-౫౪.

ఏక్రియయందు నేది స్వతంత్రమని వివక్ష చేయఁబడునో యాక్రియ కాశ్రయమగునది కర్తయనఁబడును.

ఉదా:—రథో గచ్ఛతి (రథము నడచుచున్నది)

సూ.—తత్ప్రయోజకో హేతుశ్చ—౧-౪-౫౫.

కర్తను బ్రవర్తింపఁజేయునట్టిది హేతువనియుఁ, గర్త యనియుఁ గూడఁ జెప్పఁబడును.

సూ.—హేతుమతి చ—3-౧-౨౬.

ప్రేషణ (తనకంటెఁ దక్కువవానిని బ్రవర్తింపఁజేయుట) మున్నగు ప్రయోజకకర్తృవ్యాపారమును బోధించుచు. ధాతువుకంటెఁ బరముగా ణిచ్ (ఇ) అనుప్రత్యయ మగును.

ఉదా:—భవన్తం ప్రేరయతి (భూ+ఇ+అ+తి=) భావయతి. క్రియాఫలము కర్తృగామియగుచో నాత్మనేపదము నగును. భావయతే.

సూ.—ఓః పుయణ్జ్యపరే—౭-౪-౮౦.

సన్పరకమగునంగమున కవయవమగు నభ్యాసము యొక్క ఉకారమునకు అవర్ణముపరముగాఁ గల పవర్గము గాని, యణ్ణులుగాని, జకారముగాని పరమగుచో ఇకార మగును.

ఉదా:—అబీభవత్. ష్ఠా = గతినివృత్తౌ - (కదల కుండుట.)

సూ.—అర్తిహ్రీవ్లీరీక్నూయీక్ష్మాయ్యాతాం పుక్ ణౌ—౭-౩-౩౬.

ఋ-హ్రీ-వ్లీ-రీ-క్నూయీ-క్ష్మాయీ ధాతువులకును, ఆకా రాంతధాతువులకును ణిప్రత్యయము పరమగునపుడు పుక్ (ప్) అనునాగమమగును. ఉదా:—స్థాపయతి.

సూ.—తిష్ఠతేరిత్—౭-౪-౫.

ష్ఠాధాతువుయొక్క యుపధకు చఙ్పరకమగు ణిప్రత్య యము పరమగునపుడు హ్రస్వమైన ఇకారమగును.

ఉదా:—అతిష్ఠిపత్. ఘ్రాపయతి.

సూ.—జిఘ్రతేర్వా—౭-౪-౬.

ఘ్రాధాతువుయొక్క యుపధకు చఙ్పరకమగు ణిప్రత్య యము పరమగునపుడు ఇకారము వికల్పముగానగును.

ఉదా:—అజిఘ్రిపత్-అజిఘ్రపత్.

పాతేర్ణౌ లుగ్వక్తవ్యః—(వా)

పా (రక్షణార్థకము) ధాతువునకు ణిప్రత్యయము పరమగునపుడు లుక్ (ల్) అనునాగమ మగును. పుగాగమంబున కపవాదంబు.ఉదా:—పాలయతి.

సూ.—వో విధూననే జుక్—౭-౩-౩౮.

ఓవై (వా) ధాతువునకుఁ గంపనార్థమున ణిప్రత్యయము పరమగుచో జుక్ (జ్) అనునాగమమగును.

ఉదా:—వాజయతి. కేశాన్ వాపయతి. ఇటఁ గంపనం బర్థంబు కాకుంటచే జుక్కు లేదు.

సూ.—రుహః పోఽన్యతరస్యామ్—౭-౩-౪౩.

ణిప్రత్యయము పరమగునపుడు రుహ ధాతువునకు పకారాదేశము వికల్పముగానగును.

ఉదా:—రోపయతి (పక్షంబున) రోహయతి.

సూ.—క్రీఙ్ జీనాం ణౌ—౬-౧-౪౮.

డుక్రీఞ్-ఇఙ్-జి (జయార్థకము) ధాతువులయొక్క ఏచ్చునకు ణిప్రత్యయము పరమగునపుడు ఆకారమగును.

ఉదా:—క్రాపయతి. అధ్యాపయతి. జాపయతి.

సూ.—ణౌ చ సంశ్చఙోః—౬-౧-౩౧.

సన్ను గాని చఙ్ఙుగాని పరముగాఁ గల ణిప్రత్యయము

పరమగునపుడు, ఇఙ్ ధాతువునకు గాఙ్ (గా) అనునాదేశము వికల్పముగా నగును.

ఉదా:—అధ్యజీగపత్; అధ్యాపిపత్.

సూ.—ఊదుపధాయా గోహః—౬-౪-౮౯.

గుహూ ధాతువుయొక్క యుపధకు గుణనిమిత్తమగు-అజాదిప్రత్యయము పరమగునపుడు ఊకారమగును.

ఉదా:—గూహయతి.

దోషో ణౌ—౬-౪-౯౦.

దుష ధాతువుయొక్క యుపధకు ణిప్రత్యయము పరమగుచో ఊకారమగును. ఉదా:—దూషయతి.

సూ.—వా చిత్తవిరాగే—౬-౪-౯౧.

చిత్తవిరాగార్థము విరాగమనన ప్రీతత్వము. న దుష ధాతువుయొక్క యుపధకు ఊకారము వికల్పముగానగును.

ఉదా:—చిత్తం దూషయతి, దోషయతి వా కామః. (స్నానసంధ్యాదికమున విరక్తముగాఁ జేయుచున్నదనియర్థము.)

ఘట=చేష్టాయామ్ (ఘటించుట.)

ఘటాదయో మితః—(గ-సూ)

ఘట మున్నగు ధాతువులు మిత్తులవంటివగును..

జ్ఞపమిచ్చ—(గ-సూ.)

చౌరాదికంబగు జ్ఞపధాతువును మిత్తువంటిదగును.

సూ.—మితాం హ్రస్వః—౬-౪-౯౨.

మిత్తులయొక్క యుపధకు ణిప్రత్యయము పరమగుచో హ్రస్వమగును. ఉదా:—ఘటయతి.

జ్ఞప=జ్ఞానే, జ్ఞాపనే చ (తెలిసికొనుట-తెలుపుట.)

ఉదా:—జ్ఞపయతి. వ్యజిజ్ఞపత్.

సూ.—ణౌ గమిరబోధనే—౨-౪-౪౬.

ఇణ్ ధాతువునకు ణిప్రత్యయము పరమగునపుడు గమి (గమ్) అనునాదేశమగును. బోధనార్థమునఁ గాదు.

ఉదా:—గమయతి. బోధనార్థంబున-ప్రత్యాయయతి.

ఇణ్వదిక ఇతి వక్తవ్యమ్—(వా).

ఇక్ ధాతువునకు ఇణ్ ధాతువునకువలెనే యాదేశము లగును. ఈధాతువు నిత్యముగా 'అధి' యనునుపసర్గముతోఁ గూడియుండును. ఉదా:—అధిగమయతి.

సూ.—హనస్తోఽచిణ్ణలోః—7-3-32.

చిణ్-ణల్ ప్రత్యయభిన్నంబులగు-ఞిత్తుగాని ణిత్తుగాని పరమగుచో హనధాతువునకు తకార మంతాదేశమగును. 'హోహన్తే' యనుసూత్రముచేఁ గుత్వము.

ఉదా:—ఘాతయతి.

నివృత్తప్రేషణంబగు ధాతువుకంటెఁ బరముగా హేతుమణ్ణిచ్చు వచ్చునపుడు ణిచ్ప్రకృతియర్థమునే గ్రహించునది.

కావున 'ప్రార్థయన్తి శయనోత్థితం ప్రియాః' అను మున్నగు ప్రయోగములు సిద్ధించుచున్నవి. ఇట్లే తక్కినచోట్లనెల్ల నూహించునది.

ఇది ణ్యంతప్రక్రియ.

---

సన్నంతప్రక్రియ.

సూ.—ధాతోః కర్మణస్సమానకర్తృకాదిచ్ఛాయాం వా—3-౧-౭.

ఇచ్ఛను గూర్చి కర్మయగునట్టియు, ఇచ్ఛాకర్తయే కర్తగాఁ గలదియునగు ధాతువుకంటెఁ బరముగా ఇచ్ఛను బోధించుచు సన్ (స) అను ప్రత్యయము వికల్పముగానగును. ఇట ధాతువునకుఁ గర్మత్వమును, సమానకర్తృకత్వమును నర్థద్వారా యగునని యెఱుంగునది. పఠ=వ్యక్తాయాం వాచి (పఠించుట.)

సూ.—సన్యఙోః—౬-౧-౯.

సన్నంతముయొక్కయు, యఙన్తముయొక్కయుఁ బ్రథమైకాచ్కమునకు ద్విత్వమగును; అజాది యగుచో ద్వితీయైకాచ్కమునకు ద్విత్వమగును. 'సన్యతః' అనుసూత్రముచేత నభ్యాసాకారమునకు నికారము.

ఉదా:—పఠితుమిచ్ఛతి=పిపఠిషతి. "కర్మణః" అనుటచేత గమనేనేచ్ఛతి యనుచోఁ గరణముకంటె సన్ను రాదు.

'శిష్యాః పఠన్త్వితీచ్ఛతి గురుః' అనుచో సమానకర్తృకంబుగామింజేసి సన్ను రాదు. సన్ను వికల్ప మగుటచేత వాక్యముగూడ నుండును. "లుజ్సనోర్ఘస్లౄ" అనుసూత్రముచే అద ధాతువునకు ఘస్లాదేశము, "ఏకాచః" అనుసూత్రముచేత నిట్టు రాదు.

సూ.—సస్యార్ధధాతుకే—౭-౪-౪౯.

సకారాదియగునార్ధధాతుకము పరమగునపుడు సకారమునకు తకార మాదేశమగును.

ఉదా:—అత్తుమిచ్ఛతి=జిఘత్సతి. "ఏకాచ" యను సూత్రముచేత నిట్టు లేదు.

సూ.—అజ్ఝనగమాం సని—౬-౪-౧౬.

అజంతధాతువులయొక్కయు, హనధాతువుయొక్కయు, అజాదేశమగు గమ్ధాతువుయొక్కయు అచ్చునకు ఝలాది సన్ను పరమగుచో దీర్ఘమగును.

సూ.—ఇకో ఝల్—౧-౨-౯.

ఇగంతముకంటెఁ బరమగు ఝలాదిసన్ను కిత్తువంటిదగును. "ఋత ఇద్ధాతోః" అనుసూత్రముచేత నిత్వము.

ఉదా:—కర్తుమిచ్ఛతి=చికీర్షతి.

సూ.—సన్లిటో ర్జేః—౭-3-౫౭.

జిధాతువుయొక్క సన్నుగాని లిట్టుగాని నిమిత్తముగాఁగల యభ్యాసముకంటెఁ బరమగుదానికి గుత్వమగును.

ఉదా:—జేతుమిచ్ఛతి = జిగీషతి, హన్తుమిచ్ఛతి = జిఘాంసతి.

సూ.—సనిగ్రహగుహోశ్చ—౭-౨-౧౨.

గ్రహ-గుహూ ధాతువులకంటెను, ఉగంత ధాతువుల కంటెను బరమగు సన్ ప్రత్యయమున కిట్టురాదు.

ఉదా:—గ్రహీతుమిచ్ఛతి=జిఘృక్షతి, గూహితుమిచ్ఛతి =జుఘుక్షతి, భవితుమిచ్ఛతి=బుభూషతి.

ఇది సన్నంతప్రక్రియ.

---

యఙన్తప్రక్రియ.

సూ.—ధాతోరేకాచో హలాదేః క్రియాసమభిహారే యఙ్—3-౧-౨౨.

క్రియాసమభిహారార్థము ద్యోత్యమగునపుడు ఏకాచ్కమును హలాదియు నగు ధాతువుకంటెఁ బరముగా యఙ్(య) అను ప్రత్యయ మగును. పౌనఃపున్యంబును భృశార్థంబును గ్రియాసమభిహారంబు నాఁబడు.

సూ.—గుణో యఙ్లుకోః—౭-౪-౮౨.

యఙ్కును యఙ్లుక్కునకును బరమగుచో నభ్యాసమునకు గుణమగును. జిదంతముగాన నాత్మనేపదము.

ఉదా:—పునఃపునః అతిశయేన వా భవతి=బోభూయతే. బోభూయాంచక్రే. అబోభూయిష్ట.

సూ.—నిత్యం కౌటిల్యే గతౌ—3-౧-౨3.

గత్యర్థకధాతువుకంటె కౌటిల్యార్థమందే యఙ్గగును. క్రియాసమభిహారార్థంబున రాదు.

సూ.—దీర్ఘోఽకితః—౭-౪-౮3.

యఙ్గుగాని యఙ్లుక్కుగాని పరమగునపుడు కిత్తులేని యభ్యాసమునకు దీర్ఘమగును.

ఉదా:—కుటిలం వ్రజతి=వావ్రజ్యతే.

సూ.—యస్య హలః—౬-౪-౪౯.

సూత్రమున "యస్య" అనుచో, అకారవిశిష్టయకార గ్రహణంబు. హల్లుకంటెఁ బరమగు య అనుదానికి నార్ధధాతుకము పరమగునపుడు లోపమగును. "ఆదేః పరస్య" యను దానిచే యకారమునకు లోపము. "అతో లోపః" అను సూత్రముచేత అకారలోపము.

ఉదా:—వావ్రజాంచక్రే. వావ్రజితా.

సూ.—రీగృదుపధస్య చ—౭-౪-౯౦.

ఋదుపధకమగు ధాతువుయొక్క యభ్యాసమునకు యఙ్గును యఙ్లుక్కును బరమగునపుడు రీక్ (రీ) అనునాగమంబగును.

ఉదా:—వరీవృత్యతే. వరీవృతాంచక్రే. వరీవృతితా.

సూ.—క్షుభ్నాదిషు చ—౮-౪-౩౯.

క్షుభ్నాదిగణపఠితశబ్దములయందలి నకారమునకు ణత్వము రాదు.

ఉదా:—నరీనృత్యతే. జరీగృహ్యతే.

ఇది యఙన్తప్రక్రియ.

—•—

యఙ్లుగంతప్రక్రియ.

సూ.—యఙోఽచి చ—౨-౪-౭౪.

యఙునకు అచ్ప్రత్యయము పరమగునపుడు లుక్కగును. చకారముచేత నచ్ప్రత్యయము లేకున్నను బహుళముగా లుక్కగును. అనిమిత్తక మగుటచేత నీలుక్కు అంతరంగము గాన ద్విత్వముకంటె ముందుగా వచ్చును. పిమ్మటఁ బ్రత్యయ లక్షణముచేత యఙన్తమగునుగాన ద్విత్వము.అభ్యాసకార్యము. ఇది ధాతువగుటచే లడాదులగును. జిత్వముప్రత్యయా ప్రత్యయసాధారణముగానఁ బ్రత్యయలక్షణము లేనందున "అనుదాత్తఙిత"యను సూత్రముచేత నాత్మనేపదము కాదు. "శేషాత్కర్తరి"యను దానిచేఁ బరస్మైపదము. యఙ్లుగంతము నదాదియందుఁ బఠించుటచేత శప్పునకు లుక్కు.

## సూ.—యఙో వా—౭-౩-౯౪.

యఙంతముకంటెం బరమగు హలాదియును, పకారే త్సంజ్ఞకము నగు సార్వధాతుకమునకు ఈట్ (ఈ) అనునాగ మంబు వికల్పంబుగానగును.

"దాధర్తి దర్ధర్తి దర్ధర్షి బోభూతు తేతిక్తే..."యని ఛందస్సునందు గుణాభావము నిపతించుటచే భాషయందు యఙ్లుక్కులో "భూసువో స్తిఙి" యను సూత్రముచే గుణ నిషేధము రాదు.

ఉదా:—బోభవీతి; బోభోతి-బోభూతః-"అదభ్యస్తా" త్తను సూత్రముచే ఝకారమునకు అత్ - అనునాదేశము-బోభువతి. బోభవాంచకార. బోభవామాస. బోభవితా. బోభవిష్యతి. బోభవీతు; బోభోతు - బోభూతాత్; బోభూతామ్-బోభువతు, బోభూహి, బోభవాని. అబోభవీత్; అబోభోత్-అబోభూతామ్-అబోభవుః. బోభూయాత్-బోభూయాతామ్-బోభూయుః; బోభూయాత్-బోభూయాస్తామ్-బోభూయాసుః. "గాతిస్థ"యను సూత్రముచేత సిచ్చునకు లుక్కు. "యఙో వా"యను దానిచే; ఈట్పక్షమున గుణమునుబాధించి నిత్యముగాన వుగాగమమగును.

ఉదా:—అబోభూవీత్; అబోభోత్ - అబోభూతామ్. అబోభూవుః. అబోభవిష్యత్.

ఇది యఙ్లుగంతప్రక్రియ

## నామధాతుప్రక్రియ.

### సూ.—సుప ఆత్మనః క్యచ్—3-౧-౮.

ఇచ్ఛాకర్మవాచకమును, ఇచ్ఛాకర్తృసంబంధివాచకము నగు సుబంతంబుకంటె నిచ్ఛారూపార్థంబున క్యచ్ (య) అను ప్రత్యయము వికల్పముగానగును.

### సూ.—సుపో ధాతుప్రాతిపదికయోః—౨-౪-౭౧.

ధాత్వవయవమును బ్రాతిపదికావయవమునునగు సుప్పునకు లుక్కగును.

### సూ.—క్యచి చ—౭-౪-33.

క్యచ్ప్రత్యయము పరమగునపుడు, అవర్ణమునకు ఈకారాదేశ మగును.

ఉదా:—ఆత్మనః పుత్రమిచ్ఛతి=పుత్రీయతి.

### సూ.—నః క్యే—౧-౪-౧౫.

క్యచ్చుగాని క్యఙ్గుగాని పరమగుచో నకారాంతమే పదమనఁబడును. మఱేదియును బదము గాదు. నలోపము-రాజానమాత్మన ఇచ్ఛతి = రాజీయతి. నకారాంతము కాకుంటచే వాచమాత్మన ఇచ్ఛతి యనుచోఁ గుత్వాదికము లేదు. వాచ్యతి.

"హలి చ" యను సూత్రముచేత నుపధా దీర్ఘము. గిరమాత్మన ఇచ్ఛతి=గీర్యతి. పురమాత్మన ఇచ్ఛతి=పూర్యతి. ధాతువునకే యుపధాదీర్ఘమగును గాన-దివమిచ్ఛతి=దివ్యతి-యనుచో దీర్ఘము లేదు.

సూ.—క్యస్య విభాషా—౬-౪-౫౦.

ఆర్ధధాతుకము పరమగునపుడు హల్లుకంటె బరమగు క్యచ్-క్యఙ్లులకు లోపము వికల్పముగానగును.

'ఆదేః పరస్య' యనుదానిచేత యకారలోపము. 'అతో లోప' యనుసూత్రముచేత అకారలోపము. అల్లోపమునకు స్థానివద్భావముండునుగాన లఘూపధగుణంబు లేదు.

ఉదా:—సమిధితా-సమిధ్యితా.

సూ.—కామ్యచ్చ—3-౧-౯.

"సుప ఆత్మనః క్యచ్"అను సూత్రవిషయమున కామ్యచ్ (కామ్య) ప్రత్యయము గూడ నగును.

ఉదా:—పుత్రమాత్మన ఇచ్ఛతి = పుత్రకామ్యతి. పుత్రకామ్యితా. 'యస్య హలః'అను సూత్రమున అకారవిశిష్ట యకారంబునకు గ్రహణంబుకాన నిట యకారలోపంబు లేదని తెలియునది.

సూ.—ఉపమానాదాచారే—3-౧-౧౦.

ఉపమానమగు కర్మమును బోధించు సుబంతముకంటె నాచార (వ్యవహార) రూపార్థమున క్యచ్ (య) ప్రత్యయమగును.

ఉదా:—పుత్రమివాచరతి (వ్యవహారతి) = పుత్రీయతి. (ఛాత్రమ్). విష్ణుమివాచరతి=విష్ణూయతి (ద్విజమ్)

సర్వప్రాతిపదికేభ్యః క్విబ్వా వక్తవ్యః—(వా)

ప్రాతిపదికమాత్రముకంటెఁ బరముగా నాచారార్థమున క్విప్ (వ్)అను ప్రత్యయము వికల్పముగానగును.

ఉదా:—పరరూపము - కృష్ణ ఇవాచరతి = కృష్ణతి. స్వఇవాచరతి స్వతి. సస్వౌ.

సూ.—అనునాసికస్య క్విఝలోః క్ఙితి—౬-౪-౧౫.

క్విప్రత్యయముగాని, ఝలాదిరైన కిత్తుగాని ఙిత్తుగాని యగు ప్రత్యయముపరమగుచో అనునాసికాంతాంగము యొక్క యుపధకు దీర్ఘమగును.

ఉదా:—ఇదమివాచరతి = ఇదామతి. రాజేవాచరతి= రాజానతి. పన్థా ఇవాచరతి=పథీనతి.

సూ.—కష్టాయ క్రమణే—3-౧-౧౪.

చతుర్థ్యంతమగు కష్టశబ్దంబుకంటెఁ బరంబుగ నుత్సాహార్థమున క్యఙ్(య)అను ప్రత్యయ మగును.

ఉదా:—కష్టాయ+క్రమతే = కష్టాయతే (పాపకార్యంబులఁజేయ నుత్సహించుచున్నాఁడని యర్థము.)

సూ.—శబ్దవైరకలహాభ్రకణ్వమేఘేభ్యః కరణే—3-౧-౧౭

కర్మవాచకములగు-శబ్ద-వైర-కలహ-అభ్ర-కణ్వ - మేఘ శబ్దంబులకంటెఁ గృఞ్ ధాత్వర్థంబున క్యఙ్ ప్రత్యయమగును.

ఉదా:—శబ్దం కరోతి=శబ్దాయతే. ఇత్యాదికము.

పాౄతిపదికాద్ధాత్వర్థే బహులమిష్ఠవచ్చ—(గ-సూ)

ప్రాతిపదికమాత్రముకంటెఁ బరముగా ధాత్వర్థమున ణిచ్ (ఇ) ప్రత్యయమగును. మఱియు, ఇష్ఠన్ ప్రత్యయము పరమగునపుడువలె ణిప్రత్యయము పరమగునపుడును, ప్రాతి పదికమునకుఁ బుంవద్భావము. (పట్వీ=పటిష్ఠః)రభావము (కృశః= క్రశిష్ఠః) టిలోపము (సాధుః = సాధిష్ఠః) విన్మతుబ్లోపము (స్రగ్వీ=స్రజిష్ఠః, గోమాన్=గవిష్ఠః) యణాదిలోపము (స్థూలః= స్థవిష్ఠః, దూరః=దవిష్ఠః, యువా = యవిష్ఠః-) ప్రస్థస్ఫాద్యా దేశములు. (ప్రియః=ప్రేష్ఠః, స్థిరః=స్థేష్ఠః, స్ఫిరః=స్ఫేష్ఠః ఇత్యాది) భసంజ్ఞయునగును. ధాత్వర్థమనఁగా - తత్కరోతి, తదాచష్టే, తేనాతిక్రామతి యనునర్థములని తెలియునది. భసంజ్ఞయుంట చే టిలోపంబు.

ఉదా:—ఘటంకరోతి, ఆచష్టే వా=ఘటయతి. అశ్వే నాతిక్రామతి=అశ్వయతి.

ఇది నామధాతుప్రక్రియ.

---

కణ్వాదులు.

సూ.—కణ్డ్వాదిభ్యో యక్—3-౧-౨౭.

కండూఞ్ మున్నగుధాతువులకంటెఁ బరంబుగా స్వార్థ మున యక్ (య) అను ప్రత్యయము నిత్యముగానగును. కణ్డూఞ్=గాత్రవిఘర్షణే (గోకుట)

ఉదా:—కణ్డూయతి; కణ్డూయతే. ఇత్యాదులు.

ఇవి కణ్డ్వాదులు.

## ఆత్మనేపదప్రక్రియ.

### సూ.—కర్తరి కర్మవ్యతిహారే—౧-3-౧౪.

క్రియావినిమయము ద్యోత్యమగునపుడు కర్త్రర్థమున నాత్మనేపదమగును.

ఉదా:—వ్యతిలునీతే. (ఇతరుఁడు చేయఁదగిన ఛేదనము దాను జేయుచున్నాఁడని యర్థము.)

### సూ.—న గతిహింసార్థేభ్యః—౧-3-౧౫.

గమనార్థకములును హింసార్థకములును నగుధాతువులకంటెఁ బరముగాఁ బూర్వోక్తవిషయంబున నాత్మనేపదంబు రాదు.

ఉదా:—వ్యతిగచ్ఛన్తి. వ్యతిఘ్నన్తి.

### సూ.—నేర్విశః—౧-3-౧౭.

ని-అనెడియుపసర్గమునకుఁ బరమగు విశ ధాతువుకంటెఁ బరముగా నాత్మనేపద మగును. ఉదా:—నివిశతే.

### సూ.—పరివ్యవేభ్యః క్రియః—౧-3-౧౮.

పరి-వి-అవ అనునట్టి యుపసర్గములకుఁ బరమగు-డుక్రీఞ్ ధాతువుకంటె నాత్మనేపదమగును. (పరస్మైపదము రాదనుట.)

ఉదా:—పరిక్రీణీతే. విక్రీణీతే. అవక్రీణీతే.

సూ.—విపరాభ్యాం జేః—౧-3-౧౯.

వి-పరా అనునట్టియుపసర్గములకుఁ బరమగు జి ధాతువు కంటె నాత్మనేపదమగును. ఉదా:—విజయతే. పరాజయతే.

సూ.—సమవప్రవిభ్యః స్థః—౧-3-౨౨.

సమ్ - అవ - ప్ర-వి అనెడి యుపసర్గములకుఁ బరమగు స్థాధాతువుకంటె నాత్మనేపదమగును.

ఉదా:—సంతిష్ఠతే, అవతిష్ఠతే, ప్రతిష్ఠతే, వితిష్ఠతే.

సూ.—అపహ్నవే జ్ఞః—౧-3-౪౪.

అపలపనరూపార్థమున జ్ఞాధాతువుకంటెఁ బరముగా నాత్మనేపద మగును.

ఉదా:—శతమపజానీతే (మాటుపలుచుచున్నాఁడని యర్థము.)

సూ.—అకర్మకాచ్చ—౧-3-౪౫.

జ్ఞాధాతు వకర్మకమగునపుడుగూడ నాత్మనేపదమగును.

ఉదా:—సర్పిషో జానీతే (సర్పిస్సను నుపాయముచేఁ భోజనంబున బ్రవర్తించుచున్నాఁడని యర్థము.)

సూ.—సమస్తృతీయాయుక్తాత్—౧-3-౫౪.

సమ్-అనునట్టి యుపసర్గమునకుఁ బరమగు చరధాతువు తృతీయాంతముతోఁ గూడినపుడు ఆత్మనేపదమగును.

ఉదా:—రథేన సంచరతే.

సూ.—దాణశ్చ సా చేచ్చతుర్థ్యర్థే—౧-౩-౫౫.

సంపూర్వకదాణ్ ధాతువు చతుర్థీవిభక్త్యర్థకంబగు తృతీయాంతముతోఁడఁ గూడినపుడు, ఆత్మనేపద మగును.

ఉదా:—దాస్యా సంయచ్ఛతే కాముకః.

సూ.—పూర్వవత్సనః—౧-౩-౬౨.

సన్ప్రకృతియగు ధాతువుతోఁ దుల్యముగా, సన్నంతంబుగూడ నాత్మనేపదమును, బొందును.

ఉదా:—ఏదిధిషతే.

సూ.—హలన్తాచ్చ—౧-౨-౧౦.

ఇక్కునకు సమీపమగుహల్లుకంటెఁ బరంబగు ఝలాది సన్ను కిత్తువంటిదగును. కాన గుణము లేదు.

ఉదా:—నివివిక్షతే.

సూ.—గన్ధనావక్షేపణసేవనసాహసిక్యప్రతియత్నప్రకథనోపయోగేషు కృఞః—౧-౩-౩౨.

గన్ధనము (సూచనము)-అవక్షేపణము(భర్త్సనము)-సేవనము (సేవించుట) - సాహసిక్యము (సాహసించుట) - ప్రతియత్నము (గుణాధానము)-ప్రకథనము(విశేషముగాఁ జెప్పుట)-ఉపయోగము (వినియోగము) అనునీయర్థములందు డుకృఞ్ ధాతు వాత్మనేపది యగును

ఉదా:—ఉత్కురుతే, శ్యేనో వర్తికాముత్కురుతే, హరిముపకురుతే,పరదారాన్ప్రకురుతే, ఏధోదకస్యోపస్కురుతే, కథాః ప్రకురుతే, శతం ప్రకురుతే. అని క్రమంబున నుదాహరణంబులు. అన్యార్థంబులందుఁ బరస్మైపదిగూడ నగును. కటంకరోతి-ఇత్యాది. 'భుజోఽనవనే' యను సూత్రముచేత నభ్యవహారార్థమునందు - ఓదనంభుఙ్క్తే-యనియు, పాలనార్థమున - మహీం భునక్తి-యనియు రూపంబులగును.

ఇది యాత్మనేపదప్రక్రియా.



పరస్మైపదప్రక్రియా.

సూ.—అనుపరాభ్యాం కృఞః—౧-౩-౭౯.

అను-పరా అనునుపసర్గములకుఁ బరమగు డుకృఞ్ ధాతువుకంటెఁ గ్రియాఫలము కర్తృగామి యగునపుడును, గంధనాద్యర్థములందును బరస్మైపదమగును.

ఉదా:—అనుకరోతి, పరాకరోతి.

సూ.—అభిప్రత్యతిభ్యః క్షిపః—౧-౩-౮౦.

అభి-ప్రతి-అతి అనునట్టియుపసర్గములు పూర్వమునఁగల క్షిప (ప్రేరణార్థకము-స్వరితేత్తు) ధాతువుకంటెఁ బరముగాఁ బరస్మైపదమగును.

ఉదా:—అభితిక్షిపతి, ప్రతిక్షిపతి, అతిక్షిపతి.

సూ.—ప్రాద్వహః—౧-3-౮౧.

ప్ర అనెడి యుపసర్గముకంటెఁ బరమగు వహాధాతువు పరస్మైపది యగును. ఉదా:—ప్రవహతి.

సూ.—పరేర్మృషః—౧-3-౮౨.

పరిపూర్వకమృషధాతువు పరస్మైపదము నొందును.

ఉదా:—పరిమృషతి.

సూ.—వ్యాఙ్పరిభ్యో రమః—౧-3-౮3.

వి-ఆఙ్-పరి అనునట్టి యుపసర్గములకుఁ బరమగు రమ ధాతువు పరస్మైపది యగును. రమ=క్రీడాయామ్ (క్రీడించుట)

ఉదా:—విరమతి, ఆరమతి, పరిరమతి.

సూ.—ఉపాచ్చ—౧-3-౮౪.

ఉప యను నుపసర్గము పూర్వమునఁగల రమధాతువును, బరస్మైపదమును బొందును.

ఉదా:—యజ్ఞదత్తముపరమతి—ఇయ్యది యంతర్భావితప్రేరణార్థకంబు. విరమింపఁజేయుచున్నాఁడని యర్థము.

ఇది పరస్మైపదప్రక్రియ.

## భావకర్మప్రక్రియ.

### సూ.—భావకర్మణోః—౧-౩-౧౩.

భావార్థకముగాని, కర్మార్థకముగాని యగు లకారమునకు నాత్మనేపదమగును.

### సూ.—సార్వధాతుకే యక్—౩-౧-౬౭.

భావకర్మవాచకమగు సార్వధాతుకము పరమగునపుడు ధాతువుకంటెఁ బరముగా యక్ (య)అను ప్రత్యయ మగును.

భావమనఁగాఁ గ్రియ అదియును భావార్థకలకారముచేత ననువదింపఁబడును. యుష్మదస్మచ్ఛబ్దములతోడి సామానాధికరణ్యము లేనందునఁ బ్రథమపురుషమే యగును. తిఙ్ వాచ్యక్రియ ద్రవ్యరూపము గానందున ద్విత్వాది ప్రతీతి లేకుంటచే ద్వివచనబహువచనములు లేవు. ఔత్సర్గికమగు నేకవచనమే యగును.

ఉదా:—త్వయా మయా అన్యైశ్చ భూయతే, బభూవే.

### సూ.—స్యసిచ్సీయుట్తాసిషు భావకర్మణోరుపదేశేఽజ్ఝనగ్రహదృశాం వా చిణ్వదిట్చ—౬-౪-౬౨.

ఔపదేశికమగు-అచ్చు అంతమునఁగల ధాతువులకును, హన-గ్రహ-దృశిర్ ధాతువులకును, భావకర్మార్థములు గమ్యమానములగునపుడు స్య-సిచ్-సీయుట్ (ఆగమము) తాసిఅనునవి పరమగుచో, చిణ్ పరమగునపుడువలె నంగకార్యములు వికల్ప

ముగానగును. స్య-సిచ్ మున్నగువాని కిడాగమంబునగును. చిణ్వద్భావము వచ్చినపుడే, ఇడాగమమగును. 'అచోఞ్ణితి' అను సూత్రముచే వృద్ధి భావితా; భవితా. భావిష్యతే; భవిష్యతే. భూయతామ్. అభూయత. భావిషీష్ట; భవిషీష్ట.

సూ.—చిణ్ భావకర్మణోః—3-౧-౬౬.

భావకర్మవాచకమగు తశబ్దము పరమగుచో చ్లిప్రత్యయమునకు చిణ్ (ఇ)అను నాదేశమగును.

ఉదా:—అభావి. అభావిష్యత; అభవిష్యత.

అకర్మకధాతువును నుపసర్గవశంబున సకర్మకమగును. అనుభూయతే ఆనన్దః చైత్రేణ త్వయా మయా చ. అనుభూయేతే-అనుభూయన్తే, త్వమనుభూయసే, అహమనుభూయే. అన్వభావి-అన్వభావిషాతామ్; అన్వభవిషాతామ్. ణిలోపము-భావ్యతే. భావయాంచక్రే-భావయాంబభూవే-భావయామాసే. చిణ్వద్భావముచేత నిడాగమము భావితా. చిణ్వదిట్టు ఆభీయము గాన నసిద్ధమగుటచే ణిలోపము. భావయితా. భావయిషీష్ట. అభావి - అభావిషాతామ్; అభావయిషాతామ్. బుభూష్యతే. బుభూషాంచక్రే. బుభూషితా. బుభూషిష్యతే. బోభూయ్యతే, బోభూయిష్యతే. 'అకృత్సార్వధాతుకయోర్దీర్ఘః' అనుసూత్రముచేత దీర్ఘము-స్తూయతే (విష్ణుః) స్తావితా; స్తోతా. స్తావిష్యతే; స్తోష్యతే. అస్తావి-అస్తావిషాతామ్; అస్తోషాతామ్. ఋ=గతౌ 'గుణోఽర్తిసంయోగాద్యోః' అనుసూత్రముచే గుణము అర్యతే.

స్మృ = చిన్తాయామ్. స్మర్యతే. సస్మరే. ఉపదేశ గ్రహణము వలన ఛిణ్వాదిట్టు. ఆరితా; అర్తా. స్మారితా; స్మర్తా. అనిదితా మిత్యాదిసూత్రముచే నలోపము స్రస్యతే. ఇదిత్తయినచో- నన్ద్యతే. సంప్రసారణము ఇజ్యతే.

సూ.—తనోతేర్యకి—౬-౪-౪౪.

తనుధాతువునకు యక్ప్రత్యయము పరమగునపుడు ఆకారము వికల్పముగా నంతాదేశమగును.

ఉదా:—తాయతే; తన్యతే.

సూ.—తపోऽనుతాపే చ—3-౧-౬౫.

కర్మకర్తృరూపార్థమునను, పశ్చాత్తాపరూపార్థమునను, తపధాతువుకంటెఁ బరమగు చ్లిప్రత్యయమునకు చిణ్ణు రాదు.

ఉదా:—అన్వతప్త పాపేన.'ఘుమాస్థా' యనుసూత్రము చేత నీత్వము-దీయతే. ధీయతే. దదే.

సూ.—ఆతో యుక్ చిణ్కృతోః—౭-3-33.

చిణ్ణుగాని, ఞిత్తుణిత్తునగు కృత్తుగాని పరమగునపుడు ఆకారాంతధాతువునకు యుక్(య్)అనునాగమ మగును.

ఉదా:—దాయితా; దాతా. దాయిషీష్ట; దాసీష్ట. అదాయి-అదాయిషాతామ్. భజ్యతే.

సూ.—భఞ్జేశ్చ చిణి—౬-౪-33.

భఞ్జో ధాతువునకు చిణ్ణు పరమగునపుడు నకారలోపము వికల్పముగానగును.

ఉదా:—అభాజి-పక్షంబున-అభఞ్జి. లభ్యతే.

సూ.—విభాషా చిణ్ణములోః—౭-౧-౬౯.

చిణ్ణుగాని, ణముల్ప్రత్యయముగాని పరమగునపుడు డులభష్ ధాతువునకు నుమాగమంబు వికల్పముగానగును.

ఉదా:—అలమ్భి; అలాభి.

ఇది భావకర్మప్రక్రియ.

---

కర్మకర్తృప్రక్రియ.

సౌకర్యాతిశయమును బోధించునపుడు కారకములన్నియుఁ గర్తృసంజ్ఞను బొందును.

ఉదా:—సాధ్వసి శ్ఛినత్తి, కాష్ఠాని పచన్తి, స్థాలీ పచతి, ఇత్యాది. కర్మకారకమునకుఁ గర్తృత్వవివక్షయందు సకర్మక ధాతువులుగూడ నకర్మకములేయగును గానఁ గర్త్రర్థమందును, భావార్థమందును, లకారంబులగును.

సూ.—కర్మవత్కర్మణా తుల్యక్రియః—౩-౧-౮౭.

కర్మస్థక్రియతోఁ దుల్యమగుక్రియగలకర్త కర్మము వంటిదగును. ఇది కార్యాతిదేశంబు గాన యక్కు - ఆత్మనే పదము-చిణ్ణు-చిణ్వదిట్టు అనునీనాలుగు కార్యములు నగును.

ఉదా:—పచ్యతే ఫలమ్, భిద్యతే కాష్ఠమ్. అపాచి అభేది. భావార్థమందు-భిద్యతే కాష్ఠేన.

ఇది కర్మకర్తృప్రక్రియ

---

## లకారార్థప్రక్రియ.

### సూ.—అభిజ్ఞావచనే లృట్—౩-౨-౧౧౨.

స్మృతిబోధకశబ్ద ముపపదంబుగా నున్నపుడు భూతానద్యతనకాలికక్రియను బోధించుధాతువుకంటెఁ బరముగా లృట్టగును. లఙ్కున కపవాదంబు.

ఉదా:—వస=నివాసే. స్మరసి కృష్ణ గోకులే వత్స్యామః. ఇట్లే - బుధ్యసే, చేతయసే మున్నగు శబ్దప్రయోగములందు నెఱుంగునది.

### సూ.—న యది—౩-౨-౧౧౩.

యచ్ఛబ్దయోగంబునఁ బూర్వోక్తకార్యంబు రాదు.

ఉదా:—అభిజానాసి కృష్ణ యద్వనే అభుఞ్జ్మహి.

### సూ.—లట్ స్మే—౩-౨-౧౧౮.

స్మశబ్దయోగంబున భూతానద్యతనపరోక్షార్థమున లట్టగును. లిట్టున కపవాదంబు. ఉదా:—యజతి స్మ యుధిష్ఠిరః.

### సూ.—వర్తమానసామీప్యే వర్తమానవద్వా—౩-౩-౧౩౧.

సమీపమే సామీప్యమనఁబడును. వర్తమానకాలమునఁజెప్పఁబడిన ప్రత్యయములు వర్తమానసమీపమగు భూతంబునను, భవిష్యత్తునందును గూడ వికల్పముగానగును.

ఉదా:—కదా ఆగతోఽసి? అయమాగచ్ఛామి, అయమాగమం వా. కదాగమిష్యసి? ఏష గచ్ఛామి, ఏష గమిష్యామి వా.

**సూ.—హేతుహేతుమతోర్లిఙ్—3-3-౧౫౬.**

భవిష్యదర్థంబునఁ గార్యకారణక్రియావాచకధాతువులకంటెఁ బరమగుచు లిఙ్లు వికల్పముగానగును.

ఉదా:—కృష్ణం నమేచ్చేత్ సుఖం యాయాత్; కృష్ణం నంస్యతి చేత్ సుఖం యాస్యతి. భవిష్యదర్థమునందే యగుట భాష్యకారసమ్మతంబుగాన—హన్తీతి పలాయతే—అనుచో రాదు. 'విధినిమన్త్రణ' యనుసూత్రముచేత లిఙ్లు విధియందు—యజేత. నిమన్త్రణమందు-ఇహ భుఞ్జీత. ఆమన్త్రణమున-ఇహాసీత. అధీష్టమునందు - పుత్రమధ్యాపయేద్భవాన్. సంప్రశ్నమందు-కిం భో వేదమధీయీయ ఉత తర్కమ్. ప్రార్థనంబున-భో భోజనం లభేయ. ఇట్లే లోట్టుగూడ నగునని యెఱుంగునది. విధ్యాదులయర్థంబులు 'విధినిమన్త్రణ' యను సూత్రమున నరయునది.

ఇది లకారార్థప్రక్రియ.

ఇది తిజన్తప్రకరణము.

# కృదన్తప్రకరణము.

## కృత్యప్రక్రియ.

### సూ.—ధాతోః—3-౧-౯౧.

ఇయ్యది యధికారసూత్రంబు. తృతీయాధ్యాయము చివరవఱకు విధింపఁబడిన ప్రత్యయములు ధాతువుకంటెఁ బరంబుగానగును. 'కృదతిఙ్' అనుదానిచేఁ గృత్సంజ్ఞ.

### సూ.—వా సరూపోఽస్త్రియామ్—3-౧-౯౪.

ఈధాత్వధికారంబున సరూపంబు కానియపవాదప్రత్యయము సామాన్యప్రత్యయమునకు వికల్పముగా బాధకంబగును. 'స్త్రియాం క్తిన్' అను నధికారంబునఁగాదు.

### సూ.—కృత్యాః—3-౧-౯౫.

ఇది యధికారసూత్రంబు. 'ణ్వుల్తృచౌ' అనుసూత్రమునకుఁ బూర్వమువిధింపఁబడిన ప్రత్యయములు కృత్యసంజ్ఞకంబులగును.

### సూ.—కర్తరి కృత్—3-౪-౬౭.

కృత్ప్రత్యయంబు కర్త్రర్థంబునం దగును. అని ప్రాప్తింపఁగా,

### సూ.—తయోరేవ కృత్యక్తఖలర్థాః—3-౪-౭౦.

కృత్యప్రత్యయంబులును, క్తప్రత్యయంబును, ఖలర్థప్రత్యయంబులును భావకర్మములయందే యగును.

సూ.—తవ్యత్తవ్యానీయరః—3-౧-౯౬.

తవ్యత్ (తవ్య)-తవ్య-అనీయర్ (అనీయ) ప్రత్యయం బులు ధాతువుకంటెఁ బరంబుగానగును.

ఉదా:—ఏధ్+తవ్య ఇడాగమంబు-ఏధితవ్యమ్, ఏధ నీయమ్ త్వయా. భావార్థంబున నౌత్సర్గికంబగు నేకవచనం బును గ్లీబత్వంబు నగును. చేతవ్యః చయనీయో వా ధర్మ స్త్వయా.

కేలిమర ఉపసంఖ్యానమ్—(వా).

ధాతువుకంటెఁబరంబుగా కేలిమర్ (ఏలిమ) ప్రత్యయం బగును.

ఉదా:—పచ్+ఏలిమ=పచేలిమాః మాషాః.(పక్తవ్యాః), భిదేలిమాః సరలాః. (భేత్తవ్యాః) ఇటఁ గర్మరూపార్థంబున కేలిమర్ ప్రత్యయంబయ్యెనని యెఱుంగునది.

సూ.—కృత్యల్యుటో బహులమ్—3-3-౧౧3.

కృత్యప్రత్యయంబులును, ల్యుట్ ప్రత్యయంబును ధాతువుకంటెఁ బరముగ బహుళంబుగా నగును.

ఒకచో నిత్యప్రవృత్తి, మఱియొకచోఁ బ్రవృత్తిలేకుం డుట, ఒకచోటవికల్పముగాఁ బ్రవర్తించుట, యొక్కచో నన్యార్థంబు నిచ్చుటయు నని బహుళపదార్థమును నాలుగు విధములుగాఁ జెప్పుచున్నారు. స్నాత్యనేనేతి స్నానీయమ్

(చూర్ణమ్)-ఇటఁ గరణార్థమున 'అనీయర్' ప్రత్యయమువచ్చెను. దీయతే అస్మై దానీయో (విప్రః)-ఇటసంప్రదానంబున 'అనీ యర్' ప్రత్యయంబు.

సూ.—అచో యత్—౩-౧-౯౭.

అజంతంబగు ధాతువుకంటెఁ బరంబుగా యత్ (య) ప్రత్యయంబగును. ఉదా:—చేయమ్.

సూ.—ఈద్యతి—౬-౪-౬౫.

యత్ ప్రత్యయంబు పరంబగుచో ఆకారాంతంబగు నంగమునకు, ఈకారంబగును.

ఉదా:—దేయమ్, గ్లేయమ్.

సూ.—పోరదుపధాత్—౩-౧-౯౮.

పవర్గాంతంబును అదుపధంబును నగు ధాతువుకంటెఁ బరంబుగా యత్ప్రత్యయంబగును. ణ్యత్తునకపవాదంబు.

ఉదా:—శప్యమ్, లప్యమ్.

సూ.—ఏతిస్తుశాస్వృదృజుషః క్యప్—౩-౧-౧౦౯.

ఇణ్-ష్టుఞ్-శాసు-వృఞ్-దృఙ్-జుషీ ధాతువులకంటెఁ బరంబుగా క్యప్(య) ప్రత్యయంబగును.

సూ.—హ్రస్వస్య పితి కృతి తుక్—౬-౧-౭౧.

హ్రస్వంబునకుఁ బకారేత్సంజ్ఞకమగు కృత్తు పరమగుచో తుక్ (త్) అను నాగమంబగును.

ఉదా:—ఇ+య తుగాగమంబు = ఇత్యః, స్తు+య-స్తుత్యః. శాసు.=అనుశిష్టౌ (శాసించుట.)

సూ.—శాస ఇదఙ్హలోః—౬-౪-౩౪.

శాసుధాతువుయొక్క యుపధకు అఙ్కాని, హలాదులగు కిత్తు-ఙిత్తులుగాని పరంబగుచో, ఇకారంబగును.

ఉదా:—శాస్+య శిస్+య 'శాసివసి' యనుసూత్రముచే షత్వము-శిష్+య=శిష్యః. వృత్యః, ఆదృత్యః, జుష్యః.

సూ.—మృజేర్విభాషా—౩-౧-౧౧౩.

మృజూధాతువుకంటెఁ బరంబుగా క్యప్(య) ప్రత్యయము వికల్పముగానగును.

ఉదా:—మృజ్+క్యప్=మృజ్యః.

సూ.—ఋహలోర్ణ్యత్—౩-౧-౧౨౪.

ఋవర్ణాంతంబుగాని, హలంతంబుగానియగు ధాతువుకంటెఁబరంబుగా ణ్యత్(య)ప్రత్యయంబగును.

ఉదా:—కార్యమ్, హార్యమ్, ధార్యమ్.

సూ.—చజోః కు ఘిణ్ణ్యతోః—౭-౩-౫౨.

ఘిత్తుగాని ణ్యత్తుగాని పరమగుచో చ-జ లకు కుత్వంబగును.

ఉదా:—మృజ్+య కుత్వంబు మృగ్+య అనిసిద్ధింపఁగా,

మృజేర్వృద్ధిః—౭-౨-౧౧౪.

సార్వధాతుకముగాని, యార్ధధాతుకముగాని పరమగుచో మృజూధాతువుయొక్క ఋకారమునకు వృద్ధియగును.

ఉదా:—మార్గ్+య=మార్గ్యః.

సూ.—భోజ్యం భక్ష్యే—౭-౩-౬౯.

భక్ష్యంబర్థంబగుచో-భోజ్యమ్—అనఁబడును.

భుజధాతువునకు భక్ష్యార్థంబునఁ గుత్వాభావంబు దీనిచే నిపతింపఁబడియె అర్థాంతరంబున - భోగ్యమ్.

ఇది కృత్యప్రక్రియ.



పూర్వకృదన్తప్రకరణము.

సూ.—ణ్వుల్తృచౌ—3-౧-౧33.

కర్త్రర్థంబున ధాతువుకంటెఁబరముగా ణ్వుల్(వు)-తృచ్(తృ) ప్రత్యయంబులగును.

సూ.—యువోరనాకౌ—౭-౧-౧.

అంగముకంటెఁబరములు, ననునాసికములునగు యు-వులకు వరుసగా అన-అక అనునవి యాదేశములగును.

ఉదా:—కృఞ్+ణ్వుల్ కృ+వ్ కృ+అక కార్+అక=కారకః. కృ+తృ గుణము=కర్తృ, కర్తా.

సూ.—నందిగ్రహిపచాదిభ్యో ల్యుణిన్యచః—3-౧-౧౩౪.

టునది మున్నగు వానికిని, గ్రహ మొదలగు వానికిని, డుపచష్ ప్రభృతులకును బరమై వరుసగా ల్యు(యు) - ణిని(ఇన్). అచ్ (అ) ప్రత్యయంబు లగును.

ఉదా:—నన్దయతీతి=నన్దనః, జనార్దనః, లవణః, గ్రాహీ, స్థాయీ, మన్త్రీ. పచాదులాకృతిగణంబు.

సూ.—ఇగుపధజ్ఞాప్రీకిరః కః—3-౧-౧౩౫.

ఇగుపధంబులగు ధాతువులకంటెను, జ్ఞా-ప్రీఞ్ - కౄ ధాతువులకంటెను, క (అ) ప్రత్యయంబగును.

ఉదా:—బుధ్+అ=బుధః, కృశః, జ్ఞః, ప్రియః, కిరః.

సూ.—ఆతశ్చోపసర్గే—3-౧-౧౩౬.

ఉపసర్గం బుపపదంబగుచో ఆదంతంబగు ధాతువుకంటెఁ బరంబుగా క-ప్రత్యయంబగును.

ఉదా:—ప్రజ్ఞా+అ (క) ఆకారలోపంబు ప్రజ్ఞః, సుగ్లః.

సూ.—గేహే కః—3-౧-౧౪౪.

గేహంబు కర్తయగుచో గ్రహధాతువుకంటెఁబరముగా కప్రత్యయంబగును.

ఉదా:—గ్రహ్+అ (క) సంప్రసారణంబు=గృహమ్.

సూ.—కర్మణ్యణ్—3-౨-౧.

కర్మబోధకం బుపపదంబగుచో ధాతువుకంటె అణ్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—కుమ్భం కరోతీతి=కుమ్భకారః.

సూ.—ఆతోఽనుపసర్గే కః—3-2-3.

కర్మబోధకం బుపపదంబగుచో, ఉపసర్గసహితంబుకాని ఆదంతథాతువుకంటెం బరముగా కప్రత్యయంబగును. అణ్ణున కపవాదంబు.

ఉదా:—గాం దదాతి-యనువిగ్రహంబున గో-దా+క ఆకారలోపంబు = గోదః, ధనదః. కమ్బలం దదాతీతి = కమ్బలదః. గాం సమ్యక్ దదాతి యనుచో-గో—సం+దా ఇట దా థాతు వుపసర్గసహితంబగుటచేతఁ గప్రత్యయంబు లేదు. అణ్ణు= గోసందాయః.

మూలవిభుజాదిభ్యః కః—(వా)

మూలవిభుజాదిశబ్దములకంటెఁ గప్రత్యయంబగును.

ఉదా:—మూలాని విభుజతీతి=మూలవిభుజ్+క=మూలవిభుజః-(రథః) ఇది యాకృతిగణంబుగాన మహీధ్రః, కుధ్రః, యనుచోఁ గప్రత్యయము సిద్ధించెనని తెలియునది.

సూ.—చరేష్టః—3-2-16.

అధికరణం బుపపదంబగుచో చరథాతువుకంటెఁ బరముగా ట (అ) ప్రత్యయంబగును.

ఉదా:—కురుషు చరతీతి=కురుచరః.

సూ.—భిక్షాసేనాదాయేషు చ—3-౨-౧౭.

భిక్షా-సేనా-ఆదాయ శబ్దంబు లుపపదంబులగుచో చర ధాతువుకంటె టప్రత్యయంబగును.

ఉదా:—భిక్షాచరః, సేనాచరః, ఆదాయశబ్దంబు ల్యప్ప్రత్యయాంతంబు. ఆదాయచరః.

సూ.—కృఞో హేతుతాచ్ఛీల్యానులోమ్యేషు—3-౨-౨౦.

హేతువుగాని, తాచ్ఛీల్యముగాని, ఆనులోమ్యముగాని ద్యోత్యమగుచో కృఞ్ ధాతువుకంటెఁ బరముగా టప్రత్యయంబగును.

సూ.—అతః కృకమికంసకుమ్భపాత్రకుశాకర్ణీష్వనవ్యయస్య—౮-3-౪౬.

అత్తునకుఁబరమును, అవ్యయభిన్నంబుననగు విసర్గంబునకు సమాసంబున కృఞ్-కము-కంస-కుమ్భ-పాత్ర-కుశా-కర్ణీ యనునవి పరమగుచో నిత్యంబుగా సకారాదేశంబగును. ఉత్తరపదస్థమగు సకారమునకుఁగాదు.

ఉదా:—యశః+కృ+ట గుణము-సత్వము = యశస్కర జీప్పు-యశస్కరీ (విద్యా), శ్రాద్ధకరః, వచనకరః.

సూ.—ఏజేః ఖశ్—3-౨-౨౮.

ణ్యంతంబగు ఏజృధాతువుకంటె ఖశ్ (అ) ప్రత్యయంబగును.

సూ.—అరుర్ద్విషదజన్తస్య ముమ్—౬-3-౬౭.

అరుశ్శబ్దంబునకును, ద్విషచ్ఛబ్దంబునకును, అజంతంబునకును ఖిదంతంబగు నుత్తరపదంబుపరంబగుచో ముమ్ (మ్) అనునాగమంబగును. అవ్యయంబునకుఁగాదు. ఇయ్యదిశిత్తగుటచే శబాదులువచ్చును.

ఉదా:—జనమ్ ఏజయతి—యనువిగ్రహంబున - జన ఏజి+ఖశ్ శప్పు-జన+ఏజి+అ-అ గుణము - అయాదేశము-పరరూపము - జన+ఏజయ ముమాగమము=జనమేజయః.

సూ.—ప్రియవశే వదః ఖచ్—3-౨-3౮.

ప్రియ-వశ శబ్దంబు లుపపదంబులగుచో వదధాతువు కంటె ఖచ్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—ప్రియంవదః, వశంవదః.

సూ.—ఆత్మమానే ఖశ్ చ—3-౨-౮3.

సుబంత ముపపదమగుచో స్వకర్మకమననంబును బోధించు మన్యధాతువుకంటెఁ బరముగా ఖశ్ ప్రత్యయంబగును. ణిని (ఇన్) ప్రత్యయంబుగూడ నగును.

ఉదా:—పణ్డితమాత్మానం మన్యతే-యనువిగ్రహంబునఁ దన్నుఁదాను బండితుఁడనని తలఁచుకొనుటచేత నీజ్ఞానంబునఁ దానేకర్మమగును. పణ్డిత+మన్య ముమ్ము-పణ్డితంమన్యః, పణ్డిత+మన్+ణిని ణినిప్రత్యయంబుశిత్తుకానందున శ్యన్ను రాదు;

ఖిదంతంబగు నుత్తరపదంబులేనందున ముమాగమంబులేదు. పణ్డితమానీ.

సూ.—అన్యేభ్యోఽపి దృశ్యన్తే—3-౨-౭౫.

మనిన్ (మన్)-క్వనిప్ (వన్) - వనిప్ (వన్)-విచ్ (ఇది సర్వాలోపి) ప్రత్యయంబులు ధాతువుకంటెఁ బరంబుగానగును.

సూ.—నేడ్వశి కృతి—౭-౨-౮.

వశ్ ప్రత్యాహారబోధ్యవర్ణంబు లాదియందుఁగలకృత్తున కిడాగమంబురాదు. శౄ = హింసాయామ్ (హింసించుట).

ఉదా:—సు-శౄ+మనిన్ గుణంబు-సుశర్మన్=సుశర్మా, ప్రాతరిత్వా.

సూ.—విడ్వనోరనునాసికస్యాత్—౬-౪-౪౧.

విట్-వన్ ప్రత్యయంబులు పరంబులగుచో ననునాసికంబున కాకారంబాదేశంబగును.

ఉదా:—విజాయతే - యనువిగ్రహంబున. విజన్+వన్ నకారంబున కాత్వంబు, సవర్ణదీర్ఘము - విజా+వన్=విజావాన్=విజావా.

ఓణ్పృ=అపనయనే (తొలఁగించుట) ఓణ్+వన్ ఆత్వంబు-ఓ-ఆ+వన్ అవాదేశంబు-అవ్-ఆ+వన్ = అవావన్=అవావా. రుష-రిష = హింసాయామ్ - రుష్+విచ్=రుష్ గుణము-రోష్-రోట్-రోడ్. రేట్-రేడ్. సుగణ్.

సూ.—క్విప్ చ—3-2-76.

ధాతువుకంటెబరంబుగా క్విప్ ప్రత్యయంబుగూడ నగును. (ఈప్రత్యయంబు సర్వంబునులోపించు).

ఉదా:—ఉఖా+స్రంస్+క్విప్ 'అనిదితా'మ్మను దానిచే నకారలోపము. 'వసుస్రంసుధ్వంసు' అనుదానిచే దకారము. ఉఖాస్రత్. పర్ణ+ధ్వంస్+క్విప్ = పర్ణధ్వత్. నకారలోపము, షత్వజశ్త్వచర్త్వములు-వాహభ్రట్.

సూ.—సుప్యజాతౌ ణినిస్తాచ్ఛీల్యే—3-2-78.

జాతివాచకంబుకాని సుబంతం బుపపదంబగుచో తాచ్ఛీల్యంబుద్యోత్యంబగునపుడు, ధాతువుకంటెబరముగా ణిని (ఇన్) ప్రత్యయంబగును.

ఉదా:—ఉష్ణం భుఙ్క్తే—యనువిగ్రహంబున - ఉష్ణ+భుజ్+ఇన్ గుణము=ఉష్ణభోజిన్; ఉష్ణభోజీ.

సూ.—మనః—3-2-82.

సుబంతం బుపపదంబగుచో దైవాదికంబగు మను ధాతువుకంటెబరంబుగా ణినిప్రత్యయంబగును.

ఉదా:—ఆత్మానం పరం వా దర్శనీయం మన్యతే—యనువిగ్రహంబున - దర్శనీయమానీ.

సూ.—ఖిత్యనవ్యయస్య—6-3-66.

ఖిదంతంబగు నుత్తరపదంబు పరంబగుచో నవ్యయభిన్నంబగు పూర్వపదంబునకు హ్రస్వంబగును.

ఉదా:—కాలీం మన్యతే=కాలింమన్యా.

సూ.—కరణే యజః—.3-౨-౮౫.

కరణవాచకం బుపపదంబగుచో భూతార్థవాచకంబగు యజధాతువుకంటెఁ బరముగాఁ గర్త్రర్థంబున ణినిప్రత్యయం బగును.

ఉదా:—సోమేనేష్టవాన్ - సోమ+యజ్+ణిని ఉపధా వృద్ధి=సోమయాజీ, అగ్నిష్టోమయాజీ.

సూ.—దృశేః క్వనిప్—3-౨-౯౪.

కర్మబోధకం బుపపదంబగుచో భూతార్థవాచకంబగు దృశిర్ ధాతువుకంటెఁబరంబుగా క్వనిప్ ప్రత్యయమగును.

ఉదా:—పారం దృష్టవాన్=పారదృశ్వా.

సూ.—రాజని యుధికృఞః—3-౨-౯౫.

కర్మభూతంబగు రాజన్‌శబ్దం బుపపదంబగుచో భూతార్థ వాచకంబులగు-యుధ-కృఞ్ ధాతువులకంటె క్వనిప్ ప్రత్యయంబగును. యుధధాతు వంతర్భావితప్రేరణార్థకంబు.

ఉదా:—రాజానం యోధితవాన్ = రాజయుధ్వా. రాజానం కృతవాన్=రాజకృత్వా.

సూ.—సహే చ—3-౨-౯౬.

సహాశబ్దం బుపపదంబగుచో భూతార్థవాచకంబులగు యుధ-కృఞ్ ధాతువులకంటెఁబరముగా క్వనిప్పగును.

ఉదా:—సహ యోధితవాన్ = సహయుధ్వా. సహ కృతవాన్=సహకృత్వా.

సూ.—సప్తమ్యాం జనేర్డః—3-౨-౯౭.

సప్తమ్యంతం బుపపదంబగుచో భూతార్థవాచకంబగు జనీధాతువునకుఁ బరముగా డ (అ) ప్రత్యయంబగును.

సూ.—తత్పురుషే కృతి బహులమ్—౬-3-౧౪.

తత్పురుషసమాసంబునఁ గృదన్తంబగు నుత్తరపదంబు పరంబగుచో సప్తమీవిభక్తికి బహుళముగా నలుక్కగును. (అనఁగా బహుళముగాలుక్కు కాదనుట).

ఉదా:—సరసిజాతమ్:—సరస్+ఇ+జన్+డ టిలోపంబు సరస్+ఇ+జ్+అ=సరసిజమ్. విభక్తిలోపించినపక్షమున—సరోజమ్.

సూ.—ఉపసర్గే చ సంజ్ఞాయామ్—3-౨-౯౯.

సంజ్ఞనుబోధించుచో నుపసర్గం బుపపదంబగునపుడు జనీ-ధాతువుకంటె డప్రత్యయంబగును.

ఉదా:—ప్ర - జన్+డ టిలోపంబు - ప్రజ+టాప్=ప్రజా. 'ప్రజా స్యాత్సంతతౌ జనే' అనియమరము.

సూ.—క్తక్తవతూ నిష్ఠా—౧-౧-౨౬.

క్త (త)-క్తవతు - (తవత్) ప్రత్యయంబులు నిష్ఠాసంజ్ఞకంబులు.

సూ.—నిష్ఠా—3-౨-౧౦౨.

భూతార్థవృత్తియగు ధాతువుకంటెబరముగా నిష్ఠయగును. అందు 'తయోరేవ కృత్యక్తఖలర్థాః' అనుదానిచే భావకర్మములయందు క్తప్రత్యయంబును, 'కర్తరి కృ'త్తను దానిచే గర్త్రర్థంబున క్తవతుప్రత్యయంబును నగును.

ఉదా:—ష్ణా+త స్నా+త=స్నాతమ్ మయా, స్తుతస్త్వయా విష్ణుః, విశ్వం కృతవాన్ విష్ణుః.

సూ.—రదాభ్యాం నిష్ఠాతో నః పూర్వస్య చ దః—౮-౨-౪౨.

రేఫదకారములకంటె బరంబగునిష్ఠాతకారమునకును, ఆనిష్ఠకంటె బూర్వముననున్న ధాతుస్థదకారమునకును నకారంబగును.

ఉదా:—శౄ+క్త శౄ+త 'ఋూతఇద్ధాతోః' యను దానిచే ఋూకారంబున కికారంబు రపరంబై వచ్చును. శిర్+త 'హలి చ' అనుదానిచే దీర్ఘంబు - తకారంబునకు నకారంబు= శీర్న ణత్వము=శీర్ణః. భిద్+త-భిన్నః, ఛిన్నః.

సూ.—సంయోగాదేరాతో ధాతోర్యణ్వతః—౮-౨-౪౩.

సంయోగాదియు, నాదంతంబును, యణ్వంతంబునునగు ధాతువుకంటెబరంబగు నిష్ఠాతకారమునకు నకారంబగును.

ఉదా:—ద్రా+త నకారము-ద్రా+న ణత్వము=ద్రాణః, గ్లానః.

సూ.—ల్వాదిభ్యః—౮-౨-౪౪.

లూఞ్ మున్నగు ధాతువు లిరువదియొకటింటికిని బర మగు నిష్ఠాతకారంబునకు నకారంబగును. (క్ర్యాదిగణమున వివరింపఁబడిన ప్వాదిగణమునందంతర్గణము ల్వాది.)

ఉదా:—లూఞ్+త=లూనః, జ్యా+త సంప్రసారణము-పూర్వరూపము జి+త అనియుండఁగా,

సూ.—హలః—౬-౪-౨.

అంగంబున కవయవంబగు హల్లునకం టెఁబరంబగు సంప్రసారణం బంతంబునంగల యంగంబునకు దీర్ఘంబగును.

ఉదా:—జీ+త నిష్ఠానత్వము=జీనః.

సూ.—ఓదితశ్చ—౮-౨-౪౫.

ఓకారేత్సంజ్ఞకంబులగు ధాతువులకం టెఁబరంబగు నిష్ఠాతకారమునకు నకారంబగును.

ఉదా:—భుజో-టుఓశ్వి ఇత్యాదు లోదిత్తులు. భుజ్+త భుగ్+త భుగ్+న = భుగ్నః. ఉద్+శ్వి+త'వచిస్వపియజాదీనాంకితి' అనుసూత్రముచే సంప్రసారణము ఉద్+శూ+న చర్త్వము-ఛత్వము=ఉచ్ఛూనః.

శుషః కః—౮-౨-౫౧.

శుష ధాతువునకుఁబరమగు నిష్ఠాతకారమునకు, కకారం బగును.

ఉదా:—శుష్+త=శుష్కః.

సూ.—పచో వః—౮-౨-౫౨.

డుపచష్ ధాతువునకుఁబరమైన నిష్ఠాతకారమునకు వకారంబగును.

ఉదా:—పచ్+త కుత్వంబు పక్+త వత్వంబు=పక్వః. క్షై=హార్ష క్షయే (కృశించుట).

సూ.—క్షాయో మః—౮-౨-౫౩.

క్షైధాతువుకంటెఁబరమగు నిష్ఠాతకారమునకు మకారంబగును.

ఉదా:—క్షై+త ఆత్వంబు-మత్వంబు=క్షామః.

సూ.—నిష్ఠాయాం సేటి—౬-౪-౫౨.

సేట్టగు నిష్ఠపరమగుచో ణిప్రత్యయంబు లోపించును.

ఉదా:—భావి+త ఇట్టు-భావి+ఇత ణిలోపంబు-భావ్+ఇత=భావితః, భావితవాన్. దృహదృహి=వృద్ధౌ(వృద్ధినొందుట.)

సూ.—దృఢః స్థూలబలయోః—౭-౨-౨౦.

స్థూలమైనవానియందును, బలముగలవానియందును "దృఢః" అని నిపతింపఁబడియెను.

ఇట దృహ-దృహి ధాతువులకుఁబరమైన నిష్ఠ కిడ భావంబును, తకారంబునకు ఢత్వంబును, హకారంబునకు లోపంబును నిపతింపఁబడియెను. దృహిధాతువునకు నలోపం

బొక్కం డధికంబు. ఇతరార్థంబులందు. దృహితః, దృంహితః-అనిరూపంబులగును.

సూ.—దథాతేర్హిః—౭-౪-౪౨.

తకారాదియగు కిత్తుపరమగుచో ధాఞ్ ధాతువునకు హి యనునది యాదేశంబగును.

ఉదా:—ధా+త=హితమ్.

సూ.—దో దద్ఘోః—౭-౪-౪౬.

ఘుసంజ్ఞకంబులగు దారూపధాతువులకు తకారాది యగుకిత్తుపరమగుచో దద్-(దత్)(దద్) (దథ్)-అనునాదేశం బగును.

ఉదా:—దా+త దథ్+త చర్త్వము=దత్తః.

సూ.—ఛన్దసి లిట్—3-౨-౧౦౫.

సూ.—లిటః కానజ్వా—3-౨-౧౦౬.

సూ.—క్వసుశ్చ—3-౨-౧౦౭.

భూతార్థసామాన్యమున లిట్టగును. ఆలిట్టునకు కానచ్ (ఆన)-క్వసు (వస్) ప్రత్యయంబులు వికల్పంబుగానగును. 'తజానావాత్మనేపద'మ్మనుదానిచేఁ గానచ్ప్రత్యయం బాత్మనేపదంబు.

ఉదా:—చకృ+ఆన యణ్ణు-ణత్వంబు=చక్రాణః.

సూ.—మ్వోశ్చ—౮-౨-౬౫.

మాంతంబగుధాతువుయొక్క మకారమునకు మకారముగాని, వకారముగాని పరమగుచో నకారంబగును.

ఉదా:—జగమ్+వస్ జగన్+వస్ నుమాదికము=జగన్వాన్.

సూ.—లటశ్శతృశానచావప్రథమాసమానాధికరణే— 3-౨-౧౨౪.

ప్రథమాంతభిన్నంబుతో సామానాధికరణ్యమున్నచో లట్టునకు శతృ(అత్)-శానచ్ (ఆన) ప్రత్యయంబులు వికల్పంబుగానగును. ఈప్రత్యయంబులు శిత్తులగుటచే సార్వధాతుకములుగాన శప్పుమున్నగు ప్రత్యయంబు లగును.శానచ్ప్రత్యయమాత్మనేపదము.

ఉదా:—పచ్+అత్ (శతృ)-శప్పు పచ్+అ+అత్ పరరూపము=పచత్. పచన్తం చైత్రం పశ్య.

సూ.—ఆనే ముక్— ౭-౨-౮౨.

అంగావయవంబగు హ్రస్వాకారంబునకు ఆన-అనునది పరమగుచో ముక్ (మ్) ఆగమంబగును.

ఉదా:—పచ్+ఆన, శప్పు పచ+ఆన ముగాగమంబు = పచమానమ్ చైత్రం పశ్య.

లట్ అనియనువర్తించుచుండఁగా, మరల లట్టును గ్రహించుటచే నొకచోఁ బ్రథమాసామానాధికరణ్యమందును, శతృ-శానచ్ ప్రత్యయంబు లగుననిసూచితంబయ్యె.

ఉదా:—సన్-ద్విజః.

సూ.—విదేశ్శతుర్వసుః—౭-౧-౩౬.

ఆదాదికంబగు విదథాతువుకంటెఁబరమగు శతృప్రత్యయంబునకు వసు(వస్) అనునాదేశంబు వికల్పముగానగును.

ఉదా:—విద్+అత్ (శతృ) విద్+వస్=విద్వస్=విద్వాన్. పక్షంబున-విద్+శతృ విదత్=విదన్.

సూ.—తౌ సత్—౩-౨-౧౨౭.

శతృశానచ్ప్రత్యయంబులు రెండును సత్సంజ్ఞకంబులు.

సూ.—ల్రుటస్సద్వా—౩-౩-౧౪.

ల్రుట్టునకు సత్తు వికల్పముగానగును.

ఉదా:—కరిష్యన్తం, కరిష్యమాణం (పశ్య).

సూ.—ఆ క్వేస్తచ్ఛీలతద్ధర్మతత్సాధుకారిషు—౩-౨-౧౩౪.

ఇది మొదలుకొని క్విప్పువఱకు విధింపఁబోవు ప్రత్యయములు తచ్ఛీల (ప్రకృతధాత్వర్థము స్వభావముగాఁ గలది) తద్ధర్మ. (ప్రకృతధాత్వర్థమాఁచారముగాఁగలది) తత్సాధుకారులు (ప్రకృతధాత్వర్థమును బాగుగ ననుష్ఠించునది) కర్తలగుచో నగును.

సూ.—తృన్—౩-౨-౧౩౫.

తచ్ఛీలాదులు కర్తలగుచో ధాతువుకంటెఁ బరముగా తృన్ (తృ) ప్రత్యయంబగును.

ఉదా:—కృ+తృ గుణము=కర్తృ అనజాదికము. కర్తా (కటాన్).

సూ.—జల్పభిక్షకుట్టలుణ్టవృఙ్షాకన్—3-౨-౧౫౫.

జల్ప-భిక్ష-కుట్ట-లుటి-వృఙ్ ధాతువులకంబెరముగా షాకన్(ఆక)ప్రత్యయంబగును.

సూ.—షః ప్రత్యయస్య—౧-3-౬.

ప్రత్యయంబున కాద్యవయవంబగుషకారం బిత్సంజ్ఞకం బగును.

ఉదా:—జల్ప్+ఆక = జల్పాకః, భిక్షాకః, కుట్టాకః లుణ్టాకః. వృ+ఆక వర్+ఆక=వరాకః.

సూ.—సనాశంసభిక్ష ఉః—3-౨-౧౬౮.

సన్నంతంబులగు ధాతువులకును, ఆఙ్పూర్వకంబగు శంసుధాతువునకును, భిక్షధాతువునకును బరముగా 'ఉ' ప్రత్యయంబగును.

ఉదా:—చికీర్ష+ఉ అత్తునకులోపము. చికీర్షుః, ఆశంసుః భిక్షుః.

సూ.—భ్రాజభాసధుర్విద్యుతోర్జిపృజుగ్రావస్తువః క్విప్—3-౨-౧౭౭.

భ్రాజృ-భాస-ధుర్వీ-ద్యుత - ఊర్జ-పృ-జు-ష్టుఞ్-(గ్రావశబ్దపూర్వకము) వీనికిఁబరముగా క్విప్ ప్రత్యయంబగును.

ఉదా:—విభ్రాట్, భాః.

సూ.—రాల్లోపః—౬-౪-౨౧.

రేఫముకంటెబరంబగు ఛకారవకారములకు క్విప్రత్యయముగాని, ఝలాదులగుకిత్తుఙిత్తులుగాని, అనునాసికాదియగుప్రత్యయముగాని, పరమగుచో లోపంబగును.

ఉదా:—ధుర్వ్+క్విప్=ధుర్వ్ వలోపంబు-ధుర్=ధూః, విద్యుత్, ఊర్క్, పృ+క్విప్ 'ఉదోష్ఠ్యపూర్వస్య' యనుసూత్రముచేత, ఉకారము=పుర్ = పూః. 'అన్యేభ్యోఽపి దృశ్యతే' యనుసూత్రమునుండి దృశిగ్రహణా బపకర్షించుట చేత జుధాతువునకు దీర్ఘంబునగును. జూః, గ్రావస్తుత్.

క్విబ్వచిప్రచ్ఛ్యాయతస్తుకటప్రుజుశ్రీణాం దీర్ఘోఽసంప్రసారణం చ—(వా)

వచ-ప్రచ్ఛ-ష్టుఞ్(ఆయతశబ్దపూర్వకము) ప్రు (కటశబ్దపూర్వకము) జు-శ్రిఞ్ ధాతువులకంటెబరముగా, క్విప్ప్రత్యయంబగును. మఱియు నీధాతువులకు దీర్ఘమునగును. సంప్రసారణమురాదు.

ఉదా:—వక్తీతి—వచ్+క్విప్ దీర్ఘము-సంప్రసారణనిషేధము=వాచ్-కుత్వాదికము=వాక్, వాగ్.

సూ.—చ్ఛ్వోః శూడనునాసికే చ—౬-౪-౧౯.

తుగాగమసహితంబగు ఛకారంబునకును, వకారంబునకును క్విప్రత్యయముగాని, అనునాసికముగాని, ఝలాదు

లగు కిత్తుజిత్తులుగాని, పరమగుచో వరుసగా శ్-ఊఠ్ అనునవి యాదేశంబులగును.

ఉదా:—పృచ్ఛతి—యనువిగ్రహంబున - ప్రచ్ఛ్+క్విప్ ప్రచ్ఛ్ తుగాగమసహితంబగు ఛకారమునకు శవర్ణాదేశము-ప్రశ్ ప్రకృతవార్తికముచే దీర్ఘము, సంప్రసారణాభావము. ప్రాశ్ సులోపము, షత్వాదికము = ప్రాట్, ప్రాడ్. ఆయతం స్తౌతీతి- ఆయతస్తు+క్విప్=ఆయతస్తూః-కటం ప్రవతే ఇతి= కటప్రూః, శ్రయతి హరిం సా శ్రీః - ఈమూఁడుధాతువులకు దీర్ఘము. జూః అనునది పూర్వమునఁజెప్పఁబడెను.

సూ.—దామ్నీశసయుయుజస్తుతుదసిసిచమిహపతదశ నహః కరణే—౩-౨-౧౮౨.

దాప్-ణీఞ్-శసు-యు - యుజిర్-ష్టుఞ్ - తుద-షిఞ్ - షిచిర్-మిహ-పత్ల-దంశ-ణహ ధాతువులకంటెఁ గరణార్థమున ష్ట్రన్(త్ర)ప్రత్యయంబగును.

ఉదా:—దాత్యనేనేతి=దాత్రమ్, నీ+త్ర గుణము = నేత్రమ్.

సూ.—తితుత్రతథసిసుసరకసేషు చ—౭-౨-౯.

తి-తు-త్ర-త-థ-సి-సు-సర - క - స అనునీకృత్ప్రత్యయములు పదింటికిని, ఇడాగమంబు రాదు.

ఉదా:—శస్త్రమ్, యు+త్ర గుణము = యోత్రమ్ యుజ్+త్ర గుణము-కుత్వము=యోక్త్రమ్,స్తోత్రమ్, తోత్రమ్,

నేత్రమ్, నేక్త్రమ్, మిహ్+త్ర గుణము - ఢత్వము - ధత్వము-ష్టుత్వము - ఢలోపము=మేఢ్రమ్, పత్రమ్, దంశ్+త్ర షత్వ ష్టుత్వములు. షిత్తులకు జీష్నిత్యముగాన టాప్పు = దంష్ట్రా, నహ్+త్ర "నహోధ" యనుదానిచే ధత్వంబు నధ్+త్ర ధత్వ జశ్త్వములు. షిత్తగుటచేత జీష్షు=నధ్రీ.

సూ.—అర్తిలూధూసూఖనసహచర ఇత్రః—3-౨-౧౮౪.

ఋ-లూఞ్-ధూ (విధూననే - కదల్చుట కుటాది)-షూ-ఖను-షహ-చర ధాతువులకంటెబరముగా ఇత్ర ప్రత్యయం బగును.

ఉదా:—ఋ+ఇత్ర గుణము = అరిత్రమ్, లూ+త్ర గుణావాదేశములు=లవిత్రమ్, ధూ+త్ర ఈధాతువు కుటాది యగుటచే 'గాఙ్కుటాదిభ్య' యనుసూత్రముచేఁ బ్రత్యయంబుఙిత్తుగాన గుణము లేదు=ధువిత్రమ్, సవిత్రమ్, ఖనిత్రమ్, సహిత్రమ్, చరిత్రమ్.

సూ.—పువస్సంజ్ఞాయామ్—3-౨-౧౮౫.

పూఙ్, పూఞ్ ధాతువులకంటెఁ బరముగా సంజ్ఞయందు ఇత్ర అను ప్రత్యయంబగును.

ఉదా:—పూ+ఇత్ర గుణము=పవిత్రమ్.

ఇది పూర్వకృదంతప్రకరణము.

## ఉణాదిప్రకరణము.

### కృవాపాజిమిస్వదిసాధ్యశూభ్య ఉణ్—(ఉ-సూ.)

డుకృఞ్-వా-పా-జి-డుమిఞ్-ష్వద-సాధ-అశూ ధాతువులకంటెబరముగా ఉణ్ (ఉ) ప్రత్యయంబగును.

ఉదా:—కరోతీతి—కృ+ఉ వృద్ధి=కారుః, (శిల్పి, కారకుఁడును). వాతీతి—వా+ఉ "ఆతోయుక్చిణ్కృతోః" యనుదానిచే యుగాగమము=వాయుః. పాయుః (గుదము) జయతి (అభిభవతి)రోగానితి—జి+ఉ వృద్ధ్యాయాదేశములు=జాయుః, (ఔషధము). మినోతి (ప్రక్షిపతి) దేహే ఊష్మాణమితి=మాయుః (పిత్తము). స్వదతే (రోచతే) ఇతి = స్వాదుః (రుచించునది). సాధ్నోతి పరకార్యమితి=సాధుః (సాధించునది). అశ్నుతే ఇతి=ఆశు (శీఘ్రము).

ఇది ఉణాదిప్రకరణము.

—

## ఉత్తరకృదన్తప్రకరణము.

### సూ.—ఉణాదయో బహులమ్—3-3-౧.

ఉణ్ణుమున్నగు ప్రత్యయంబులు ధాతువుకంటెఁ బరంబుగా వర్తమానార్థమందును, సంజ్ఞయందును బహుళముగానగును. విధింపఁబడని మఱికొన్ని ప్రత్యయంబులు నూహ్యంబులు. సంజ్ఞావాచకములందు ధాతువులను, వానికంటెబరముగాఁ బ్రత్యయములను, ఆప్రత్యయములందుఁ గార్యవిశే

మునవిత్సంజ్ఞకవర్ణములను స్వేచ్ఛగాఁగల్పింపఁబడినవి. ఇవి యుణాదులయనుశాసనంబు.

## సూ.—తుమున్ణ్వులౌ క్రియాయాం క్రియార్థాయామ్ 3-3-౧౦.

క్రియార్థంబగుక్రియ యుపపదంబగుచో భవిష్యదర్థమున ధాతువుకంటెఁబరముగా తుమున్ (తుమ్)-ణ్వుల్ (వ్) ప్రత్యయంబులగును. ఈప్రత్యయంబులు మకారాంతములగుటచేత నీప్రత్యయము లంతమునఁగలశబ్దంబు లవ్యయంబులగును.

ఉదా:—కృష్ణమ్ దృశ్+తుమ్ 'సృజిదృశో' యనుదానిచే అమాగమము. దృ+అశ్+తుమ్ యణ్ణు- ద్రశ్+తుమ్ షత్వము-ష్టుత్వము=ద్రష్టుమ్ యాతి; కృష్ణం దర్శకో యాతి.

## సూ.—కాలసమయవేలాసు తుమున్—3-3-౧౬౭.

కాలార్థకము లుపపదంబులగుచో ధాతువుకంటెఁబరముగా తుమున్ ప్రత్యయంబగును.

ఉదా:—కాలః, సమయః, వేలా, అనేహా వా భుజ్+తుమ్ గుణము-కుత్వము=భోక్తుమ్.

## సూ.—భావే—3-3-౧౮.

సిద్ధావస్థాపన్నంబగు ధాత్వర్థంబు భావమనంబడును. అయ్యది వాచ్యమగుచో ధాతువుకంటె ఘఞ్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—పచ్+ఘఞ్ 'అతఉపథాయాః'యను సూత్ర ముచే వృద్ధి,చకారమునకు 'చజోఃకు' యనుదానిచేఁ గుత్వము =పాకః.

సూ.—అకర్తరి చ కారకే సంజ్ఞాయామ్—3-3-౧౯.

కర్తృభిన్నంబగు కారకంబును బోధించుచు సంజ్ఞ యందు ఘఞ్ ప్రత్యయంబగును. ఈసూత్రము మొదలుకొని 'కృత్యల్యుటోబహుళమ్' అను సూత్రమువఱకు భావే, అకర్తరి, కారకే అనుపదము లనువర్తించును.

సూ.—ఘఞి చ భావకరణయోః—౬-౪-౨౭.

భావార్థకంబును గరణార్థకంబునునగు ఘఞ్ ప్రత్యయము పరమగుచో రఞ్జ్‌ధాతువుయొక్క నకారమునకు లోప మగును.

ఉదా:—రఞ్జ్+ఘఞ్ నలోపము-రజ్+అ వృద్ధి 'చజోః కు' యనుదానిచేఁ గుత్వము=రాగః. భావకరణార్థకం బనుటచే నిట నలోపములేదు. రజ్యతి అస్మిన్నితి=రఙ్గః (నాట్యశాల)

సూ.—నివాసచితిశరీరోపసమాధానేష్వాదేశ్చ కః— 3-3-౪౧.

నివాసము-చితి-శరీరము-ఉపసమాధానము అనునీయర్థములందు చిఞ్ ధాతువుకంటె ఘఞ్ ప్రత్యయంబును, ఆదివర్ణమునకు కకారంబునునగును.(ఉపసమాధానంబన రాశి చేయుట).

ఉదా:—నిచి+అ కకారాదేశము - వృద్ధ్యాయాదేశములు = నికాయః, ఆకాయమగ్నిం చిన్వీత. (ఈవాక్యమున కాయశబ్దము చిత్యర్థకము) కాయః, గోమయనికాయః.

సూ.—ఏరచ్—3-3-౫౬.

ఇవర్ణాంతంబగు ధాతువుకంటెఁ బరముగా అచ్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—చి+అ గుణాయాదేశములు-చయః, జయః.

సూ.—ఋదోరప్—3-3-౫౭.

ఋకారాంతమును ఉవర్ణాంతంబునునగు ధాతువుకంటె అప్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—కౄ+అప్ గుణము = కరః, గరః, యు+అ గుణావాదేశములు - యవః, స్తవః. లూ+అ గుణావాదేశములు-లవః, పవః.

ఘఞర్థే కవిధానమ్—(వా)

ఘఞర్థంబులందు కప్రత్యయంబగును.

ఉదా:—ప్ర-స్థా+అ 'ఆతోలోప'యనుదానిచే నాకారలోపంబు-ప్రస్థః. విహన్+క'గమహన'యనుసూత్రముచేత నుపధాలోపంబు, హకారమునకు 'హోహన్తే' యనుదానిచేఁ ఘత్వము=విఘ్నః.

సూ —డ్వితః క్త్రిః—3-3-౮౮.

డు అనునది యిత్సంజ్ఞ గాఁగలధాతువుకంటె క్త్రి (త్రి) ప్రత్యయంబగును.

సూ:—క్త్రేర్మమ్ నిత్యమ్.—౪-౪-౨౦.

నిర్వృత్తార్థంబునందు క్త్రిప్రత్యయాంతంబుకంటెఁ బరంబుగా మప్ (మ) ప్రత్యయంబు నిత్యంబుగానగును.

ఉదా:—డుపచష్—పాకేన నిర్వృత్తమ్ = పక్త్రిమమ్. డువప్—వప్+త్రి 'వచిస్వపియజాదీనాంకిత' అనుదానిచే సంప్రసారణంబు పూర్వరూపంబు=ఉప్త్రిమ; ఉప్త్రిమమ్.

సూ.—ట్వితోఽథుచ్—3-3-౮౯.

టు అనునది యిత్సంజ్ఞ గాఁగలధాతువుకంటెఁ బరముగా అథుచ్ (అథు) ప్రత్యయంబగును.

ఉదా:—టు వేపృ=కంపనే (వణఁకుట) వేప్+అథు = వేపథుః.

సూ.—యజయాచయతవిచ్ఛప్రచ్ఛరక్షో నఙ్—3-3-౯౦.

యజ-టుయాచృ-యతీ - విచ్ఛ-ప్రచ్ఛ-రక్ష ధాతువులకంటెఁ బరముగా నఙ్ (న) ప్రత్యయంబగును.

ఉదా:—యజ్+న శ్చుత్వము = యజ్ఞః, యాచ్+న = యాచ్ఞా, యత్నః, విచ్ఛ్+న 'ఛ్వోశ్శూడనునాసికే చ' అను దానిచే శకారము. విశ్+న = విశ్నః (ప్రతాపము), ప్రచ్ఛ్+న

ఇట 'గ్రహిజ్యా' యనుసూత్రముచే బ్రాప్తించుసంప్రసార ణము 'ప్రశ్నే చాసన్న కాలే'అను నిర్దేశముచే రాదు. ప్రశ్నః. రత్నః.

సూ.—స్వపో నన్—3-3-౯౧.

ఞిష్వప్ ధాతువుకంటె నన్ (న) ప్రత్యయంబగును.

ఉదా:—స్వప్+న=స్వప్నః.

సూ.—ఉపసర్గే ఘోః కిః—3-3-౯౨.

ఉపసర్గం బుపపదంబగుచో ఘుసంజ్ఞకంబులగు ధాతువులకంటె కి (ఇ) ప్రత్యయంబగును.

ఉదా:—ప్ర-ధా+ఇ ఆకారలోపంబు=ప్రధిః, ఉపధిః.

సూ.—స్త్రియాం క్తిన్—3-3-౯౪.

స్త్రీలింగంబున భావార్థమందు ధాతువుకంటెబరముగా క్తిన్ (తి) ప్రత్యయంబగును. ఘఞ్ఞున కపవాదము.

ఉదా:—కృ+క్తి = కృతిః, స్తుతిః, క్తిన్ను కిత్తగుటచే గుణము లేదు.

ఋూల్వాదిభ్యః క్తిన్నిష్ఠావద్వాచ్యః—(వా)

ఋూకారాంతంబులగు ధాతువులకంటెను, లూ - ధూ మున్నగు ధాతువులకంటెను బరమగు క్తిన్ ప్రత్యయము నిష్ఠా ప్రత్యయమువంటిదగును. కావుననత్వంబు.

ఉదా:—కీర్ణిః, లూనిః, ధూనిః, పూనిః (వినాశ ము:)

సమ్పదాదిభ్యః క్విప్—(వా)

సంపత్ మున్నగువానికంటె క్విప్ప్రత్యయంబగును.

ఉదా:—సంపత్, విపత్, ఆపత్, ప్రతిపత్ వీనికంటె క్తిన్ ప్రత్యయంబుగూడ భాష్యకారసమ్మతము. సంపత్తిః, విపత్తిః, ఆపత్తిః, ప్రతిపత్తిః.

సూ.—ఊతియూతిజూతిసాతిహేతికీర్తయశ్చ—3.3-97.

ఊతి-యూతి-జూతి - సాతి-హేతి - కీర్తి అనునియ్యవి అన్తోదాత్తములుగా నిపతింపఁబడియెను.

ఇట అవధాతువునకుఁ బాఠముస్వరార్థము. యు - జు ధాతువులకుదీర్ఘమును, షో - ధాతువునకు 'ద్యతిస్యతి'యను సూత్రముచేఁ బ్రాప్తించు నిత్వాభావంబును, హనధాతువు యొక్క నకారమున కికారంబును, హిధాతువునకగుచో గుణమును, కృాత ధాతువుకంటె 'ణ్యాసశ్రన్థ'యను సూత్రముచేఁ బ్రాప్తించు యుచ్చునకుబాధకంబుగా క్తిన్-ప్రత్యయంబును నిపతింపఁబడియెను. సాతి అనునది షణ-ధాతువునకగుచో 'జనసన'యనుసూత్రముచే నాత్వముగాఁగా రూపసిద్ధియగునుగానఁ బాఠము స్వరార్థము.

సూ.—జ్వరత్వరస్రివ్యవిమవాముపధాయాశ్చ—౬-౪-౨౦

జ్వర-ఞిత్వరా-స్రివు-అవ - మవ ధాతువుల యుపధా వకారంబులకు అనునాసికముగాని, క్విప్పుగాని, ఝలాదులగు కిత్తుఙిత్తులుగాని పరమగుచో ఊఠ్ఠగును.

ఉదా:—అవ్ + క్తిన్ ఊఠ్ = ఊతిః, యూతిః, జూతిః సాతిః, హేతిః, కీర్తిః. జ్వర్ + క్విప్ ఊఠ్ = జూర్ విసర్గము= జూః, తూః, స్రూః, ఊః, మూః.

సూ.—ఇచ్ఛా—3-3-౧౦౧.

ఇషధాతువునకు భావార్థంబున శప్రత్యయంబును 'సార్వధాతుకేయ' కనుదానిచేఁ బ్రాప్తించు యగభావంబును దీనిచే నిపతింపఁబడియెను.

ఉదా:—ఇష్+శ 'ఇషగమియమాంఛ' యనుసూత్రముచే ఛకారము. ఇఛ్+అ తుక్ఛత్వములు టాప్సు=ఇచ్ఛా.

సూ.—అప్రత్యయాత్—3-3-౧౦౨.

ప్రత్యయాంతంబులగు ధాతువులకంటెఁ బరముగా స్త్రీత్వంబున అ-అను ప్రత్యయంబగును.

ఉదా:—చికీర్ష+అ అకారలోపము - టాప్సు = చికీర్షా, పుత్రకామ్య+అ అకారలోపము-టాప్సు=పుత్రకామ్యా.

సూ.—గురోశ్చ హలః—3-3-౧౦౩.

గురుమంతంబును హలంతంబునునగు ధాతువుకంటెఁ బరముగా స్త్రీత్వంబున అ- ప్రత్యయంబగును.

ఉదా:—ఈహ్+అ టాప్సు=ఈహా.

సూ.—ణ్యాసశ్రన్థో యుచ్—3-3-౧౦౭.

ణ్యంతంబులకంబెను ఆస-శ్రన్థ ధాతువులకంబెను బర ముగా యుచ్ (య్) ప్రత్యయంబగును. అప్రత్యయంబునకప వాదము.

ఉదా:—కారి+యుచ్ 'యువోరనాకౌ' అనుదానిచే అనాదేశము కారి+అన టాప్పు = కారణా, హారణా, ఆసనా, శ్రన్థనా.

సూ.—నపుంసకే భావే క్తః—3-3-౧౧౪.

సూ.—ల్యుట్ చ—3-3-౧౧౫.

ధాతువునకు నపుంసకలింగంబున భావార్థంబునందు క్త (త) ప్రత్యయంబును, ల్యుట్ (య్) ప్రత్యయంబునునగును.

ఉదా:—హస్+త ఇడాగమము=హసితమ్, హస్+ల్యు హస్+అన=హసనమ్.

సూ.—పుంసి సంజ్ఞాయాం ఘః ప్రాయేణ—3-3-౧౧౮.

కరణాధికరణార్థములయందుఁ బుల్లింగంబున సంజ్ఞను బోధించుచు ధాతువుకంటెఁ బరముగా ఘ (అ) ప్రత్యయము ప్రాయికముగానగును.

సూ.—ఛాదేర్ఘేఽద్వ్యుపసర్గస్య—౬-౪-౯౬.

రెండుమున్నగు నుపసర్గములతోఁగూడని ణిజంతమగు ఛదధాతువునకు ఘప్రత్యయముపరమగుచోఁ హ్రస్వమగును.

ఉదా:—దన్తాః ఛాద్యన్తే అనేనేతి—దన్త+ఛాది+అ హ్రస్వణిలోపములు=దన్తచ్ఛదః. ఆకుర్వన్త్యస్మిన్నిత్యాకరః.

సూ.—అవే తృస్త్రోర్ఘఞ్—3-3-౧౨౦.

కరణాధికరణార్థములయందు అవ - యనునుపసర్గము కంటెఁ బరమగు తౄ-స్తౄఞ్ ధాతువులకంటెఁబరముగా ఘఞ్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—అవ-తౄ+అ వృద్ధి = అవతారః (కూపాదేః) అవస్తారః (తెర).

సూ.—హలశ్చ—3-3-౧౨౧.

కరణాధికరణార్థములయందు హలంతంబగు ధాతువునకు ఘఞ్ ప్రత్యయంబగును. ఘప్రత్యయమున కపవాదము.

ఉదా:—రమన్తే యోగినోఽస్మిన్నితి—రమ్+అ ఉపధా వృద్ధి=రామః. అపమృజ్యతే అనేన వ్యాధ్యాదిరితి—అప-మృజ్ +అ 'మృజేర్వృద్ధి' యనుదానిచే వృద్ధి, 'చజోః' అనుదానిచేఁ గుత్వము, "ఉపసర్గస్య ఘఞి" అనుసూత్రముచే దీర్ఘము=అపామార్గః.

సూ.—ఈషద్దుస్సుషు కృచ్ఛ్రాకృచ్ఛ్రార్థేషు ఖల్—3-3-౧౨౬.

దుఃఖసుఖార్థకములగు ఈషత్-దుస్-సు అనునవి యుపపదంబులగుచో ధాతువుకంటెఁబరముగా ఖల్ (అ) ప్రత్యయం

బగును. తయోరేవ-యనుదానిచే భావంబునందును గర్మంబు నందుసునగును.

ఉదా:—(దుఃఖార్థమందు) దుస్+కృ+అ గుణము, విసర్గము, షత్వము=దుష్కరః (కటో భవతా) (సుఖంబునందు). ఈషత్కరః, సుకరః.

సూ.—ఆతో యుచ్— 3-3-౧౨౮.

దుఃఖసుఖార్థకంబులగు ఈషత్ - దుస్-సు లుపపదంబులగుచో ఆదంతంబగు ధాతువుకంటెబరంబుగా యుచ్ (య్) ప్రత్యయంబగును. ఖల్లునకపవాదంబు.

ఉదా:—ఈషత్పానస్సోమో భవతా, దుష్పానః, సుపానః.

సూ.—అలంఖల్వోః ప్రతిషేధయోః ప్రాచాం క్త్వా— 3-౪-౧౮.

ప్రతిషేధార్థకంబులగు అలమ్-ఖలు శబ్దము లుపపదంబులగుచో ధాతువుకంటెబరముగా క్త్వా(త్వా) ప్రత్యయంబగును. (ఇట 'ప్రాచామ్' అనుపదమును గ్రహించుట పూజార్థంబు).

ఉదా:—దా+క్త్వా 'దోదద్ఘోః' అను సూత్రముచే 'దద్' అనునాదేశము దద్+త్వా = అలందత్త్వా. పా+త్వా ఘుమాస్థేత్యాదిసూత్రముచేత నీత్వము=పీత్వాఖలు. మాకార్షీత్—ఇట అలమ్-ఖలు లుపపదంబులుకావు గానను, అలం

కారః—ఇట అలమ్ - అనునది నిషేధార్థకము కాకపోవుట చేతను ఖల్ప్రత్యయము లేదు.

సూ.—సమానకర్తృకయోః పూర్వకాలే—3-౪-౨౧.

సమానకర్తృకంబులగు క్రియలలో నెయ్యది పూర్వకాలికంబగుఁ దద్వాచకంబగు ధాతువుకంటెఁబరముగా క్త్వా ప్రత్యయమగును.

ఉదా:—ష్ణా+క్త్వా = స్నాత్వా వ్రజతి. సూత్రమందలి ద్వివచన మప్రయోజకము. అనఁగాఁ గ్రియలు రెంటికంటె నెక్కుడుగానున్నను క్త్వా ప్రత్యయమగును. స్నాత్వా భుక్త్వా పీత్వా వ్రజతి.

సూ.—న క్త్వా సేట్—౧-౨-౧౮.

సేట్టగు క్త్వాప్రత్యయము కిత్తుగాదు.

ఉదా:—శీఙ్+త్వా ఇట్టు-గుణము = శయిత్వా. కృ+త్వా—ఇటఁ బ్రత్యయంబు సేట్టు కానందునఁ గిత్వనిషేధంబు లేదు. (కిత్వముండుననుట) కానగుణము రాదు. కృత్వా.

సూ.—రలో వ్యుపధాద్ధలాదేస్సంశ్చ—౧-౨-౨౬.

ఉకారముగాని ఇకారముగాని యుపధగాఁగలదియు, హలాదియు, రలన్తంబునునగు ధాతువుకంటెఁ బరంబులగు సేట్టులయిన క్త్వా సన్ ప్రత్యయములు కిత్తులు వికల్పముగానగును.

ఉదా:—ద్యుత్+త్వా ఇట్టు = ద్యుతిత్వా; పక్షంబున గుణము=ద్యోతిత్వా. లిఖిత్వా; లేఖిత్వా.

వృత్+ఇత్వా—ఇటనికారంబుగాని యుకారంబుగాని యుపధకాకపోవుటచేతను, సివ్+ఇత్వా—ఇచ్చట ధాతువుర లంతము కానందునను, ఇష్+ఇత్వా—ఈధాతువు హలాది కామించేసియుఁ గత్త్వనిషేధమునిత్యము. గుణము-వర్తిత్వా, సేవిత్వా, ఏషిత్వా, భుజ్+త్వా—ఈయెడ క్త్వాప్రత్యయము సేట్టుకాకుంటచేఁ గిత్వంబునిత్యంబు భుక్త్వా.

సూ.—ఉదితో వా—౭-౨-౫౬.

ఉదిత్తగుధాతువుకంటెఁ బరంబగు క్త్వాప్రత్యయమున కిట్టువికల్పముగా నగును.

ఉదా:—శము—శమ్+త్వా ఇట్టు=శమిత్వా; పక్షమున శమ్+త్వా 'అనునాసికస్యక్వి' యనుదానిచే నుపధాదీర్ఘము, 'నశ్చాపదాన్తస్యఝలి'అనుదానిచే ననుస్వారము, పరసవర్ణము= శాన్త్వా. దివ్+త్వా ఇట్టు గుణము= దేవిత్వా; పక్షంబున 'ఛ్వోశ్శూడనునాసికేచ' యనుసూత్రముచే ఊఠ్, యణ్ణు=ద్యూత్వా. ధా+త్వా 'దధాతేర్హిః' యనుదానిచేత హి యను నాదేశము=హిత్వా.

సూ.—జహాతేశ్చ క్త్వి—౭-౪-౪౩.

క్త్వాప్రత్యయము పరమగుచో ఓహాక్ - ధాతువునకు హి-అనునాదేశమగును.

ఉదా:—హా+త్వా=హిత్వా. ఓహాఙ్-హాత్వా.

సూ.—సమాసేఽనఞ్పూర్వే క్త్వో ల్యప్—౭-౧-౩౭.

నఞ్భిన్నంబులగు నవ్యయంబులు పూర్వపదముగాఁగల సమాసంబున క్త్వాప్రత్యయమునకు ల్యప్(య)అను ప్రత్యయమాదేశమగును.

ఉదా:—ప్ర-కృ+త్వా ప్రకృ+ల్యప్ ప్రకృ+య తుగాగమను=ప్రకృత్య. న+కృత్వా—ఇటఁ బూర్వపదంబు నఞగుట చేతను, పరమమ్+కృత్వా—ఇచ్చోఁ బూర్వపదం బవ్యయంబు కాకపోవుట చేతను ల్యప్ప్రత్యయంబు లేదు. అకృత్వా. పరమకృత్వా.

సూ.—ఆభీక్ష్ణ్యే ణముల్చ—౩-౪-౨౨.

సమానకర్తృకంబులగు క్రియలలో నెయ్యది పూర్వకాలికంబగుఁ దద్వాచకంబును, ఆభీక్ష్ణ్యార్థకంబునునగు ధాతువుకంటెఁ బరముగా ణముల్ (అమ్) ప్రత్యయంబును, క్త్వా ప్రత్యయంబును నగును.

సూ.—నిత్యవీప్సయోః—౮-౧-౪.

ఆభీక్ష్ణ్యమును, వీప్సయును ద్యోత్యమగుచోఁ బదంబునకు సర్వంబునకు ద్విత్వమగును. తిఙన్తములును, అవ్యయసంజ్ఞకంబులగు కృదంతములును నాభీక్ష్ణ్యమును బోధించును.

ఉదా:—స్మృ+ణముల్ వృద్ధి=స్మారమ్ ద్విత్వము=స్మారంస్మారమ్ నమతి శివమ్. స్మృత్వాస్మృత్వా. పాయంపాయమ్. భోజంభోజమ్. శ్రావంశ్రావమ్.

సూ.—అన్యథైవంకథమిత్థంసుసిద్ధాప్రయోగశ్చేత్— 3-4-27.

అన్యథా-ఏవమ్-కథమ్ - ఇత్థమ్ అనునివి యుపపదంబు లగునపుడు కృఞ్ ధాతువు సిద్ధమగు ప్రయోగాభావము కలది యగుచో (అనఁగా నిటఁగృఞ్ ధాతువున కర్థము లేదనుట) కృఞ్ ధాతువుకంటెఁబరముగా ణముల్ ప్రత్యయంబగును.

ఉదా:—అన్యథా కారమ్, ఏవం కారమ్, కథం కారమ్, ఇత్థం కారమ్ భుఙ్క్తే.

శిరోఽన్యథా కృత్వా భుఙ్క్తే—ఇటకృఞ్ ధాతు వర్థ వంతమగుటచే ణముల్ ప్రత్యయము లేదని తెలియునది.

ఇది ఉత్తరకృదంతప్రకరణము.

కృదంతప్రకరణము సమాప్తము.

---

# విభక్త్యర్థప్రకరణము.

సూ.—ప్రాతిపదికార్థలిఙ్గపరిమాణవచనమాత్రే ప్రథమా—2-3-46.

నియతోపస్థితికము ప్రాతిపదికార్థము. (అనఁగా నేప్రాతి పదిక ముచ్చరింపఁబడఁగా నేయర్థము తప్పకస్ఫురించునో యయ్యదిప్రాతిపదికార్థము) ప్రాతిపదికార్థమాత్రమందును, లింగ మాత్రాధికంబగు ప్రాతిపదికార్థమందును, పరిమాణమాత్ర

మందును, సంఖ్యామాత్రమందును బ్రథమయగును. లింగములు లేని యవ్యయంబులును, నియతలింగములునగు ప్రాతిపదికములు ప్రాతిపదికార్థమున కుదాహరణములు.

ఉదా:—(ప్రాతిపదికార్థమందు) ఉచ్చైః, నీచైః, కృష్ణః, శ్రీః, జ్ఞానమ్. (లింగమాత్రాధిక్యమందు) తటః, తటీ, తటమ్. (పరిమాణమాత్రమందు) ద్రోణః (వ్రీహిః). (సంఖ్య యన వచనంబు) ఏకః, ద్వౌ, బహవః.

సూ.—సంబోధనే చ—౨-3-౪౭.

సంబోధనంబునందును బ్రథమయగును.

ఉదా:—హే రామ.

సూ.—కర్తురీప్సితతమం కర్మ—౧-౪-౪౯.

కర్తకుఁ గ్రియతోఁ సంబంధింపఁజేయుట కిష్టతమంబగునది కారకసంజ్ఞకమగుచుఁ గర్మసంజ్ఞకంబగును. క్రియాజనకంబు కారకంబనఁబడు.

సూ.—కర్మణి ద్వితీయా—౨-3-౨.

తిఙ్కృత్తద్ధితసమాసములచేఁ గర్మం బుక్తంబుగానిచోఁ గర్మవాచకమగు ప్రాతిపదికముకంటెఁ బరముగా ద్వితీయ యగును.

ఉదా:—హరింభజతి. కర్మాదు లుక్తంబులగుచోఁ బ్రాతిపదికార్థేత్యాది సూత్రముచే బ్రథమయగును.—దేవదత్తేన హరిస్సేవ్యతే. లక్ష్మ్యా సేవితో హరిః—ఇట తిఙ్కృత్తులు కర్మ

మును జెప్పినవిగానఁ బ్రాతిపదికార్థమాత్రమునఁ బ్రథమయయ్యె
నని యెఱుంగునది.

సూ.—అకథితం చ—౧-౪-౫౧.

అపాదానము, అధికరణము మున్నగు కారకములచే వివ
క్షితముగాని కారకంబు కర్మసంజ్ఞకంబు. దుహ - టుయాచృ-
డుపచష్-దండ-రుధిర్-ప్రచ్ఛ - చిఞ్-బ్రూఞ్ - శాసు-జి-మన్థ-
ముష ధాతువులయొక్కయు, ణీఞ్-హృఞ్-కృష-వహ ధాతు
వులయొక్కయుఁ గర్మముతో సంబంధించిన యపాదానాదులు
అవివక్షితములని యెఱుంగునది.

ఉదా:—గాం దోగ్ధి పయః, బలిం యాచతే వసుధామ్,
తండులానోదనం పచతి, గర్గాన్ శతం దండయతి, వ్రజమవరు
ణద్ధి గామ్, మాణవకం పన్థానం పృచ్ఛతి, వృక్షమపచినోతి
ఫలాని, మాణవకం ధర్మం బ్రూతే శాస్తి వా, శతం జయతి
దేవదత్తమ్, సుధాం క్షీరనిధిం మథ్నాతి, దేవదత్తం శతం
ముష్ణాతి, గ్రామమజాం నయతి హరతి కర్షతి వహతి వా.
ఈసంజ్ఞయర్థనిబంధనంబు. (అనఁగాఁ బూర్వోక్తధాతువులు
మాత్రమేగాక తదర్థకములుగూడ గ్రహింపఁబడుననుట) బలిం
భిక్షతే వసుధామ్, మాణవకం ధర్మం భాషతే అభిధత్తే వక్తి.
ఇత్యాదులు.

సూ.—సాధకతమం కరణమ్—౧-౪-౪౨.

క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబగు కారకంబు కరణ
సంజ్ఞకంబు. 'స్వతంత్రః కర్తా' యనుదానిచేఁ గర్తృసంజ్ఞ.

సూ.—కర్తృకరణయోస్తృతీయా—౨-3-౧౮.

కర్తగాని కరణముగాని యనభిహితంబగుచోఁ దద్వాచకముకంటెఁ బరముగాఁ దృతీయయగును.

ఉదా:—రామేణ బాణేన హతో వాలీ.

ప్రకృత్యాదిభ్య ఉపసంఖ్యానమ్—(వా)

ప్రకృతిమున్నగు శబ్దములకంటెఁ దృతీయయగును.
ఉదా:—ప్రకృత్యా చారుః ఇత్యాదులు.

సూ.—సహయుక్తేఽప్రధానే—౨-3-౧౯.

సహార్థంబుతోఁగూడిన యప్రధానమును బోధించు ప్రాతిపదికముకంటెఁ దృతీయా విభక్తియగును.

ఉదా:—పుత్రేణ సహాగతః పితా—ఇట నాగమనక్రియ యందుఁ బుత్త్రుఁ డప్రధానంబు. ఇట్లే సాకమ్, సార్ధమ్, సమమ్ అనువానితోడి యోగమందు నూహించునది. 'వృద్ధోయూ' నేత్యాది పాణినినిర్దేశముంబట్టి సహార్థకంబులు ప్రయోగింపఁ బడకున్నను దృతీయయగును. పుత్రేణాగతః పితా.

సూ.—హేతౌ—౨-3-౨3.

హేతువాచకంబగు ప్రాతిపదికముకంటెఁ దృతీయయగును. ద్రవ్యమునుగూర్చియు, గుణమునుగూర్చియుఁ గ్రియను గూర్చియుఁ గారణమయినట్టిది వ్యాపారమున్నను లేకున్నను హేతువనఁబడును. క్రియనుగూర్చిమాత్రమే కారణంబగు

నట్టియు, నిత్యముగా వ్యాపారసహితంబగునది కరణంబనం బడును.

ఉదా:—దణ్డేన ఘటః—ఇట ద్రవ్యంబగు ఘటమును గూర్చి దండంబు కారణంబుగాన దండంబు హేతువు; భ్రమణంబు వ్యాపారంబు. పుణ్యేన దృష్టో హరిః—ఇట దర్శన క్రియను గూర్చి పుణ్యము కారణంబుగానఁ గరణంబు. ఫలము గూడ హేతువుగా గ్రహింపఁబడును గానఁ దద్వాచకము కంటెఁగూడఁ దృతీయయగును. అధ్యయనేన వసతి-ఇట నివసించుట కధ్యయనము ఫలము.

సూ.—కర్మణా యమభిప్రైతి స సమ్ప్రదానమ్—౧-౪-౩౨

దానముయొక్క కర్మముతో దేనిని సంబంధింపఁజేయునో యది సంప్రదాన మనఁబడును.

సూ.—చతుర్థీ సమ్ప్రదానే—౨-౩-౧౩.

సంప్రదానం బనభిహితంబగుచోఁ దద్వాచకముకంటెఁ జతుర్థియగును.

ఉదా:—విప్రాయ గాం దదాతి.

తాదర్థ్యే చతుర్థీ వాచ్యా—(వా)

తాదర్థ్యంబునఁ జతుర్థియగును. తాదర్థ్యమనఁ గార్య కారణ భావాదిసంబంధంబు.

ఉదా:—ముక్తయే హరిం భజతి—ఇటహరిభజనము ముక్తికొఱకుఁ జేయఁబడుటచేఁ దాదర్థ్యమని తెలియునది.

క్లపి సమ్పద్యమానే చ—(వా)

క్లపిధాత్వర్థప్రయోగంబున సంపద్యమానవాచకంబగు ప్రాతిపదికముకంటెఁ బరముగాఁ జతుర్థియగును.

ఉదా:—భక్తిః జ్ఞానాయ కల్పతే, సంపద్యతే,జాయతే భక్తి జ్ఞానరూపముగాఁ బరిణమించుచున్నదని భావము.

ఉత్పాతేన జ్ఞాపితే చ—(వా)

శుభాశుభసూచకంబును నాకస్మికమునునగు భూత వికారం బుత్పాతమనఁబడును. అట్టియుత్పాతముచేత సూచిత మగు నర్థమును బోధించుశబ్దముకంటెఁ జతుర్థియగును.

ఉదా:—వాతాయ కపిలా విద్యుత్—ఇటఁ గపిల విద్యుత్తుచేతఁ బెనుగాలిసూచింపఁబడినదిగాన నావాయువాచక మగుదానికంటెఁ జతుర్థియయ్యెనని యెఱుంగునది.

హితయోగే చ—(వా)

హితశబ్దయోగమందును జతుర్థియగును.

ఉదా:—బ్రాహ్మణాయ హితమ్.

సూ.—నమస్స్వస్తిస్వాహాస్వధాలంవషడ్యోగాచ్చ— ౨-౩-౧౬.

నమః-స్వస్తి-స్వాహా-స్వధా-అలమ్ - వషట్ అనువాని తోడి సంబంధమున్నచోఁ జతుర్థియగును.

ఉదా:—హరయే నమః, ప్రజాభ్యః స్వస్తి, అగ్నయే స్వాహా, పితృభ్యః స్వధా. అలమ్-అనుదానిచేఁ బర్యాప్త్యర్థక శబ్దములు గ్రహింపఁబడును. దానం జేసి - దైత్యేభ్యో హరిరలమ్, ప్రభుః, సమర్థః, శక్తః ఇత్యాదులందును జతుర్థి యగును.

సూ.—ధ్రువమపాయేఽపాదానమ్—౧-౪-౨౪.

అపాయంబన విశ్లేషంబు. అట్టివిశ్లేషము సాధ్యమగుచో నవధిభూతం బపాదానసంజ్ఞ కంబగును.

సూ.—అపాదానే పఞ్చమీ—౨-3-౨౮.

అపాదానం బభిహితంబు కానిచోఁ దద్వాచకంబుకంటెఁ బంచమియగును.

ఉదా:—గ్రామాదాయాతి. ధావతోఽశ్వాత్పతతి.

సూ.—భీత్రార్థానాం భయహేతుః—౧-౪-౨౫.

భయార్థకంబులును త్రాణార్థకంబులునగు శబ్దంబులు ప్రయోగింపఁబడుచో భయమునకు హేతువగునది యపాదానము నాఁబడు.

ఉదా:—చోరాద్బిభేతి, చోరాత్త్రాయతే-ఇచ్చట భయహేతువులు చోరులుగానఁ దద్వాచకం బపాదానంబని తెలియునది. అరణ్యే బిభేతి, త్రాయతే - ఇట నరణ్యంబు భయహేతువు కానందున నపాదానసంజ్ఞ లేదు.

ల్యబ్లోపే కర్మణ్యధికరణే చ—(వా)

ల్యప్ప్రత్యయాంతము లోపించినపుడు (అనఁగాఁ గమ్యమానార్థకమగుటచేఁ బ్రయోగింపఁబడనితఱి) కర్మవాచకమును అధికరణవాచకమునునగు శబ్దముకంటెఁ బంచమీ విభక్తియగును.

ఉదా:—ప్రాసాదాత్ ప్రేక్షతే, ఆసనాత్ ప్రేక్షతే. (ప్రాసాదమారుహ్య, ఆసనే ఉపవిశ్య ప్రేక్షతే ఇత్యర్థః).

సూ.—షష్ఠీ శేషే—౨-3-౫౦.

అపాదానము మున్నగు కారకములకంటెను, బ్రాతిపదికార్థముకంటెను భిన్నమగు స్వస్వామిభావాదిసంబంధము శేషం బనఁబడును. అట్టిసంబంధమున విశేషణవాచకముకంటె షష్ఠి యగును.

ఉదా:—రాజ్ఞః పురుషః—ఇట స్వస్వామిభావంబున షష్ఠియయ్యె. కర్మాదులకును సంబంధమాత్రవివక్షయందు (సంబంధసామాన్యమందు) షష్ఠీవిభక్తియే యగును—సతాం గతమ్, సర్పిషో జానీతే, మాతుః స్మరతి, ఏధోదకస్యోపస్కురుతే, భజే శమ్భోశ్చరణయోః, ఫలానాం తృప్తః.

సూ.—కర్తృకర్మణోః కృతి—౨-3-౬౫.

కృదంతార్థంబుతోడి సంబంధంబునఁ గర్త్రర్థమందును గర్మమందును షష్ఠియగును.

ఉదా:—కృష్ణస్య కృతిః, జగతః కర్తా కృష్ణః.

సూ.—ఉభయప్రాప్తౌ కర్మణి—౨-3-౬౬.

ఏకృదంతార్థయోగంబునఁ గర్తయందును గర్మయందును షష్ఠిప్రాప్తించునో యట్టి కృదంతార్థయోగంబునఁ గర్మమందు మాత్రమే షష్ఠియగును.

ఉదా:—ఆశ్చర్యో గవాం దోహో గోపేన—ఇటఁ గర్తృవాచకమగు అగోపశబ్దముకంటెను, గర్మవాచకమగు గోశబ్దముకంటెను, షష్ఠిప్రాప్తింపఁగాఁ గర్మమందుమాత్రమే షష్ఠియయ్యె.

సూ.—ఆధారోఽధికరణమ్—౧-౪-౪౫.

కర్తృకర్మద్వారా కర్తృకర్మనిష్ఠంబగు క్రియ కాధారంబగునది యధికరణం బనంబడును.

సూ.—సప్తమ్యధికరణే చ—౨-3-3౬.

అధికరణం బుక్తంబుగానిచోఁ దద్వాచకమగు ప్రాతిపదికముకంటె సప్తమియగును. చకారంబుచే దూరార్థకంబులకంటెను నంతికార్థములకంటెనుగూడ సప్తమియగును. ఔపశ్లేషికంబు-వైషయికంబు - అభివ్యాపకంబని యాధారంబు త్రివిధంబు.

ఉదా:—(ఔపశ్లేషికంబునకు) కటే ఆస్తే, స్థాల్యాం పచతి. (వైషయికంబునకు) మోక్షే ఇచ్ఛాస్తి. (అభివ్యాపకం

బునకు సర్వస్మిన్నాత్మాస్తి, వనస్య దూరే-అంతికే వా. ఇత్యాదులు.

### నిమిత్తాత్కర్మయోగే—(వా)

నిమిత్తంబన ఫలంబు. యోగంబనఁగా సంయోగసమవాయాన్యతరసంబంధము. కర్మవాచకంబుతోడి యోగంబునందు హేతువాచకంబగు శబ్దంబుకంటె సప్తమియగును.

ఉదా:—చర్మణి ద్వీపినం హన్తి—ఇటఁ గర్మమగుద్వీపితోడ హేతువగు చర్మమునకు సమవాయసంబంధము గలదు. (చర్మసంపాదనమనెడు ఫలము నపేక్షించి శార్దూలమును జంపుదురు) దన్తయోర్హన్తి కుఞ్జరమ్. (దంతములనిమిత్తము) వాలేషు చమరీం హన్తి (వాలార్థము). సీమ్ని పుష్కలకో హతః (సీమయనఁగా సరిహద్దులు, పుష్కలకంబన సరిహద్దులయందుఁ బాతఁబడు కీలకము.) ఇటఁ గర్మమగుకీలకముతో సీమకు సంయోగసంబంధముగలదు.

ఇది విభక్త్యర్థప్రకరణము.

---

# సమాసప్రకరణము.

## కేవలసమాసప్రకరణము.

సమసించుట సమాసమనఁబడును. కేవలము-అవ్యయీభావము - తత్పురుషము - బహువ్రీహి - ద్వంద్వము నని

సమాసం బయిదు తెఱంగులుగానుండును. అందు మొదటిది విశేషసంజ్ఞావిరహితంబు. (అనఁగాఁ దత్పురుషాదులకుఁబోలె విశేషసంజ్ఞ లేదనుట) తక్కినవి వరుసను సామాన్యముగాఁ బూర్వోత్తరాన్యోభయపదార్థప్రధానంబులై యుండును. తత్పురుషభేదంబు కర్మధారయంబు. కర్మధారయభేదంబు ద్విగువు.

సూ.—సమర్థః పదవిధిః—౨-౧-౧.

ఇది పరిభాష. పదసంబంధియగువిధి సమర్థాశ్రితంబని యెఱుంగునది.

వ్యపేక్షయనియు నేకార్థీభావంబనియు సామర్థ్యము రెండువిధములుగానుండును. స్వార్థపర్యవసాయులగు పదంబులకు నాకాంక్షాదివశంబునఁగలుగు పరస్పరసంబంధము వ్యపేక్ష యనఁబడును. ప్రక్రియాదశయందుఁ బ్రత్యేకముగా నర్థవంతంబులుగా గ్రహింపఁబడినపదంబులు సముదాయశక్తిచేతఁ బ్రయోగదశయందు విశిష్టంబగు నొకయర్థమును బోధించుట యేకార్థీభావ మనఁబడును.

ఇట సమాసాదివృత్తులయం దేకార్థీభావసామర్థ్యము మాత్రమే గ్రహింపఁబడును.

సూ.—ప్రాక్కడారాత్సమాసః—౨-౧-3.

'కడారాః కర్మధారయే' యను సూత్రమువఱకు 'సమాస' యనుపద మనువర్తించును.

## సూ.—సహ సుపా—౨-౧-౪.

సుబంతము సమర్థంబగుసుబంతముతో వికల్పముగా సమసించును. సమాసంబగుటచే కృత్తద్ధితసూత్రముచేఁ బ్రాతిపదికసంజ్ఞ సిద్ధింపఁగా 'సుపో ధాతుప్రాతిపదికయోః' యను సూత్రముచేత సుప్పునకు లుక్కు.

కృద్వృత్తియనియు, తద్ధితవృత్తియనియు, సమాసవృత్తి యనియు, ఏకశేషవృత్తియనియు, సనాద్యంతధాతురూపవృత్తి యనియు వృత్తి యైదు తెఱఁగులుగానుండును. పరార్థాభిధానంబు వృత్తినాఁబడు. వృత్త్యర్థమును బోధించువాక్యము విగ్రహ మనఁబడు. అది లౌకికమనియు నలౌకికమనియు ద్వివిధంబు. పరినిష్ఠితమగుటచేత సాధువు ప్రయోగార్హము. లౌకికము (పూర్వం+భూతః) ప్రయోగానర్హమగుటచేత నసాధు వలౌకికంబు. (పూర్వ+అమ్-భూత+స్) 'భూతపూర్వే చరట్' అను పాణినినిర్దేశంబునం జేసి భూతశబ్దంబునకు సమాసంబునఁ బూర్వనిపాతము.

ఉదా:—భూతపూర్వః.

## ఇవేన సహ సమాసో విభక్త్యలోపశ్చ—(వా)

సమర్థంబగు సుబంతము ఇవశబ్దంబుతోడ సమసించును. విభక్తికూడ లోపింపదు.

ఉదా:—వాగర్థౌ+ఇవ=వాగర్థావివ (వాగర్థసదృశౌ).

ఇది కేవలసమాసప్రకరణము.

## అవ్యయీభావసమాసప్రకరణము.

### సూ.—అవ్యయీభావః—౨-౧-౫.

ఇది యధికారసూత్రము. 'తత్పురుష'యను సూత్రము వఱకు ననువర్తించును.

### సూ.—అవ్యయం విభక్తిసమీపసమృద్ధివ్యృద్ధ్యర్థాభావాత్యయా సంప్రతిశబ్ద ప్రాదుర్భావ పశ్చాద్యథానుపూర్వ్య యౌగపద్య సాదృశ్య సంపత్తిసాకల్యాన్తవచనేషు—౨-౧-౬

విభక్తి (కారకశక్తి)-సమీపము-సమృద్ధి (ఋద్ధియొక్కయాధిక్యము)-వ్యృద్ధి (వృద్ధిలేకుండుట) అర్థాభావము (వస్త్వభావము)-అత్యయము (ధ్వంసము)-అసంప్రతి (అయుక్తము)-శబ్దప్రాదుర్భావము (శబ్దప్రకాశము)-పశ్చాదర్థము-యథాశబ్దార్థము-ఆనుపూర్వ్యము-యౌగపద్యము - సాదృశ్యము-సంపత్తి (అనురూపాత్మభావము)-సాకల్యము అను వీనినిబోధించు నవ్యయము సుబంతముతో నిత్యముగా సమసించును.

విగ్రహము లేనిదియు నస్వపదవిగ్రహమును నిత్యసమాసమని చెప్పఁబడును.

ఉదా:—(విభక్తియందు) హరిఙి+అధి అనియుండఁగా,

### సూ.—ప్రథమానిర్దిష్టం సమాస ఉపసర్జనమ్—౧-౨-౪౩.

సమాసమును విధించుసూత్రమునఁ బ్రథమావిభక్త్యంతముగా నిర్దేశింపఁబడినశబ్ద ముపసర్జన మనఁబడును.

ఇట అధి- యనునవ్యయము సమాసవిధాయకమగు "అవ్యయం విభక్తి" ఇత్యాదిసూత్రమునఁ బ్రథమాంతంబుగా నిర్దేశింపఁబడినదిగాన నుపసర్జనమగును.

సూ.—ఉపసర్జనం పూర్వమ్—౨-౨-30.

ఉపసర్జనసంజ్ఞకంబగుశబ్దంబు సమాసంబునఁ బూర్వావయవంబుగఁ బ్రయోగింపఁబడును.

దీనిచే అధియనుదానికిఁ బూర్వనిపాతము. అధి-హరి+ఙి ఇది సమాసంబగుటచేఁ బ్రాతిపదికసంజ్ఞయుండునుగాన ఙిప్రత్యయంబునకు లుక్కు=అధి+హరి పిమ్మట సముదాయంబుకంటెఁ బ్రత్యయంబువచ్చును. "అవ్యయీభావశ్చ" అనుదానిచే దీనికవ్యయత్వముండుటచేత నాప్రత్యయమునకు లుక్కగును-అధిహరి.

సూ.—అవ్యయీభావశ్చ—౨-౪-౧౮.

అవ్యయీభావసమాసంబు నపుంసకంబగును.

ఉదా:—గాః పాతీతి=గోపః-తస్మిన్=అధిగోపమ్.

సూ.—నావ్యయీభావాదతోఽమ్ త్వపఞ్చమ్యాః—౨-౪-౮3.

అదంతంబగు నవ్యయీభావంబుకంటెఁ బరమగు సుప్పునకు లుక్కురాదు. పంచమీవిభక్తిభిన్నంబులగు నాసుప్పులకు అమ్-అను నాదేశమగును.

సూ.—తృతీయాసప్తమ్యోర్బహులమ్—౨-౪-౮౪.

అదంతంబగు నవ్యయీభావసమాసంబుకంటెఁ బరంబగు, తృతీయాసప్తములకు అమాదేశంబు బహుళముగానగును.

ఉదా:—కృష్ణస్య సమీపే - అనువిగ్రహంబున కష్ణ+జస్+ఉప ఉపకృష్ణ+జస్ ఉపకృష్ణ+టా అమాదేశము=ఉపకృష్ణమ్; పక్షమున ఉపకృష్ణేన, ఉపకృష్ణమ్; ఉపకృష్ణే.

(సమృద్ధియందు) మద్రాణాం సమృద్ధిః=సుమద్రమ్,
(వ్యృద్ధియందు) యవనానాం వ్యృద్ధిః=దుర్యవనమ్.
(అర్థాభావమందు) మక్షికాణామభావః=నిర్మక్షికమ్.
(అత్యయమందు) హిమస్యాత్యయో=అతిహిమమ్.
(అసంప్రతియందు)నిద్రాసంప్రతినయుజ్యతే=అతినిద్రమ్.
(శబ్దప్రాదుర్భావమందు) హరిశబ్దస్య ప్రకాశః=ఇతిహరి.
(పశ్చాదర్థమందు) విష్ణోః పశ్చాత్=అనువిష్ణు.

యోగ్యతయు, వీప్సయు (వ్యాప్తి) పదార్థానతిక్రమణమును, సాదృశ్యంబును యథాశబ్దార్థంబులు.

(యోగ్యతయందు) రూపస్య యోగ్యమ్=అనురూపమ్.
(వీప్సయందు) అర్థమర్థం ప్రతి=ప్రత్యర్థమ్.
(పదార్థానతిక్రమణమందు) శక్తిమనతిక్రమ్య=యథాశక్తి.

సూ.—అవ్యయీభావే చాకాలే—౬-3-౮౧.

అవ్యయీభావసమాసంబున సహశబ్దమునకు స-యను నాదేశమగును. కాలవాచక ముత్తరపదమగుచోఁ గాదు.

ఉదా:—(సాదృశ్యమందు) హరేస్సాదృశ్యమ్=సహ+హరి సహశబ్దంబునకు సభావంబు=సహరి. ఇట సహశబ్దంబునకు సాదృశ్యంబర్థంబు. (ఆనుపూర్వ్యమందు) జ్యేష్ఠస్యానుపూర్వ్యేణ అనుజ్యేష్ఠమ్. (యౌగపద్యమందు) చక్రేణ యుగపత్ = సచక్రమ్.

యథాశబ్దార్థంబుచేతనే సాదృశ్యార్థమందును సమాసంబు సిద్ధించుచుండఁగా, అవ్యయమిత్యాది సూత్రమందు సాదృశ్యగ్రహణంబు సాదృశ్యం బప్రధానమైనను సమాసము సిద్ధించుటకని తెలియునది.

(సాదృశ్యమందు) సదృశస్సఖ్యా=ససఖి,
(సంపత్తియందు) క్షత్త్రాణాం సంపత్తిః=సక్షత్త్రమ్,
(సాకల్యమందు) తృణమప్యపరిత్యజ్య=సతృణమ్ (అత్తి),
(అంతవచనమందు) అగ్నిగ్రన్థపర్యన్తమధీతే=సాగ్ని.

సూ.—విభాషా—౨-౧-౧౧.

ఇది యధికారసూత్రంబు.

సూ.—నదీభిశ్చ—౨-౧-౨౦.

నదీవాచకంబులతో సంఖ్యావాచకంబు వికల్పముగా సమసించును. సమాహారమందే యగునని భాష్యకారసమ్మతంబు.

ఉదా:—పఞ్చగఙ్గమ్, ద్వియమునమ్.

సూ.—తద్ధితాః—౪-౧-౭౬.

పంచమాధ్యాయంబు చివరవఱకు నియ్యది యధికార సూత్రము.

సూ.—అవ్యయీభావే శరత్ప్రభృతిభ్యః—౫-౪-౧౦౭.

అవ్యయీభావసమాసంబున శరదాదులకంటెఁ బర ముగా నంతావయవంబగుచు టచ్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—శరదస్సమీపమ్=ఉపశరద్+టచ్=ఉపశరదమ్. ప్రతివిపాశమ్.

సూ.—జరాయా జరశ్చ—(గ-సూ)

జరాశబ్దంబునకు జరసాదేశంబునగును.

ఉదా:—ఉపజరసమ్ ఇత్యాదులు.

సూ.—అనశ్చ—౫-౪-౧౦౮.

అన్నంతంబగు నవ్యయీభావసమాసంబున కంతావ యవంబగుచు టచ్ప్రత్యయంబగును. అది తద్ధితసంజ్ఞకంబగు.

సూ.—నస్తద్ధితే—౬-౪-౧౪౪.

నాంతంబును భసంజ్ఞకమునగు నంగముయొక్క టి సంజ్ఞకమునకు తద్ధితపరమగుచో లోపంబగు.

ఉదా:—రాజ్ఞస్సమీపమ్ - ఉప+రాజన్+టచ్ టిలో పంబు. ఉపరాజ్+అ అమ్భావము=ఉపరాజమ్, అధ్యాత్మమ్.

సూ.—నపుంసకాదన్యతరస్యామ్—౫-౪-౧౦౯.

అన్నంతంబగు నపుంసకలింగం బంతంబునంగల యవ్యయీభావసమాసంబుకంటెఁ బరముగా సమాసాంతమగుచు. టచ్చు వికల్పముగానగును.

ఉదా:—ఉపచర్మన్+టచ్ టిలోపము-అమ్ము=ఉపచర్మమ్; పక్షంబున నలోపంబు=ఉపచర్మ.

సూ.—ఝయః—౫-౪-౧౧౧.

ఝయంతమగు నవ్యయీభావసమాసంబున కంతావయవమగుచు టచ్చు వికల్పముగానగును.

ఉదా:—ఉపసమిధమ్; పక్షమున ఉపసమిత్.

ఇది అవ్యయీభావసమాసప్రకరణము.



తత్పురుషసమాసప్రకరణము.

సూ.—తత్పురుషః—౨-౧-౨౨.

ఇయ్యది యధికారసూత్రంబు 'శేషోబహువ్రీహిః'అనునంతవఱకు ననువర్తించును.

సూ.—ద్విగుశ్చ—౨-౧-౨౩.

ద్విగుసమాసంబును తత్పురుషసంజ్ఞకంబు.

సూ.—ద్వితీయా శ్రితాతీతపతితగతాత్యస్తప్రాప్తాపన్నైః —౨-౧-౨౪.

ద్వితీయాంతంబగుశబ్దంబు శ్రితాదిప్రకృతికములగు సుబంతములతోడ వికల్పంబుగా సమసించును. అది తత్పురుష సంజ్ఞకంబు.

ఉదా:—కృష్ణమ్+శ్రితః=కృష్ణశ్రితః ఇత్యాదులు.

సూ.—తృతీయాతత్కృతార్థేన గుణవచనేన—౨-౧-౩౦.

తృతీయాంతంబగుసమర్థంబు తృతీయాంతార్థకృతంబగు గుణమునుబోధించు సుబంతముతోడను అర్థశబ్దంబుతోడను వికల్పంబుగా సమసించును.

ఉదా:—శఙ్కులయా+ఖణ్డః = శఙ్కులాఖణ్డః—ఇట శఙ్కులయా అనునది తృతీయాంతంబు. అద్దానికర్థంబు-ఛేదన సాధనంబగు శంకుల. అట్టిశంకులచేఁ జేయఁబడినది ఖండనము, గుణముగానఁ దద్విశిష్టవాచకమగు ఖండశబ్దముతోఁ దృతీయాంతంబగు శంకులాశబ్దంబు సమసించెను. ధాన్యేన+అర్థః= ధాన్యార్థః. అక్ష్ణా కాణః—ఇచ్చటఁ గాణత్వంబు రోగాదుల వలన సంభవించినదిగాని యక్షికృంతబుగానందున సమాసంబు లేదు.

సూ.—కర్తృకరణే కృతా బహులమ్—౨-౧-౩౨.

కర్తృకరణార్థకతృతీయాంతము కృదంతముతో బహుళముగా సమసించును.

ఉదా:—హరిణా+త్రాతః=హరిత్రాతః. నఖైః+భిన్నః= నఖభిన్నః.

కృద్గ్రహణే గతికారకపూర్వస్యాపి గ్రహణమ్—(పరి)

కృత్తునుగ్రహించుచో గతికారకములు పూర్వమునఁ గల దానినిగూడ గ్రహింపవలయును. అనఁగాఁ బూర్వోక్తం బగుకృదంతమునకు గతిసంజ్ఞకంబులుగాని కారకంబుగాని పూర్వమందున్నను దృతీయాంతంబు దానితోడ సమసించునని భావము.

ఉదా:—నఖైః+నిర్భిన్నః=నఖనిర్భిన్నః.

సూ.—చతుర్థీ తదర్థార్థబలిహితసుఖరక్షితైః—౨-౧-౩౬.

చతుర్థ్యంతమగుశబ్దంబు చతుర్థ్యంతవాచ్యముకొఱకగు వస్తువుసుబోధించు సుబంతముతోడను, అర్థ-బలి-హిత-సుఖ-రక్షిత శబ్దంబులతోడను, వికల్పముగా సమసించును.

ఉదా:—యూపాయ+దారు = యూపదారు. సూత్రమందలి తదర్థ పదముచేతఁ బ్రకృతివికృతిభావంబు మాత్రమే గ్రహింపఁబడునుగాన రంధనాయ+స్థాలీ - యనుచోఁ బ్రకృతివికృతిభావంబు లేనందున సమాసంబు లేదు.

అర్థేన సహ నిత్యసమాసో విశేష్యలిఙ్గతా చేతి వక్తవ్యమ్—(వా)

చతుర్థ్యంత మర్థశబ్దముతోడ నిత్యముగా సమసించును. మఱియు నాసమాసంబు విశేష్యనిఘ్నంబు గూడనగును.

ఉదా:—ద్విజాయాయమ్ = ద్విజార్థః. (సూపము) ఇట విశేష్యమగు సూపశబ్దంబు పుల్లింగంబుగాన సమాసంబు పుల్లింగంబయ్యె.

ఇట్లే యంతట నెఱుంగునది.

ద్విజాయ ఇయమ్=ద్విజార్థా-(యవాగూః),

ద్విజార్థమ్ (పయః),

భూతేభ్యో+బలిః=భూతబలిః,

గోభ్యః+హితమ్=గోహితమ్,

గోభ్యః+సుఖమ్=గోసుఖమ్,

గోభ్యః+రక్షితమ్=గోరక్షితమ్.

సూ.—పఞ్చమీ భయేన—౨-౧-౩౭.

పఞ్చమ్యంతంబు భయశబ్దంబుతోడ వికల్పముగా సమసించును. అది తత్పురుషంబు.

ఉదా:—చోరాత్+భయమ్=చోరభయమ్.

భయభీతభీతిభీభిరితి వాచ్యమ్—(వా)

పంచమ్యంతంబు భయశబ్దంబుతోడంబోలె - భీత-భీతి-భీ అనుశబ్దంబులతోడను వికల్పముగా సమసించును.

ఉదా:—వృకాత్+భీతః=వృకభీతః, వృకభీతిః, వృకభీః.

సూ.—స్తోకాన్తికదూరార్థకృచ్ఛ్రాణి క్తేన—౨-౧-౩౯.

పంచమ్యంతములగు స్తోకార్థకంబులును, సమీపార్థకంబులును, దూరార్థకంబులును, కృచ్ఛ్రశబ్దంబును, క్తాంతముతోడ వికల్పముగా సమసించును.

సూ.—పఞ్చమ్యాః స్తోకాదిభ్యః—౬-౩-౨.

స్తోకాద్యర్థకంబులగు శబ్దంబులకంటెఁ బరంబగు పంచమీవిభక్తికి, ఉత్తరపదంబు పరంబగుచో, అలుక్కగును. (పంచమీవిభక్తి లోపింపదనుట.)

ఉదా:—స్తోకాత్+ముక్తః=స్తోకాన్ముక్తః, అల్పాన్ముక్తః. అంతికాదాగతః. అభ్యాశాదాగతః. దూరాదాగతః. విప్రకృష్టాదాగతః.

సూ.—షష్ఠీ—౨-౨-౮.

షష్ఠ్యంతము సుబంతముతోడ వికల్పముగా సమసించును.

ఉదా:—రాజ్ఞః+పురుషః=రాజపురుషః.

సూ.—పూర్వాపరాధరోత్తరమేకదేశినైకాధికరణే—౨-౨-౧.

పూర్వ-అపర - అధర-ఉత్తర శబ్దంబులు ఏకత్వసంఖ్యావిశిష్టంబగు అవయవివాచకముతోడ వికల్పముగా సమసించును. షష్ఠీసమాసంబున కపవాదంబు.

ఉదా:—పూర్వమ్+కాయస్య = పూర్వకాయః, అపర కాయః, అధరకాయః, ఉత్తరకాయః. పూర్వాః+ఛాత్రాణామ్-ఇట నవయవివాచకమగు ఛాత్రశబ్దము బహుత్వవిశిష్టవాచకమగుటచేత సమాసము లేదు. పూర్వాః ఛాత్రాణామ్.

సూ.—అర్ధంనపుంసకమ్—౨-౨-౨.

సగము అనునర్థమునుజెప్పు అర్ధశబ్దము నిత్యనపుంసకంబు. అది షష్ఠ్యంతముతోడ వికల్పముగా సమసించును.

ఉదా:—అర్ధం+పిప్పల్యాః=అర్ధపిప్పలీ.

సూ.—సప్తమీ శౌణ్డైః—౨-౧-౪౦.

సప్తమ్యంతము శౌండాదులతో వికల్పముగా సమసించును. అది తత్పురుషంబు.

ఉదా:—అక్షేషు+శౌణ్డః = అక్షశౌణ్డః—'ద్వితీయాశ్రితాతీత, తృతీయాతత్కృతార్థేన' ఇత్యాదిసూత్రంబులందలి ద్వితీయా తృతీయా మున్నగుయోగవిభాగంబునంజేసి పూర్వోక్తసుబంతములతోడనేగాక యితరములతోఁగూడ ద్వితీయాదులు సమసించునని తెలియునది.

సూ.—దిక్సంఖ్యే సంజ్ఞాయామ్—౨-౧-౫౦.

దిగ్వాచకంబులును సంఖ్యావాచకంబులును సంజ్ఞయందు సుబంతముతో వికల్పముగా సమసించును. 'విశేషణంవిశేష్యేణ

బహులమ్మను సూత్రముచేతనే యిచ్చటఁగూడ సమాసంబు సిద్ధించుచుండఁగా మరల సమాసమునువిధించుట దిగ్వాచకములును సంఖ్యావాచకములును సంజ్ఞయందే సమానాధికరణంబగు విశేష్యంబుతో సమసించునను నియమంబుకొఱకని యెఱుంగునది.

ఉదా:—పూర్వేషుకామశమీ (ఇదియొక గ్రామవిశేషమునకుఁ బేరు) సప్తర్షయః (మరీచిమున్నగు సప్తమహర్షులకు సంజ్ఞ)ఉత్తరాః వృక్షాః, పఞ్చ బ్రాహ్మణాః—ఇవి సంజ్ఞలుకానందున సమాసంబు లేదు.

సూ.—తద్ధితార్థోత్తరపదసమాహారే చ—౨-౧-౫౧.

తద్ధితార్థము విషయమగుచుండఁగఁగాని, ఉత్తరపదము పరమగుచోఁగాని, సమాహారంబు వాచ్యంబగునెడఁగాని, దిగ్వాచకంబులును సంఖ్యావాచకంబులును సమానాధికరణంబుతో వికల్పముగాసమసించును. అది తత్పురుషంబు.

ఉదా:—పూర్వస్యాం శాలాయాం భవః = పూర్వా+శాలా-యని సమాసంబు సిద్ధింపఁగా—

సర్వనామ్నో వృత్తిమాత్రే పుంవద్భావః—(వా)

సమాసతద్ధితాదివృత్తిగతంబులగు సర్వనామములకు పుంవద్భావంబగును. దీనిచేఁ బుంవద్భావంబు.

ఉదా:—పూర్వశాలా.

సూ.—దిక్పూర్వపదాదసంజ్ఞాయాం ఞః—౪-౨-౧౦౭.

దిగ్వాచకంబు పూర్వపదంబుగాఁగల సమాసంబుకంటెఁ బరముగా జాతాద్యర్థములందు ఞ (అ) ప్రత్యయంబగును. సంజ్ఞయందుఁగాదు.

ఉదా:—పూర్వశాలా+అ (ఞ) అనియుండఁగా,

సూ.—తద్ధితేష్వచామాదేః—౭-౨-౧౧౭.

ఞిత్తుకాని ణిత్తుగానియగు తద్ధితప్రత్యయము పరమగుచో అంగముయొక్క యచ్చులలో మొదటియచ్చునకు వృద్ధియగును. దీనిచేత ఊకారమునకు వృద్ధి (ఔకారము.)

ఉదా:—పౌర్వశాలా+అ 'యస్యేతి చ' యనుసూత్రముచే ఆకారలోపంబు=పౌర్వశాలః—పఞ్చ గావో ధనంయస్యయను త్రిపదబహువ్రీహిసమాసముచేయఁగా,

ద్వన్ద్వతత్పురుషయోరుత్తరపదే నిత్యసమాసవచనమ్
—(వా)

ఉత్తరపదము పరమగునపుడు ద్వంద్వతత్పురుషములకు నిత్యసమాసత్వమగును.

సూ.—గోరతద్ధితలుకి—౫-౪-౯౨.

గోశబ్దంబంతమునఁగల తత్పురుషముకంటెఁ బరముగా సమాసంబున కంతావయవంబగుచు - టచ్ (అ) ప్రత్యయంబగును. తద్ధితకులుక్కగునపుడు గాదు.

ఉదా:—పఞ్చగో+ధన - టచ్చు-అవాదేశము=పఞ్చగవధనః. పఞ్చానాం గవాం సమాహారః - పఞ్చగో+టచ్ అనియుండఁగా,

సూ.—తత్పురుషస్సమానాధికరణః కర్మధారయః—
౧-౨-౪౨.

సమానాధికరణంబగు తత్పురుషంబు కర్మధారయము నాఁబడు.

సూ.—సంఖ్యాపూర్వో ద్విగుః—౨-౧-౫౨.

'తద్ధితార్థోత్తరపదసమాహారేచ' యనుచోటఁ జెప్పిన మూఁడువిధములగు సంఖ్యాపూర్వసమాసంబును ద్విగుసమాసంబనంబడు.

సూ.—ద్విగురేకవచనమ్—౨-౪-౧.

ద్విగ్వర్థంబగు సమాహారం బేకవచనంబగును.

సూ —స నపుంసకమ్—౨-౪-౧౭.

సమాహారంబున ద్విగుసమాసంబును ద్వంద్వంబును నపుంసకలింగంబగును.

ఉదా:—పఞ్చగవమ్.

సూ.—విశేషణం విశేష్యేణ బహులమ్—౨-౧-౫౭.

విశేషణంబు సమానాధికరణంబగు విశేష్యంబుతోడ బహుళంబుగా సమసించును.

ఉదా:—నీలమ్+ఉత్పలమ్=నీలోత్పలమ్. బహుళగ్రహ ణముచే కృష్ణసర్పః - అనుమున్నగుచోట సమాసమునిత్య మనియు, రామో+జామదగ్న్యః-అనుస్థలములందు సమాసంబు లేదనియు నెఱుంగునది.

సూ.—ఉపమానాని సామాన్యవచనైః—౨-౧-౫౫.

ఉపమానవాచకంబులు సమానాధికరణంబులగు సాధ ర్మ్యవాచకంబులతో సమసించును.

ఉదా:—ఘన ఇవ శ్యామః=ఘనశ్యామః.

శాకపార్థివాదీనాం సిద్ధయే ఉత్తరపదలోపో వక్తవ్యః —(వా)

శాకపార్థివః—అను మున్నగుసమాసములు సిద్ధించుటకై యుత్తరపదలోపంబు చెప్పవలయును.

ఉదా:—శాకప్రియః+పార్థివః = శాకపార్థివః. దేవప్రి యః-బ్రాహ్మణః=దేవబ్రాహ్మణః.

సూ.—నఞ్—౨-౨-౬.

నఞ్ అనునవ్యయంబు సుబంతముతోడ వికల్పముగా సమసించును. అది తత్పురుషంబు.

సూ.—నలోపో నఞః—౬-3-౭3.

ఉత్తరపదంబు పరంబగుచో నఞుయొక్కనకారమునకు లోపంబగును.

ఉదా:—న+బ్రాహ్మణః నలోపము=అబ్రాహ్మణః.

సూ.—తస్మాన్నుడచి—౬-3-౭౪.

లుప్తనకారంబగు నఞుకంటెఁ బరంబగు నుత్తరపదంబునకు అజాదియగుదానికి నుట్ (న్) ఆగమంబగును.

ఉదా:—న+అశ్వః అ+అశ్వః = అ+న్+అశ్వః అనశ్వః. నైకధా-అను మున్నగుచోట్ల నశబ్దంబుతోడ 'సుప్సుపా'యను సూత్రముచేత సమాసంబు న+ఏకధా వృద్ధి=నైకధా. "నిత్యం క్రీడాజీవికయోః"యను సూత్రంబునుండి నిత్యపదం బనువర్తించుచుండఁగా,

సూ.—కుగతిప్రాదయః—౨-౨-౧౮.

కుశబ్దంబును, గతిసంజ్ఞకంబులును, ప్రాదులును సమర్థంబుతోడ నిత్యముగా సమసించును. అది తత్పురుషము. గత్యాదులసాహచర్యంబుచే నిట నవ్యయంబగు కుత్సితార్థక కు శబ్దంబు మాత్రమే గ్రహింపఁబడునుగాని భూవాచకము గ్రహింపఁబడదు.

ఉదా:—కు (కుత్సితః) పురుషః=కుపురుషః.

సూ.—ఊర్యాదిచ్విడాచశ్చ—౧-౪-౬౧.

ఊరీప్రభృతులును, చ్విప్రత్యయాంతములును, డాచ్ ప్రత్యయాంతములును, క్రియాయోగంబునందు గతిసంజ్ఞకంబు లగును.

ఉదా:—ఊరీ+కృత్వా "కుగతిప్రాదయ"యను దాని చేత సమాసంబు. ఊరీకృత్వా, ల్యప్పు=ఊరీకృత్య - శుక్లీ+కృత్వా=శుక్లీకృత్వా, శుక్లీకృత్య. పటపటా+కృత్వా పటపటాకృత్వా, పటపటాకృత్య. సు+పురుషః=సుపురుషః.

ప్రాదయో గతాద్యర్థే ప్రథమయా—(వా)

ప్రాదులు గతాద్యర్థమందుఁ బ్రథమావిభక్త్యంతముతోడ నిత్యముగా సమసించును.

ఉదా:—ప్ర+(గతః) ఆచార్యః=ప్రాచార్యః.

అత్యాదయః క్రాన్తాద్యర్థే ద్వితీయయా—(వా)

అతిమున్నగునవి క్రాన్తాద్యర్థమందు ద్వితీయాంతంబుతోడ నిత్యముగా సమసించును.

ఉదా:—అతి+ (క్రాన్తః) మాలామ్—అనువిగ్రహంబున,

సూ.—ఏకవిభక్తి చాపూర్వనిపాతే—౧-౨-౪౪.

విగ్రహంబున నెద్ది నియతవిభక్తికంబగు నది యుపసర్జనమనఁబడును. దానికి సమాసంబునఁ బూర్వనిపాతంబు లేదు. ఇట మాలామ్-అనునది నియతవిభక్తికముగాన నుపసర్జనసంజ్ఞ సిద్ధింపఁగా,

సూ —గోస్త్రియోరుపసర్జనస్య—౧-౨-౪౮.

ఉపసర్జనంబగు గోశబ్దంబును అట్టి స్త్రీప్రత్యయాంతంబును నంతంబునఁగల ప్రాతిపదికమునకు హ్రస్వమగును.

ఉదా:—అతిమాలః.

అవాదయః క్రుష్టాద్యర్థే తృతీయయా—(వా)

అవమున్నగునవి క్రుష్టాద్యర్థంబునందుఁ దృతీయాంతంబుతోడ నిత్యముగాసమసించును.

ఉదా:—అవ+(క్రుష్టః) కోకిలయా=అవకోకిలః.

పర్యాదయో గ్లానాద్యర్థే చతుర్థ్యా—(వా)

పరిమొదలుగాఁగలవి గ్లానాద్యర్థమందుఁ జతుర్థ్యంతంబుతోడ నిత్యముగా సమసించును.

ఉదా:—పరి+(గ్లానః) అధ్యయనాయ=పర్యధ్యయనః.

నిరాదయః క్రాన్తాద్యర్థే పఞ్చమ్యా—(వా)

నిర్-మున్నగునవి క్రాన్తాద్యర్థములందుఁ బంచమ్యంతముతో నిత్యముగా సమసించును.

ఉదా:—నిర్ (క్రాన్తః)+కౌశామ్బ్యాః=నిష్కౌశామ్బిః.

సూ.—తత్రోపపదం సప్తమీస్థమ్—3-౧-౯౨.

సప్తమీవిభక్త్యంతమగు పదంబునందు అనఁగా-'కర్మణి' ఇత్యాదులందు వాచ్యవాచకభావసంబన్ధముతోనున్న కుంభాద్యర్థములను బోధించు పదంబు లుపపదంబులనంబడును.

సూ.—ఉపపదమతిఙ్—౨.౨-౧౯.

ఉపపదసంజ్ఞకంబు సమర్థంబుతోడ నిత్యముగా సమసించును; తిఙంతముతో సమసింపదు.

ఉదా:—కుమ్భంకరోతీతి— కుమ్భ+జస్+కార=కుమ్భకారః. ఇట కుంభయనుపదము 'కర్మణ్యణ్' అను సూత్రమునఁ గర్మవాచకంబుగాఁ జెప్పఁబడినదిగాన నుపపదసంజ్ఞకంబు. మాభవాన్భూత్—ఇచ్చట "మాఙిలుఙ్"అను సూత్రమందు మాఙ్ అనునది సప్తమ్యంతముగా నిర్దేశింపఁబడుటచేత నుపపదత్వంబు సిద్ధించినను భూత్-అనునది తిఙన్తంబగుటచేత సమాసంబులేదు. ఇట నుదాహరణంబున భవాన్ అనునది సమాసంబు లేదని తెలుపుటకై నడుమఁ బ్రయోగింపఁబడినది.

## గతికారకోపపదానాం కృద్భిస్సహసమాసవచనం ప్రాక్సుబుత్పత్తేః—(పరి)

గతిసంజ్ఞకంబులకును, గారకంబులకును, నుపపదంబులకును, గృదంతంబులతోడ సుప్పులుచేయుటకుఁ బూర్వమే సమాసంబు చేయవలయును.

ఉదా:—వి+ఆ+ఘ్రా "జాతేరస్త్రీవిషయాదయోపధా" త్తనుసూత్రముచేత జీష్=వ్యాఘ్రీ. అశ్వైఃక్రీతా—'క్రీతాత్కరణపూర్వా' త్తనుసూత్రముచేత జీష్=అశ్వక్రీతీ - కచ్ఛేన పిబతీతి=కచ్ఛపీ ఇత్యాదులు.

## సూ.—తత్పురుషస్యాఙ్గులేస్సంఖ్యావ్యయాదేః— ౫-౪-౮౬.

సంఖ్యావాచకంబుగాని యవ్యయంబుగాని మొదటఁ గల్గి, అంగులీశబ్దమంతంబునఁగల తత్పురుషసమాసంబున కంతావయవంబగు అచ్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:— ద్వే అంగులీ ప్రమాణమస్య-యనువిగ్రహంబున ద్వి+అఙ్గులీ+అచ్ తద్ధితార్థేత్యాదిసూత్రముచేత సమాసంబు=ద్వ్యఙ్గులమ్. నిర్గతమఙ్గులిభ్యః—నిరఙ్గులి+అచ్ 'యస్యేతిచ' యనుసూత్రముచేత నికారలోపంబు=నిరఙ్గులమ్.

సూ.—అహస్సర్వైకదేశసంఖ్యాతపుణ్యాచ్చ రాత్రేః—౫-౪-౮౭.

అహన్-సర్వ-అవయవవాచక-సంఖ్యాత-పుణ్యా శబ్దంబులలో నెద్దియేని పూర్వపదంబుగాఁగలిగిన రాత్రిశబ్దాంతంబగు తత్పురుషంబున కంతావయవంబుగా 'అచ్'-ప్రత్యయంబగును. చశబ్దంబుచేత సంఖ్యావ్యయాదిపూర్వపదకంబగు రాత్రిశబ్దాంతతత్పురుషంబునకు నగును. అహన్శబ్దంబును గ్రహించుట ద్వంద్వసమాసార్థంబు.

సూ.—రాత్రాహ్నాహాః పుంసి—౨-౪-౨౯.

కృతసమాసాంతంబులగు రాత్ర - అహ్న - అహ అను శబ్దంబు లంతంబునఁగల ద్వన్ద్వతత్పురుషసమాసంబులు పుల్లింగంబులేయగును.

ఉదా:—అహశ్చ రాత్రిశ్చ=అహోరాత్రః,సర్వరాత్రః, పూర్వరాత్రః, సంఖ్యాతరాత్రః, పుణ్యరాత్రః.

సంఖ్యాపూర్వంరాత్రం క్లీబమ్—(లిం-౧౩౨.)

సంఖ్యావాచకము పూర్వపదంబుగాఁగల కృతసమాసాంతమగు రాత్రిశబ్దము నపుంసకంబగును.

ఉదా:—ద్వి+రాత్రి+అచ్=ద్విరాత్రమ్, త్రిరాత్రమ్.

సూ.—రాజాహస్సఖిభ్యష్టచ్—౫-౪-౯౧.

రాజన్-అహన్-సఖ శబ్దంబు లంతంబునఁగల తత్పురుషంబుకంటెఁబరంబుగా నంతావయవంబగుచు టచ్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—పరమరాజన్+టచ్=పరమరాజః.

సూ.—ఆన్మహతస్సమానాధికరణజాతీయయోః—
౬-3-౪౬.

సమానాధికరణంబగు నుత్తరపదంబుగాని జాతీయర్-ప్రత్యయంబుగాని పరమగుచో మహచ్ఛబ్దంబున కాకారంబంతాదేశమగును.

ఉదా:—మహారాజః.

సూ.—ప్రకారవచనే జాతీయర్—౫-3-౬౯.

సాదృశ్యంబున జాతీయర్ (జాతీయ) ప్రత్యయంబగును.

ఉదా:—మహాప్రకారో=మహాజాతీయః.

సూ.—ద్వ్యష్టనస్సంఖ్యాయామబహువ్రీహ్యశీత్యోః—
౬-3-౪౭.

సంఖ్యావాచకంబగు నుత్తరపదంబుపరంబగుచో ద్వి-అష్టన్ శబ్దంబుల కాకారం బంతాదేశంబగును. బహువ్రీహియందును-అశీతిశబ్దము పరమగునపుడును గాదు.

ఉదా:—ద్వి+దశ=ద్వాదశ. అష్టావింశతిః.

సూ.—పరవల్లిఙ్గం ద్వన్ద్వతత్పురుషయోః—౨-౪-౨౬.

ద్వంద్వతత్పురుషసమాసంబు ఉత్తరపదలింగములు కలవియగును. ఇట ద్వంద్వపదంబుచేత నితరేతరయోగంబు మాత్రమే గ్రహింపఁబడును.

ఉదా:—కుక్కుటశ్చ మయూరీచ = కుక్కుటమయూర్యౌ (ఇమే), మయూరీచ కుక్కుటశ్చ = మయూరీకుక్కుటౌ ఇమౌ), అర్ధంపిప్పల్యాః=అర్ధపిప్పలీ.

ద్విగుప్రాప్తాపన్నాలంపూర్వగతిసమాసేషు ప్రతిషేధో వక్తవ్యః—(వా)

ద్విగుసమాసమందును, ప్రాప్త-ఆపన్న-అలమ్ శబ్దములు పూర్వపదముగాఁగలసమాసమందును, గతిసమాసమందును బరపదంబులింగంబు సమాసంబునకుఁగాదు.

ఉదా:—పఞ్చకపాలః, ప్రాప్తజీవికః,ఆపన్నజీవికః. అలమ్ కుమార్యై=అలంకుమారిః. ఈజ్ఞాపకంబుచేతనే యిట సమాసంబని యెఱుంగునది. నిష్క్రాన్తః కౌశామ్బ్యాః=నిష్కౌశామ్బిః

సూ.—అర్ధర్చాః పుంసి చ—౨-౪-౩౧.

అర్ధర్చ-మున్నగుశబ్దంబులు పుల్లింగమందును నపుంసకలింగమందును గూడనుండును.

ఉదా:—అర్ధర్చః; అర్ధర్చమ్. ఇట్లే ధ్వజ - తీర్థ-శరీర-మండ-పీయూష- దేహ-అఙ్కుశ- కలశ-పాత్ర-సూత్రమున్నగునవి.

## సామాన్యే నపుంసకమ్—(వా)

స్త్రీలింగపుల్లింగంబులకు విశేషించి ప్రాప్తిలేనపుడు నపుంసక లింగంబగును.

ఉదా:—మృదుపచతి, ప్రాతఃకమనీయమ్.

## సూ.—తత్పురుషోఽనఞ్ కర్మధారయః—౨-౪-౧౯.

ఇదియధికారసూత్రంబు. తత్పురుషః అనఞ్ కర్మధారయః అనుపదము లుత్తరసూత్రములలోని కనువర్తించును. (అనఁగాఁ జెప్పఁబోవు కార్యములు నఞ్ సమాసకర్మధారయ సమాసభిన్నంబగు తత్పురుషంబునం డగుననుట)

## సూ.—ఛాయా బాహుల్యే—౨-౪-౨౨.

పూర్వపదార్థబాహుళ్యమున ఛాయాశబ్ద మంతమునఁ గలిగినట్టియు నఞ్ కర్మధారయసమాసభిన్నంబునగు తత్పురుషంబు నపుంసకంబగును. "విభాషాసేనా" యనుసూత్రముచే విధింపఁబోవువికల్పమున కపవాదము.

ఉదా:—ఇక్షూణాం+ఛాయా=ఇక్షుచ్ఛాయమ్.

సూ.—సభా రాజాఽమనుష్యపూర్వా—౨-౪-౨౩.

రాజపర్యాయంబును, అమనుష్యవాచకంబును, బూర్వ పదంబుగాఁగలిగి సభాశబ్దమంతమునఁగల తత్పురుషంబు నపుంసకంబగును.

ఉదా:—ఇనసభమ్, ఈశ్వరసభమ్.

పర్యాయస్యైవేష్యతే—(వా)

రాజపర్యాయంబులు పూర్వమందుఁగల సభాంతంబగు తత్పురుషంబునకే నపుంసకలింగంబిష్టంబు. రాజశబ్దమునకును రాజవిశేషములకును గ్రహణము లేదు.

ఉదా:—రాజసభా, చన్ద్రగుప్తసభా.

అమనుష్యశబ్దంబు రూఢిచే రాక్షసులను బిశాచములను బోధించును.

ఉదా:—రక్షస్సభమ్, పిశాచసభమ్.

సూ.—విభాషా సేనాసురాచ్ఛాయా
శాలానిశానామ్—౨-౪-౨౫.

సేనా-సురా-ఛాయా-శాలా-నిశా శబ్దంబు లంతంబునఁ గల తత్పురుషంబు నపుంసకంబు వికల్పంబుగా నగును.

ఉదా:—బ్రాహ్మణసేనమ్; బ్రాహ్మణసేనా, యవసురమ్, యవసురా. కుడ్యచ్ఛాయమ్, కుడ్యచ్ఛాయా. గోశాలమ్, గోశాలా. శ్వనిశమ్; శ్వనిశా. 'తత్పురుషోఽనఞ్ కర్మధారయః

అనుటచేత దృఢసేనః—అనుబహువ్రీహియందును, అసేనా యను నఞ్ సమాసమందును, పరమసేనా యనుకర్మధారయ సమాసమందును, నీకార్యంబు లేదు.

ఇది తత్పురుషసమాసప్రకరణము.



బహువ్రీహిసమాసప్రకరణము.

సూ.—శేషో బహువ్రీహిః—౨-౨-౨౩.

ఇయ్యది యధికారసూత్రంబు. 'చార్థేద్వన్ద్వః' అను సూత్రంబువఱకు ననువర్తించును.

సూ.—అనేకమన్యపదార్థే—౨-౨-౨౪.

అనేకంబగు ప్రథమాంతం బన్యంబగు పదంబునర్థంబున విద్యమానంబగుచు వికల్పంబుగా సమసించును. అయ్యది బహువ్రీహిసంజ్ఞకంబు.

సూ.—సప్తమీవిశేషణే బహువ్రీహౌ—౨-౨-౩౫.

సప్తమ్యంతంబును, విశేషణంబును బహువ్రీహిసమాసంబునఁ బూర్వంబుగఁ బ్రయోగింపఁబడును. ఈజ్ఞాపకంబు చేతనే వ్యధికరణపదంబగు బహువ్రీహిసమాసంబుఁ గలదని సూచింపఁబడియె.

ఉదా:—కణ్ఠేకాలో యస్య యనువిగ్రహంబున

సూ.—హలదన్తాత్సప్తమ్యాస్సంజ్ఞాయామ్—౬-3-౯.

ఉత్తరపదంబు పరంబగుచో హలంతంబును-అదంతంబు నగు శబ్దంబుకంటెఁబరంబగు సప్తమీవిభక్తికి అలుక్కగును.

ఉదా:—కణ్ఠేకాలః,త్వచిసారః, ప్రాప్తముదకం యం సః ప్రాప్తోదకః (గ్రామము) ఊఢరథః (అనడ్వాహము), ఉపహృతపశుః (రుద్రుఁడు), ఉద్ధృతౌదనా (స్థాలి), పీతామ్బరః (హరి),వీరపురుషకః (గ్రామము).

ప్రాదిభ్యో ధాతుజస్య వాచ్యో వా
చోత్తరపదలోపః —(వా)

ప్రాదులకంటెఁ బరంబగు ధాతుజప్రకృతికసుబంతంబులకు అన్యంబగుసుబంతంబుతోడ బహువ్రీహిసమాసంబగు. అగుచో నుత్తరపదంబగు ధాతుజప్రకృతికసుబంతంబు వికల్పంబుగా లోపించును.

ఉదా:—ప్రపతితం పర్ణం యస్మాత్తత్=ప్రపర్ణః పక్షంబున) ప్రపతితపర్ణః.

నఞోఽస్త్యర్థానాం వాచ్యో వా చోత్తరపదలోపః—(వా)

నఞుకంటెఁ బరంబులును, అస్త్యర్థకంబులునగు సుబంతంబులకు బహువ్రీహియగును. అగుచో నస్త్యర్థవాచకంబులగు నుత్తరపదంబులు వికల్పంబుగా లోపించును.

ఉదా:—అవిద్యమానః పుత్రః యస్య=అపుత్రః, పక్షమున అవిద్యమానపుత్రః.

సూ.—స్త్రియాః పుంవద్భాషితపుంస్కాదనూఙ్ సమానాధికరణే స్త్రియామపూరణీప్రియాదిషు—౬-3-3౪.

భాషితపుంస్కంబును ఊఙ్‌రహితంబునునగు స్త్రీవాచకశబ్దంబునకు సమానాధికరణంబును స్త్రీలింగంబునగు నుత్తరపదంబు పరంబగుచోఁ బుంవాచకంబునకుంబోలెరూపంబగును. స్త్రీలింగంబగు పూరణప్రత్యయాంతంబును, ప్రియాదులును బరంబగుచోఁ గాదు.

ఉదా:—చిత్రాః గావో యస్య సః=చిత్రగుః. రూపవతీ భార్యా యస్య సః = రూపవద్భార్యః. (ఇట-గో-భార్యా-అనువానికి "గోస్త్రియోరుపసర్జనస్య" యనుసూత్రంబుచే హ్రస్వంబు) వామోరూః భార్యా యస్య=అనుచో వామోరూశబ్దంబు ఊఙ్‌సహితంబుగానఁ బుంవద్భావంబులేదు. వామోరూభార్యః.

సూ.—అప్‌పూరణీప్రమాణ్యోః—౫-౪-౧౧౬.

పూరణార్థకప్రత్యయాంతమగు స్త్రీలింగంబంతంబునఁ గల్గినట్టియుఁ బ్రమాణీశబ్దంబంతంబునఁ గల్గినట్టియు బహువ్రీహికంబునకుఁ బరంబుగా సమాసాంతమగు ను అప్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—కల్యాణీ పఞ్చమీ యాసాం (రాత్రీణాం) తాః=కల్యాణీ పఞ్చమాః (రాత్రులు). స్త్రీ ప్రమాణీ యస్య సః= స్త్రీప్రమాణః. కల్యాణీ ప్రియా యస్య-అనుచోఁ బ్రియాశబ్దంబు

పరంబైనది కానఁ గల్యాణీశబ్దంబునకుఁ బుంవద్భావంబు లేదు. కల్యాణీప్రియః, ఇత్యాదులు—

సూ.---బహువ్రీహౌసక్థ్యక్ష్ణోః స్వాఙ్గాత్ షచ్—౫-౪-౧౧౩

స్వాఙ్గవాచకములగు సక్థి-అక్షి శబ్దంబులంతంబునఁగల బహువ్రీహిసమాసంబుకంటెఁ బరముగా షచ్ - (అ) ప్రత్యయంబు సమాసాంతంబగును.

ఉదా:—దీర్ఘే సక్థినీ యస్య=దీర్ఘసక్థః, జలజే ఇవ అక్షిణీ యస్యాః=జలజాక్షీ.

దీర్ఘసక్థి (శకటము) స్థూలాక్షా (వేణుదండము) ఇత్యాదులందు సక్థి-అక్షి-శబ్దంబులు స్వాంగవాచకంబులు కాకుంట చే షచ్చురాదు "అక్ష్ణోఽదర్శనా" త్తనుసూత్రము చేత వక్ష్యమాణంబు అచ్ ప్రత్యయంబు.

సూ.—ద్విత్రిభ్యాం ష మూర్ధ్నః—౫-౪-౧౧౫.

ద్వి-త్రి- శబ్దపూర్వపదకంబును మూర్ధన్ శబ్దాంతంబును నగు బహువ్రీహిసమాసంబున కంతావయవంబగుచు ష (అ) ప్రత్యయంబగును.

ఉదా:—ద్విమూర్ధః, త్రిమూర్ధః.

సూ.—అన్తర్బహిర్భ్యాఞ్చ లోమ్నః—౫-౪-౧౧౭.

అన్తర్బహిశ్శబ్ద పూర్వపదకంబును లోమన్ శబ్దాంతంబునునగు బహువ్రీహిసమాసంబున కంతావయవంబగుచు అప్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—అన్తః లోమాని యస్య = అన్తర్లోమః, బహిః లోమాని యస్య=బహిర్లోమః.

సూ.—పాదస్య లోపోఽహస్త్యాదిభ్యః—౫-౪-౧౩౮.

హస్త్యాదిభిన్నంబగు నుపమానవాచకంబు పూర్వపదంబుగను పాదశబ్దం బుత్తరపదంబుగనుగల బహువ్రీహికి సమాసాంతంబగుచు లోపంబగును.

ఉదా:—వ్యాఘ్రస్యేవపాదావస్య = వ్యాఘ్రపాత్. హస్తిపాదః, కుసూలపాదః. ఇటనుపమానవాచకంబులు హస్త్యాదిభిన్నంబులు కాకుంటచే సమాసాంతకార్యంబు లేదు.

సూ.—సంఖ్యాసుపూర్వస్య—౫-౪-౧౪౦.

సంఖ్యావాచకంబుగాని సు-అనునదిగాని పూర్వపదంబుగాఁగలపాదశబ్దంబునకు బహువ్రీహియందు లోపంబు సమాసాంతంబగును.

ఉదా:—ద్వౌ పాదావస్య=ద్విపాత్, సుపాత్.

సూ.—ఉద్విభ్యాం కాకుదస్య—౫-౪-౧౪౮.

ఉద్-వి అనువానికంటెఁ బరంబగు కాకుదశబ్దంబునకు బహువ్రీహియందు లోపంబు సమాసాంతంబగును.

ఉదా:—ఉత్కాకుత్, వికాకుత్ కాకుదంబనఁగాఁ దాలువు.

సూ.—పూర్ణాద్విభాషా—౫-౪-౧౪౯.

పూర్ణశబ్దముకంటెఁబరంబగు కాకుదశబ్దంబునకు బహువ్రీహియందు సమాసాంతలోపంబు వికల్పంబుగానగును.

ఉదా:—పూర్ణ కాకుత్, (పక్షంబున) పూర్ణ కాకుదః.

సూ.—సుహృద్దుర్హృదౌ మిత్రామిత్రయోః—౫-౪-౧౫౦.

మిత్రునిబోధించునపుడు 'సుహృత్' అనియు, శత్రుని బోధించునపుడు 'దుర్హృత్' అనియు నిపతింపఁబడియెను.

ఉదా:—శోభనం హృదయం యస్య=సుహృత్, దుష్టం హృదయం యస్య=దుర్హృత్. ఇట హృదయశబ్దంబునకు హృదాదేశంబు. సుహృత్తనఁగా మిత్రుఁడు దుర్హృత్తనఁగా నమిత్రుఁడునని యర్థము.

సూ.—ఉరః ప్రభృతిభ్యః కప్—౫-౪-౧౫౧.

ఉరః ప్రభృతులకంటెఁ బరముగా బహువ్రీహియందు కప్-(క) ప్రత్యయంబు సమాసాంతంబగును.

ఉదా:—వ్యూఢమ్ ఉరః యస్య సః-అనువిగ్రహంబున వ్యూఢోరః+క-అనియుండఁగా,

సూ.—కస్కాదిషు చ—౮-3-౪౮.

కస్కాదులయందు ఇణ్ణుకంటెఁబరంబగు విసర్గంబునకు కవర్గపవర్గంబులు పరంబగుచో షకారంబగును. ఇణ్ణుకంటెఁ బరంబుగాని విసర్గమునకు సకారమగును. దీనిచే విసర్గంబునకు సకారంబు.

ఉదా:—వ్యూఢోరస్కః. ప్రియం సర్పిః యస్య=ప్రియ సర్పిః+క ఇటవిసర్గ మిణ్ణుకంబుఁ బరంబైనదిగాన షకారము = ప్రియసర్పిష్కః.

సూ.—నిష్ఠా—౨-౨-౩౬.

నిష్ఠాప్రత్యయాంతంబగునది బహువ్రీహియందుఁ బూర్వముగాఁ బ్రయోగింపఁబడును.

ఉదా:—యుక్తః యోగః యేన సః=యుక్తయోగః.

సూ.—శేషాద్విభాషా—౫-౪-౧౫౪.

ఉక్తములగు సమాసాంతప్రత్యయములు లేని బహువ్రీహికి కప్ప్రత్యయంబు సమాసాంతంబు వికల్పంబుగానగును.

ఉదా:—మహత్ యశః యస్య = మహాయశస్కః; పక్షంబున మహాయశాః. పక్షద్వయంబునందును మహచ్ఛబ్దంబునకు 'ఆన్మహతః' అను సూత్రముచేత నాత్వంబనియెఱుంగునది.

ఇది బహువ్రీహిసమాసప్రకరణము.

---

ద్వంద్వసమాసప్రకరణము.

సూ.—చార్థే ద్వన్ద్వః—౨-౨-౨౯.

అనేకంబగు సుబంతంబు చార్థంబున వర్తమానంబగుచు వికల్పంబుగా సమసించును. అది ద్వంద్వసమాసంబు.

సముచ్చయము - అన్వాచయము - ఇతరేతరయోగము సమాహారంబుననునాలుగును చార్థంబులు. పరస్పరనిరపేక్షంబులగు ననేకార్థంబులకు నొక్కచో (క్రియాదికముతో) నన్వయంబు సముచ్చయంబు నాఁబడును. అనేకార్థములలో నొకదాని నానుషంగికముగాఁ గ్రియాదులతో నన్వయించుట యన్వాచయం బనంబడును. పరస్పరసాపేక్షములగు ననేకార్థముల నొక్కచో (క్రియాదులతోఁడ) నన్వయించుట యితరేతరయోగమనఁబడును. సమూహంబు సమాహారంబనఁజను.

ఈశ్వరం గురుఞ్చ భజస్వ-అనుసముచ్చయమునందును, భిక్షామట గాఞ్చానయ-అనునన్వాచయంబునను, సామర్థ్యము లేదుగాన సమాసంబు లేదు.

ఉదా:—ధవఖదిరౌ. సంజ్ఞాపరిభాషమ్.

సూ.—రాజదన్తాదిషు పరమ్—౨-౨-౩౧.

రాజదన్త మున్నగుసమాసంబులందుఁ బూర్వప్రయోగార్హంబగు శబ్దంబు పరంబుగాఁ బ్రయోగింపఁబడును.

ఉదా:—దన్తానాం రాజా = రాజదన్తః. ఇట "షష్ఠీ" యనుసూత్రముచే సమాసంబుగాన దన్తశబ్దమునకుఁ బూర్వనిపాతంబు ప్రాప్తింపఁగా దీనిచేఁ బరనిపాతమని యెఱుంగునది.

ధర్మాదిష్వనియమః—(వా)

ధర్మాదులయందు బూర్వనిపాతనియమంబులేదు.

ఉదా:—అర్థధర్మౌ; ధర్మార్థౌ-ఇట 'అజాద్యదన్త' మ్మను దానిచే నర్థశబ్దమునకుఁ బూర్వనిపాతంబు ప్రాప్తింపఁగా దీనిచే నియమాభావంబు చెప్పఁబడియె-ఇత్యాదు లెఱుంగునది.

సూ.—ద్వన్ద్వే ఘి—౨-౨-౩౨.

ద్వంద్వసమాసంబున ఘిసంజ్ఞకంబు పూర్వంబుగాఁ బ్రయోగింపఁబడును.

ఉదా:—హరిశ్చ-హరశ్చ=హరిహరౌ.

సూ.—అజాద్యదన్తమ్—౨-౨-౩౩.

అజాదియును అదంతమునగు శబ్దంబునకు ద్వంద్వంబునఁ బూర్వనిపాతంబగును.

ఉదా:—ఈశశ్చ కృష్ణశ్చ=ఈశకృష్ణౌ.

సూ.—అల్పాచ్తరమ్—౨-౨-౩౪.

అల్పసంఖ్యాకంబులగు నచ్చులుగలశబ్దంబు ద్వంద్వంబునఁ బూర్వంబుగాఁ బ్రయోగింపఁబడును.

ఉదా:—శివశ్చ కేశవశ్చ=శివకేశవౌ.

సూ.—పితామాత్రా—౧-౨-౭౧.

మాతృపితృశబ్దంబులకు సహవివక్షయందు పితృశబ్దము మాత్రమే వికల్పముగ శేషించును. గానఁ బక్షంబున ద్వంద్వ సమాసముగూడ నగుచున్నది.

ఉదా:—మాతా చ పితా చ=పితరౌ-పక్షమున-మాతా పితరౌ.

సూ.—ద్వన్ద్వశ్చ ప్రాణితూర్యసేనాఙ్గానామ్—౨-౪-౨.

ప్రాణ్యంగంబులయు, తూర్యాంగంబులయు, సేనాంగంబులయు ద్వంద్వసమాసం బేకత్వవాచకంబగును. 'సనపుంసక' మ్మను సూత్రముచేత నపుంసకత్వంబు.

ఉదా:—పాణిపాదమ్, మార్దఙ్గికపాణవికమ్, రథికాశ్వారోహమ్. ప్రాణ్యంగాదులకు సమాహారమందే గాని యితరేతర యోగంబున సమాసంబు లేదు.

సూ.—ద్వన్ద్వాచ్చుదషహాన్తాత్సమాహారే—౫-౪-౧౦౬.

చవర్గాంతంబును దకారషకారహకారాంతంబుననగు ద్వంద్వంబునకు సమాహారంబున టచ్(అ) ప్రత్యయంబు సమాసాంతంబగును.

ఉదా:—వాక్త్వచమ్, త్వక్స్రజమ్, శమీదృషదమ్, వాక్త్విషమ్, ఛత్రోపానహమ్. ప్రావృట్చ శరచ్చ - అనుచో సమాహారంబు లేమింజేసి సమాసాంతంబు కాదు. ప్రావృట్ శరదౌ.

ఇది ద్వంద్వసమాసప్రకరణము.

సమాసాన్తప్రకరణము.

సూ.—ఋక్పూరబ్ధూఃపథామానక్షే—౫-౪-౭౪.

ఋచ్-పుర్-అప్-ధుర్-పథిన్ శబ్దాంతంబగు సమాసంబున కంతావయవంబుగా అప్రత్యయమగును. అక్షసంబంధివాచకమగు ధూర్శబ్దం బంతంబునఁగల సమాసంబునకుఁగాదు. అక్షంబనఁగా రథావయవంబగు దారువిశేషంబు.

ఉదా:—అర్ధర్చః, విష్ణుపురమ్, విమలాపమ్, (సరస్సు), రాజధురా. అక్షధూః, దృఢధూః (అక్షము) ఇట ధూర్శబ్దం బక్షసంబంధివాచకమగుటచే నప్రత్యయంబులేదు. సఖిపథః, రమ్యపథః (దేశము).

సూ.—అక్ష్ణోఽదర్శనాత్—౫-౪-౭౬.

చక్షుస్సునుబోధింపని అక్షిశబ్దంబునకు సమాసాంతంబగుచు అచ్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—గవామక్షీవ=గవాక్షః.

సూ.—ఉపసర్గాదధ్వనః—౫-౪-౮౫.

ఉపసర్గముకంటెఁబరంబగు అధ్వన్‌శబ్దంబునకు సమాసాంతంబు అచ్ ప్రత్యయంబగును.

ఉదా:—ప్రగతోఽధ్వానమ్=ప్రాధ్వః (రథము).

సూ.—న పూజనాత్—౫-౪-౬౯.

స్వతిభ్యామేవ—(వా)

పూజావాచకంబులగు సు - అతి అనువానికంటెఁ బర మగు నుత్తరపదములకు సమాసాంతప్రత్యయంబులు రావు.

ఉదా:—సు(శోభనః) రాజా=సురాజా, అతిరాజా. ఇట 'రాజాహస్సఖిభ్యష్టచ్' అను సూత్రముచే టచ్చు ప్రాప్తింపఁగా దీనిచేత నిషేధింపఁబడియె.

ఇది సమాసాన్తప్రకరణము.

ఇది సమాసప్రకరణము.

---

# తద్ధితాధికారప్రకరణము.

సాధారణప్రత్యయప్రకరణము.

సూ.—సమర్థానాం ప్రథమాద్వా—౪-౧-౮౨.

'ప్రాగ్దిశః' అను సూత్రముపఱకు సమర్థానామ్—ప్రథమాత్-వా-అనుమూఁడుపదంబులు ననువర్తించును. సమర్థంబులలో నెయ్యది సూత్రంబులందుఁ బ్రథమోచ్చరితంబగు దానికంటెఁ బరంబుగాఁ జెప్పఁబోవు ప్రత్యయంబులు వికల్పంబుగా నగును. సామర్థ్యంబనఁగాఁ బరినిష్ఠితత్వంబు. (కృతసంధికార్యత్వం బనుట).

సూ.—ప్రాగ్దీవ్యతోఽణ్—౪-౧-౮౩.

'తేనదీవ్యతి' అను సూత్రమువఱకు 'అణ్' (అ) అనుపదం బనువర్తించును.

సూ.—అశ్వపత్యాదిభ్యశ్చ—౪-౧-౮౪.

అశ్వపతి మున్నగువానికంటెఁ బరముగా ప్రాగ్దీవ్యతీయంబులగు నర్థంబులయందు అణ్ప్రత్యయంబగును. 'తస్యాపత్యమ్' అనునది మొదలుకొని తస్య వికారః. అను దానివఱకుఁ జెప్పఁబడినయర్థంబులు ప్రాగ్దీవ్యతీయంబులు నాఁబడును. "తద్ధితేష్వచామాదేః" అను సూత్రముచే వృద్ధి.

ఉదా:—అశ్వపతేరపత్యాది=ఆశ్వపతమ్, గాణపతమ్.

సూ.—దిత్యదిత్యాదిత్యపత్యుత్తరపదాణ్ణ్యః—౪-౧-౮౫.

దితి-అదితి-ఆదిత్య శబ్దంబులకంటెను, పతిశబ్ద ముత్తర పదంబుగాఁగల దానికంటెను బరముగా ప్రాగ్దీవ్యతీయంబులగు అపత్యమున్నగునర్థంబులందు ణ్య - (య) అనుప్రత్యయం బగును. అణ్ణునకపవాదంబు.

ఉదా:—దితేరపత్యాది = దైత్యః, అదితేరపత్యాది = ఆదిత్యః, ఆదిత్యస్యాపత్యాది=ఆదిత్యః, ప్రాజాపత్యః.

దేవాద్యఞఞౌ—(వా)

దేవశబ్దంబుకంటెఁబరంబుగా, ప్రాగ్దీవ్యతీయంబులగు నర్థంబులందు యఞ్ (య)-అఞ్ (అ) ప్రత్యయంబులగును.

ఉదా:—దేవస్యాపత్యాది=దైవ్యమ్, దైవమ్.

బహిషష్టిలోపో యఞ్ చ—(వా)

బహిస్-అనునవ్యయంబుకంటెఁ బరముగాఁ బ్రాగ్దీవ్యతీయార్థంబులందు యఞ్ ప్రత్యయంబును, బ్రకృతికి టిలోపంబునగును..

ఉదా:—బహిర్భవః=బాహ్యః.

ఈకక్చ—(వా)

బహిస్ అనునవ్యయంబునకుఁ బరముగా ఈకక్ (ఈక) ప్రత్యయంబును బ్రకృతికి టిలోపంబును బ్రాగ్దీవ్యతీయార్థంబులనగును.

సూ.—కితి చ—౭-౨-౧౧౮.

కి త్తగుతద్ధితప్రత్యయము పరమగునపుడు అంగము యొక్క యచ్చులలో మొదటియచ్చునకు వృద్ధియగును.

ఉదా:—బహిర్భవః=బాహీకః.

సర్వత్ర గోరజాదిప్రసఙ్గే యత్—(వా)

గోశబ్దంబుకంటెఁ బరముగాఁ బ్రాగ్దీవ్యతీయార్థంబులయందు అజాదిప్రత్యయములకుఁ బ్రసంగము (ప్రాప్తి) గలిగినచో యత్ప్రత్యయమగును.

ఉదా:—గోః అపత్యాది—ఇట అణ్ణు ప్రసక్తముకాఁగా దీనిచే యత్ప్రత్యయంబు. గో+యత్ 'వాన్తో యి ప్రత్యయే' అనుదానిచే వాంతాదేశము—గవ్యమ్.

సూ.—ఉత్సాదిభ్యోఽఞ్—౪-౧-౮౬.

ప్రాగ్దీవ్యతీయార్థంబులందు ఉత్సాదులకంటెఁ బరముగా అఞ్ (అ) ప్రత్యయంబగును.

ఉదా:—ఉత్సస్యాపత్యాది = ఔత్సః.

ఇవి యపత్యాదివికారాన్తార్థసాధారణప్రత్యయములు.

ఇది సాధారణప్రత్యయప్రకరణము.

---

అపత్యాధికారప్రకరణము.

సూ—స్త్రీపుంసాభ్యాం నఞ్స్నఞౌ భవనాత్—౪-౧-౮౭.

'ధాన్యానాం భవనే క్షేత్రే ఖఞ్' అను సూత్రమునకుఁ బూర్వమునవిహితంబులగు నర్థంబులయందు స్త్రీశబ్దపుంశబ్దంబులకంటెఁ బరముగా వరుసను నఞ్ (న) - స్నఞ్ (స్న) అను ప్రత్యయంబులగును.

ఉదా:—స్త్రియాః అపత్యాది—స్త్రీ+న వృద్ధి-ణత్వము=స్త్రైణః-పుంసః అపత్యాది—పుంస్+స్న వృద్ధి-సంయోగాంతలోపము=పౌంస్నః.

సూ.—తస్యాపత్యమ్—౪-౧-౯౨.

షష్ఠ్యంతంబును కృతసంధికంబును సమర్థంబునగు ప్రాతిపదికముకంటెఁబరంబుగా నపత్యార్థంబున నుక్తంబులును,వక్ష్యమాణంబులునునగు ప్రత్యయంబులు వికల్పంబుగానగును.

ఉదా:—ఉపగోరపత్యమ్ ఉపగు+అ ఆదివృద్ధి—ఔపగు+అ అని సిద్ధింపఁగా,

సూ.—ఓర్గుణః—౬-౪-౧౪౬.

ఉవర్ణాంతంబును భసంజ్ఞకంబునునగు నంగమునకు తద్ధితపరమగుచో గుణంబగును. దీనిచే గుణంబు.

ఉదా:—ఔపగో+అ అవాదేశము = ఔపగవః, ఆశ్వపతః, దైత్యః, ఔత్సః, స్త్రైణః, పౌంస్నః.

సూ.—అపత్యం పౌత్రప్రభృతి గోత్రమ్—౪-౧-౧౬౨.

అపత్యంబుగా వివక్షింపఁబడిన పౌత్రాదులు గోత్రసంజ్ఞకంబులగును.

సూ.—ఏకో గోత్రే—౪-౧-౯౩.

గోత్రంబున నపత్యార్థకప్రత్యయ మొక్కటియే యగును.

ఉదా:—ఉపగోర్గోత్రాపత్యమ్=ఔపగవః.

సూ.—గర్గాదిభ్యో యఞ్—౪-౧-౧౦౫.

గర్గ-మున్నగుశబ్దంబులకంటెఁ బరముగా గోత్రాపత్యార్థమున యఞ్ (య) ప్రత్యయంబగును.

ఉదా:—గర్గస్య గోత్రాపత్యమ్ = గార్గ్యః. వత్సస్య గోత్రాపత్యమ్=వాత్స్యః.

సూ.—యఞఞోశ్చ—౨-౪-౬౪.

గోత్రార్థంబున నేశబ్దంబులు యఞ్-అఞ్ ప్రత్యయాంతంబులగుఁ దదవయవంబులగు యఞ్-అఞ్ ప్రత్యయంబులకు స్వార్థగతబహుత్వమందు లుక్కగును. స్త్రీలింగంబునఁ గాదు.

ఉదా:—గర్గస్య గోత్రాపత్యాని=గర్గాః. వత్సస్య గోత్రాపత్యాని=వత్సాః.

సూ.—జీవతి తు వంశ్యే యువా—౪-౧-౧౬౩.

వంశ్యులగు పిత్రాదులు జీవించియుండఁగాఁ బౌత్రాదుల యొక్క యపత్యము (చతుర్థాది) యువసంజ్ఞకంబే యగును.

సూ.—గోత్రాద్యూన్యస్త్రియామ్—౪-౧-౯౪.

యువాపత్యార్థమందు గోత్రప్రత్యయాంతముకంటెనే పరముగఁ బ్రత్యయంబగును. స్త్రీలింగంబున యువసంజ్ఞ లేదు.

సూ.—యఞిఞోశ్చ—౪-౧-౧౦౧.

గోత్రార్థంబున విహితంబులగు యఞ్ - ఇఞ్ ప్రత్యయంబు లంతంబునఁగల ప్రాతిపదికములకంటెఁ బరముగా యువాపత్యార్థంబున ఫక్ (ఫ) అను ప్రత్యయమగును.

సూ.—ఆయనేయీనీయియః ఫఢఖఛఘాం
ప్రత్యయాదీనామ్—౭-౧-౨.

ప్రత్యయంబులకాదులగు ఫ-ఢ-ఖ-ఛ-ఘ అనువానికిఁ

గ్రమముగా ఆయన్-ఏయ్-ఈన్ - ఈయ్ - ఇయ్ అనునవి యాదేశములగును.

ఉదా:—గర్గస్య యువాపత్యమ్—గర్గ+యఞ్ గార్గ్య+ఫ ఆయన్నాదేశము=గార్గ్యాయణః.

సూ.—అత ఇఞ్—౪-౧-౯౫.

అదంతప్రాతిపదిక ప్రకృతికంబగు షష్ఠ్యంతంబుకంటెఁ బరంబుగా నపత్యార్థమున ఇఞ్ (ఇ) అను ప్రత్యయమగును.

ఉదా:—దక్షస్యాపత్యమ్=దాక్షిః. దాక్షాయణః

సూ.—బాహ్వాదిభ్యశ్చ—౪-౧-౯౬.

బాహ్వ-మున్నగువానికంటెఁ బరంబుగా నపత్యార్థంబున ఇఞ్-ప్రత్యయంబగును.

ఉదా:—బాహోరపత్యమ్=బాహవిః. బాహువని యొక మహర్షి నామధేయంబు ఉడులోమ్నః అపత్యం ఔడులోమిః. ఇది యాకృతిగణంబు.

సూ.—అనృష్యానన్తర్యే బిదాదిభ్యోఽఞ్—౪-౧-౧౦౪.

బిదాదిగణంబున ఋషివాచకంబులుఁ దదితరంబులును గూడఁ బఠింపఁబడియె. అందు ఋషివాచకభిన్నంబులకంటెఁ బరంబుగా ననంతరాపత్యార్థమునను, ఋషివాచకంబులకు గోత్రార్థమందును అఞ్-ప్రత్యయంబగును.

ఉదా:—బిదస్య గోత్రాపత్యమ్=బైదః - బైదౌ-బిదాః పుత్రస్యాపత్యమ్=పౌత్రః-పౌత్రౌ - పౌత్రాః. ఇట్లే దుహిత్రు-మున్నగువానిరూపంబు లరయునది.

సూ.—శివాదిభ్యోఽణ్—౪-౧-౧౧౨.

శివ - మొదలగువానికంటెఁ బరంబుగా నపత్యార్థంబున అణ్-ప్రత్యయంబగును.

ఉదా:—శివస్యాపత్యమ్=శైవః. గఙ్గాయాః అపత్యమ్=గాఙ్గః.

సూ.—ఋష్యన్ధకవృష్ణికురుభ్యశ్చ—౪-౧-౧౧౪.

ఋషివిశేషవాచకంబులకంటెను, అన్ధక - వృష్ణి-కురు-వంశ్యవాచకంబులకంటెను బరముగా నపత్యార్థమున అణ్ణగును. వంశమున జన్మించినవారు వంశ్యులనం బడుదురు.

ఉదా:—ఋషివిశేషవాచకంబులకు-వసిష్ఠస్యాపత్యమ్=వాసిష్ఠః, వైశ్వామిత్రః.

(అంధకవంశ్యవాచకంబునకు) శ్వఫల్కస్యాపత్యమ్ = శ్వాఫల్కః.

(వృష్ణివంశ్యవాచకంబునకు) వసుదేవస్యాపత్యమ్=వాసుదేవః.

(కురువంశ్యవాచకంబునకు) నాకులః, సాహదేవః.

సూ.—మాతురుత్సంఖ్యాసంభద్రపూర్వాయాః—
౪-౧-౧౧౫.

సంఖ్యావాచకంబును సమ్-భద్ర అనునవియుఁ బూర్వమందుఁగల మాతృశబ్దంబునకు హ్రస్వమైన ఉకార మాదేశమగును. మాతృశబ్దముకంటెఁ బరముగానణ్ణునగును.

ఉదా:—ద్వయోర్మాత్రోరపత్యమ్ = ద్వైమాతురః షణ్ణాం మాతౄణామపత్యమ్ = షాణ్మాతురః. (సమీచీనా మాతా సంమాతా)-సంమాతురపత్యమ్=సాంమాతురః. భద్రమాతురపత్యమ్=భాద్రమాతురః.

సూ.—స్త్రీభ్యో ఢక్—౪-౧-౧౨౦.

స్త్రీప్రత్యయాంతంబులకంటెఁ బరముగా నపత్యార్థమున ఢక్ (ఢ) ప్రత్యయంబగును.

ఉదా:—వినతాయా అపత్యమ్ వినతా+ఢ వైనతా+ఢ వైనత+ఏయ=వైనతేయః.

సూ.—కన్యాయాః కనీన చ—౪-౧-౧౧౬.

కన్యాశబ్దంబునకుఁ బరంబుగా నపత్యార్థంబున అణ్ణగును. మఱియుఁ గన్యాశబ్దంబునకు కనీన-యనునాదేశమగును.

ఉదా:—కన్యాయాః అపత్యమ్=కానీనః. (వ్యాసుఁడు-కర్ణుఁడు.)

సూ.—రాజశ్వశురాద్యత్—౪-౧-౧౩౭.

రాజన్ శబ్దంబుకంటెను శ్వశురశబ్దంబుకంటెను బరముగా నపత్యార్థమున యత్ (య) ప్రత్యయంబగును.

రాజ్ఞో జాతావేవేతి వాచ్యమ్—(వా)

రాజన్ శబ్దంబునకు జాతియందే యత్తగును.

సూ.—యే చాభావకర్మణోః—౬-౪-౧౬౮.

యకారాదియగు తద్ధిత ప్రత్యయము పరమగుచో అన్-అనునది ప్రకృతిభావంబునొందును. భావకర్మములయందుఁ బొరయదు.

ఉదా:—రాజ్ఞః అపత్యమ్=రాజన్యః - (క్షత్త్రియుఁడు).

సూ—అన్—౬-౪-౧౬౭.

అణ్ణుపరంబగుచో అన్ - అనునది ప్రకృతిభావంబునొందును.

ఉదా:—రాజన్+అణ్=రాజనః-(క్షత్త్రియునివలన నన్య స్త్రీయందు జన్మించినవాఁడనియర్థము) ఇట జాతియర్థంబు కాకుండుటచే యత్తు రాదని తెలియునది. శ్వశురస్యాపత్యమ్ = శ్వశుర్యః.

సూ.—క్షత్త్రాద్ఘః—౪-౧-౧౩౮.

క్షత్త్రశబ్దముకంటెఁ బరంబుగా జాతిగమ్యమానంబగుచో నపత్యార్థంబున ఘ-ప్రత్యయంబగును.

ఉదా:—క్షత్రస్యాపత్యమ్— క్షత్ర + ఘ ఇయాదేశంబు-అకారలోపము-క్షత్రియః. అర్థాంతరంబున క్షాత్రిః.

సూ.—కులాత్ఖః—౪-౧-౧౩౯.

కులశబ్దంబుకంటెఁ బరంబుగా నపత్యార్థంబున ఖ-ప్రత్యయంబగును.

ఉదా:—కులస్యాపత్యమ్—కుల+ఖ కుల+ఈన్+అ = కులీనః.

సూ.—రేవత్యాదిభ్యష్ఠక్—౪-౧-౧౪౬.

రేవతీ-మున్నగుశబ్దంబులకంటెఁ బరంబుగా నపత్యార్థమున ఠక్ (ఠ్) ప్రత్యయంబగును.

సూ.—ఠస్యేకః—౭-౩-౫౦.

అంగంబుకంటెఁ బరంబగు ఠకారమునకు ఇక-అనునాదేశమగును.

ఉదా:—రేవత్యాః అపత్యమ్—రేవతీ+ఠ్ (ఠక్) రేవతీ+ఇక ఆదివృద్ధి-ఈకారలోపంబు=రైవతికః.

సూ.—జనపదశబ్దాత్ క్షత్రియాదఞ్—౪-౧-౧౬౮.

జనపదవాచకంబును, క్షత్రియవాచకంబునగు శబ్దంబుకంటెఁ బరంబుగా నపత్యార్థమున అఞ్ ప్రత్యయమగును.

ఉదా:—పఞ్చాలస్యాపత్యమ్-పాఞ్చాలః.

క్షత్రియసమానశబ్దాజ్జనపదాత్తస్య రాజన్యపత్యవత్-(వా).

జనపదక్షత్రియవాచకశబ్దంబునకు షష్ఠ్యంతమునకుఁబర ముగా 'తస్య రాజా' (దానికి రాజు) అనునర్థమందు అపత్యా ర్థమునఁజెప్పిన ప్రత్యయంబులగును.

ఉదా:—పఞ్చాలానాం రాజా—పఞ్చాల+అణ్ = పాఞ్చాలః.

పూరోరణ్వక్తవ్యః—(వా)

పూరుశబ్దంబుకంటెఁ బరంబుగా నపత్యార్థమున అణ్ ప్రత్యయంబగును.

ఉదా:—పూరోరపత్యమ్=పౌరవః.

పాణ్డోర్డ్యణ్—(వా)

పాణ్డుశబ్దముకంటెఁ బరముగా నపత్యార్థంబున డ్యణ్ (య) ప్రత్యయంబగును.

ఉదా:—పాణ్డోః అపత్యమ్—పాణ్డూనామ్ రాజా పాణ్డు+య (డ్యణ్) డిత్వసామర్థ్యముచే భసంజ్ఞ లేకున్నను టిలోపంబు-పాణ్డ్యః.

సూ.—కురునాదిభ్యో ణ్యః—౪-౧-౧౭౨.

కురుశబ్దముకంటెను నకారాదిశబ్దంబులకంటెను బర ముగా నపత్యార్థంబున ణ్య (య) ప్రత్యయమగును.

ఉదా:—కురోరపత్యమ్-కురూణాం రాజా వా = కౌర వ్యః. నిషధస్యాపత్యమ్—నిషాధానాం రాజా వా=నైషధ్యః

సూ.—తే తద్రాజాః—౪-౧-౧౭౪.

అఞ్-అణ్-ఞ్యఙ్-ణ్య-ఇఞ్ అను ప్రత్యయములు తద్రాజసంజ్ఞకంబులగును.

సూ.—తద్రాజస్య బహుషు తేనైవా స్త్రియామ్—౨-౪-౬౨.

తద్రాజప్రత్యయాంతార్థకృత బహుత్వమునఁ దద్రాజసంజ్ఞకప్రత్యయంబులకు లుక్కగును. స్త్రీలింగంబునఁ గాదు.

ఉదా:—పఞ్చాలస్యాపత్యాని - పఞ్చాలానాం రాజానో వా=పఞ్చాలాః. పూరవః, పాణ్డవః, కురవః, నిషధాః.

సూ.—కమ్బోజాల్లుక్—౪-౧-౧౭౫.

కమ్బోజాదిభ్య ఇతి వక్తవ్యమ్—(వా)

కమ్బోజ-చోల - కేరల-శక - యవన శబ్దంబులకంటెఁ బరంబులగు తద్రాజసంజ్ఞకప్రత్యయంబులకు లుక్కగును.

ఉదా:—కమ్బోజస్యాపత్యమ్ = కమ్బోజః-కమ్బోజౌ. చోలః, కేరలః, శకః, యవనః.

ఇది అపత్యాధికారప్రకరణము.

---

రక్తాద్యర్థప్రకరణము.

సూ.—తేన రక్తం రాగాత్—౪-౨-౧.

తృతీయాంతమును సమర్థమునగు రంజకద్రవ్యవాచకముకంటెఁ బరముగా 'తేన రక్తమ్' (దానిచే రంగువేయఁబడినది) అనునర్థమున అణ్ (అ) అనుతద్ధితప్రత్యయమగును.

ఉదా:—కషాయేణ రక్తం వస్త్రం=కాషాయమ్.

సూ.—నక్షత్రేణ యుక్తః కాలః—౪-౨-౩.

నక్షత్రసమీపమునందుండు చంద్రునితోఁగూడిన కాలమును బోధించుచు నక్షత్రవాచకముకంటెఁ బరముగా అణ్-ప్రత్యయమగును.

తిష్యపుష్యయోర్నక్షత్రాణి యలోప ఇతి వాచ్యమ్—(వా)

తిష్య-పుష్య అనునీశబ్దములయొక్క యకారమునకు నక్షత్రయుక్తకాలమునుబోధించు అణ్ణు పరమగునపుడు లోపమగును.

ఉదా:—పుష్యేణ యుక్తమ్ = పౌషమ్ (అహస్సు). పౌషీ (రాత్రి).

సూ.—లుబవిశేషే—౪-౨-౪.

అరువదిగడియలు పరిమాణముగల కాలముయొక్క యవాంతరవిశేషము గమ్యమానముకానియపుడు అణ్ణునకు లుప్పగును (లోపమనుట).

ఉదా:—అద్య పుష్యః.

సూ.—దృష్టం సామ—౪-౨-౭.

తృతీయాసమర్థముకంటెఁ బరముగా 'తేన దృష్టమ్' (వానిచేఁ జూడఁబడినది) అనునర్థమునఁ జూడఁబడినది సామమగుచో అణ్ణగును.

ఉదా:—వసిష్ఠేన దృష్టమ్=వాసిష్ఠమ్. (సామము.)

సూ.—వామదేవాడ్డ్యడ్డ్యౌ—౪-౨-౯.

వామదేవశబ్దముకంటెఁ బరముగాఁ బూర్వోక్తార్థమున డ్యత్ (య) డ్య (య) అను ప్రత్యయములగును

ఉదా:—వామదేవేన దృష్టం సామ=వామదేవ్యమ్.

సూ.—పరివృతో రథః—౪-౨-౧౦.

'తేన పరివృతో రథః' (దానిచే రథము కప్పఁబడినది) అనునర్థమునఁ దృతీయాసమర్థముకంటెఁ బరముగా అణ్-ప్రత్యయమగును.

ఉదా:—వస్త్రేణ పరివృతో=వాస్త్రః (రథము.)

సూ.—తత్రోద్ధృతమమత్రేభ్యః—౪-౨-౧౪.

పాత్రవాచకములగు సప్తమీసమర్థములకంటెఁ బరముగా 'తత్ర ఉద్ధృతమ్' (దానియందెత్తియుంపఁబడినది) అనునర్థమున అణ్ణగును.

ఉదా:—శరావే ఉద్ధృతః=శారావః (ఓదనము.)

సూ.—సంస్కృతం భక్షాః—౪-౨-౧౬.

'తత్ర సంస్కృతమ్' (దానియందు సంస్కరింపఁబడినది) అనునర్థమున సంస్కరింపఁబడినవి భుజింపఁదగినవస్తువులగుచో సప్తమీసమర్థముకంటెఁ బరముగా అణ్ణగును.

ఉదా:—భ్రాష్ట్రేషు సంస్కృతాః=భ్రాష్ట్రాః (పేలాలు.)

సూ.—సాస్య దేవతా—౪-౨-౨౪.

ప్రథమాసమర్థమగు ప్రాతిపదికముకంటెఁ బరముగా 'సాస్య దేవతా' (అది దీనికి దేవత) అనునర్థమున అణ్ణగును.

ఉదా:—ఇన్ద్రో దేవతాఽస్యేతి = ఐన్ద్రమ్ (హవిస్సు). పాశుపతమ్, బార్హస్పత్యమ్.

సూ.—శుక్రాద్ఘన్—౪-౨-౨౬.

శుక్రశబ్దముకంటెఁ బరముగా ఘన్ (ఘ) ప్రత్యయము పూర్వోక్తవిషయమున నగును.

ఉదా:—శుక్రియమ్.

సూ.—సోమాట్ట్యణ్—౪-౨-౩౦.

పూర్వోక్తార్థంబున సోమశబ్దముకంటెఁ బరముగా ట్యణ్ (య) అను ప్రత్యయమగును.

ఉదా:—సౌమ్యమ్.

సూ.—వాయ్వృతుపిత్రుషసో యత్—౪-౨-౩౧.

పూర్వోక్తార్థమున వాయు-ఋతు-పితృ-ఉషస్ అనుప్రాతిపదికములకంటెఁ బరముగా యత్ (య) అను ప్రత్యయమగును.

ఉదా:—వాయవ్యమ్. ఋతవ్యమ్.

సూ.—రీఙ్ ఋతః—౭-౪-౨౭.

కృత్తును సార్వధాతుకమునుగానట్టి యకారము పరమగునపుడును, చ్విప్రత్యయము పరమగునపుడును, ఋదంతాంగంబునకు రీఙ్ (రీ) అను నాదేశమగును.

ఉదా:—పితృ+య పిత్రీ+య - 'యస్యేతి చ' యను సూత్రముచేత ఈకారలోపము=పిత్ర్యమ్. ఉపస్యమ్.

సూ.—పితృవ్యమాతులమాతామహపితామహాః—
౪-౨-౩౬.

పితృవ్య-మాతుల-మాతామహ-పితామహ శబ్దములు అర్థవిశేషంబునందు నిపతింపఁబడియెను.

ఉదా:—పితృశబ్దముకంటె పితృభ్రాతయందు వ్యత్ (న్) వ్య అను ప్రత్యయము నిపతింపఁబడియెను. పితృవ్యః.

మాతృశబ్దముకంటె మాతృభ్రాతయందు డులచ్ (ఉల) అను ప్రత్యయము నిపతింపఁబడినది. మాతులః.

మాతృపితృశబ్దములకంటెఁ దల్లిదండ్రులయొక్క-తండ్రి యనునర్థమున డామహచ్ (ఆమహ) ప్రత్యయము నిపతింపఁ బడియె. మాతామహః పితామహః.

సూ.—తస్య సమూహః—౪-౨-౩౭.

తేషాం సమూహః (వానిసమూహము) అనునర్థమున షష్ఠీసమర్థముకంటెఁ బరముగా నణ్ణగును.

ఉదా:—కాకానాం సమూహః=కాకమ్.

సూ.—భిక్షాదిభ్యోఽణ్—౪-౨-౩౮.

భిక్షా మున్నగుప్రాతిపదికములకంటె సమూహార్థంబున అణ్ణగును. ఠక్కు మున్నగు ప్రత్యయములకు బాధకము.

ఉదా:—భిక్షాణాం సమూహః=భైక్షమ్. ఇట 'అచిత్త హస్తిధేనోష్ఠక్' అనుసూత్రముచే ఠక్కు ప్రాప్తించుచున్నది.

గర్భిణీనాం సమూహః=గార్భిణమ్ - ఇట 'అనుదాత్తా దేరఞ్'అనుసూత్రముచే అఞ్ ప్రత్యయము ప్రాప్తించుచున్నది. అఞ్ఞువచ్చినచో టిలోపమగునుగాన టిలోపము రాకుండుటకై పూర్వసూత్రముచే సిద్ధించుచున్నను మరల నణ్ణు విధింపఁబడిన దని యెఱుంగునది. "భస్యాఢేతద్ధితే" అనుసూత్రముచేఁ బుంవ ద్భావను చేయఁగా గార్భిన్+అ-అని కాఁగా,

సూ.—ఇనణ్యనపత్యే—౬-౪-౧౬౪.

అపత్యార్థకముగాని అణ్ణు పరమగునపుడు ఇన్ అనునది ప్రకృతిభావంబునొందును. కాన నిట "న_స్తద్ధితే" యను దానిచే టిలోపము రాదు.

ఉదా:—గార్భిణమ్ యువతిశబ్దం బనుదాత్తాదియగు టచే 'అనుదాత్తా దేరఞ్' అనుసూత్రముచేత అఞ్ఞు ప్రాప్తిం పఁగా భిక్షాదులలో గ్రహింపఁబడియె.

ఉదా:—యువతీనాం సమూహః-యువతి+అ పుంవద్భా వము. యువన్+అ 'అన్' అనుదానిచేఁ బ్రకృతిభావంబు ఆది వృద్ధి=యౌవనమ్.

సూ.—అనుదాత్తాదేరఞ్—౪-౨-౪౪.

అనుదాత్తాదియగు ప్రాతిపదికముకంటెఁ బరముగా సమూహార్థమున అఞ్ ప్రత్యయంబగును.

శత్రంతంబగు యువతీశబ్దముకంటెఁ బరముగా అఞ్ ప్రత్యయము.

ఉదా:—యువతీ+అ పుంవద్భావము యువత్+అ వృద్ధి=యౌవతమ్.

సూ.—గ్రామజనబన్ధుభ్య స్తల్—౪-౨-౪౩.

గ్రామ-జన-బన్ధు శబ్దములకంటెఁ బరముగా తల్ (త) అను ప్రత్యయమగును.

తలన్తః—(లిం-౧౭).

తల్ప్రత్యయాంతము స్త్రీలింగంబగును.

ఉదా:—గ్రామతా, జనతా, బన్ధుతా.

గజసహాయాభ్యాం చేతి వక్తవ్యమ్—(వా)

గజ-సహాయ-శబ్దములకంటెఁ బరముగా తల్ప్రత్యయమగును.

ఉదా:—గజతా-సహాయతా.

అహ్నః ఖః క్రతౌ—(వా)

అహన్‌శబ్దముకంటెఁ బరముగా క్రతువువాచ్యమగునపుడు ఖ-అను ప్రత్యయమగును.

ఉదా:—అహీనః (క్రతువిశేషము.)

సూ.—అచిత్తహస్తిధేనోష్ఠక్—౪-౨-౪౭.

చిత్తరహితవాచకశబ్దముకంటెను హస్తిన్-ధేను శబ్దములకంటెను బరముగా ఠక్ (ఠ్) అను ప్రత్యయమగును.

సూ.—ఇసుసుక్తాన్తాత్కః—౭-3-౫౧.

ఇస్-ఉస్-ఉక్ (ప్రత్యాహారము) ష్ అనునవి యంత మునఁగలయంగముకంటెఁ బరమగు ఠకారమునకు క-అను నాదేశమగును.

ఉదా:—సాక్తుకమ్, హాస్తికమ్; ధైనుకమ్.

సూ.—తదధీతే తద్వేద—౪-౨-౫౯.

తదధీతే (దానిని జదువుచున్నవాఁడు) తద్వేద (అది తెలిసికొనువాఁడు) అనునర్థముల ద్వితీయాసమర్థముకంటెఁ బర ముగా అణ్ ప్రత్యయమగును.

సూ.—నయ్వాభ్యాం పదాన్తాభ్యాం పూర్వౌ తు తాభ్యామైచ్—౭-3-3.

పదాంతములగు యకారవకారములకంటెఁ బరమగు దానికి వృద్ధిరాదు. ఆయకారముకంటెఁ బూర్వముగా ఐకార మును, వకారముకంటెఁ బూర్వముగా ఔకారమును నాగ మములగును. ఇవి యాదేశప్రత్యయభిన్నములగుటచేత నాగ మము లనంబడును.

ఉదా:—వ్యాకరణమధీతే వేద వా=వైయాకరణః.

సూ.—క్రమాదిభ్యో వున్—౪-౨-౬౧.

క్రమ-మున్నగు ప్రాతిపదికములకంటెఁ బరముగా వున్ (వ్) అను ప్రత్యయము పూర్వోక్తార్థంబు లందగును.

ఉదా:—క్రమకః, పదకః, శిక్షకః, మీమాంసకః.

ఇది రక్తాద్యర్థప్రకరణము.



చాతురర్థికప్రకరణము.

సూ.—తదస్మిన్నస్తీతి దేశేతన్నామ్ని—౪-౨-౬౭.

తదస్మిన్నస్తి- (అది దీనియందుఁ గలదు) అనునర్థంబునఁ బ్రథమాంతముకంటెఁ బరముగా నా ప్రత్యయాంతము సంజ్ఞగాఁగలదేశమును బోధించుచు అణ్ప్రత్యయంబగును. ఇది మతుప్ప్రత్యయంబున కపవాదంబు.

ఉదా:—ఉదుమ్బరాస్సన్త్యస్మిన్ దేశే = ఔదుమ్బరః- (దేశవిశేషము.)

సూ.—తేన నిర్వృత్తమ్—౪-౨-౬౮.

తేన నిర్వృత్తమ్ (వానిచే సిద్ధింపఁచేయఁబడినది) అనునర్థమునఁ దృతీయాంతముకంటెఁ బ్రత్యయాంతము సంజ్ఞగాఁ గలది దేశమగుచో అణ్ణగును.

ఉదా:—కుశామ్బేన నిర్వృత్తా నగరీ=కౌశామ్బీ.

సూ.—తస్య నివాసః—౪-౨-౬౯.

తస్య నివాసః (వానియొక్క నివాసము) అనునర్థంబున షష్ఠ్యంతముకంటెఁ బ్రత్యయాంతము సంజ్ఞగాఁగలది దేశమగుచో అణ్ణగును.

ఉదా:—శిబీనాం నివాసో దేశః=శైబః.

సూ.—అదూరభవశ్చ—౪-౨-౭౦.

అదూరభవః (దానికి సమీపమున నగునది) అనునర్థమున షష్ఠ్యంతముకంటెఁ బరముగాఁ బ్రత్యయాంతము సంజ్ఞగాఁగలది దేశమగుచో అణ్ణగును.

ఉదా:—విదిశాయాః అదూరభవం నగరమ్=వైదిశమ్.

సూ—జనపదే లుప్—౪-౨-౮౧.

జనపదము వాచ్యమగునపుడు చాతురర్థిక ప్రత్యయమునకు లుబన్తము దేశమునకు సంజ్ఞయగుచో లుప్పగును.

సూ—లుపి యుక్తవద్వ్యక్తివచనే—౧-౨-౫౧.

లుప్పు వచ్చినపుడు లిఙ్గముసంఖ్యయును బ్రకృతితోఁ దుల్యముగానుండును. యుక్తమనఁగాఁ బ్రకృతి, వచనమనఁగా సంఖ్యయని యెఱుంగునది.

ఉదా:—పఞ్చాలానాం నివాసః జనపదః = పఞ్చాలాః, కురవః, అఙ్గాః, వఙ్గాః, కలిఙ్గాః.

సూ.—వరణాదిభ్యశ్చ—౪-౨-౮౨.

వరణ-మున్నగు ప్రాతిపదికములకంటెఁ బరముగానున్న చాతురర్థిక ప్రత్యయమునకు లుప్పగును. జనపదము వాచ్యమగునపుడు లుప్పువచ్చుటకై యీసూత్ర మారంభింపఁబడినది.

ఉదా:—వరణానాం అదూరభవం నగరం=వరణాః.

సూ.—కుముదనడవేతసేభ్యో డ్మతుప్—౪-౨-౮౭.

కుముద-నడ-వేతస శబ్దములకంటెఁ బరముగా చాతురర్థికమగుడ్మతుప్ (మత్) ప్రత్యయమగును. తదస్మిన్నస్తి-తేన నిర్వృత్తమ్-తస్యనివాసః=అదూరభవః అనునాలుగర్థములుగల ప్రత్యయము చాతురర్థికము నాఁబడును.

సూ.—ఝయః—౮-౨-౧౦.

ఝయంతమగు ప్రాతిపదికముకంటెఁ బరమగు మతు ప్రత్యయముయొక్క మకారమునకు వకారాదేశమగును.

ఉదా:—కుముద+మత్ టిలోపము-మతప్వలోనిమకారమునకు వ కారము-కుముద్వాన్. నడ్వాన్.

సూ.—మాదుపధాయాశ్చ మతోర్వోఽయవాదిభ్యః—౮-౨-౯.

మకారముగాని అవర్ణముగాని యంతమునఁగల ప్రాతిపదికముకంటెను, మకారఅకారము లుపధగాఁగల ప్రాతిపదికములకంటెను బరమగుడ్మతుప్ మతుప్రత్యయములయొక్క మకారమునకు వకారమగును. యవ-మున్నగు ప్రాతిపదికములకంటెఁ బరమగుచోఁ గాదు.

ఉదా:—వేతస్వాన్—

సూ.—నడశాదాడ్డ్వలచ్—౪-౨-౮౮.

నడ-శాద అనునీ ప్రాతిపదికములకంటెఁ బరముగాఁ జాతురర్థికమగు డ్వలచ్(వల)అను ప్రత్యయమగును.

ఉదా:—నడ్వలః, శాద్వలః.

సూ.—శిఖాయా వలచ్—౪-౨-౮౯.

శిఖా-శబ్దముకంటెఁ బరముగాఁ జాతురర్థికమగువలచ్ (వల) ప్రత్యయమగును.

ఉదా:—శిఖావలమ్—

ఇది చాతురర్థికప్రకరణము.

---

శైషికప్రకరణము.

సూ.—శేషే—౪-౨-౯౨.

అపత్యార్థము మొదలుకొని చతురర్థీపర్యంతముగాక తక్కినయర్థము శేషమనఁబడును. అందు అణ్ణగును.

ఉదా:—చక్షుషా గృహ్యతే=చాక్షుషమ్+(రూపము) శ్రవణేన గృహ్యతే=శ్రావణః (శబ్దము) ఉపనిషద్భిః గృహ్యతే ఔపనిషదః (పురుషుఁడు). దృషది పిష్టాః=దార్షదాః-(సక్తువులు). చతుర్భిరుహ్యతే=చాతురమ్ (శకటము). ఉలూఖలే క్షుణ్ణః-ఔలూఖలః(లత్తుక) అశ్వైరుహ్యతే=ఆశ్వః(రథము). చతుర్దశ్యాం దృశ్యతే=చాతుర్దశమ్(రక్షస్సు). ఇది విధిసూత్రముచు "తస్య వికారః" అనునంతవఱకు నధికారసూత్రమును గూడ నగును. కానఁ జెప్పఁబోవు ఘ-మున్నగు ప్రత్యయములన్నియు శేషార్థమున నగునని యెఱుంగునది.

సూ — రాష్ట్రావారపారాద్ఘఖౌ — ౪-౨-౯3.

సప్తమ్యాదివిభక్త్యంతసమర్థములగు రాష్ట్ర-అవారపార అనుశబ్దములకంటెఁ బరముగా వరుసను ఘ-ఖ అను ప్రత్యయములు తత్ర జాతః-(అచ్చటఁబుట్టినవాఁడు) తత్ర భవః-(అక్కడ నుండునది) అనుమున్నగునర్థంబులందగును.

ఉదా:— రాష్ట్రే జాతః=రాష్ట్రియః.

ఇట్లే రాష్ట్రేభవః - అనుమున్నగు నర్థంబులందును రూపంబు నెఱుంగునది. అవారపారీణః

అవారపారాద్విగృహీతాదపి విపరీతాచ్చేతి వక్తవ్యమ్ —(వా)

అవారపార-పారావార అనునపుడును ఖ-ప్రత్యయం బగును.

ఉదా:— అవారీణః పారీణః, పారావారీణః ఇటఁ బ్రకృతివిశేషముకంటె ఘప్రత్యయము మొదలుకొని ట్యు-ట్యుల్ అనుప్రత్యయములవఱకుఁ జెప్పఁబడిన ప్రత్యయములకు జాతాద్యర్థవిశేషములును సమర్థవిభక్తులును మున్ముందుఁ జెప్పఁబడును.

సూ — గ్రామాద్యఖఞౌ — ౪-౨-౯౪.

గ్రామశబ్దముకంటెఁ బరముగా య-ఖఞ్(ఖ)అను ప్రత్యయములగును.

ఉదా:— గ్రామ్యః, గ్రామీణః.

సూ.—నద్యాదిభ్యో ఢక్—౪-౨-౯౭.

నదీ-మహీ వారాణసీ మున్నగుశబ్దములకంటెఁ బరముగా ఢక్(ఢ+)ప్రత్యయంబగును.

ఉదా:—నాదేయమ్, మాహేయమ్, వారాణసేయమ్.

సూ.—దక్షిణాపశ్చాత్పురసస్త్యక్—౪-౨-౯౮.

దక్షిణా - పశ్చాత్ - పురస్ అనునవ్యయంబులకంటెఁ బరముగా త్యక్+ (త్య) అను ప్రత్యయమగును.

ఉదా:—దాక్షిణాత్యః, పాశ్చాత్యః, పౌరస్త్యః.

సూ.—ద్యుప్రాగపా(వా)గుదక్ప్రతీచో యత్—౪-౨-౧౦౧.

దివ్-ప్రాక్-అపా(వా)క్-ఉదక్-ప్రత్యక్ అనుశబ్దములకంటెఁ బరముగా యత్-(య)అనుప్రత్యయమగును.

ఉదా:—దివ్యమ్, ప్రాచ్యమ్, అపా (వా) చ్యమ్, ఉదీచ్యమ్, ప్రతీచ్యమ్.

సూ.—అవ్యయాత్త్యప్—౪-౨-౧౦౪.

అమేహక్వతసిత్రేభ్య ఏవ—(వా)

అమా-ఇహ-క్వ అనునవ్యయంబులకంటెను తసిల్-త్రల్ ప్రత్యయాంతంబులకంటెను బరముగా త్యప్ (త్య) ప్రత్యయమగును.

ఉదా:—అమాత్యః, ఇహత్యః, క్వత్యః, తతస్త్యః, తత్రత్యః.

త్యబ్నేర్ధ్రువ ఇతి వక్తవ్యమ్—(వా)

ని-అనునట్టి యవ్యయముకంటెఁ బరముగా ధ్రువ రూపార్థమున త్యప్పగును.

ఉదా:—నిత్యః (స్థిరమగునది).

సూ.—వృద్ధిర్యస్యాచామాదిస్తద్వృద్ధమ్—౧-౧-౭౩.

ఏసముదాయముయొక్క యచ్చులలో మొదటియచ్చు వృద్ధిసంజ్ఞకమగునో యాసముదాయము వృద్ధమనఁబడును.

సూ. త్యదాదీని చ—౧-౧-౭౪.

త్యద్-మున్నగునవియును వృద్ధసంజ్ఞకంబులగును.

సూ.—వృద్ధాచ్ఛః—౪-౨-౧౧౪.

వృద్ధసంజ్ఞకములకంటెఁ బరముగా ఛ-అనుప్రత్యయము శైషికంబగును.

ఉదా:—శాలీయః, మాలీయః, తదీయః.

వా నామధేయస్య వృద్ధసంజ్ఞా వక్తవ్యా—(వా)

సంజ్ఞావాచకశబ్దమునకు వికల్పముగా వృద్ధసంజ్ఞయగును.
ఉదా:— దేవదత్తీయః దైవదత్తః.

సూ.—గహాదిభ్యశ్చ—౪-౨-౧౩౮.

గహ-మున్నగు ప్రాతిపదికములకంటెఁ బరముగా ఛ-ప్రత్యయమగును.

ఉదా:—గహీయః—

సూ.—యుష్మదస్మదోరన్యతరస్యాం ఖఞ్ చ—౪-3-౧.

యుష్మద్-అస్మద్ అనుశబ్దములకంటెఁ బరముగా ఖఞ్ (ఖ)-ఛఅనుప్రత్యయములు వికల్పముగనగును.

ఉదా:—యువయోః యుష్మాకం వా అయమ్=యుష్మదీయః అస్మదీయః.

సూ.—తస్మిన్నణి చ యుష్మాకాస్మాకౌ—౪-3-౨.

యుష్మద్-అస్మద్ అనుశబ్దములకు ఖఞ్గాని అణ్ణుగాని పరమగునపుడు వరుసగా యుష్మాక-అస్మాక అను నాదేశము లగును.

ఉదా:—యౌష్మాకీణః, ఆస్మాకీనః పక్షమున అణ్ణు-యౌష్మాకః, ఆస్మాకః.

సూ.—తవకమమకావేకవచనే—౪-3-3.

ఏకార్థవాచములగు యుష్మదస్మచ్ఛబ్దములకు ఖఞ్గాని, అణ్ణుగాని పరమగునపుడు తవక-మమక అనునాదేశములు వరుసగానగును.

ఉదా:—తావకీనః, మామకీనః, తావకః, మామకః.

యుష్మద్+ఛ అని యుండఁగా,

సూ.—ప్రత్యయోత్తరపదయోశ్చ—౭-౨-౯౮.

ప్రత్యయముగాని యుత్తరపదముగాని పరమగునపుడు ఏకార్థవాచకములగు యుష్మదస్మచ్ఛబ్దములయొక్కమపర్యంతమునకు త్వ-మ అనునాదేశములు క్రమముగానగును.

ఉదా:—త్వదీయః, మదీయః. తవపుత్రః-యుష్మద్ + పుత్రః త్వ+అద్+పుత్రః పరరూపచర్త్వములు=త్వాత్పుత్రః = మత్పుత్రః.

సూ.—మధ్యాన్మః—౪-3-౮.

మధ్యఅనుశబ్దముకంటె బరముగా మ-అను ప్రత్యయమగును.

ఉదా:—మధ్యమః—

సూ.—కాలాఠ్ఠఞ్—౪-3-౧౧.

కాలవాచకముకంటె బరముగా ఠఞ్(ఠ్)అను ప్రత్యయమగును.

ఉదా:—కాలికమ్, మాసికమ్-సాంవత్సరికమ్.

అవ్యయానాం భమాత్రే టిలోపః—(వా)

అవ్యయములకు భసంజ్ఞామాత్రమున టిలోపంబగును-

ఉదా:—సాయంప్రాతికః, పౌనఃపునికః.

సూ. ప్రావృష ఏణ్యః—౪-3-౧౭.

ప్రావృష్ అనుదానికంటె బరముగా ఏణ్యఅను ప్రత్యయమగును.

ఉదా:—ప్రావృషేణ్యః.

సూ.—సాయంచిరంప్రాహ్ణేప్రగేఽవ్యయేభ్యః ట్యుట్యులౌ తుట్చ—౪-3-౨3.

సాయ-చిర-ప్రాహ్ణ-ప్రగ అనుశబ్దములకంటెను, కాల వాచకములగు నవ్యయంబులకంటెను బరముగా ట్యు (యు), ట్యుల్ (యు) అనుప్రత్యయములగును. ఆప్రత్యయములకు తుట్ (త్) అనునాగమముగూడనగును.

"అనద్యతనే"అనునిర్దేశముచే 'యువోరనాకౌ' అను సూత్రముచే అన-అనునాదేశము వచ్చినపిమ్మట తుడాగమ మగును. సాయ-చిర శబ్దములకు మాంతత్వంబును, ప్రాహ్ణ-ప్రగ శబ్దములకు ఏదంతత్వమును ప్రత్యయసంనియోగమందు నిపతింపఁబడియె.

ఉదా:—సాయన్తనమ్ - చిరన్తనమ్- ప్రాహ్ణేతనమ్ - ప్రగేతనమ్ దోషాతనమ్.

సూ.—తత్ర జాతః—౪-3-౨౫.

సప్తమీసమర్థముకంటెఁ బరముగా తత్రజాతః=(అచ్చట పుట్టినది) అనునర్థమున చెప్పఁబడిన ఘమున్నగు ప్రత్యయములు చెప్పఁబోవు అణ్ణుమొదలగునవియు నగును.

ఉదా:—అణ్ణుస్రుఘ్నే జాతః = స్రౌఘ్నః. అణ్ణు ఉత్సే, జాతః=ఔత్సః. ఘప్రత్యయము. రాష్ట్రియః. ఖప్రత్యయంబు. అవారపారీణః మున్నగునవి.

సూ.—ప్రావృషష్ఠప్—౪-3-౨౬.

ప్రావృష్-అను ప్రాతిపదికముకంటెఁ బరముగా జాతార్థమున ఠప్ (ఠ్) అను ప్రత్యయమగును. ఏణ్యప్రత్యయమున కపవాదము.

ఉదా:—ప్రావృషి జాతః=ప్రావృషికః.

సూ.—ప్రాయభవః—౪-3-3౯.

తత్ర ప్రాయభవః(అచ్చట తఱచుగానుండునది) అను నర్థమున సప్తమీసమర్థముకంటెఁ బరముగా అణాదులగును.

ఉదా:—స్రుఘ్నే ప్రాయేణ (బాహుల్యేన) భవతి = స్రౌఘ్నః.

సూ.—సమ్భూతే—౪-3-౪౧.

సంభావనారూపార్థంబున సప్తమీసమర్థంబుకంటెఁ బరముగా అణాదులగును.

ఉదా:—స్రుఘ్నే సంభవతి=స్రౌఘ్నః.

సూ.—కోశాడ్ఢఞ్—౪-3-౪౨.

కోశశబ్దముకంటెఁ బరముగా ఢఞ్-(ఢ) అను ప్రత్యయమగును.

ఉదా:—కౌశేయమ్ (వస్త్రము.)

సూ.—తత్ర భవః—౪-3-౫3.

సప్తమీసమర్థముకంటెఁ బరముగా తత్రభవః=(అక్కడనుండునది) అనునర్థమున అణాదులగును.

ఉదా:—స్రుఘ్నే భవః=స్రౌఘ్నః, ఔత్సః, రాష్ట్రియః.

సూ.—దిగాదిభ్యో యత్—౪-3-౫౪.

దిశ్-మున్నగు ప్రాతిపదికములకంటెఁ బరముగాఁ బూర్వోక్తార్థంబున యత్ (య) అను ప్రత్యయమగును.

ఉదా:—దిశ్యమ్, వర్గ్యమ్.

సూ.—శరీరావయవాచ్చ—౪-3-౫౫.

శరీరావయవవాచకముకంటెఁ బరముగా నుక్తార్థమున యత్తగును.

ఉదా:—దన్త్యమ్. కణ్ఠ్యమ్.

అధ్యాత్మాదేష్ఠఞిష్యతే—(వా)

అధ్యాత్మమున్నగు ప్రాతిపదికములకంటెఁ బరముగా ఠఞ్ (ఠ్) అను ప్రత్యయమగును.

ఉదా:—అధ్యాత్మం భవమ్=ఆధ్యాత్మికమ్.

సూ.—అనుశతికాదీనాఞ్చ—౭-3-౨౦.

ఞిత్తుగాని ణిత్తుగాని కిత్తుగాని పరమగుచో అనుశతిక-మున్నగు ప్రాతిపదికములందుఁ బూర్వోత్తరపదములయొక్క-యాద్యచ్చులకు వృద్ధియగును. అనుశతికాది యాకృతిగణము.

ఉదా:—ఆధిదైవికమ్, ఆధిభౌతికమ్, ఐహలౌకికమ్, పారలౌకికమ్. అధ్యాత్మాదికం బాకృతిగణంబు.

సూ.—జిహ్వామూలాఙ్గులేశ్ఛః—౪-3-౬౨.

జిహ్వామూల-అఙ్గులీ శబ్దములకంటెఁ బరముగా భవార్థంబున ఛప్రత్యయంబగును.

ఉదా:—జిహ్వామూలీయమ్, అఙ్గులీయమ్.

సూ.—వర్గాన్తాచ్చ—౪-3-౬3.

వర్గశబ్దమంతంబునఁగల ప్రాతిపదికముకంటెఁ బరముగా భవార్థంబున ఛప్రత్యయంబగును.

ఉదా:—కవర్గీయమ్.

సూ.—తత ఆగతః—౪-3-౭౪.

తత ఆగతః=(అచ్చటనుండి వచ్చినది) అనునర్థంబునఁ బంచమీసమర్థముకంటెఁ బరముగా అణాదులగును.

ఉదా:—స్రుఘ్నాదాగతః=స్రౌఘ్నః.

సూ.—ఠగాయస్థానేభ్యః—౪-3-౭౫.

స్వామిగ్రాహ్యమగు భాగము ఆయమనంబడును. ఏ స్థానమునుండి యాయము గ్రహింపఁబడునో యది యాయస్థానము నాఁబడును. ఆయస్థానవాచకములకంటెఁ బరముగాఁ బూర్వోక్తార్థమున ఠక్కగును.

ఉదా:—శుల్కశాలాయాః ఆగతః=శౌల్కశాలికః.

సూ.—విద్యాయోనిసంబన్ధేభ్యో వుఞ్—౪-౩-౭౭.

విద్యాకృతసంబంధము గలదానినిగాని, యోనికృత సంబంధముగల దానినిగాని, బోధించు ప్రాతిపదికముకంటెఁ బరంబుగాఁ బూర్వోక్తార్థమున వుఞ్ (వ్) అనుప్రత్యయం బగును.

ఉదా:—ఔపాధ్యాయకః. పైతామహకః.

సూ.—హేతుమనుష్యేభ్యోఽన్యతరస్యాం రూప్యః—
౪-౩-౮౧.

హేతువాచకములకంటెను మనుష్యవాచకములకం టెను బరముగాఁ బూర్వోక్తార్థమున రూప్య-అనుప్రత్యయము వికల్పముగానగును.

ఉదా:—సమాదాగతమ్ = సమరూప్యమ్. విషమరూప్యమ్. ఈశబ్దంబులు గహాదిగణంబులోనివగుటచే పక్షంబున ఛప్రత్యయమగును. సమీయమ్, విషమీయమ్. దేవదత్త రూప్యమ్; దేవదత్తీయమ్; దైవదత్తమ్.

సూ.—మయట్చ—౪-౩-౮౨.

పూర్వోక్తప్రాతిపదికములకంటెఁ బరముగా నుక్తార్థమున మయట్ (మయ) అనుప్రత్యయముగూడ నగును

ఉదా:—సమమయమ్.విషమమయమ్. దేవదత్తమయమ్.

సూ.—ప్రభవతి—౪-3-౮3.

పంచమీసమర్థముకంటెఁ బరముగా తతః ప్రభవతి-(దాని నుండి ప్రకాశించుచున్నది.) అనునర్థంబున అణాదులగును.

ఉదా:—హిమవతః ప్రభవతి=హైమవతీ (గఙ్గ) అచ్చట ముందుగాఁ జూడఁబడినదని యర్థము.

సూ.—తద్గచ్ఛతి పథిదూతయోః—౪-3-౮౫.

తద్గచ్ఛతి (దానిని బొందుచున్నది) యనునర్థమున ద్వితీయాసమర్థముకంటెఁ బరముగా గమనకర్త మార్గముగాని దూతగాని యగుచో అణాదులగును.

ఉదా:—స్రుఘ్నం గచ్ఛతి=స్రౌఘ్నః (మార్గము- లేక- దూత)

సూ.—అభినిష్క్రామతి ద్వారమ్—౪-3-౮౬.

ద్వితీయాసమర్థముకంటెఁ బరముగా తత్ అభినిష్క్రామతి (దానికభిముఖముగా వెళ్లుచున్నది) అనునర్థమున అభిముఖనిష్క్రమణమున ద్వారముకర్తయగుచో అణాదులగును.

ఉదా:—స్రుఘ్నమభినిష్క్రామతి=స్రౌఘ్నమ్. (కాన్యకుబ్జద్వారము.)

సూ.—అధికృత్య కృతే గ్రన్థే—౪-3-౮౭.

తదధికృత్య కృతః గ్రన్థః-(దానిని బ్రస్తుతముగాఁ జేసి చేయఁబడినగ్రన్థము) అనునర్థమున ద్వితీయాసమర్థముకంటెఁ బరముగా అణాదులగును.

ఉదా:—కుత్సితం శరీరం శరీరకమ్ శరీరకసమ్బన్ధీ=శారీరకః (జీవాత్మ-) లేక శరీరసమ్బన్ధీ శారీరః - (జీవాత్మ) శారీర ఏవ = శారీరకః. శారీరకమధికృత్య (ప్రస్తుత్య) కృతో గ్రన్థః= శారీరకీయః. శారీరకమ్ భాష్యమ్ అనునది జీవాత్మకును భాష్యమునకును నభేదోపచారమువలన సాధువగునని యెఱుంగునది.

సూ.—సోఽస్య నివాసః—౪-3-౮౯.

సః అస్య నివాసః - (అది దీనికి యునికిపట్టు) అనునర్థంబునఁ బ్రథమాసమర్థముకంటెఁ బరముగా అణాదులగును.

ఉదా:—స్రుఘ్నో నివాసోఽస్య=స్రౌఘ్నః.

సూ.—తేన ప్రోక్తమ్—౪-3-౧౦౧.

తేన ప్రోక్తమ్-(వానిచే నతిశయముగాఁ జెప్పఁబడినది) అనునర్థమునఁ దృతీయాసమర్థముకంటెఁ బరముగా అణాదులగును.

ఉదా:—పాణినినా ప్రోక్తమ్=పాణినీయమ్ - (స్వరచితంబుగాని, యన్యకృతంబుగానియగు వ్యాకరణశాస్త్రమధ్యాపనముచేఁగాని యర్థవ్యాఖ్యానముచేఁగాని ప్రథమమునఁ బాణినిచేఁ బ్రకాశింపఁజేయఁబడినదని యర్థము.)

సూ.—తస్యేదమ్—౪-3-౧౨౦.

తస్య ఇదమ్ (ఇది వానిది) అనునర్థమున షష్ఠీసమర్థముకంటెఁ బరముగా నణాదులగును.

ఉదా:—ఉపగోరిదమ్=ఔపగవమ్.

ఇది శైషికప్రకరణము.

---

## ప్రాగ్దీవ్యతీయ ప్రకరణము.

### సూ.—తస్య వికారః—౪-3-౧3౪.

తస్య వికారః (దానియొక్క వికారము) అనునర్థమున షష్ఠీసమర్థముకంటెఁ బరముగా అణాదులగును.

### అశ్మనో వికారే టిలోపో వక్తవ్యః—(వా)

జాతినిబోధించు అశ్మన్-శబ్దమునకు వికారార్థకప్రత్యయము పరమగుచో టిలోపమగును.

ఉదా:—అశ్మనో వికారః=ఆశ్మః. భాస్మనః. మార్త్తికః.

### సూ.—అవయవే చ ప్రాణ్యోషధివృక్షేభ్యః—౪-3-౧3౫.

ప్రాణివాచకములకంటెను, ఓషధివాచకములకంటెను వృక్షవాచకములకంటెను బరముగా నవయవమును బోధించుచును, వికారమును బోధించుచును జెప్పఁబోవు ప్రత్యయములగును.

ఉదా:—మయూరస్యావయవో వికారో వా=మాయూరః. ఇట 'ప్రాణిరజతాదిభ్యోఞ్'అనుసూత్రముచేత అఞ్ (అ). మౌర్వమ్ (కట్టి-లేక-భస్మము) పైప్పలమ్. మూర్వయనఁగా నోషధి. పిప్పలమన (వృక్షవిశేషము).

సూ—మయడ్వైతయోర్భాషాయామభక్ష్యా
చ్ఛాదనయోః—౪-3-౧౪3.

లౌకికభాషయందు ప్రకృతిమాత్రముకంటెఁ బరముగా వికారావయవార్థములందు మయట్ (మయ) అను ప్రత్యయము వికల్పముగానగును. భక్ష్యముగాని యాచ్ఛాదనముగాని యర్థ మగుచోఁ గాదు.

ఉదా:—అశ్మమయమ్=ఆశ్మనమ్-ఇట అశ్మన్ శబ్దమునకు కల్మాషాంఘ్రి యనురాజునకు భార్యయగు మదయంతియందు వసిష్ఠునివలనఁబుట్టిన యశ్మకుఁడర్థముగాన "అశ్మనోవికారే" అనుదానిచే టిలోపముకాదని యెఱుంగునది. భక్ష్యాచ్ఛాద నములందు రాదనుటచే మౌద్గః(సూపము), కార్పాసమ్(ఆచ్ఛా దనము) అనుచో మయట్ ప్రత్యయములేదు. "బిల్వాదిభ్యో ఽణ్"అనుదానిచేత అణ్ణు.

సూ.—నిత్యం వృద్ధశరాదిభ్యః—౪-3-౧౪౪.

వృద్ధసంజ్ఞకప్రాతిపదికములకంటెను శర-మున్నగుప్రాతి పదికములకంటెను బూర్వోక్తార్థములందు మయట్ - ప్రత్య యము నిత్యముగానగును.

ఉదా:—ఆమ్రమయమ్. శరమయమ్.

సూ.—గోశ్చ పురీషే—౪-3-౧౪౫.

గోశబ్దముకంటెఁ బరముగాఁ బురీషరూపార్థమున మయ ట్టగును.

ఉదా:—గోమయమ్.

సూ.—గోపయసోర్యత్—౪-౩-౧౬౦.

గోశబ్దముకంటెను పయశ్శబ్దముకంటెను బరముగా వికారావయవార్థములందు యత్ (య) ప్రత్యయమగును.

ఉదా:—గవ్యమ్ పయస్యమ్.

ఇది ప్రాగ్దీవ్యతీయప్రకరణము.

ఠగధికారప్రకరణము.

సూ.—ప్రాగ్వహతేష్ఠక్—౪-౪-౧.

'తద్వహతి' అనుసూత్రమునకుఁ బూర్వ మీసూత్ర మందలి ఠక్-అనుపద మనువర్తించును.

సూ.—తేన దీవ్యతి ఖనతి జయతి జితమ్—౪-౪-౨.

తేన దీవ్యతి (దానిచే నాడుచున్నాఁడు), తేన ఖనతి-(దానిచే త్రవ్వుచున్నాఁడు), తేన జయతి (దానిచే జయించుచున్నాఁడు), తేన జితమ్ (దానిచే జయింపఁబడినది) అనునర్థములందు తృతీయాసమర్థముకంటెఁ బరముగా ఠక్ (ఠ్)అను ప్రత్యయమగును. దీవ్యతిమున్నగువానిలోఁ గాలపురుషసంఖ్యలు వివక్షితములుగావు.

ఉదా:—అక్షైః దీవ్యతి జయతి జితో వా=ఆక్షికః. అభ్ర్యాఖనతి=ఆభ్రికః. ఇట్లే అక్షైః అదేవీత్ దేవిష్యతి దీవ్యసి

దీవ్యన్తి వా=ఆక్షికః. అనుమున్నగు చోటను రూపం బెఱుంగు నది.

సూ.—సంస్కృతమ్—౪-౪-3.

తేన సంస్కృతమ్ (దానిచేత సంస్కరింపఁబడినది) అను నర్థంబునఁ దృతీయాసమర్థముకంటెఁ బరముగా ఠగాదులగును.

ఉదా:—దధ్నా సంస్కృతమ్=దాధికమ్, మారీచికమ్.

సూ.—తరతి—౪-౪-౫.

తేన తరతి (దానిచే దాఁటుచున్నాఁడు) అనునర్థమునఁ దృతీయాసమర్థముకంటెఁ బరముగా ఠగాదులగును.

ఉదా:—ఉడుపేన తరతి=ఔడుపికః.

సూ.—చరతి—౪.౪-౮.

తేన చరతి (దానిచేత వెళ్లుచున్నాఁడు, భక్షించుచున్నాఁడు) అనునర్థమునఁ దృతీయాసమర్థముకంటెఁ బరముగా ఠగాదులగును.

ఉదా:—హస్తినా చరతి (గచ్ఛతి)=హాస్తికః. దధ్నా చరతి (భక్షయతి)=దాధికః.

సూ.—సంసృష్టే—౪-౪-౨౨.

తేన సంసృష్టమ్ (దానితోఁ గలుపఁబడినది) అనునర్థంబునఁ దృతీయాసమర్థముకంటెఁ బరముగా ఠగాదులగును.

ఉదా:—దధ్నా సంసృష్టమ్=దాధికమ్.

సూ.—ఉఞ్ఛతి—౪-౪-౩౨.

తత్ ఉఞ్ఛతి (దాని నొక్కొక్కగింజవంతున నేరికొని తినుచున్నది) అనునర్థంబున ద్వితీయాసమర్థముకంటెఁ బరముగా ఠక్కగును.

ఉదా:—బదరాణ్యుఞ్ఛతి=బాదరికః.

సూ.—రక్షతి—౪-౪-౩౩.

తత్ రక్షతి (దానిని గాపాడుచున్నాఁడు.) అనునర్థమున ద్వితీయాసమర్థముకంటెఁ బరముగా ఠక్కగును.

ఉదా:—సమాజం రక్షతి=సామాజికః.

సూ.—శబ్దదర్దురం కరోతి—౪-౪-౩౪.

శబ్దం కరోతి (శబ్దమును వ్యుత్పాదించుచున్నాఁడు), దర్దురం కరోతి (వాద్యభాండవిశేషమును జేయుచున్నాఁడు.) అనునర్థమున ద్వితీయాసమర్థములగు శబ్దదర్దురశబ్దములకంటెఁ బరముగా ఠక్కగును.

ఉదా:—శబ్దం కరోతి = శాబ్దికః (వైయాకరణుఁడు), దర్దురం కరోతి=దార్దురికః (కులాలుఁడు).

సూ.—ధర్మం చరతి—౪-౪-౪౧.

అధర్మాచ్చేతి వక్తవ్యమ్—(వా)

ధర్మం చరతి (ధర్మమును జేయుచున్నాఁడు), అధర్మం చరతి-(అధర్మమును జేయుచున్నాఁడు) అనునర్థములందు ద్వితీ

యాసమర్థములగు ధర్మ-అధర్మ శబ్దములకంటెఁ బరముగా ఠక్కగును.

ఉదా:—ధర్మం చరతి = ధార్మికః. అధర్మం చరతి - ఆధర్మికః.

సూ.—శిల్పమ్—౪-౪-౫౫.

తదస్య శిల్పమ్ (అది వీనికిఁ గౌశలము) అనునర్థంబునఁ బ్రథమాసమర్థముకంటెఁబరముగా ఠక్కుమున్నగునవియగును.

ఉదా:—మృదఙ్గవాదనం శిల్పమస్య=మార్దఙ్గికః. ఇట మృదంగశబ్దము మృదంగవాదన విషయకమున లాక్షణికము.

సూ.—ప్రహరణమ్—౪-౪-౫౭.

తదస్య ప్రహరణమ్ (అది వీనికి నాయుధము) అనునర్థమునఁ బ్రథమాసమర్థముకంటెఁ బరముగా ఠగాదులగును.

ఉదా:—అసిః ప్రహరణమస్య=ఆసికః. ధనుః ప్రహరణమస్య=ధానుష్కః.

సూ.—శీలమ్—౪-౪-౬౧.

తదస్య శీలమ్ (అది వీనిస్వభావము) అనునర్థమునఁ బ్రథమాసమర్థముకంటెఁ బరముగా ఠగాదులగును.

ఉదా:—అపూపభక్షణం శీలమస్య=ఆపూపికః.

సూ.—నికటే వసతి—౪-౪-౭౩.

నికటే వసతి (సమీపమున నివసించుచున్నాఁడు) అను నర్థంబున సప్తమీసమర్థమగు నికటశబ్దముకంటెఁ బరముగా ఠక్కగును.

ఉదా:—నికటే వసతి=నైకటికః (భిక్షుకుఁడు).

ఇది ఠగధికారప్రకరణము.

---

ప్రాగ్ఘితీయప్రకరణము.

సూ.—ప్రాగ్ఘితాద్యత్—౪-౪-౭౫.

తస్మై హితమ్ అను సూత్రమునకుఁ బూర్వము యత్, (య) అనునది యనువర్తించును.

సూ.—తద్వహతి రథయుగప్రాసఙ్గమ్—౪-౪-౭౬.

తత్ వహతి (దానిని వహించుచున్నది) అనునర్థంబున ద్వితీయాసమర్థములగు రథ - యుగ - ప్రాసఙ్గశబ్దములకంటెఁ బరముగా యత్ (య) అను ప్రత్యయంబగును.

ఉదా:—రథం వహతి=రథ్యః, యుగ్యః, ప్రాసఙ్గ్యః.

సూ.—ధురో యడ్ఢకౌ—౪-౪-౭౭.

ధుర్-అనుదానికంటెఁ బరముగా యత్ప్రత్యయమును, ఢక్ (ఢ)అను ప్రత్యయమునగును.

ఉదా:—ధురం వహతి=ధుర్యః; ధౌరేయః.

**సూ.—నౌవయోధర్మవిషమూలమూలసీతాతులాభ్యస్తార్య తుల్యప్రాప్యవధ్యానామ్యసమసమితసమ్మితేషు—౪-౪-౯౧.**

తృతీయాసమర్థములగు నౌ-వయస్-ధర్మ-విష-మూల-మూల - సీతా-తులా శబ్దములకంటెఁ బరముగా వరుసను తార్యమ్ (దాఁటశక్యమగునది) తుల్యమ్ (సదృశమగునది)-ప్రాప్యమ్ (పొందఁదగినది.) వధ్యమ్ (వధార్హమగునది)ఆనామ్యమ్ (అభిభవనీయము.) (వస్తువును విక్రయింపఁగా వచ్చిన లాభము)-సమమ్ (సమమగునది) సమితమ్ (చదును చేయఁబడినది) సమ్మితమ్ (పరిచ్ఛిన్నము) అనునర్థములందు యత్ప్రత్యయం బగును.

ఉదా:—నావా తార్యమ్=నావ్యమ్ (జలము), వయసా తుల్యః=వయస్యః (మిత్రుఁడు), ధర్మేణ ప్రాప్యమ్ = ధర్మ్యమ్ (శ్రేయస్సు), విషేణ వధ్యః = విష్యః (శత్రువు), మూలేన ఆనామ్యమ్=మూల్యమ్. మూలమనఁగా నిటవర్తకులచే వస్తువులుకొనునపు డుపయోగించు ద్రవ్యమని యర్థము. ఆనామ్యమనఁగా వర్తకులు తిరిగి విక్రయింపఁగా వచ్చినలాభము. అదియే మూల్యమనఁబడును ఈసూత్రమున'సంజ్ఞాయామ్'అని యనువర్తించును గాన లోకంబున లాభసహితమునే మూల్యమనివాడుట నిరూఢలక్షణ చేనని యెఱుంగునది. మూలేన సమః=మూల్యః. సీతయా సమితమ్ = సీత్యమ్. (క్షేత్రము). తులయా సమ్మితమ్=తుల్యమ్ ఇది రూఢిశబ్దముగాన సదృశమాత్రమున వ్యవహరింపఁబడుచున్నది.

సూ.—తత్ర సాధుః—౪-౪-౯౮.

తత్ర సాధుః (దానియందుఁ బ్రవీణుఁడు లేక యోగ్యుఁడు) అనునర్థమున సప్తమీసమర్థముకంటెఁ బరముగా యత్ప్రత్యయంబగును.

ఉదా:—అగ్రే సాధుః = అగ్ర్యః, సామసు సాధుః = సామన్యః, యే 'చాభావకర్మణోః' అనుసూత్రముచేఁ బ్రకృతిభావంబు. కర్మణ్యః, శరణ్యః.

సూ.—సభాయా యః—౪-౪-౧౦౫.

సాధువు అనునర్థంబున సప్తమీసమర్థమగు సభాశబ్దముకంటె య-అను ప్రత్యయంబగును.

ఉదా:—సభాయాం సాధుః=సభ్యః. ఇది యత్ప్రత్యయావధి.

ఇది ప్రాగ్ఘితీయప్రకరణము.

---

ఛయద్విధిప్రకరణము.

సూ.—ప్రాక్క్రీతాచ్ఛః—౫-౧-౧.

తేన క్రీతమ్ అనుసూత్రమునకుఁ బూర్వము ఛః-అనుపద మనువర్తించును.

సూ.—ఉగవాదిభ్యో యత్—౫-౧-౨.

"తేన క్రీతమ్" అనుదానివఱకుఁ జెప్పఁబడిన యర్థంబులందు ఉవర్ణాంతప్రాతిపదికములకంటెను, గో-మున్నగుప్రాతి

పదికములకంటెను బరముగా యత్ (య)అను ప్రత్యయం బగును. ఛప్రత్యయంబున కపవాదంబు "తస్మై హితమ్" అను సూత్రముచేత వక్ష్యమాణంబు యత్ప్రత్యయము.

ఉదా:—శఙ్కవే హితం=శఙ్కవ్యం (దారువు.) గవే హితమ్=గవ్యమ్.

నాభి నభం చ—(గ-సూ)

నాభిశబ్దమునకు నభ-యనునాదేశము గూడనగును.

ఉదా:—నభ్యోఽక్షః, నభ్యమఞ్జనమ్.

సూ—తస్మై హితమ్—౫-౧-౫.

"తస్మై హితమ్"(దానికొఱకు హితమైనది) అను నర్థమునఁ జతుర్థీసమర్థముకంటెఁ బరముగా ఛ-యత్ అను ప్రత్యయము లగును.

ఉదా:—వత్సేభ్యో హితః = వత్సీయః (పాలుపితుకువాఁడు.)

సూ.—శరీరావయవాద్యత్—౫-౧-౬.

శరీరావయవవాచకముకంటెఁ బరముగా యత్తగును.

ఉదా:—దన్త్యమ్, కణ్ఠ్యమ్, నస్యమ్.

సూ.—ఆత్మన్విశ్వజనభోగోత్తరపదాత్ఖః—౫-౧-౯.

ఆత్మన్‌శబ్దముకంటెను, విశ్వజనశబ్దముకంటెను, భోగశబ్ద ముత్తరపదముగాఁగలదానికంటెను బరముగా -ఖ- అను ప్రత్యయ మగును.

సూ.—ఆత్మాధ్వానౌ ఖే—౬-౪-౧౬౯.

ఆత్మన్-అధ్వన్ శబ్దములు ఖప్రత్యయము పరమగుచోఁ బ్రకృతిభావంబు నొందును. (టిలోపంబు రాదనుట)

ఉదా:—ఆత్మనే హితమ్=ఆత్మనీనమ్. (విశ్వేశ్చాసౌ జనశ్చ=విశ్వజనః)—విశ్వజనాయ హితమ్=విశ్వజనీనమ్. మాతృభోగీణః.

ఇది ఛయద్విధిప్రకరణము.



ఆర్హీయప్రకరణము.

సూ.—ప్రాగ్వతేష్ఠఞ్—౫-౧-౧౮.

తేన తుల్యమ్ అనుసూత్రమువఱకు ఠఞ్ - అనునది యనువర్తించును.

సూ.—తేన క్రీతమ్—౫-౧-౩౭.

"తేన క్రీతమ్" (దానిచేఁ గొనఁబడినది) అనునర్థంబునఁ దృతీయాసమర్థముకంటెఁ బరముగా ఠఞ్ మున్నగు ప్రత్యయము లగును.

ఉదా:—సప్తత్యా క్రీతమ్=సాప్తతికమ్. ప్రాస్థికమ్.

సూ.—తస్యేశ్వరః—౫-౧-౪౨

సూ.—తత్ర విదిత ఇతి చ—౫-౧-౪౩.

తస్యేశ్వరః - (దానికిఁ బ్రభువు,) తత్ర విదితః (దానియందుఁ దెలియఁబడినవాఁడు) అనునర్థములందు షష్ఠీసమర్థము

లును, సప్తమీసమర్థములునునగు సర్వభూమి-పృథివీ శబ్దముల కంటెఁ బరముగా అణ్-అఞ్ అను ప్రత్యయములు వరుసగ నగును. అనుశతికాదీనాఞ్చ అనుసూత్రముచే నుభయపదవృద్ధి.

ఉదా:—సర్వభూమేరీశ్వరః సర్వభూమౌవిదితో వా = సార్వభౌమః. పృథివ్యాః ఈశ్వరః - పృథివ్యాం విదితోవా= పార్థివః.

**సూ.—పఙ్క్తి-వింశతి త్రింశచ్చత్వారింశత్పంచాశత్షష్టి సప్తత్యశీతినవతిశతమ్—౫-౧-౫౯.**

"తదస్య పరిమాణమ్" (అది దీనికిఁ బరిమాణము)అను నర్థంబున నీరూఢిశబ్దంబులు నిపతింపఁబడియె పఞ్చన్శబ్దమునకు టిలోపము, తి-అనుప్రత్యయమును, గుత్వమును నిపతింపఁ బడియె.

ఉదా:—పఞ్చ పరిమాణమస్య=పఙ్క్తిః.

ద్విదశత్ అనుశబ్దమునకు విం-అనునాదేశమును, శతి - అనుప్రత్యయమును నిపతింపఁబడియె.

ఉదా:—ద్వౌ దశతౌ పరిమాణమస్య=వింశతిః త్రిద శత్+(త్రింశత్) త్రయోదశతః పరిమాణమస్య = త్రింశత్. చతుర్దశత్+(చత్వారింశత్) చత్వారః దశతః పరిమాణమస్య= చత్వారింశత్. పఞ్చదశత్ (పఞ్చా-శత్) పఞ్చ దశతః పరిమా మస్య=పఞ్చాశత్. షడ్దశత్+(షష్-తి) షట్ దశతః పరిమాణ మస్య=షష్టిః. సప్తదశత్-(సప్త-తి) సప్తదశతః పరిమాణమస్య= సప్తతిః. అష్టాదశత్-(అశీ-తి) అష్టౌ దశతః పరిమాణమస్య =

అశీతిః నవదశత్(నవ-తి) నవ దశతః పరిమాణమస్య=నవతిః. దశదశత్+(శ-త) దశ దశతః పరిమాణమస్య=శతమ్.

సూ—తదర్హతి—౫-౧-౬౩.

"తత్ అర్హతి" (దానిని బొందుటకు యోగ్యమైనది) అనునర్థమున ద్వితీయానసమర్థముకంటెఁ బరముగా ఠఞాదు లగును.

ఉదా:—ప్రస్థమర్హతి=ప్రాస్థికః.

సూ.—దణ్డాదిభ్యో యత్—౫-౧-౬౬.

దణ్డమున్నగు ప్రాతిపదికములకంటెఁ బరముగా నుక్తార్థమున యత్తగును.

ఉదా:—దణ్డమర్హతి=దణ్డ్యః+అర్ఘ్యః+వధ్యః.

సూ—తేన నిర్వృత్తమ్—౫-౧-౭౯.

"తేన నిర్వృత్తమ్"(దానిచే సిద్ధింపఁ జేయఁబడినది) అనునర్థమునఁ గరణభూతకాలమును బోధించు తృతీయాసమర్థముకంటెఁ బరముగా ఠఞగును.

ఉదా:—అహ్నా నిర్వృత్తమ్+(నిష్పాదితమ్) ఆహ్నికమ్.

ఇది ఆర్హీయప్రకరణము.

నఞ్ స్నఞధికారప్రకరణము.

సూ.—తేన తుల్యం క్రియా చేద్వతిః—౫-౧-౧౧౫.

"తేన తుల్యమ్ (దానితో సదృశము) అనునర్థమున సమానమగునది క్రియయగుచోఁ దృతీయాసమర్థముకంటెఁ బరముగా వతి(వత్) అనుప్రత్యయమగును.

ఉదా:—బ్రాహ్మణేన తుల్యమ్=బ్రాహ్మణవత్. (అధీతే) తుల్యమగునది క్రియయనుటచే గుణతుల్యమున కాదు. పుత్రేణ తుల్యః-స్థూలః.

సూ.—తత్ర తస్యేవ—౫-౧-౧౧౬.

సప్తమీసమర్థముకంటెను షష్ఠీసమర్థముకంటెను బరముగా ఇవార్థంబున వతిప్రత్యయమగును.

ఉదా:—మథురాయామివ=మథురావత్ (స్రుఘ్నే ప్రాకారః.) చైత్రస్యేవ=చైత్రవత్ (మైత్రస్య గావః).

సూ.—తస్య భావస్త్వతలౌ—౫-౧-౧౧౯.

షష్ఠీసమర్థముకంటెఁ బరముగా భావంబున త్వ-తల్-(త)అను ప్రత్యయములగును.

ప్రకృతిజన్యబోధంబునఁ బ్రకారంబగునది భావం బనఁబడును.

త్వష్యఞౌ తద్ధితౌ—(లిం—౧౨౧.)

త్వప్రత్యయాంతము ష్యఞ్ప్రత్యయాంతమును నపుంసకంబులగును.

ఉదా:—గోర్భావః=గోత్వమ్, గోతా.

సూ.—ఆ చ త్వాత్—౫-౧-౧౨౦.

"బ్రహ్మణ స్త్వః" అనుసూత్రమువఱకు త్వ-తల్ అనునవి యనువర్తించును. చెప్పఁబోవు నపవాదప్రత్యయంబులతో సమావేశముకొఱకై యీయధికారము. నఞ్స్నఞ్ప్రత్యయంబులతో సమావేశముకొఱకై చకారము సూత్రమున గ్రహింపఁబడినది.

ఉదా:—స్త్రియా భావః = స్త్రైణమ్, స్త్రీత్వమ్, స్త్రీతా. పౌంస్నమ్, పుంస్త్వమ్, పుంస్తా.

సూ.—పృథ్వాదిభ్య ఇమనిజ్వా—౫-౧-౧౨౨.

పృథుమున్నగుప్రాతిపదికములకంటెఁ బరముగా భావార్థంబున ఇమనిచ్ (ఇమన్) అనుప్రత్యయము వికల్పముగా నగును. వాగ్రహణం బణాది సమావేశార్థంబు.

సూ.—ర ఋతో హలాదేర్లఘోః—౬-౪-౧౬౧.

హలాదియగునంగముయొక్క లఘువగుఋకారమునకు ఇష్ఠన్-ఇమనిచ్-ఈయస్ అనుప్రత్యయములు పరమగునపుడు ర-అనునాదేశమగును.

సూ.—టేః—౬-౪-౧౫౫.

భసంజ్ఞకముయొక్క టిసంజ్ఞకంబునకు ఇష్ఠన్-ఇమనిచ్-ఈయస్ ప్రత్యయములు పరమగుచో లోపమగును. పృథు - మృదు - భృశ-కృశ - దృఢ-పరివృఢ అనునీయాఱుశబ్దములకే రభావంబగును.

ఉదా:—పృథోర్భావః = ప్రథిమా; పార్థవమ్. మృదోః భావః=మ్రదిమా; మార్దవమ్.

సూ.—వర్ణదృఢాదిభ్యః ష్యఞ్ చ—౫-౧-౧౨౩.

వర్ణవాచకములకంటెను దృఢమున్నగుప్రాతిపదికములకంటెను బరముగా భావార్థంబున ష్యఞ్ (య) అనుప్రత్యయమును, ఇమనిచ్చును గూడనగును.

ఉదా:—శుక్లస్య భావః=శౌక్ల్యమ్; శుక్లిమా. దార్ఢ్యమ్; ద్రఢిమా.

సూ.—గుణవచనబ్రాహ్మణాదిభ్యః కర్మణి చ—౫-౧-౧౨౪.

తస్య కర్మ (వానియొక్క క్రియ (లేక) కార్యము) అనునర్థమునను, భావార్థమునను, గుణవచనములకంటెను బ్రాహ్మణమున్నగు ప్రాతిపదికములకంటెను బరముగా ష్యఞ్ఞగును.

ఉదా:—జడస్య కర్మ భావో వా=జాడ్యమ్. మూఢస్య కర్మ భావో వా=మౌఢ్యమ్. బ్రాహ్మణ్యమ్. బ్రాహ్మణాది యాకృతిగణంబు.

సూ.—సఖ్యుర్యః—౪-౧-౧౨౬.

సఖిశబ్దముకంటె బరముగా భావార్థమందును గర్మార్థమందును య-అను ప్రత్యయ మగును.

ఉదా:—సఖ్యుః భావః కర్మ వా=సఖ్యమ్.

సూ.—కపిజ్ఞాత్యోర్ఢక్—౪-౧-౧౨౭.

కపి-జ్ఞాతి శబ్దములకంటె బరముగా భావకర్మార్థంబులందు ఢక్ (ఢ) అను ప్రత్యయంబగును.

ఉదా:—కాపేయమ్, జ్ఞాతేయమ్.

సూ.—పత్యన్తపురోహితాదిభ్యో యక్—౪.౧-౧౨౮.

పతిశబ్దాంతప్రాతిపదికములకంటెను పురోహితమున్నగు ప్రాతిపదికములకంటెను బరముగా భావకర్మార్థంబులందు యక్ (య) అను ప్రత్యయమగును.

ఉదా:—సైనాపత్యమ్-పౌరోహిత్యమ్.

ఇది నఞ్ స్నఞధికారప్రకరణము.



పాఞ్చమికప్రకరణము.

సూ.—ధాన్యానామ్భవనే క్షేత్రే ఖఞ్—౪-౨-౧.

షష్ఠీసమర్థమగు ధాన్యవాచకముకంటె బరముగా ధాన్యోత్పత్తిస్థానమగు క్షేత్రమునుబోధించుచు ఖఞ్ (ఖ) అనుప్రత్యయంబగును.

ఉదా:—భవ న్త్యస్మిన్నితి=భవనమ్. దీనియందుఁ బుట్టు చున్నవిగాన భవనమనంబడును. ముద్గానాం భవనం క్షేత్రమ్= మౌద్గీనమ్.

సూ.—వ్రీహిశాల్యోర్ఢక్—౫-౨-౨.

వ్రీహి-శాలి శబ్దములకంటెఁ బరముగాఁ బూర్వోక్తార్థంబు నందు ఢక్ (ఢ) అను ప్రత్యయంబగును.

ఉదా:—వ్రైహేయమ్, శాలేయమ్.

సూ.—హైయఙ్గవీనం సంజ్ఞాయామ్—౫-౨-౨౩.

హ్యో గోదోహశబ్దముకంటెఁ బరముగా సంజ్ఞయగు నపుడు వికారార్థంబున ఖఞ్ (ఖ) అను ప్రత్యయము బ్రకృతికి హియఙ్గు-అనునాదేశంబును నిపతింపఁబడిరెను.

ఉదా:—దుహ్యత ఇతి=దోహః-పితుకఁబడునది దోహ మనంబడును. (క్షీరము) గోర్దోహః=గోదోహః - (ఆవుపాలు). హ్యః గోదోహః=హ్యోగోదోహః-'సుప్సుపా' అనుసూత్రముచే సమాసము. (నిన్న పితుకఁబడిన యావుపాలు)—హ్యోగోదోహస్య వికారః-హైయఙ్గవీనమ్. (నవనీతము.)

సూ.—తదస్య సఞ్జాతం తారకాదిభ్య ఇతచ్—౫-౨-౩౬.

ప్రథమాసమర్థములగు తారక-మున్నగు ప్రాతిపదికముల కంటెఁ బరముగా 'తదస్య సఞ్జాతమ్' (అది దీనికిఁ గలిగినది) అనునర్థంబున ఇతచ్ (ఇత) అను ప్రత్యయంబగును.

ఉదా:—తారకా స్సఞ్జాతా అస్య=తారకితమ్ (ఆక సము) పణ్డా సఞ్జాతా అస్య = పణ్డితః (విద్వాంసుఁడు). ఇది యాకృతిగణంబు.

సూ.—ప్రమాణే ద్వయసజ్దఘ్నఞ్మాత్రచః—౫-౨-౩౭.

తదస్య ప్రమాణమ్ (అది దీనికిఁ బ్రమాణము) అను నర్థంబునఁ బ్రథమాసమర్థముకంటెఁ బరముగా ద్వయసచ్ (ద్వయస)-దఘ్నచ్ (దఘ్న)-మాత్రచ్ - (మాత్ర)-అనుప్రత్యయంబులగును.

ఉదా:—ఊరూ ప్రమాణమస్య=ఊరుద్వయసమ్, ఊరుదఘ్నమ్, ఊరుమాత్రమ్.

సూ.—యత్తదేతేభ్యః పరిమాణే వతుప్—౫-౨-౩౯.

యద్-తద్-ఏతద్-అనుశబ్దములకంటెఁ బరముగాఁ బరిమాణార్థమందు వతుప్ (వత్) అనుప్రత్యయమగును.

ఉదా:—యత్పరిమాణమస్య .యావాన్, తావాన్, ఏతావాన్.

సూ.—సంఖ్యాయా అవయవే తయప్—౫-౨-౪౨.

"సోస్యావయవః" (అది దీని కవయవము) అనునర్థంబునఁ బ్రథమాసమర్థమగు అవయవార్థకసంఖ్యావాచకశబ్దముకంటెఁ బరముగా తయప్ (తయ) అనుప్రత్యయంబగును.

ఉదా:—పఞ్చావయవా అస్య=పఞ్చతయమ్.

సూ.—ద్విత్రిభ్యాం తయస్యాయజ్వా—౫-౨-౪౩.

ద్వి-త్రి శబ్దములకంటెఁబరమగు తయప్ప్రత్యయము నకు వికల్పముగా అయచ్-(అయ) అనునాదేశమగును.

ఉదా:—ద్వయమ్, ద్వితయమ్. త్రయమ్ త్రితయమ్.

సూ.—ఉభాదుదాత్తో నిత్యమ్—౫-౨-౪౪.

ఉభ-శబ్దముకంటెఁ బరమైయవయవార్థమున అయచ్-(అయ) అనుప్రత్యయం బాద్యుదాత్తంబగుచు నిత్యముగా నగును.

ఉదా:—ఉభౌ అవయవౌ అస్య=ఉభయమ్.

ఇది పాఞ్చమికప్రకరణము.

---

మత్వర్థీయప్రకరణము.

సూ.—తస్య పూరణే డట్—౫-౨-౪౮.

"తస్య పూరణసాధనమ్" (వానియొక్క పూర్తికి సాధనమగునది) అనునర్థమునందు షష్ఠీసమర్థమగు సంఖ్యా వాచకముకంటెఁ బరముగా డట్ (అ) అనుప్రత్యయమగును.

ఉదా:—ఏకాదశానాం పూరణః=ఏకాదశః.

సూ.—నాన్తాదసంఖ్యాదేర్మట్—౫-౨-౪౯.

సంఖ్యావాచకము పూర్వమునలేని నకారాంతసంఖ్యా వాచకశబ్దముకంటెఁ బరమగుడట్టునకు మట్ (మ్) అను నాగమమగును.

ఉదా:—పఞ్చానాం పూరణః=పఞ్చమః.

సూ.—తి వింశతేర్డితి—౬-౪-౧౪౨.

భసంజ్ఞకమగు వింశతిశబ్దముయొక్క తి-శబ్దమునకు డిత్తుపరమగుచో లోపమగును—"నాన్తాత్" అనుటచే మడాగమంబురాదు.

ఉదా:—వింశానాం పూరణః=వింశః. "అసంఖ్యాదేః" అనుటచే ఏకాదశః=అనుచో మడాగమంబులేదు.

సూ.—షట్కతికతిపయచతురాం థుక్—౫-౨-౫౧.

షష్-కతి-కతిపయ-చతుర్ శబ్దములకు డట్టు పరమగుచో థుక్. (థ్) అనునాగమమగును.

ఉదా:—షణ్ణాం పూరణః=షష్ఠః. కతిథః కతిపయశబ్దము సంఖ్యావాచకముగాకున్నను థుగాగమవిధానసామర్థ్యముచే డట్టగును. కతిపయథః, చతుర్థః.

సూ.—ద్వేస్తీయః—౫-౨-౫౪.

ద్విశబ్దముకంటెఁ బరముగాఁ బూరణార్థమున తీయ-అనుప్రత్యయంబగును. డట్టునకపవాదంబు.

ఉదా:—ద్వయోః పూరణః=ద్వితీయః.

సూ.—త్రేస్సమ్ప్రసారణం చ—౫-౨-౫౫.

త్రిశబ్దంబునకు సంప్రసారణంబుగూడనగును

ఉదా:—తృతీయః-

సూ.—శ్రోత్రియంశ్ఛన్దోఽధీతే—౫-౨-౮౪.

"ఛన్దః అధీతే" (ఛన్దస్సును జదువును) అనునర్థంబున శ్రోత్రియన్ (శ్రోత్రియ) అని గాని ఛన్దస్-అనుశబ్దమునకు శ్రోత్రి-అనునాదేశమును ఘన్-(ఘ)అను ప్రత్యయమునుగాని నిపతింపఁబడియె—ఛన్దోఽధీతే=శ్రోత్రియః. ఇట వా అనునది యనువర్తించుటచేఁ బక్షమున ఛాన్దసః-అనియు రూపంబగును.

సూ.—పూర్వాదినిః—౫-౨-౮౬.

"పూర్వం కృతమ్" (ముందుగా వీనిచేఁ జేయఁబడినది) అనునర్థంబున ద్వితీయాసమర్థంబును గ్రియావిశేషణమునగు పూర్వశబ్దముకంటెఁ బరముగా ఇని (ఇన్) ప్రత్యయమగును.

ఉదా:—పూర్వం కృతమనేన=పూర్వీ.

సూ.—సపూర్వాచ్చ—౫-౨-౮౭.

పూర్వోక్తార్థమున విద్యమానపూర్వమగు పూర్వశబ్దముకంటెఁ బరంబుగా ఇని-ప్రత్యయమగును.

ఉదా:—కృతపూర్వీ.

సూ.—ఇష్టాదిభ్యశ్చ—౫-౨-౮౮.

ఇష్టమున్నగు ప్రాతిపదికములకంటెఁ బరముగా ఇష్టమనేన (వీనిచే యాగముచేయఁబడినది) అనుమున్నగునర్థములందు ఇని ప్రత్యయంబగును.

ఉదా:—ఇష్టమనేన=ఇష్టీ. అధీతమనేన= అధీతీ.

సూ.—తదస్యాస్త్యస్మిన్నితి మతుప్—౫-౨-౯౪.

"తదస్యాస్తి" (అది దీనికిఁగలదు) అనునర్థమునఁగాని, "తదస్మిన్నస్తి" (అది దీనియందుఁగలదు) అనునర్థమునఁగాని ప్రథమాసమర్థముకంటెఁ బరముగా మతుప్ (మత్) అను ప్రత్యయంబగును.

ఉదా:—గావః అస్య అస్మిన్ వా సన్తి=గోమాన్.

విద్వస్+మత్ అనియుండఁగా

సూ.—తసౌ మత్వర్థే—౧-౪-౧౯.

మత్వర్థకంబగు ప్రత్యయంబు పరమగుచో తకారాంతమును సకారాంతమును భసంజ్ఞకంబగును. 'వసోస్సంప్రసారణ' మ్మనుసూత్రముచేత సంప్రసారణంబు వకారమున కుకారంబు, పూర్వరూపము=విద్+ఉస్ షత్వము=విదుష్+మత్=విదుష్మాన్.

గుణవచనేభ్యో మతుపో లుగిష్టః—(వా)

గుణమును గుణినిగూడబోధించుశబ్దంబులకంటెఁ బరమగు మతుప్పునకు లుక్కగునని భాష్యకారుని సమ్మతము.

ఉదా:—శుక్లో గుణోఽస్యాస్తీతి=శుక్లః (పటము) కృష్ణః.

సూ.—ప్రాణిస్థాదాతో లజన్యతరస్యామ్—౫-౨-౯౬

ఆకారాంతమును ప్రాణిస్థవాచకమునగు ప్రాతిపదికముకంటెఁ బరముగా లచ్ (ల) అనుప్రత్యయము వికల్పముగా నగును.

ఉదా:—చూడాలః; చూడావాన్. ప్రాణిస్థాత్తనుటచే శిఖావాన్ (దీపము) చూడావాన్ (వృక్షము) అనుచో నీ కార్యము లేదు.

ప్రాణ్యఙ్గాదేవ—(వా)

ప్రాణిస్థమగునది ప్రాణికవయవమగునపుడే చెప్పఁబడిన ప్రత్యయంబగును. దానంజేసి మేధావాన్-అనుచో లచ్ప్రత్యయము లేదని యెఱుంగునది.

సూ.—లోమాదిపామాదిపిచ్ఛాదిభ్యశ్శనేలచః—
౫-౨-౧౦౦.

లోమన్-మున్నగువానికంటె శప్రత్యయమును, పామన్-మొదలగువానికంటె న-ప్రత్యయమును, పిచ్ఛ - మొదలైనవానికంటె ఇలచ్ (ఇల) ప్రత్యయమును మత్వర్థమున వికల్పముగానగును.

ఉదా:—లోమశః; లోమవాన్. పామనః, పామవాన్.

అఙ్గాత్కల్యాణే—(గ-సూ.)

అఙ్గ-శబ్దముకంటెఁ బరముగా మంగళావయవములుకలది యనునర్థమున న-ప్రత్యయంబగును.

ఉదా:—అఙ్గనా.

లక్ష్మ్యా అచ్చ—(గ-సూ.)

లక్ష్మీశబ్దంబునకు అకారాదేశముగూడనగును.

ఉదా:—లక్ష్మణః, పిచ్ఛిలః; పిచ్ఛవాన్.

సూ.—దన్త ఉన్నత ఉరచ్—౫-౨-౧౦౬.

దన్త ఉన్నతః (ఉన్నతములగు దంతములుగలవాఁడు) అనునర్థమందు ఉరచ్ (ఉర) అను ప్రత్యయంబగును.

ఉదా:—ఉన్నతా దన్తా అస్య=దన్తురః.

సూ.—కేశాద్వోఽన్యతరస్యామ్—౫-౨-౧౦౯.

కేశశబ్దముకంటెఁ బరముగా మత్వర్థమున వ-అను ప్రత్యయము వికల్పముగానగును.

ఉదా:—కేశవః; కేశవాన్.

ప్రాణిస్థా_త్తనుసూత్రమునుండి 'అన్యతరస్యామ్' అనునది యనువర్తించుచుండఁగా మరల నీసూత్రమున గ్రహించుట చేత ఇని (ఇన్)-ఠన్(ఠ్) అను ప్రత్యయములుగూడ నగునని తెలియునది.

ఉదా:—కేశీ; కేశికః.

అన్యేభ్యోఽపి దృశ్యతే—(వా)

మఱికొన్ని ప్రాతిపదికములకంటెఁ గూడ పరముగా వ-ప్రత్యయంబు గాన్పించెడిని.

ఉదా:—మణివః (సర్పవిశేషము) హిరణ్యవః (నిధి విశేషము).

అర్ణసో లోపశ్చ—(వా)

అర్ణస్-అనుశబ్దమునకు వప్రత్యయమును సకారలోపమును గూడనగును.

ఉదా:—అర్ణవః.

సూ.—అత ఇనిఠనౌ—౫-౨-౧౧౫.

అదంతంబగు ప్రాతిపదికముకంటెఁ బరముగా ఇని-ఠన్ ప్రత్యయములు మత్వర్థంబున నగును.

ఉదా:—దణ్డీ; దణ్డికః.

సూ.—వ్రీహ్యాదిభ్యశ్చ—౫-౨-౧౧౬.

వ్రీహిమున్నగుప్రాతిపదికములకంటెను బరముగా ఇని-ఠన్ప్రత్యయంబు లగును.

ఉదా:—వ్రీహీ; వ్రీహికః.

సూ.—అస్మాయామేధా స్రజో వినిః—౫-౨-౧౨౧.

అసంతములగు ప్రాతిపదికములకంటెను, మాయా-మేధా స్రజ్ అనుప్రాతిపదికములకంటెను బరముగా విని (విన్) అను ప్రత్యయము వికల్పముగానగును.

ఉదా:—యశస్వీ; యశస్వాన్. మాయావీ; మాయావాన్. వ్రీహ్యాదిపాఠముచే వీనికి ఇని-ఠన్ప్రత్యయములుగూడ నగును. మాయీ; మాయికః. మేధావీ; మేధావాన్=స్రగ్వీ; స్రగ్వాన్.

సూ.—వాచో గ్మినిః—౫-౨-౧౨౪.

వాచ్-అనుప్రాతిపదికముకంటెఁ బరముగా మత్వర్థంబున గ్మిని (గ్మిన్) అను ప్రత్యయంబగును.

ఉదా:—పుత్వజ_శ్త్వములు-వాగ్మీ.

సూ.—అర్శఆదిభ్యోఽచ్—౫-౨-౧౨౭.

అర్శస్-మున్నగు ప్రాతిపదికములకంటెఁ బరముగా మత్వర్థంబున అచ్ (అ) అను ప్రత్యయంబగును.

ఉదా:—అర్శాంస్యస్య విద్యన్తే=అర్శసః. ఇది యాకృతిగణంబు.

ఇది మత్వర్థీయప్రకరణము.

---

ప్రాగ్దిశీయ ప్రకరణము.

సూ.—ప్రాగ్దిశో విభక్తిః—౫-౩-౧.

'దిక్శబ్దేభ్యః' అనుసూత్రమునకుఁ బూర్వమునఁ జెప్పఁబోవు ప్రత్యయములు విభక్తిసంజ్ఞకములగును.

సూ.—కింసర్వనామబహుభ్యోఽద్వ్యాదిభ్యః—౫-౩-౨.

ప్రాగ్దిశీయప్రత్యయవిధాయకసూత్రములందు కిమః - సర్వనామ్నః-బహోః అని యనువర్తించును.

ద్వి-యుష్మద్-అస్మద్-భవతు అనుశబ్దములకంటెఁ బరముగాఁ బ్రాగ్దిశీయములు రావు. 'అద్వ్యాదిభ్యః' అనునిషేధము ప్రాప్తింపఁగా కిమ్-శబ్దము సూత్రంబున గ్రహింపఁబడినది.

సూ.—పఞ్చమ్యాస్తసిల్—౫-౩-౭.

పంచమ్యంతములగు కిమ్-మున్నగుశబ్దములకంటెఁ బరముగా తసిల్ (తస్) అనుప్రత్యయము వికల్పముగా నగును.

సూ.—కు తిహోః—౭-౨-౧౦౪.

కింశబ్దమునకు తకారాదిగాని హకారాదిగాని యగు విభక్తి పరమగుచో కు-యనునాదేశమగును.

ఉదా:—కుతః, పక్షమున కస్మాత్.

సూ.—ఇదమ ఇశ్—౫-3-3.

ప్రాగ్దిశీయము పరమగునపుడు ఇదమ్శబ్దమునకు ఇశ్ (ఇ) అను నాదేశమగును. ఇయ్యది శిత్తగుటచే సర్వాదేశం బగును.

ఉదా:—ఇతః

సూ.—అన్—౫-3-౫.

ఏతచ్ఛబ్దమునకుఁ బ్రాగ్దిశీయము పరమగునపుడు అన్-అనునాదేశంబగును. ప్రయోజనము లేనందున నకారమిత్సంజ్ఞకంబుగాదు. అనేకాల్లుగాన సర్వాదేశంబగును.

ఉదా:—అతః, అముతః, యతః, తతః, బహుతః; అద్వ్యాదిభ్యః-అనుటచే ద్వాభ్యామ్ అనుచో తసిల్ప్రత్యయము రాదు.

సూ.—పర్యభిభ్యాఇచ్చ—౫-3-౯.

పరి-అభి అనునట్టి యుపసర్గములకంటెఁ బరముగా తసిల్ప్రత్యయంబగును.

ఉదా:—పరితః (అంతట) అభితః (ఇరుప్రక్కలు.)

సూ—సప్తమ్యాస్త్రల్—౫-3-౧౦.

సప్తమ్యంతములగు కిమ్-సర్వనామ బహుశబ్దముల కంటెఁ బరముగా త్రల్ (త్ర) అనుప్రత్యయము వికల్పముగా నగును.

ఉదా:—కుత్ర, యత్ర, తత్ర, బహుత్ర.

సూ.—ఇదమో హః—౫-3-౧౧.

సప్తమ్యంతంబగు ఇదమ్‌శబ్దముకంటెఁ బరముగా హ-అనుప్రత్యయం బగును. త్రల్లున కపవాదంబు.

ఉదా:—ఇహ.

సూ.—కిమో౽త్—౫-3-౧౨.

సప్తమ్యంతమగు కిమ్-శబ్దముకంటెఁ బరముగా అత్-(అ) అనుప్రత్యయము వికల్పముగానగును. పక్షమున త్రల్లు గూడనగును.

సూ.—క్వాతి—౭-౨-౧౦౫.

కిమ్-శబ్దమునకు అత్ప్రత్యయము పరమగుచో క్వ-అను నాదేశమగును.

ఉదా:—క్వ, కుత్ర.

సూ.—ఇతరాభ్యో౽పి దృశ్యన్తే—౫-3-౧౪.

పంచమీసప్తమీతరవిభక్త్యంతముకంటెఁ గూడఁ బరముగా తసిలాదులు గాన్పించెడిని. దృశి గ్రహణముచే భవదాది యోగమందే యగును.

ఉదా:—సభవాన్ అనునర్థంబున తతో భవాన్, తత్ర భవాన్, తంభవన్తమ్ అనునర్థంబున తతో భవన్తమ్, తత్ర భవన్తమ్ ఇట్లే దీర్ఘాయుః, దేవానాంప్రియః, ఆయుష్మాన్ అనుశబ్దములందుఁ గూడనగును.

సూ.—సర్వైకాన్యకింయత్తదః కాలే దా—౫-3-౧౫.

కాలార్థకములును సప్తమ్యంతములునగు సర్వ - ఏక - అన్య-కిమ్-యద్-తద్ శబ్దములకంటెఁ బరముగా స్వార్థమున దా-అను ప్రత్యయమగును.

సూ.—సర్వస్య సోఽన్యతరస్యాం ది—౫-3-౬.

సర్వశబ్దమునకు దకారాదియగు ప్రాగ్దిశీయము పరమగు నపుడు స-అనునాదేశము వికల్పముగానగును.

ఉదా:—సర్వస్మిన్ కాలే = సదా; సర్వదా, ఏకదా, అన్యదా, కదా, యదా, తదా. కాలవాచకములనుట చేత సర్వత్ర (దేశే) అనుచో త్రల్లగును.

సూ.—ఇదమో ర్హిల్—౫-3-౧౬.

సప్తమ్యంతమును కాలవాచకమునగు ఇదమ్-శబ్దము కంటెఁ బరముగా ర్హిల్ (ర్హి) అనుప్రత్యయమగును.

సూ.—ఏతేతౌ రథోః—౫-3-౪.

రేఫాదిగాని థకారాదిగానియగు ప్రాగ్దిశీయప్రత్యయము పరమగుచో ఇదమ్-శబ్దమునకు ఏత-ఇత్ అను నాదేశములు క్రమముగానగును.

ఉదా:—అస్మిన్ కాలే=ఏతర్హి. కాలవాచకమని యనుటచే ఇహ(దేశే)యనుచో హ ప్రత్యయమగును.

సూ.—అనద్యతనే ర్హిలన్యతరస్యామ్—౫-3-౨౧.

సప్తమ్యంతములును అనద్యతనకాలవృత్తులునగు కిమాది శబ్దములకంటెఁ బరముగా ర్హిల్-ప్రత్యయము వికల్పముగా నగును.

ఉదా:—కర్హి; కదా; యర్హి; యదా, తర్హి; తదా.

సూ.—ఏతదః—౫-3-౫.

ఏతచ్ఛబ్దమునకు రేఫాదిగాని థకారాదిగానియగు ప్రాగ్దిశీయప్రత్యయము పరమగుచో ఏత-ఇత్ అనునాదేశములు వరుసగానగును.

ఉదా:—ఏతస్మిన్ కాలే=ఏతర్హి.

సూ.—ప్రకారవచనే థాల్—౫-3-౨3.

ప్రకారార్థములగు కిమాదిశబ్దములకంటెఁ బరముగా స్వార్థమున థాల్ (థా)అనుప్రత్యయమగును. ప్రకారమనఁగా సామాన్యభేదకమగు విశేషము.

ఉదా:—తేన ప్రకారేణ=తథా, యథా.

## సూ.—ఇదమస్థముః—౫-3-౨౪.

ఇదమ్ శబ్దముకంటెఁబరముగా థము (థమ్) అను ప్రత్యయ మగును. థాల్లున కపవాదంబు.

### ఏతదోఽపి వాచ్యః—(వా)

ఏతచ్ఛబ్దముకంటెఁగూడఁ బరముగా థముప్రత్యయం బగును.

ఉదా:—అనేన ఏతేన వా ప్రకారేణ=ఇత్థమ్.

## సూ.—కిమశ్చ—౫-3-౨౫.

కిమ్‌శబ్దముకంటెను బరముగా థముప్రత్యయమగును.

ఉదా:—కేన ప్రకారేణ=కథమ్.

ఇది ప్రాగ్దిశీయ ప్రకరణము.

---

### ప్రాగివీయప్రకరణము.

## సూ.—అతిశాయనే తమబిష్ఠనౌ—౫-3-౫౫.

అతిశయవిశిష్టార్థవాచకమగు శబ్దముకంటెఁబరముగా స్వార్థమున తమప్ (తమ)-ఇష్ఠన్ (ఇష్ఠ) అను ప్రత్యయము లగును.

ఉదా:—అయమేషామతిశయేనాఢ్యః=ఆఢ్యతమః. లఘుతమః. లఘిష్ఠః.

సూ.—తిఙశ్చ—౫-3-౫౬.

తిఙంతముకంటెఁబరముగా నతిశయము ద్యోత్యమగు నపుడు తమప్-ప్రత్యయం బగును.

సూ.—తరప్తమపౌ ఘః—౧-౧-౨౨.

తరప్-తమప్ అను ప్రత్యయములు ఘ-యనుసంజ్ఞ గలవి యగును.

సూ.—కిమేత్తిఙవ్యయఘాదామ్వద్రవ్యప్రకర్షే ౫-౪-౧౧.

ఘ-సంజ్ఞక ప్రత్యయాంతములగు కిమ్-ఏకారాంత-తిఙన్త శబ్దములకంటెను,అట్టి యవ్యయములకంటెను బరముగా ఆము-(ఆమ్) అను ప్రత్యయమగును. ద్రవ్యప్రకర్షమునఁగాదు.

ఉదా:—కింతమామ్, ప్రాహ్ణేతమామ్, పచతితమామ్, ఉచ్చైస్తమామ్; ద్రవ్యప్రకర్షంబునందు - ఉచ్చైస్తమః (వృక్షము)

సూ.—ద్వివచనవిభజ్యోపపదే తరబీయసునౌ—౫-3-౫౭.

రెండువస్తువులలో నొకదానియొక్క యతిశయవిశిష్టార్థము ను బోధించునదిగాని విభక్తవ్య వాచకముగాని యుపపద మగునపుడు సుప్తిఙంతములకంటెఁ బరముగా తరప్ (తర) - ఈయసున్ (ఈయస్) అను ప్రత్యయములగును. ఇవి తమబిష్ఠన్నిత్యంబుల కపవాదములు.

ఉదా:—అయమనయోరతిశయేన లఘుః = లఘుతరః, లఘీయాన్. ఉదీచ్యాః ప్రాచ్యేభ్యః పటుతరాః=పటీయాంసః.

సూ.—ప్రశస్యస్య శ్రః—౫-3-౬౦.

ఇష్ఠన్ప్రత్యయమును, ఈయసున్ప్రత్యయంబును బరమగునపుడు ప్రశస్యశబ్దమునకు శ్ర-అను నాదేశమగును.

సూ.—ప్రకృత్యైకాచ్—౬-౪-౧౬3.

ఇష్ఠన్-ఇమనిచ్-ఈయసున్ప్రత్యయములు పరమగునపుడొకయచ్చుగలయంగము ప్రకృతిభావమునొందును.

ఉదా:—శ్రేష్ఠః; శ్రేయాన్.

సూ.—జ్య చ—౫-3-౬౧.

ఇష్ఠేయసున్ప్రత్యయంబులు పరమగుచో ప్రశస్యశబ్దంబునకు జ్య-అనునాదేశముగూడ నగును.

ఉదా:—జ్యేష్ఠః

సూ.—జ్యాదాదీయసః—౬-౪-౧౬౦.

జ్య-అనునాదేశముకంటె బరమగు ఈయసున్ప్రత్యయమునకు ఆకారాదేశమగును. 'ఆదేః పరస్య' అనుపరిభాషచేత నీకారంబున కాకారంబగును.

ఉదా:—జ్యాయాన్.

సూ.—బహోర్లోపో భూ చ బహోః—౬-౪-౧౫౮.

బహుశబ్దముకంటెబరములగు ఇమనిచ్ - ఈయసున్ ప్రత్యయములయాదివర్ణమునకు లోపమును, బహుశబ్దమునకు భూ-అను నాదేశము నగును.

ఉదా:—భూమా; భూయాన్.

సూ.—ఇష్ఠస్య యిట్ చ—౬-౪-౧౫౯.

బహుశబ్దముకంటెబరమగు ఇష్ఠన్ ప్రత్యయమునకు లోపమును, యిట్ (యి) అనునాగమంబును, బహుశబ్దమునకు భూ-అనునాదేశమునగును.

ఉదా:—భూయిష్ఠః.

సూ.—విన్మతోర్లుక్—౫-3-౬౫.

ఇష్ఠేయసున్ప్రత్యయములు పరమగునపుడు విన్-మతుప్ ప్రత్యయంబులకు లుక్కగును.

ఉదా:—అతిశయేన స్రగ్వీ=స్రజిష్ఠః; స్రజీయాన్. అతిశయేన త్వగ్వాన్=త్వచిష్ఠః; త్వచీయాన్.

సూ.—ఈషదసమాప్తౌ కల్పబ్దేశ్యదేశీయరః—౫-3-౬౭.

ఈషదసమాప్తివిశిష్టార్థవృత్తులగు సుబంతతిఙంతములకంటెఁ బరముగా కల్పప్ (కల్ప)- దేశ్య- దేశీయర్ (దేశీయ) అను ప్రత్యయంబు లగును.

ఉదా:—ఈషదూనో విద్వాన్ = విద్వత్కల్పః; విద్వ ద్దేశ్యః; విద్వద్దేశీయః. పచతికల్పమ్.

**సూ.—విభాషా సుపో బహుచ్ పురస్తాత్తు—౫-3-౬౮.**

ఈషదసమాప్తివిశిష్టార్థవృత్తియగు సుబంతముకంటెc బూర్వమున బహుచ్ (బహు) అను ప్రత్యయము వికల్పముగా నగును.

ఉదా:—ఈషదూనః పటుః = బహుపటుః; పక్షమున పటుకల్పః. 'సుబంతముకంటె'ననుటచే పచతి కల్పమ్-అనుచోc దిజన్తమునకు రాదు.

సూ.—ప్రాగివాత్కః—౫-3-౭౦.

'ఇవే ప్రతికృతౌ' అనుసూత్రమునకుc బూర్వమున క-అనునది యనువర్తించును.

సూ.—అవ్యయసర్వనామ్నామకచ్ ప్రాక్టేః—౫-3-౭౧.

అవ్యయములయొక్కయు, సర్వనామములయొక్కయు, తిజన్తములయొక్కయు టిసంజ్ఞకములకుc బూర్వమున అకచ్ (అక్) అనుప్రత్యయమగును. కప్రత్యయాపవాదంబు.

సూ.—అజ్ఞాతే—౫-3-౭3.

అజ్ఞాతార్థంబునc బ్రాతిపదికముకంటెc బరముగా క-ప్రత్యయమగును.

ఉదా:—కస్యాయమశ్వః=అశ్వకః, ఉచ్చకైః, నీచకైః, సర్వకః. పచతకి.

సూ.—కుత్సితే—౫-౩-౭౪.

కుత్సితార్థమునఁ బ్రాతిపదికముకంటెఁ బరముగా క-ప్రత్యయంబగును.

ఉదా:—కుత్సితోఽశ్వః=అశ్వకః.

సూ.—కింయత్తదో నిర్ధారణే ద్వయోరేకస్య డతరచ్ ౫-౩-౯౨.

కిమ్-యద్ - తద్ అనుప్రాతిపదికములకంటెఁబరముగా రెండువస్తువులలో నొకదానికి జాతిగుణక్రియాసంజ్ఞలచేఁ బృథక్కృతిఁజేయునపుడు డతరచ్ (అతర) అనుప్రత్యయం బగును.

ఉదా:—అనయోః కతరో వైష్ణవః యతరః. తతరః. మహావిభాషచే కః, యః, సః అనికూడ రూపంబులగును.

సూ.—వా బహూనాం జాతిపరిప్రశ్నే డతమచ్ ౫-౩-౯౩.

బహుపదార్థములలో నొకదానినిర్ధారణమునఁ బూర్వోక్త ప్రాతిపదికములకంటెఁ బరముగా డతమచ్ (అతమ) అను ప్రత్యయము వికల్పముగానగును. సూత్రమందలి 'జాతిపరిప్రశ్నే'అనునది భాష్యమునఁ బ్రత్యాఖ్యానము చేయఁబడినది.

ఉదా:—కతమో భవతామ్ కతః, యతమః, తతమః. వాగ్రహణముచే యకః, సకః, మహావిభాషచే యః, సః అనియు రూపంబులగును.

ఇది ప్రాగివీయప్రకరణము.



స్వార్థిక ప్రకరణము.

సూ.—ఇవే ప్రతికృతౌ—౫-౩-౯౬.

ఇవార్థమగు నుపమానత్వముగల వస్తువును బోధించు ప్రాతిపదికముకంటెఁ బరముగా నుపమేయము ప్రతికృతి యగుచో స్వార్థమున కన్ (క) అను ప్రత్యయమగును. తృణ-చర్మ-కాష్ఠాదులచే నిర్మింపఁబడిన ప్రతిమాపరపర్యాయకమగు వస్తువు ప్రతికృతి నాఁబడును.

ఉదా:—అశ్వ ఇవ ప్రతికృతిః=అశ్వకః.

ప్రాతిపదికమాత్రముకంటెఁ బరముగా స్వార్థమున కన్-అను ప్రత్యయంబగును.

ఉదా:—అశ్వ ఏవ-అశ్వకః.

సూ.—తత్ప్రకృతవచనే మయట్—౫-౪-౨౧.

ఇట 'వచనమ్' అనునది భావార్థమునఁగాని; యధికరణార్థమునఁగాని ల్యుడన్తము ప్రకృతమనఁగాఁ బ్రస్తుతము. ఇచ్చట వచనశబ్దగ్రహణముచేఁ బ్రాచుర్యవిశిష్టమగు ప్రస్తు

తము గ్రహింపఁబడును. ప్రచురమగు ప్రస్తుతముయొక్క బోధనముగలుగునపుడు ప్రచురార్థబోధకంబగు ప్రథమాసమర్థముకంటెఁ బరముగా స్వార్థమున మయట్ (మయ) అను ప్రత్యయంబగును. ఇది భావల్యుడన్తపక్షమున నర్థము. ప్రచుర ప్రస్తుతము దేనియందుఁ జెప్పఁబడునో యట్టి యధికరణరూపార్థము వాచ్యమగునపుడు ప్రథమాసమర్థమగు ప్రాచుర్యవిశిష్ట వస్తువాచకముకంటెఁ బరముగా మయట్ప్రత్యయమగును.

ఈయది యధికరణల్యుడంతపక్షంబున నర్థంబు.

ప్రథమపక్షమున—

ప్రకృతమన్నమ్=అన్నమయమ్; అపూపమయమ్.

ద్వితీయపక్షమున—

అన్నమయః. (యజ్ఞము), అపూపమయమ్ (పండుగ) అందు మొదటిపక్షంబున మయట్ప్రత్యయాంతంబు నిత్యనపుంసకంబును, రెండవపక్షంబున విశేష్యనిఘ్నంబునగునని తెలియునది.

సూ.—ప్రజ్ఞాదిభ్యశ్చ—౫-౪-౩౮.

ప్రజ్ఞమున్నగుప్రాతిపదికములకంటెఁ బరముగా స్వార్థమున అణ్ణగును.

ఉదా:—ప్రజ్ఞ ఏవ=ప్రాజ్ఞః. దైవతః. బాన్ధవః.

సూ.—బహ్వల్పార్థాచ్ఛస్కారకాదన్యతరస్యామ్ ౫-౪-౪౨.

బహ్వర్థకముగాని యల్పార్థకముగానియగు కారక

వాచకప్రాతిపదికముకంటెఁ బరమై వికల్పముగా శస్-అను ప్రత్యయంబగును.

ఉదా:—బహూని దదాతి=బహుశః. అల్పశః.

ఆద్యాదిభ్యస్తసేరుపసంఖ్యానమ్—(వా)

ఆది-మున్నగుప్రాతిపదికములకంటెఁ బరముగా స్వార్థమున తసి (తస్) అనుప్రత్యయమగును.

ఉదా:—ఆదౌ = ఆదితః, మధ్యతః, అన్తతః, పృష్ఠతః, పార్శ్వతః. ఇది యాకృతిగణంబు. స్వరేణ=స్వరతః, వర్ణతః.

సూ.—కృభ్వస్తియోగే సంపద్యకర్తరి చ్విః—౫-౪-౫౦.

అభూతతద్భావ ఇతి వక్తవ్యమ్—(వా)

డుకృఞ్-భూ-అస ధాతువులతో యోగమున్నపుడు అభూతతద్భావము గమ్యమానమగుచో వికారస్వరూపమును బొందిన ప్రకృతియందు వర్తమానమును సంపత్తికర్తయునగు వికారవాచకశబ్దముకంటెఁ బరముగా చ్వి-అనుప్రత్యయము స్వార్థమున వికల్పముగానగును. ఇది సర్వము లోపించును. అంతకుఁబూర్వమున లేని స్వరూపమునొందుట అభూతతద్భావమనంబడును.

సూ.—అస్య చ్వౌ—౭-౪-౩౨.

చ్విప్రత్యయము పరమగునపుడు అవర్ణమునకు ఈకారమగును.

ఉదా:—అకృష్ణః కృష్ణస్సమ్పద్యతే, తం కరోతి=కృష్ణీ కరోతి. బ్రహ్మీభవతి. గఙ్గీ స్యాత్.

అవ్యయస్య చ్వావీత్వం నేతి వాచ్యమ్—(వా)

అవ్యయమునకు చ్విప్రత్యయము పరమగుచో ఈకారము రాదు.

ఉదా:—దోషాభూతమ్ (అహస్సు) దివాభూతా (రాత్రి).

సూ.—విభాషా సాతి కార్త్స్న్యే—౫-౪-౫౨.

చ్విప్రత్యయవిషయమున సాకల్యార్థమందు వికల్పముగా సాతి (సాత్) అను ప్రత్యయమగును.

సూ.—సాత్పదాద్యోః—౮-౩-౧౧౧.

సాత్-ప్రత్యయావయవముగాని, పదాదిగానియగు సకారమునకు షత్వము రాదు.

ఉదా:—దధి సిఞ్చతి. కృత్స్నం శస్త్రం అగ్నిస్సం పద్యతే=అగ్నిసాద్భవతి.

సూ.—చ్వౌ చ—౭-౪-౨౬.

చ్విప్రత్యయము పరమగుచోఁ బూర్వమునకు దీర్ఘమగును.

ఉదా:—అగ్నీభవతి.

సూ.—అవ్యక్తానుకరణాత్ ద్వ్యజవరార్ధాదనితౌ డాచ్ ౫-౪-౫౭.

అనేకాచ్కమగు నర్ధభాగముగలదియు, ధ్వన్యనుకరణవాచకమును ఇతిశబ్దపరకముగానిదియునగు ప్రాతిపదికము. కం కెంబరముగా కృఞ్-భూ-అస ధాతువులతో యోగమున్నపుడు డాచ్ (ఆ) అనుప్రత్యయమగును.

డాచి బహులం ద్వే భవతః—(వా).

డాచ్ ప్రత్యయము వివక్షితమగుచో ద్విత్వము బహులముగానగును.

ఉదా:—పటత్-అనుదానికి ద్విత్వము పటత్‌పటత్-ఈసముదాయములో నర్ధభాగము ద్వ్యచ్కముగాన డాచ్చును జేయఁగా పటత్+పటత్+ఆ-కరోతి టిలోపము=పటత్+పట్+ఆకరోతి పటత్+పటాకరోతి అనియుండఁగా,

నిత్యమామ్రేడితే డాచీతి వక్తవ్యమ్—(వా)

డాచ్పరకమగు నామ్రేడితము పరమగునపుడు పూర్వపరవర్ణములకుఁ బరరూపము నిత్యముగానగును. దీనిచేత తకారపకారములకు పకారము

ఉదా:—పటపటాక్షరోతి.

అవ్యక్తానుకరణాత్-ద్వ్యజవరార్థాత్ - అవర-అనితౌ అనుపదములకు దృషత్కరోతి-శ్రత్కరోతి - ఖరటఖరటా కరోతి - పటితికరోతి అనునవి వరుసగా వ్యావర్త్యములని యెఱుంగునది.

ఇది స్వార్థికప్రకరణము.

ఇది తద్ధితాధికారప్రకరణము.

---

# స్త్రీప్రత్యయప్రకరణము.

## సూ.—స్త్రియామ్—౪-౧-౩.

ఇయ్యది యధికారసూత్రంబు 'సమర్థానాం ప్రథమాద్వా' అనుసూత్రమువఱకు ననువర్తించును.

## సూ.—అజాద్యతష్టాప్—౪-౧-౪.

అజమున్నగు ప్రాతిపదికములకుఁగాని, అదన్తప్రాతిపదికములకుఁగాని వాచ్యమగు స్త్రీత్వమును ద్యోతనచేయుచు టాప్ (ఆ) అనుప్రత్యయమగును.

ఉదా:—అజా, ఏడకా, అశ్వా, చటకా, మూషికా, బాలా, వత్సా, హోడా, మన్దా, విలాతా మున్నగునవి యజాదులు. మేధా, గఙ్గా, సర్వా మున్నగునవి యదన్తములు.

అజాదులన్నియు నదంతములయినను టాప్పునకు బాధకములగు జీష్-జీన్ ప్రత్యయములను బాధించుటకు వేఱుగా గ్రహింపఁబడినవని యెఱుంగునది.

సూ.—ఉగితశ్చ—౪-౧-౬.

(ఉక్కు-ప్రత్యాహారము) ఉగిత్తు-మంతమునఁగల ప్రాతిపదికముకంటెఁ బరముగా స్త్రీత్వమున జీప్(ఈ) అను ప్రత్యయమగును.

ఉదా:—భవన్తీ, పచన్తీ.

సూ.—అనుపసర్జనాత్—౪-౧-౧౪.

ఇది యధికారసూత్రంబు. 'యూనస్తిః' అనునంతవఱకనువర్తించును.

సూ.—టిడ్ఢాణఞ్ద్వయసచ్దఘ్నఞ్మాత్రచ్తయప్ ఠక్ఠఞ్కఞ్క్వరపః—౪-౧-౧౫.

అనుపసర్జనంబులగు టిత్తుమున్నగునవి యంతమునఁగల అదంతప్రాతిపదికముకంటె స్త్రీత్వమున జీప్ (ఈ) ప్రత్యయమగును. టిత్-ఇయ్యాదిప్రాతిపదికము ప్రత్యయముకూడనగును. ఢ-ఢక్-ఢఞ్-అణ్-ద్వయసచ్ - దఘ్నచ్-మాత్రచ్- తయప్-ఠక్-ఠఞ్-కఞ్-క్వరప్ అనునవి ప్రత్యయములు.

ఉదా:—కురుచరీ (టప్రత్యయము), నదట్ = నదీ, దేవట్=దేవీ, సౌపర్ణేయీ (ఢక్), ఐన్ద్రీ (అణ్), ఔత్సీ.

(అణ్). ఊరుద్వయసీ, ఊరుదఘ్నీ, ఊరుమాత్రీ, పఞ్చతయీ (తయప్). ఆక్షికీ (ఠక్). లావణికీ (ఠఞ్). యాదృశీ (కఞ్). ఇత్వరీ (క్వరప్) అనుపసర్జనమనుటచే బహుకురుచరా-అనుచో టాప్ప్రత్యయమే యగును.

నఞ్స్నఞీకక్ఖ్యుంస్తరుణతలునానా
ముపసంఖ్యానమ్—(వా)

నఞ్-స్నఞ్ - ఈకక్-ఖ్యున్ అను ప్రత్యయము లంత మునఁగలవానికంటెను, తరుణ - తలున అనుప్రాతిపదికముల కంటెను గూడ ఙీప్పగును.

ఉదా:—స్త్రైణీ, పౌంస్నీ, శాక్తీకీ, ఆఢ్యఙ్కరణీ, తరుణీ, తలునీ.

సూ.—యఞశ్చ—౪-౧-౧౬.

యఞ్ప్రత్యయాంతముకంటెఁ బరముగా స్త్రీత్వంబున ఙీప్పగును.

ఉదా:—గార్గ్య+ఈ అకారలోపము గార్గ్య్+ఈ,

హలస్తద్ధితస్య—౬-౪-౧౫౦.

హల్లుకంటెఁబరమగు తద్ధితయకారమునకు ఈకారము పరమగునపుడు లోపమగును. దీనిచే యకారలోపంబు.

ఉదా:—గార్గీ.

సూ.—ప్రాచాం ష్ఫ తద్ధితః—౪-౧-౧౭.

యఞ న్తముకంటెఁబరముగా ష్ఫ(ఫ) అనుప్రత్యయము వికల్పముగానగును. అది తద్ధితసంజ్ఞకంబు.

సూ.—షిద్గౌరాదిభ్యశ్చ—౪-౧-౪౧.

షిత్తులకంటెను, గౌర-మున్నగుప్రాతిపదికములకంటెను బరముగా జీష్ (-ఈ) అనుప్రత్యయమగును.

ఉదా:—గార్గ్య+ఫ గార్గ్య+ఆయన ణత్వము=గార్గ్యాయణ జీష్=గార్గ్యాయణీ. నర్తకీ (ష్వున్). గౌరీ, అనడుహీ; అనడ్వాహీ. ఇయ్యది యాకృతిగణంబు.

సూ.—వయసి ప్రథమే—౪-౧-౨౦.

ప్రథమవయోవాచకమగు అదంతప్రాతిపదికముకంటెఁ బరముగా జీష్పగును. ఉదా:—కుమారీ.

సూ.—ద్విగోః—౪-౧-౨౧.

అదంతమగు ద్విగుసమాసముకంటెఁ బరముగా జీష్పగును.

ఉదా:—త్రిలోకీ. అజాదులగుటచే త్రిఫలా, త్ర్యనీకా, (సేన) అనుచో టాప్పగును.

సూ.—వర్ణాదనుదాత్తాత్తోపథాత్తో నః—౪-౧-౩౯.

వర్ణవాచకమును, అనుదాత్తాంతము తకారోపధకమునగు శబ్దమంతమునఁగలదియు, ననుపసర్జనమునగు ప్రాతిపదికముకంటెఁబరముగా జీష్పు విభాషనగును. తకారమునకు నకా

రముగూడ నాదేశమగును. ఇట 'నసుపసర్జనవిశేషణము తదంత మునకే యని యెఱుంగునది. 'త్ర్యేణ్యాశలల్యా.' అని గృహ్య సూత్రము.

ఉదా:—ఏనీ; ఏతా. రోహిణీ; రోహితా.

సూ.—వోతో గుణవచనాత్—౪-౧-౪౪.

ఉదంతము గుణవాచకమునగు ప్రాతిపదికముకంటెబర ముగా జీష్ వికల్పముగా నగును.

ఉదా:—మృద్వీ; మృదుః.

సూ.—బహ్వాదిభ్యశ్చ—౪-౧-౪౫.

బహు-మున్నగుప్రాతిపదికములకంటె బరముగా జీష్ వికల్పముగా నగును.

ఉదా:—బహ్వీ; బహుః.

సూ.—కృదికారాదక్తినః—(గ-సూ.)

క్తిన్ప్రత్యయభిన్నమగు కృత్తుయొక్క-ఇకార మంత మునఁగల ప్రాతిపదికముకంటె బరముగా జీష్ వికల్పముగా నగును.

ఉదా:—రాత్రిః; రాత్రీ.

సర్వతోఽక్తిన్నర్థాదిత్యేకే—(గ-సూ.)

క్తిన్నర్థకప్రత్యయాంతముగానట్టి ఇకారాంతప్రాతిపదిక మాత్రముకంటెనే పరముగా జీషగునని కొందఱిమతము.

ఉదా:—శకటిః; శకటీ. 'అ_క్తిన్నర్థాత్' అనియనుటచే అజననిః (అని) అనుచో రాదు.

సూ.—పుంయోగాదాఖ్యాయామ్—౪-౧-౪౮.

పుంవాచకశబ్దము పురుషునియొక్క జన్యజనకభావాది సంబంధముచే స్త్రీనిబోధించునప్పుడు ఆశబ్దముకంటెఁ బరముగా ఙీష్ప్రత్యయమగును.

ఉదా:—గోపస్య స్త్రీ = గోపీ. పుంయోగమనఁగా దాంపత్యముమాత్రమే యనినచో కేకయీ - దేవకీ మున్నగునవి గౌరాదిగణంబులోనివని తెలియునది.

పాలకాన్తాన్న—(వా)

పాలకశబ్దమంతమునఁగలప్రాతిపదికముకంటెఁ బరముగా ఙీష్షు రాదు.

ఉదా:—గోపాలకస్య స్త్రీ=గోపాలికా, అశ్వపాలికా.

సూ.—ప్రత్యయస్థాత్కాత్పూర్వస్యాత ఇదాప్యసుపః—౭-౩-౪౪.

ప్రత్యయస్థకకారముకంటెఁ బూర్వమగు హ్రస్వాకారమునకు సుప్పుకంటెఁ బరముగాని యాప్పు పరమగుచో హ్రస్వమగు ఇకారమగును.

ఉదా:—సర్వికా, కారికా. అతః - ప్రత్యయస్థాత్ - అసుపః- కాత్ -పూర్వస్య-అతః - (తపరకరణంబునకు) ఆపి అను పదంబులకుఁ గ్రమముగా నౌకా (శక్నోతీతి), శకా-బహుపరివ్రాజకా-(నగరీ), నన్దనా-కటుకా - రాకా - కారకః అనునవి వ్యావర్త్యములని తెలియునది.

సూర్యాద్దేవతాయాం చాప్ వాచ్యః—(వా)

సూర్యశబ్దమునకుఁ బ్రయోగమున దేవత వాచ్యమగుచో చాప్ (అ) అనుప్రత్యయమగును.

ఉదా:—సూర్యస్య స్త్రీ దేవతా=సూర్యా. దేవతయర్థము కానిచో,

సూర్యాగస్త్యయోః ఛే చ ఙ్యాఞ్చ—(వా)

సూర్య-అగస్త్య శబ్దములయొక్క యకారమునకు ఛ ప్రత్యయమును ఙీప్రత్యయముఁ బరమగునపుడు లోపమగును.

ఉదా:—సూరీ (కున్తి-మానుషి) అనిరూపమగును.

సూ.—ఇన్ద్రవరుణభవశర్వరుద్రమృడహిమారణ్యయవయవనమాతులాచార్యాణామానుక్—౪-౧-౪౯.

ఇన్ద్ర-వరుణ-భవ-శర్వ-రుద్ర-మృడ-హిమ-అరణ్య-యవ-యవన-మాతుల-ఆచార్య అనునీపండ్రెండుశబ్దములకును ఆనుక్ (ఆన్) అనునాగమమును, ఙీష్ప్రత్యయమును బుంయోగమున నగును.

ఉదా:—ఇన్ద్రస్య స్త్రీ = ఇన్ద్రాణీ, వరుణానీ, భవానీ, శర్వాణీ, రుద్రాణీ, మృడానీ.

హిమారణ్యయోర్మహత్త్వే—(వా)

హిమ - అరణ్య శబ్దంబులకు మహత్త్వరూపార్థమందే పూర్వోక్తకార్యంబులగును.

ఉదా:—మహద్ధిమం, హిమానీ, మహదరణ్యమ్, అరణ్యానీ.

యవాద్దోషే—(వా)

యవ-శబ్దముకంటెఁ బరముగాఁ బూర్వోక్తకార్యములు దోషరూపార్థమందే యగును.

ఉదా:—దుష్టో యవో=యవానీ-(ధాన్యజాతివిశేషము.)

యవనాల్లిప్యామ్—(వా)

యవనశబ్దమునకు లిపిరూపార్థమునందే పూర్వోక్త కార్యంబులగును.

ఉదా:—యవనానాం లిపిః=యవనానీ.

మాతులోపాధ్యాయయోరానుగ్వా—(వా)

మాతుల-ఉపాధ్యాయ శబ్దంబులకుఁ బుంయోగమందు ఆనుగాగమంబు వికల్పముగానగును.

ఉదా:—మాతులానీ; మాతులీ, ఉపాధ్యాయానీ; ఉపాధ్యాయీ.

యాతుస్వయమేవాధ్యాపికా తత్ర వా ఙీష్ వాచ్యః —(వా)

ఉపాధ్యాయీ; ఉపాధ్యాయా (అధ్యాపనముచేయునది.)

ఆచార్యాదణత్వఞ్చ—(వా)

ఆచార్యశబ్దమునకుఁ బుంయోగంబునఁ బూర్వోక్త కార్యములగును. ణత్వము రాదు.

ఉదా:—ఆచార్యస్య స్త్రీ = ఆచార్యానీ; ఆచార్యా. (స్వయముగా వ్యాఖ్యానముచేయునది.)

అర్యక్షత్రియాభ్యాం వా స్వార్థే—(వా)

అర్య-క్షత్రియ శబ్దములకంటెఁ బరముగా స్వార్థంబున జీష్నును, ఆనుగాగమంబును వికల్పముగానగును.

ఉదా:—అర్యాణీ; అర్యా (స్వామిని - లేక-వైశ్య). క్షత్రియాణీ; క్షత్రియా. పుంయోగమున అర్యీ, క్షత్రియీ.

సూ.—క్రీతాత్కరణపూర్వాత్—౪-౧-౫౦.

క్రీతశబ్దాంతమును అదంతమును కరణకారకపూర్వపద కంబునునగు ప్రాతిపదికముకంటెఁ బరముగా స్త్రీత్వంబున జీష్గును.

ఉదా:—వస్త్రక్రీతీ. ఇకార్యము కొన్నిచోట్లఁగాదు. ధనక్రీతా.

సూ.—స్వాఙ్గాచ్చోపసర్జనాదసంయోగోపధాత్— ౪-౧-౫౪.

సంయోగోపధముకానట్టియు నుపసర్జనమునగు స్వాంగ వాచక మంతంబునఁగల యదంతప్రాతిపదికముకంటెఁ బరముగా జీష్ వికల్పముగానగును.

ఉదా:— కేశానతిక్రాన్తా=అతికేశీ; అతికేశా. చన్ద్రముఖీ; చన్ద్రముఖా; అసంయోగోపథాత్తనుటచే సుగుల్ఫా అనుస్థలమందును, ఉపసర్జనాత్తనుటచే శిఖా - అనుచోటను నీకార్యము లేదు.

సూ.—న క్రోడాదిబహ్వాచః—౪-౧-౫౬.

క్రోడ-మున్నగునవియు బహ్వాచ్కములునగు స్వాంగ వాచకములకంటె జీష్ రాదు.

ఉదా:—కల్యాణక్రోడా. క్రోడాది యాకృతిగణంబు. సుభగా, సుగలా, సుజఘనా. (ఇది బహ్వాచ్కమము.)

సూ.—నఖముఖాత్సంజ్ఞాయామ్—౪-౧-౫౮.

నఖ-ముఖ అను స్వాంగవాచకములకంటెఁ బరముగా సంజ్ఞయందు జీష్షురాదు.

సూ.—పూర్వపదాత్సంజ్ఞాయామగః—౮-౪-3.

పూర్వపదస్థమగు నిమిత్తముకంటెఁబరంబగు నకారమునకు సంజ్ఞయందు ణకారమగును. గకారవ్యవధానమునఁగాదు.

ఉదా:—శూర్పణఖా, గౌరముఖా. సంజ్ఞాయామ్మనుటచేత తామ్రముఖీ (కన్య) అనుచోటజీష్షునిషేధమును - అగః-అనియనుటచేత ఋగయనమ్-అనునపుడు ణత్వమును లేదు.

సూ.—జాతేరస్త్రీవిషయాదయోపధాత్—౪-౧-౬3

జాతివాచకమును నిత్యస్త్రీలింగముకానిదియును యకారోపధకభిన్నమునునగు ప్రాతిపదికముకంటెఁ బరముగా జీష్షగును.

ఉదా:—తటీ, వృషలీ, ఔపగవీ, కఠీ, బహ్వృచీ, జాతేః-అనుటచేత ముణ్డా-అనుచోటను అస్త్రీవిషయాత్-అనుటచే బలాకా-అనుస్థలమందును, అయోపధాత్తనుటచే క్షత్రియా-అనుచోటను జీష్షు రాదు.

యోపధప్రతిషేధే హయగవయముకయమనుష్య మత్స్యానామప్రతిషేధః—(వా).

హయ-గవయ-ముకయ - మనుష్య - మత్స్యశబ్దములు యకారోపధకంబులయినను జీష్షగును.

ఉదా:—హయీ, గవయీ, ముకయీ. 'హల_స్తద్ధి తస్య' అనుసూత్రముచే యకారలోపము మనుషీ.

మత్స్యస్య జ్యామ్—(వా).

మత్స్యశబ్దమునకు జీప్రత్యయము పరమగునపుడు యకారలోపమగును

ఉదా:—మత్సీ

సూ.—ఇతో మనుష్యజాతేః—౪-౧-౬౫.

ఇదంతమగు మనుష్యజాతివాచకశబ్దముకంటె బరముగా జీష్షగును.

ఉదా:—దాక్షీ (ఇఞన్తంబు.)

సూ.—ఊఙుతః—౪-౧-౬౬.

ఉదంతమును యోపధభిన్నమునగు మనుష్యజాతివాచకముకంటె బరముగా స్త్రీత్వంబున ఊఙ్ (ఊ) అనుప్రత్యయమగును.

ఉదా:—కురూః. అయోపధాత్తనుటచే అధ్వర్యుః (బ్రాహ్మణి) అనుచోంగాదు.

సూ.—పఙ్గోశ్చ—౪-౧-౬౮.

పఙ్గుశబ్దముకంటె బరముగా స్త్రీత్వమున ఊఙ్గగును.
ఉదా:—పఙ్గూః.

శ్వశురస్యోకారాకారలోపశ్చ—(వా).

శ్వశురశబ్దముకంటెబరముగా ఊఙ్గును నాశబ్దములోని ఉకారమునకును నంతిమంబగు అకారంబునకును లోపంబును నగును.

ఉదా:—శ్వశ్రూః.

సూ.—ఊరూత్తరపదాదౌపమ్యే—౪-౧-౬౯.

ఉపమానవాచకము పూర్వపదముగాఁగలదియు, ఊరుశబ్ద ముత్తరపదముగాఁగలదియునగు ప్రాతిపదికముకంటెఁ బరముగా ఊఙ్ఞగును.

ఉదా:—కరభోరూః.

సూ.—సంహితశఫలక్షణవామాదేశ్చ—౪-౧-౭౦.

సంహిత-శఫ-లక్షణ-వామశబ్దములు పూర్వపదముగాఁగల ఊరూత్తరపదకప్రాతిపదికముకంటెఁగూడ ఊఙ్ఞగును. ఈశబ్దంబు లుపమానవాచకంబులు కానవు డూఙ్ఞువచ్చుటకై యీసూత్ర మారంభింపఁబడినది.

ఉదా:—సంహితోరూః, శఫోరూః, లక్షణోరూః, వామోరూః.

సూ.—శార్ఙ్గరవాద్యఞోఙీన్—౪-౧-౭౩.

జాతివాచకములగు శార్ఙ్గరవ మున్నగుప్రాతిపదికములకంటెను అఞ్ప్రత్యయముయొక్క అకారమంతంబునఁగల ప్రాతిపదికములకంటెను బరముగా ఙీన్ (ఈ) అనుప్రత్యయమగును.

ఉదా:—శార్ఙ్గరవీ, బ్రాహ్మణీ, బైదీ.

నృనరయోర్వృద్ధిశ్చ—(గ-సూ.)

నృ-నర శబ్దములకు వృద్ధియు నీశబ్దములకంటెఁ బరముగా ఙీన్ప్రత్యయము నగును.

ఉదా:—నారీ.

సూ.—యూనస్తిః—౪-౧-౭౭.

యువన్-శబ్దముకంటెఁ బరంబుగా స్త్రీత్వంబున తి - అను ప్రత్యయంబగును.

ఉదా.—యువన్+తి ఇట తిప్రత్యయమునకుఁ దద్ధిత సంజ్ఞయుంటచే "స్వాదిష్వసర్వనామస్థానే" అనుసూత్రముచేఁ బదత్వముండునుగాన నకారలోపమగును.

యువ+తి = యువతి-ఇది తద్ధిత ప్రత్యయాంతమగుటచేఁ బ్రాతిపదికసంజ్ఞయుండును. దానంజేసి సుబాదులు వచ్చును. యువతిః.

ఇది స్త్రీప్రత్యయప్రకరణము.

గద్యము. శ్రీమదాపస్తంబ సూత్రుండును, శాండిల్యసగోత్రుండును, చంద్రభట్లవంశ్యుండును, రామాంబా రామసిద్ధాన్తుల పుత్రుండును, యజుశ్శాఖాధ్యాయియు, జయంతి భగీరథ శాస్త్రి శిష్యుండును, నగు సూర్యనారాయణశాస్త్రి చేతను-శ్రీమదాపస్తంబ సూత్రుండును, హారితసగోత్రుండును - పంచాంగాన్వయసంభూతుండును, అలమేల్మంగా వేంకటాచార్యులపుత్రుండును, యజుశ్శాఖాధ్యాయియు నగు వేంకటనరసింహాచార్యునిచేతను - నేత్రాగ్నినిధి చంద్రమితంబగు (హూ॥ శ॥ 1932) వత్సరంబున నాంధ్రీకరింపఁబడిన లఘుసిద్ధాన్తకౌముది ముగిసెను.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1932.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 9 | ప్రత్యాహార | ప్రత్యాహార |
| 5 | 10 | ర, ష, | ర్, ష్, |
| 8 | 9 | హల్లుల | హల్లులు |
| 11 | 7 | అలోఽన్త్యస్య | అలోఽన్త్యస్య |
| 13 | 19 | గలిసి | గలిపి |
| 15 | 9 | గంఙ్గౌఘః, | గఙ్గౌఘః, |
| 15 | 20 | కేజాదులు | లేజాదులు |
| 18 | 12 | అజ్ఞుకాని | అజ్ఝుకాని |
| 19 | 14 | చిత్రగ్వగ్రమ్ | చిత్రగ్వగ్రమ్-గోః |
| 23 | 18 | సజ్ఞ | సంజ్ఞ |
| 24 | 5 | లాకి | లాకిక |
| 24 | 11 | వికల్పముకా | వికల్పముగా |
| 25 | 6 | గారియా | గార్యా |
| 26 | 8 | శార్జి | శార్ఙ్గి |
| 27 | 11 | షష్టీ | షష్ఠీ |
| 27 | 19 | సన్నష్టః | సన్నష్ఠః |
| 29 | 16 | థానమ్ | థానమ్ |
| 30 | 3 | థానమ్ | థానమ్ |
| 31 | 2 | ఛ్లోకేన | +ఛ్లోకేన |
| 32 | 20 | కింవ్యాః, | కింవ్యాః, |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 32 | 20 | కింప్మాలయతి | కింహ్వాలయతి |
| 33 | 19 | నగసు | నగుసు |
| 34 | 9 | షష్ఠ | షష్ఠః |
| 35 | 21 | ఉదా:—సర్ | ఉదా:—సఁర్ |
| 36 | 8 | సఁం+స్కర్తా | సఁః+స్కర్తా |
| 37 | 5 | చక్రిన్+త్రాయస్వ | { చక్రిన్+త్రాయస్వ<br>చక్రిర్+త్రాయస్వ |
| 37 | 18 | పాహి-పక్షంబున | పాహి |
| 37 | 19 | నృఁార్+పాహి | నృఁార్+పాహి. పక్షంబున |
| 37 | 19 | నృాంః+పాహి | నృఁాః+పాహి |
| 38 | 4 | నృాంగపాహి | నృఁాగపాహి |
| | | నృాగపాహి | నృాంగపాహి |
| | | నృాఃపాహి | నృఁాఃపాహి |
| | | నృాః | నృాంః |
| 38 | 7 | ద్విరుక్తము మొక్క | ద్విరుక్తముయొక్క |
| 39 | 1 | లక్ష్మీల్+చ్ఛా | లక్ష్మీల్+ఛా |
| 39 | 15-16 | శబ్దముయొక్క-సకారము | శబ్దము |
| 40 | 5 | అర్చః | అర్చ్యః |
| 40 | 19 | భోర్-దేవాః | భోర్+దేవాః |
| 41 | 20 | వృధ్+డ | వృధ్+ఢ |
| 48 | 4 | పర | పరమ |
| 50 | 8 | విసర్గము | విసర్గములం |
| 52 | 18-19 | పధాంతమునుకానిదానికి | పదాంతభిన్నమును |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 56 | 9 | సంఖ్యాన | సంవ్యాన |
| 57 | 19 | అది | అవి |
| 58 | 9 | నిర్జన్+ఔ | నిర్జరన్+ఔ |
| 62 | 3 | యజ్గు | యజ్ఞు |
| 64 | 17 | ఖీ-తి | ఖీ-తీ |
| 66 | 2 | షట్సజ్ఞ | షట్సంజ్ఞ |
| 76 | 11 | గలిసి | గలిగి |
| 77 | 9 | ధాతార | ధాతారః |
| 77 | 20 | నస్త్రాదులకు | నప్త్రాదులకు |
| 78 | 2 | బ్రాతృ | భ్రాతృ |
| 81 | 19 | పూర్వ్యాయై | పూర్వాయై |
| 85 | 7 | ఇయజ్గు | ఇయజ్ఞు |
| 85 | 15 | హ్రస్వములగుబుకార | బుద_న్తములు |
| 85 | 16 | స్త్ర | స్త్రీ |
| 86 | 10 | నాశబ్దము | నాశబ్దమునకు |
| 88 | 11 | అద్‌డ | అద్‌డ్డ |
| 91 | 14 | బోలె | బోలె |
| 93 | 6 | భష్భావము ధుహ్-ఘత్వము | ఘత్వము-దుఘ్ భష్భావము |
| 93 | 14 | ద్రుగ్ | ధ్రుగ్ |
| 93 | 15 | ద్రుగ్భ్యామ్ | ధ్రుగ్భ్యామ్ |
| 93 | 16 | ద్రుడ్భ్యామ్ | ధ్రుడ్భ్యామ్ |
| 93 | 16 | ద్రుట్సు | ధ్రుట్సు |
| 93 | 18 | ధాత్వాధే | ధాత్వాదే |
| 96 | 11 | తురాషాద్ | తురాషాడ్ |
| 101 | 18 | ఏనాన్ | ఏనాన్ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 101 | 19 | రాజ+స్ | రాజన్+స్ |
| 103 | 19 | యట్జి | యట్టి |
| 104 | 17 | మఘవల్న్+ | మఘవల్+స్ |
| 106 | 3 | అకారం | ఆకారం |
| 106 | 6 | అకారమగును | హ్రస్వాకారమగును |
| 106 | 8 | న్-యనునాదే | న్థ్-యనునాదే |
| 107 | 19 | నిర్దేశించుట | నిర్దేశించుటచే |
| 108 | 12 | ఉద్+ష్నిహ్ | ఉద్+స్నిహ్ |
| 110 | 1 | భ్రశ్చ | భ్రస్జ |
| 110 | 13 | పరివ్రాష్-పరి | పరివ్రాష్ |
| 111 | 8 | భృశ్+ఙా | భృశ్జ్+ఙా |
| 113 | 4 | యాయద్+ | యూయద్+ |
| 117 | 5 | వస్సనః | వస్సనః |
| 118 | 8 | ఊపధాయాః | ఉపధాయాః |
| 118 | 20 | లుప్తనకారం | లుప్తాకారనకారం |
| 119 | 10 | ఉదగ్భామ్ | ఉదగ్భ్యామ్ |
| 122 | 10 | శత్రు | శతృ |
| 122 | 15 | ధేధీజ్ | దీధీజ్ |
| 124 | 10 | షట్+జస్ | షష్+అస్ |
| 128 | 9 | వృథి | వృధి |
| 131 | 16 | అహార్+స్ | అహార్= |
| 136 | 12 | నిశ్+అ | నిశ్+ఆ |
| 136 | 16 | ల్రుట్ | లృట్ |
| 139 | 6 | పరస్మైపదిము | పరస్మైపది |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 140 | 11 | యుష్మద్యుపపదే | యుష్మద్యుపపదే |
| 141 | 19 | సాధార్వతు శార్ధధాతు | సార్వధాతు శార్ధధాతు |
| 142 | 1 | భోఅ+తి | భో+అ+తి |
| 152 | 14 | గౌరము | గౌరవము |
| 154 | 11 | గ్క్ఙితి చ | క్ఙ్కితి చ |
| 167 | 20 | క్షుద | క్షుధ |
| 170 | 12 | చిక్షియ్+థ | చిక్షి+థ |
| 173 | 1 | (య్) | (య) |
| 185 | 10 | క్ఙితి చ | క్ఙ్కితి చ |
| 188 | 15 | ఇట్టు | లిట్టు |
| 204 | 12 | నపుడు | నపుడభ్యాసముయొక్క |
| 204 | 18-19 | ఇ+ఇయ్+అతుస్ | ఇ+ఇ+అతుస్ |
| | | ఈ+ఇయ్+అతుస్ | ఈ+ఇ+అతుస్ |
| | | సవర్ణదీర్ఘము | యణ్ణు-ఈ+య్+అతుస్ |
| 212 | 10 | ఊర్ణునువుతుః | ఊర్ణునువతుః |
| 216 | 19 | పిపరతు | పిపురతు |
| 219 | 3 | భిభ్రాతే | బిభ్రాతే |
| 219 | 7 | బిబ్రీత | బిభ్రీత |
| 231 | 19 | ధాతు రేఫము | ధాతువుయొక్క రేఫము |
| 235 | 17 | వికల్పనము | వికల్పము |
| 235 | 19 | లుఝ్ఘున | లుజ్జున |
| 236 | 13 | చుకట | చుకుట |
| 246 | 5 | ననువర్తించును | నవర్తించును |
| 249 | 3 | కంఠాదేశము | కన్తాదేశము |

| పుట | పం_క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 250 | 2 | అప్లవసే | అప్రవణే |
| 250 | 3 | _స్తమ్భస్తమ్భస్క_మ్భస్క_మ్భ | _స్తన్భస్తన్భస్క_న్భస్క_న్భ |
| 251 | 7-8 | (౯) దృాఞ్=హింసాయాం (హింసించుట) దృాణాతి దృాణీతే (౧౦) | (౯) |
| 253 | 7 | అగ్రహీత | అగ్రహీత్ |
| 272 | 19 | పదమ | పదియ |
| 273 | 3 | పదమ | పదియ |
| 278 | 21 | ల | ల్వ |
| 298 | 3 | దథా తే | దధా తే |
| 298 | 18 | చక్రాణ; | చక్రాణః. |
| 307 | 16 | శరిరో | శరీరో |
| 310 | 13 | ఘుజ్ఞున | ఘుష్టున |
| 312 | 9 | తుకృభత్వములు | తుకృ_ర్త్వములు |
| 317 | 14 | యను | అను |
| 327 | 6 | దోవహో | దోవహోౘ |
| 331 | 14 | సాకల్యము | సాకల్యము, అంతము |
| 334 | 11 | సమానము | సమాసము |
| 349 | 1 | కుమ్బం | కుమ్భం |
| 358 | 11 | ధర్శనా | దర్శనా |
| 371 | 21 | ఫ, ఢ, ఖ, ఛ, ఘ | ఫ్, ఢ్, ఖ్. ఛ్, ఘ్. |
| 374 | 14 | వైనత | వైనత్ |
| 377 | 15 | (డ్యాఞ్) డిత్వసామర్థ్యశి ము చ్చే భసంజ్ఞు లేకున్నను | (డ్యాజ్ఞు) |
| 380 | 11 | త్వత్రో | తత్రో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 385 | 2 | వ్ | త్ |
| 388 | 9 | మతప్పు | మతుప్పు |
| 389 | 13 | దృపది | దృషది |
| 396 | 5 | ప్రావృషిక | ప్రావృషికః |
| 405 | 17 | సంస్పృష్టే | సంస్పృష్టే |
| 411 | 13 | వత్సేయః | వత్సీయః |
| 413 | 17 | శత్+(త్రింశత్) | శత్ (త్రిం-శత్) |
| 413 | 17 | త్రిశంత్ | త్రింశత్ |
| 413 | 18 | చతుర్దశత్+(చత్వారింశత్) | చతుర్దశత్(చత్వారిం-శత్) |
| 414 | 5 | ద్వితీయానస | ద్వితీయాస |
| 420 | 17 | ఆదిదీని | అదిదీని |
| 432 | 19 | ధాల్ | థాల్ |
| 445 | 17 | ఢ, ఢక్, ఢఞ్, అణ్ | ఢక్, ఢఞ్, అణ్, అఞ్ |
| 450 | 8 | జి ప్రత్యయముఁ | జీప్రత్యయమును |

---

☞ ప్రమాదవశమున నిట్టిస్ఖాలిత్యము లీగ్రంథమున నింకయుఁ బెక్కు-స్థలములందుఁ బొరసినవి. ఈలోపమ్ము లన్నియుఁ బునర్ముద్రణమున సవరింపఁబడి గ్రంథము నిర్దుష్టము గావింపఁబడునని పండితాఖండలులకు సవినయముగా మనవిచేసికొనుచున్నారము.

# త్రికాండశేషము, సటీకము.

ఈగ్రంథమునకు "అమరశేషము" అనికూడ నామాంతరముగలదు. ఈనిఘంటువునం దమరకోశమునం జేర్కొనని పర్యాయపదము లెన్నియో యున్నవి. గ్రంథాంతమున అకారాదిశబ్దానుక్రమణికకూడం జేర్పఁబడి యున్నది. చక్కఁగా ముద్రితమై మంచిబైండు చేయఁబడియున్నది.

ప్రతి 1-కి రూ. 1-1-0.

# విశ్వకోశము, సటీకము.

ఇయ్యది మహేశ్వరసూరివిరచితము. మూలగ్రంథమును బరిశోధించి సరళమగు తెనుఁగుటీకనువ్రాయించి శుద్ధముగా బ్రకటించితిమి. ఈనిఘంటువు నందుఁ బదము లెల్లను అంత్యాక్షర నియమమనుసరించి అకారాదిగా వ్రాయఁబడియుండుటవలన, ఆవశ్యకములగు పదములను సులభముగాఁ గనుఁగొనుట కెంతయు ననుకూలించియున్నది. ఇయ్యది శ్లోకరూపమగు నీగ్రంథమునందలి యొకగొప్పవిశేషము.

ప్రతి 1-కి రూ. 2-8-0.

# మేదినీకోశము, సటీకము.

మేదినీకరుని చే విరచితమైనది. ఇయ్యది శ్లోకరూపమగు నిఘంటువైనను పదములెల్ల నంత్యాక్షరనియమము బాటించి అకారాదిగా వ్రాయఁబడియున్నందున గోరినపదము నుత్తరక్షణముననే కనుఁగొనుటకు యుపకరించుచున్నది. గ్రంథము చక్కఁగా ముద్రింపఁబడి మంచిబైండుకట్టఁబడియున్నది.

ప్రతి 1-కి రూ. 4-0-0.

# హారావళి, సటీకము.

ఇయ్యది ౨౭౮ శ్లోకములతోఁగూడిన యొకచక్కని చిన్నసంస్కృత నిఘంటువు. ఈశ్లోకములు కంఠస్థమైయుండినఁ బర్యాయపదములకు వెదకుకొనవలసినపని యుండదు. ఇందే కాక్షరీకోశముగూడ సటీకముగా ననుబంధింపఁబడియున్నది.

ప్రతి 1-కి రూ. 0-[illegible]-0.